యజ్ఞనారాయణశాస్త్రి, పసుమర్తి.

ఆంధ్రనటప్రకాశిక

బందరు, 1930.

Record no. 84

Yajñanārāyaṇaśāstri, Pasumarti.

Āṃdhranaṭaprakāśika

Bandaru, 1930.

Record no. 84

## Bibliographic Record Target

యజ్ఞనారాయణశాస్త్రి, పసుమర్తి.

ఆంధ్రనటప్రకాశిక : సచిత్రము / పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి విరచితము. - 1. కూర్పు. - బందరు : బి.కె. మూర్తి, 1930.

(4), 2, iii, 10-18, 16, 516 p. 36 leaves of plates. :ports, :ill. ;18 cm.

Record no. 84

Yajñanārāyaṇaśāstri, Pasumarti.

Āṃdhranaṭaprakāśika : sacitramu / Pasumarti Yajñanārāyaṇaśāstri viracitamu. - 1. kūrpu. - Bandaru : Bi.Ke. Mūrti, 1930.

(4), 2, iii, 10-18, 16, 516 p. 36 leaves of plates. :ports, :ill. ;18 cm.

Record no. 84

శ్రీ

# ఆంధ్ర నట ప్రకాశిక.

## సచిత్రము.

పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి

విరచితము.

———o———

బందరు రామా ఆర్టు ప్రెస్‌నందు బి. కె. మూర్తిచే
ముద్రింపబడి,
(మొదటి 34 పుటలు బందరు కృష్ణాస్వదేశీప్రెస్‌నందును,
చిత్రపటములు మద్రాసు ఆంధ్రపత్రికా ముద్రణాలయ
మందును అచ్చొత్తింపబడి చేర్చబడి ) గ్రంథకర్తచే
బందరునందు ప్రకటింపబడెను.

మొదటికూర్పు — 1000 ప్రతులు.

1930.

 [ వెల. రు 4—0—0.

తపాలాఖర్చులు ప్రత్యేకము.

# విజ్ఞప్తి.

—o—

చిత్రపటవివరణములోని ఈ దిగువసంఖ్యలుగల పటములు కారణాంతరములచే నిందు ముద్రింపబడలేదు. అయ్యవి రెండవ భాగమున బ్రకటింపబడగలవని పాఠకులు తెలియ బ్రార్థితులు.



6, 7, 120, 128, 130, 15వ పుటలోని నెం. 1 మొదలు 13 వఱకును.__

ఈ పుస్తకమునకై 1930 సం॥ సెప్టెంబరు 30వ తారీఖులోపున ఆర్డరు యిచ్చువారికి తపాలాఖర్చులు ప్రత్యేకముగా లేకుండా రు 4—0—0 లకే వి. పి. పంపబడును.

త్వరపడి మీ ఆర్డర్లతో రు 2—0—0లు మనియార్డరుగా బంపగోరెదను. అడ్వాన్సు పంపనివారికి వి. పి. పంపబడదు.

వలయువారు:— వసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి,
కొజ్జిల్లిపేట, మచిలీపట్నం.

Rama Art Press, Printers & Photographers,
— MASULIPATAM. —



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు



శ్రీ

సీతారామాంజనేయ నాటక సంఘాధ్యక్షులు

లలితకళా పోషకులు,

ఉదార మహాశయులు,

అగు

మ. రా. రా. శ్రీ. శ్రీరాజా

మోతే నారాయణరావు

జమీందారు

ఎం. ఎల్. సి. వారికి

భక్తి పురస్సరముగ

సమర్పించుకొనఁ

బడినది.

# కృతి

---

శ్రీద మా దివ్య తేజము శిష్టలోక
సన్నుతము కీర్తి పథము ప్రశాంతమూర్తి
మంతము మదీయ దృగ్ద్వయీ మార్గమందు
బఱఁగి శ్రుతిమేళగించి నిన్నాడె నొకట.

ఈ స్ఫురన్మంజు గీతి కాహీనవృత్త
మాంధ్రదేశీయ లలిత కళానురాగ
రసధునీ మజ్జనానీత రాజహంస
మగుచు మన్మనోవీధి నాట్యమ్ముఁ జేసె॥

నీ మహోదాత్త సాత్త్విక నిస్తుల స్వ
భావ భావనాబద్ధ మద్భావ మామ
రాళనృత్త ప్రసారితాంఘ్రమున లీల
మయ్యె; నానందసర్వస్వ మనుభవించె॥

సీ. శీలవిద్విష పిశాచీదూర గోదార
హైందవాభ్యుదయ సేవాభినిరతి
వివిధ కావ్యపురాణ విపులార్థరసభావ
భావనాలబ్ధ మేధావిభూతి
ప్రాచ్య పాశ్చాత్య విశ్వంభ రాధికధీర
సంచారజనిత సంస్కారదీక్ష
రమ్య సీతారఘురామాంజనేయ నా
టక సంఘుఘోషణాత్మక నిరూఢి
సరస సస్మిత సహజ భాస్వన్మృదూక్తి
సాధుపూజానురక్తి; ప్రశస్త కార్య
కారణోద్వృత్తప్రవృత్తి; దిగ్వ్యాప్తకీర్తి;
దేశనాయకులందు నిన్ దేటపఱచె॥

శా. భూనాథాగ్రణులెందఱెన్నఁ
డెటుగాఁ బూజించిరో భారతీ
యానూన ప్రతిభా ప్రబోధక
సునాట్య బ్రహ్మమున్, నేఁడు నీ
చే నా రీతులు స్పష్టమయ్యెను;
కళాశ్రీయమ్ముఁ జేకూర్చు మో
త్తే నారాయణరాణ్మహేశ !
నిను బ్రీతిన్ సంస్తుతింతుఁ గృతిన్॥

# *FOREWORD*

## TO ANDHRA NATAPRAKASIKA

*By the Hon. V. Ramadoss Pantulu Garu B.A.B.L.*

Member Council of State.

The author has done me the honour of asking me to write a foreword to his latest work, Andhra Nata Prakasika. I do so with considerable diffidence, for my equipment to appraise the true worth of a literary work of this magnitude is very inadequate. Mr. Pasumarti Yegnanarayana Sastry combines in himself many accomplishments in addition to his literary talent and the Andhra world is familiar with him as a Dramatist, Musician, Natyacharya and versifier. His dramas, Lanka Dahanam, Rama Ravana Samgramam, and Savitri, besides being ranked among good literary compositions of that class, are frequently staged and greatly appreciated. His new work is quite out of the ordinary run of recent Telugu compositions. It is unique in many ways. It is partly a composition in correct, technical style of the rules of dramaturgy, Abhinaya and Gandharva as prescribed by ancient classical Sanskrit writers; it is partly an exposition of modern art of *make-up* (Aharyabhinayam) as it is developed in the Western Countries, in so far as it can be made adaptable to oriental stage; it is partly a literary criticism of Andhra dramatic literature by the application of just and correct standards; and it is partly a historical retrospect and a description of extant Andhra enterprise in the development of the stage. The treatment of Rasa in the Fourth Chapter and the application of its approved orthodox cannons to dramatic effort is original. The work is, in essence, a Lakshana Grandha. Its chief merit, however, consists in its being the product of one who is not only a critic and scholar of theory but also a practical artist. This is a rare combination in

aliterary man, and the desire to give shape to ideas based on experience is rarer still. The practical hints contained in Chapter VI for the formation and management of a standard theatre and the rules regulating the conduct of the *dramatist personae* are indeed very valuable. The book serves the purpose of a guide both to those who attempt drama as literature and to those who attempt it as histrionic art. It stands to drama in the same relation as grammar does to language. The style is partly classical and partly colloquial, but always smooth and facile. There is no single work in which so much useful technical and scientific information is collected, and I have no doubt that the book will be largely patronised both by scholars and lovers of Dramatic Art. One attractive feature of the book which deserves special mention is the large number of well-executed illustrations of Andhra Stage celebrities and of drawings portraying situations, emotions and poses and classic features of heroes and heroines.

V. RAMADOSS PANTULU.

స్టేటు కౌన్సిలు సభ్యులగు మ॥ రా॥ శ్రీ

ది. ఆనరబుల్ వేమవరపు రామదాసు పంతులు

బి. ఎ. బి. ఎల్. గారు ప్రసాదించిన

# తొలి పలుకు.

ఈ గ్రంథకర్త తాను నవీనముగ రచించిన యీ ఆంధ్రనట ప్రకాశికకు పీఠికను వ్రాయుమని నన్నుఁ గోరినాఁడు. ఇది నన్నుఁ జాల గౌరవము చేయుటగా తలంచుచున్నాను. కాని యిట్టి దానికి నే నర్హుఁడను గానని యెఱుఁగుదును. ఇంత మాహాత్మ్యవత్త గ్రంథమునకు సరియైన విలువఁగట్టుటకు నాకు శక్తి చాలదు. శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారు పండితుఁడగుటయే గాక, స్వయముగ నాటక కర్త, గాయకుఁడు, నాట్యాచార్యుఁడు, కవి యని తెలుగు దేశములో ప్రశస్తి కెక్కినవాఁడు. ఏతత్కవికృతములైన లంకాదహన, రామరావణ సంగ్రామ, సావిత్ర్యాది రూపకము లాంధ్ర సారస్వతమునందు సమున్నత పదవీ భ్రాజితము లగుటయే గాక, ఆంధ్రదేశ స్థానికరంగ ప్రయుక్తములై, యశేష జనబాహుళ్య మనోనందాను సంధాయకములై యలరారుచున్నవి. ఇక నీ ప్రకృత గ్రంథరాజమన్ననో, యధునాతనాంధ్ర సారస్వతధోరణీ విశేషములయందు ప్రత్యేక వైలక్షణ్యమున నొప్పారుచున్నది. ఏతద్గ్రంథ వైలక్షణ్యము బహుధావర్తితమైన దనుట నిస్సంశ

యము. ఇందు కొంత వఱకు ప్రాచీన శాస్త్రకర్తల రూప
కాభినయ గాంధర్వ విద్యా సూత్రములు నిర్దుష్టము, శాస్త్ర
సిద్ధమునైన శైలిలో క్రోడీకరింపబడినవి. అధునాతన
పాశ్చాత్య సంప్రదాయానుసరణము లైన యాహార్యాభినయ
సామగ్రి విశేషములు దేశతత్వమున కంగీకృతము లగునంత
వఱకు ప్రస్తుతము లైనవి. ఆంధ్ర రూపక సారస్వతము
ప్రాచీన లక్షణ విరుద్ధముగాని పద్ధతిలో సరసముగ విమర్శిం
ప బడినది. మఱి కొంతవడి నాంధ్ర నాట్యరంగ చరిత్రయు
తత్క్రమాభివృద్ధియు సోదాహరణముగ నుద్ఘాటింప బడినవి.
ఇందలి చతుర్థ ప్రకరణమున ప్రస్తుతమైన రస విమర్శయు,
ప్రాచీన లక్షణ సిద్ధమైన తత్సూత్ర విశేషములను నాటక
ప్రయోగమున సుప్రయుక్తములు గావించుటయు, గ్రంథకర్తృ
ప్రజ్ఞోపజ్ఞా విశేషమును వేనోళ్ల చాటుచున్నవి. వేయేల!
ఇది సర్వవిధముల నుత్కృష్టమైన లక్షణ గ్రంథము.
గ్రంథకర్త కేవల విమర్శకుఁడై పండితు డగుటయే
గాక స్వయముగ నాట్యప్రయోగ కుశలు డగుటఁ
గూడ నీ గ్రంథమునకు మఱింత వన్నె వచ్చినది. సా
మాన్య పండితులలో నిట్టి వారుండుటరుదు. ఉన్నను అను
భవ విశేషము నూతగా గొని యిట్టి యుద్గ్రంథ రచనకు
గడంగు వారొకరేనిఁ గానరారు. షష్ఠమ ప్రకరణము నం
దుద్ఘాటితములైన యుత్తమ నాటకరంగ ప్రసాధనములును,
పాత్రవైఖరీ నియమ సూత్రములును నాట్యసాధకులకుఁ గడుం
గడు నమూల్యములు. ఈ గ్రంథరత్నము రసగ్రహణ
కుతూహలులకును నాట్య సాధకులకును గూడ మార్గదర్శిని



యగు ననుట నిస్సందేహము. భాషా రహస్యము తెలుంగు
టకు వ్యాకృతి యెట్టిదో నాటక రహస్య కల్పనల నెఱింగి
యానందించుటకీ గ్రంథరాజ మట్టిది. గ్రంథకర్త గ్రాంథిక
భాషను, వ్యావహారికమును వాడుకొన్నాఁడు. ఉభయభాషా
ధోరణుల యందును ఆయన శైలి సరళమై ప్రసాదగుణ
మొప్పి యున్నది. ఇట్టి శాస్త్ర సిద్ధము, సంప్రదాయబద్ధము
నైన గ్రంథము మఱియొకటి కానుపించదు. పండితులును
కళాభిజ్ఞులును దీనిని సముచితముఁగ నాదరింతురని తలంచు
చున్నాను. మఱొక్క మాట. ఇందనేక నటక హావభావ
వైఖరీ ముద్రాభినయ విశేషములు ప్రతిచ్ఛాయలు దీయబడి
యిందు గ్రథితములై యీ గ్రంథము యొక్క సహజశోభను
ద్విగుణీకరించు చున్న వని చెప్పుచున్నాను.

17-7-29<br>మైలాపూరు<br>మద్రాసు

(Sd.) వి. రామదాసు పంతులు.

## పీఠిక

మనువసు చరిత్రాది బహు ప్రబంధ నిర్మాతలు, ఉభయభాషా విశారదులు, అగు నా ప్రాచీన విద్వత్కవి వతంసులం దెవరుకాని, ఏలకో స్వతంత్రించి తెలుగులో నొక్క నాటకమేని రచించి యుండకపోయిరి. సంస్కృతభాషయందు, ఎన్నిటనో ప్రత్యేకముగను అనంతముగను వివరింపఁబడి యుండిన అభినయము, సంగీతము, నాటకము, రసము, అను విషయములకుఁ జెందిన లక్షణాంశములలో, రూపక ప్రయోగములను సమన్వయించు నెట్టి యనుశాసనమును గాని, ఆనాఁటి లాక్షణికులయినను, ఏర్పఱచి యుండరైరి. ఆలంకారికులు నిర్ణయించిన, తక్కుంగల కావ్య లక్షణానేకములలోని పెక్కులు, శ్రవ్యప్రబంధములందు మాత్రమే సమయోచితముగ ననుసంధింపఁ బడుచున్నవి. దృశ్య కావ్యములు వాని ప్రయోగములు సహితము, ఆరీతి సర్వలోకాదర పాత్రములు కావలయుననిన తన్మార్గోద్బోధకములగు గ్రంథములు వెలువడవలసి యుండుననుట ప్రాజ్ఞు లెఱుంగనిది కాదు.

కాలక్రమమున నావరించిన నాటకాభిమానమును, ఆదరమును బురస్కరించుకొని, ఎవరికి తోచి నటులు వారు నాటకములను వ్రాయుటయు, ఆడుటయు, విమర్శించుటయుఁ గలుగుచున్నది. నానన గాంధర్వ వేదోపదిష్టము, పరమ పురుషార్థ ప్రదము నగు "నాటకకళ" రసభావ రహితము, కేవల కాలక్షేపకారణము నగుచున్నది. ఈ యరిష్టము నుండి నాటకకళ సంరక్షింపఁబడవలయుననిన మున్ముందు తత్సంబంధి శాస్త్రీయ నీతినియమము లేర్పడ వలసి యుండును. ఇప్పట్టున ప్రాక్పశ్చిమోభయభావసమన్వయమును గలిగి, నవ్యనాటక తత్త్వోపదేశమును బొనర్చు, సకలనాటక సమస్యాపరిష్కార పటిష్ఠంబైన లక్షణ గ్రంథ మొకటి బయలు వెడల వలసి యుండునని లోకజ్ఞు లెల్లరు గ్రహింపఁగలరు.

రూపకము అభినయ ప్రధానమైనది. అభినయము కళ. చిత్రము, శిల్పము, కవిత్వము, సంగీతము, తదంగములగు ఉపకళలు. భరత నాట్యశాస్త్రము ముఖ్యముగ, అభినయ కళాబోధకమైన యొక మహాత్తమ లక్షణ గ్రంథముగఁ బరిగణింపఁబడునదే కాని, తద్గత స్థూల సూక్ష్మాంతర్భేదములలోని నాట్యసంబంధి స్థూలాభినయాంశములు, లాక్షణికులచే గ్రహింపఁబడి కాలోచితముగ విస్తరింపఁబడవలసి యున్నవి. చతుర్విధాభినయములలోని, ఆహార్యాభినయమునకుఁ జెందిన, చిత్రలక్షణములు, శిల్పలక్షణములు సహితమటులె భరతసూత్ర సాంప్రదాయములచేఁ బాటింపఁ బడియు, నవ్యనాగరిక వివిధ వర్ణ లేపనాదులలో మేళగింపఁబడియు, రూపక రసభావ ప్రసరణైక విధానములలో విశదీకరింపఁ బడవలసి యున్నవి. వాచిక సాత్త్వికాభినయములిదే విధమున రూపక ప్రయోగ భావ సమన్వయమునందు యుచిత నిర్ణయమును బడయ వలసి యున్నవి. నాటకాభినయ మొక్కటియె యిన్ని విధములఁ బరిష్కరింపఁబడినఁ

గాని ప్రస్తుత నాటక లోకమునకు సులభ గ్రాహ్యము కానోపకున్నది.

ధ్వనిమయాలాప సంచారములలో స్వరభావమును ప్రదర్శించునది సంగీతము. ధ్వనిమయ భాషాభినయ విధానములలో మనోభావమును బ్రకటించునది సాహిత్యము. ధ్వనుల కీయఁబడిన సంజ్ఞలే స్వరములు. ఆ స్వరములే వర్ణములు. వర్ణములే స్వరములు. ఇట్టి అవినాభావ సంబంధమును బట్టి వాచికాభినయావసరము నందు, నటులకు శాస్త్రీయ సంగీత పరిజ్ఞాన మెంతయు నావశ్యకమైనదని తేటపడఁగలదు. మఱియు, నృత్త, గీత, వాద్యములు, 'తౌర్యత్రిక' మనబడునవి. 'గీత' మందుఁ బ్రధానమైనది. భావ, రాగ, తాళములు తత్ప్రతిపాద్యములు. ఏతాదృశ స్వర రాగ తాళాద్యనేకములను నిర్ణయించునది సంగీత శాస్త్రము. తౌర్యత్రికములోనిదే నృత్తము. అది, నృత్తము, నృత్యము, నాట్యము నన, మూఁడు విధములఁ బఱఁగునది. ఇందలి నాట్యము, ఆంగిక, వాచిక, సాత్త్విక ఆహార్యములచేనని చతుర్విధాభినయము నాఁ బేర్కొనబడి, నటులచే నుపయోగింపఁబడు నప్పటి లక్షణానేకముల నెఱిఁగించునది, అభినయ శాస్త్రము. ఏతత్ప్రామాణ్యము ననుసరించి ప్రయోగ ప్రధానమైన వాచికాభినయముతో, సంగీతమున కెటులు సంబంధము లేకపోవును? సంగీతము సర్వ విధముల వాచికముతో మేళగింపఁబడక తప్పదు. ఇట్టి సమన్వయ లక్షణమే నవ్యలాక్షణికులచేఁ బ్రసాదింపఁబడ వలసి యున్నది.



ఆలంబన విభావము లనఁబడు వివిధ నాయికా నాయకుల యొక్క వయోరూపగుణశీలములు, వృత్తిప్రవృత్తులు, సాత్త్విక సంచార్యాద్యశేష భావములు, ఏతాదృశ సకల భావాభివర్ధిత శృంగారాది రసములు, ఆలంకారికులచే నెన్నఁడో నిర్ణయింపఁబడినవి. శ్రవ్యప్రబంధము లందంతట నాయా భావాంశము లన్నియు యథావిధి, ఆదరింపఁబడియు నున్నవి. రూపకము లావిధమున రసాత్మకము లగుటకుఁ బూర్వోక్త భావోద్దీపనాంశములు సమయోచితముగ ననుసంధింపఁ బడ వలసి యుండును. అటులు జరుగుటకు నాటక ప్రకృతికిఁ ద్రిమూర్తులై నెగడు, కవి, చిత్రకారుఁడు, నటుఁడు ననువారిలో మూర్తిత్రయతుల్యుఁడైన యొకానొకఁడు మాత్రమె ప్రయోగాధికారమును గలిగి యుండవలెను. బహుత్వమున నేర్పడునట్టి, ఆ నాట్యకార్య మామూలాగ్ర మేతదధికార్యుపదిష్టమై, ఏకత్వమునఁ బ్రసన్నము కావలయును. అప్పటికిగాని, అభినయకళ బ్రహ్మానంద దాయకమై దిదృక్షులఁ దనియింపదు. నీతివంతములైన నాటకేతర రూపకములేని ప్రయోజన కారులు కానేరవు. ఇట్టి రూపకాలంకార సమన్వయము నవ్యనాటక సారస్వతమునకుఁ బ్రాణతుల్యమైనదిగ నెంచఁదగునది.

అంకాది విభాగములలో, కథాక్రమము నేకరువుపెట్టు, సాంఘిక, చారిత్రకాది రూపకములు కాని, ఆపద్ధతి నగపడు మఱియే యితర రూపకములుకాని, నాటకము లనఁబడవు. నాటకము కేవలము రసాత్మకమైనది. తదితర

ములు, తమ తమ ప్రత్యేక గుణ లక్షణములనుబట్టి ప్రకరణ ప్రహసనాదికములైన తదన్యరూపకములలోఁ జేర్పనగునవి. ఆయా నాటకాది వివిధరూపక లక్షణానేకములు దశరూపకాది లక్షణ గ్రంథములలో సాకల్యముగ వివరింపఁబడి యున్నవి. అయిన నవి మిక్కిలి పారిభాషిక పదభాజనములై సులభ గ్రాహ్యములు కాకున్నవి. ఆయా శాస్త్ర లక్షణ ప్రధానాంశములు సహితము సంగ్రహింపఁబడి, తదితర నవ్యనాటక లక్షణానేకములతో బాటుగ నొక్కచో సులభశైలిని విస్తరింపఁబడి యుండకున్నవి. ఈ లోపము తీఱినఁ గాని నాటక స్వరూపము సకల కవి కరతలామలకము కానేరదు. నాటక సారస్వతమును బండితాదరమును బడయఁ జాలదు.

అభినయము, సంగీతము, నాయకులు, రసము, రూపకము, ఇత్యాది నాటక సంబంధి శాస్త్రాంశములు పర్యాలోచింపఁ బడిన యనంతరము, ప్రస్తుత కాలమునఁ దెలుఁగు దేశము నందంతట ప్రసన్నమగునట్టి, రంగరచనలు, నైతిక, సాంఘిక చారిత్రక రాజకీయాద్యశేషరూపకములు, విద్వద్వ్యాఖ్యలు, కలరూపమున ననుభవింపఁ బడవలయును. ఈదృశలక్ష్య లక్షణోభయాచార సాంప్రదాయములు ముఖ్యముగ సమాలోచింపఁబడు మూలమున నె, అత్యావశ్యకమైన నవ్యనాటక ప్రయోగాది వివిధ మార్గోద్బోధకము, సులభ గ్రాహ్యము నగు లక్షణ మేర్పడవలసి యున్నది.



పూర్వోక్త పద్ధతిని, నాటకకళోద్ధరణమును గోరి యొక గ్రంథమును బ్రకటించ వలయునను సంకల్పము నాకెప్పటి నుండియో కలిగి యుండెడిది కాని, అట్టి మహాత్తమ కార్యనిర్వాహణమునకుఁ దగియుండు, అనంత ప్రతిభావంతులైన మహాపండితు లెందఱో యుండ, నాయట్టి మితప్రజ్ఞుఁడెటు లీపనికి సాహసించ నగునను సంకోచము నన్ను మిక్కిలి బాధించు చుండెడిది. నాటకాభిమానులు, విమర్శకులు అయిన మన్మిత్రు లనేకులతో దీనినిఁ గూర్చి తఱచుగఁ బ్రస్తావించు చుండెడి వాఁడను. అట్టి వారిలో, ఒకప్పుడు కృష్ణాపత్రికా వ్యవహర్తలుగ నుండిన, మ॥ రా॥ శ్రీ॥ వడ్లమన్నాటి కుటుంబరావుగా రొసంగిన ధైర్యోత్సాహ సాహాయ్యములు "ఆంధ్రనట ప్రకాశిక" నిర్మాణమునకు ఆదిమ కారణములైనవని మనఃపూర్వకముగ నొప్పికొనక తప్పదు.

గ్రంథరచ నావసరమునందుఁ దెలుఁగు దేశమందలి వివిధ రంగముల యొక్కయు, నటుల యొక్కయు, కళా సంబంధి వృత్తాంతములను దెలిసికొనవలసి వచ్చినది. మఱియు నాటకోద్యోగమును విరమించి యుండు, పలువురు నటశేఖరుల అభినయ గుణాగుణముల ననుభవించుకొఱకు "నాట్యవిద్వత్ప్రదర్శనము"లను బేరునఁ గొన్నిఁటి నేర్పఱచి, వారంగఱను బందరునకు రప్పించవలసియు వచ్చినది. ఇప్పట్టున వలయు ద్రవ్యాదిక సాహాయ్యములను దయతో జతపఱచి నాకుఁ దోడ్పడియుండిన బందరు బాలభారత సంఘస్థాపకులు, మన్మిత్రులు, అగు మ. రా. శ్రీ. చిట్టూరి వేంకట సరశింహాము పంతులుగారి మహదౌదార్యమును మఱువఁజాలను.

మద్గ్రంథ ముద్రణకార్య సహాయార్థముగ నెన్నియో సమాజములు యథాశక్తిఁ దోడ్పడి యున్నవి. "ఆంధ్రనాటక కళోద్ధారక" మ॥ రా॥ రా॥. శ్రీ రాజా మోతే నారాయణ రావు జమీందారుగారు, తమ శ్రీ సీతారామాంజనేయ నాటక సమాజముచే బందరులో నొక్క ప్రదర్శనము నిప్పించుటయే గాక, తామా యెడకు వచ్చి, స్వయముగ నాఁటి యాదాయమును నాకనుగ్రహించి, ఎంతయో గౌరవించి యుండిరి. ఇటులే మత్సహాయార్థముగ మఱికొన్ని ప్రదర్శనములలో భాగ్గొన నంగీకరించిన ఉదారహృదయులగు నట మహాశయులను బురస్కరించికొని, బెజవాడ, రాజమహేంద్రవరము, విశాఖపట్టణము, మున్నగు ప్రదేశములందుఁ దమ సమాజముచే, గొన్ని ప్రదర్శనములను జరిపించి, తన్మూలమున నన్నుఁ గృతార్థుని జేసిన శ్రీవారి అనన్య కళాభిమానము, సాధుశీలము, ఇంకెంతేని ప్రశంసార్హములు కాక మానవు.

భారత శాస్త్ర ప్రసిద్ధులైన నాయికా నాయకులయొక్క వయోగుణ రూప శీలాది స్వరూపములను, తత్సంబంధ భావానేకములను, ప్రశ్న పఱచుఁ గొన్ని నవల చిత్రములను, వానితోఁ బాటుగ బ్రస్తుత రంగముల యొక్కయు నటుల యొక్కయు, ఛాయా చిత్రములను, గ్రంథస్థములుగఁ జేయ బ్రయత్నించుచుండిన నా కెప్పటికిని తత్సంకల్ప మీడేరు మార్గము కన్పింప కుండెను. మ॥ రా॥ శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, నావిజ్ఞప్తిని వినిన



క్షణముననె అభయ మొసంగి, నేఁ బ్రకటించ నెంచిన యన్ని విధములయిన చిత్రములను దమ ఆంధ్రపత్రికా కార్యస్థానమునందు సిద్ధపఱపించుటయే కాక, వాని నన్నిఁటినిఁ దగురీతి ముద్రింపించియు నన్ననుగ్రహించి యుండిరి. ఎంతయో ద్రవ్యము వెచ్చింపఁబడినను, ఇంత స్వల్పకాలములో, ఇంతటి సరసగతిని, ఆ పని నెఱవేఱుట కవకాశ ముండనేరదు. ఇట్టిచో ఇంతటి మహోపకారమును బొనర్చి, నిజముగ నన్నుద్ధరించిన శ్రీ పంతులుగారి సౌహృదయ మభినుతింపఁబడుటకు నా నేర్చిన భాషాలేశము చాలదనికొనియెదను.

భరతనాట్య శాస్త్రము, భరత రసప్రకరణము, అభినయదర్పణము, కావ్యాదర్శము, కావ్యానుశాసనము, సాహిత్యదర్పణము, రసగంగాధరము, సంగీతరత్నాకరము, గానభాస్కరము, దశరూపకము, మున్నైన యుద్గ్రంథములును, "ది ఆర్ట్ ఆఫ్ మేకప్" 'హౌటుప్రిపేర్ ఎమెచ్యూర్ డ్రామాస్' అను నీ యాంగ్లేయ శాస్త్రములును, గ్రంథరచనావసరమునందు నాకు మిక్కిలి సహకారమొనర్చినవి. వీని నుండి ఇందలి మొదటి యయిదు ప్రకరణములకుఁ జెందిన పెక్కు శాస్త్రాంశములు, సంగ్రహముగను, యథాతథముగను, ఆదర్శకముగను, విశేషించి సమన్వయ స్వరూపముగను సంగ్రహింపఁబడి సులభశైలిని విస్తరింపఁబడినవి. శేషించిన ప్రయోగాది ప్రకరణము లయిదును, కేవలము మత్సృష్టములుగ భావింపఁదగునవి. ఈ గ్రంథమలంకరించి యుండిన త్రివర్ణముఖచిత్రము, మఱికొన్ని భరతమత ప్రసిద్ధము

లగు భావచిత్రములు, మ॥ రా॥ శ్రీ చంద్రభట్ల రామారావు గారిచే వ్రాయింపఁబడినట్టివి. ఛాయాచిత్రము లోఁక కొన్ని నాచే సేకరింపఁబడియు, ఒక కొన్ని శ్రీయుత కె-ఎ. హెబ్బార్ గారిచే ననుగ్రహింపఁబడియు, తదితరములు మ॥ రా॥ శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు గారిచేఁ బ్రసాదింపఁబడియు, ఇందుఁ జేర్పఁబడినవి.

నాచే వ్రాయ నారంభింపఁబడిన "ఆంధ్రనటప్రకాశిక" నే నాశించిన యన్ని విధములయిన సౌకర్యములను బడసి సక్రమముగ, ఈ నాఁటి కిటులు ప్రకటింపఁబడుటకు ముఖ్య కారకులయిన పూర్వోక్త మహోదార హృదయులకును, విలువఁగల తమకాలమును గొంత వినియోగించి, మద్గ్రంథమునకు, 'తొలిపలుకు' పలికి, నన్ను గౌరవించిన మ॥ రా॥ శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారికిని, మత్కృతజ్ఞతా పూర్వక నమస్కృతులను సమర్పించుకొనెదను. శుద్ధప్రతిని వ్రాయుట యందును, ముద్రణ పత్రములను బరిశీలించుట యందును, మిక్కిలి శ్రద్ధగలిగి వర్తించిన నా మేనల్లుఁడు చిరంజీవి చల్లా వేంకటసుబ్బారావును, ఇచ్చో పేర్కొని ఆశీస్సులిడెదను.

నాటక కళాభివృద్ధినిఁ గోరి, నా యోపిన కొలఁది, ఈ చేసిన భాషాసేవయందుఁ గల లోపములను దయతో మన్నించి, ఇందలి గుణాంశములు లోకాదర పాత్రములగు భంగిఁ దోడ్పడి, నన్నాదరించు కొఱకు సర్వజ్ఞులైన పండిత వతంసులను సవినయమునఁ బ్రార్థించెదను.

---

# ప్రకరణసూచిక

# విషయసూచిక

—:o:—

# ప్రథమ ప్రకరణము

1 గాంధర్వము అభినయము 2 గాంధర్వ ముపవేదము 3 గానము తౌర్యత్రికాత్మకము 4 సంగీత శాస్త్రము 5 నాట్యశాస్త్రము 6 భరత శాస్త్రము 7 భావము చిత్తజము 8 శ్రుతిమనోహరాలాపము రాగము, 9 స్వరభావగమన క్రియావబోధకము. తాళము 10 తాండవలాస్య సమ్మేళన స్వరూపము తాళము 11 నాట్యయోగ మనంత ఫలప్రదము 12 బ్రహ్మోపాసనమే నాట్యోపాసనము 13 నాట్యము మూఁడు విధములు 14 నాట్యము నాటకోచితము 15 నృత్తము రసభావలేశమును, తాళప్రాధాన్యమును గలది. 16 నృత్యము భావాశ్రయము 17 అభినయము రెండు విధములు 18 సూక్ష్మాభినయము త్యాజ్యము 19 స్థూలాభినయము సర్వదారోగ్యము 20 స్థూలాభినయమునకు లోకము ప్రమాణము 21 నటుఁడు లోకజ్ఞుఁడు 22 నటుఁడు సర్వాంగసుందరుఁడు 23 నటుఁడు భాషాభిజ్ఞుఁడు 24 నటుఁడు భావజ్ఞుఁడు 25 నటుఁడు వస్తువివేకి 26 నటుఁడు ప్రగల్భుఁడు 27 నటుఁడు నిగ్రహుఁడు 28 నటుఁడు పవిత్రహృదయుఁడు 29 నటుఁడు స్వతంత్రుఁడు 30 నాటకము రసాత్మకము 31 తత్ప్రయోగ ముదాత్తము 32 రంగము, రూపకాశ్రయము 33 వస్తువు కవిభావితము 34 కృషిమూల మభినయము 35 ఫలము భూమికాప్రసన్నము 36 సంగీతము భావపోషకము 37 భావసమన్వయస్వరూపము ప్రయోగము 38 విద్యదతీతము కళ 39 అభినయము కావ్యము 40 తత్ఫల మక్షరము 41 శాశ్వతానందమే బ్రహ్మానందము 42 నాట్యాభినయము నాలుగు విధముల నుండును 43 ఆంగిక వాచిక సాత్త్వికాహార్యములు స్థూలాభినయాంతరములు 44 అంగాభినయా



శ్రయము లవయవములు 45 అంగములు ప్రత్యంగములు ఉపాంగములు అని యవయవములు మూఁడు విధముల విభజింపఁబడినవి. 46 స్థూలాభినయమున ముఖ్యముగ వినియోగింపఁబడునవి శిరస్సు, దృష్టులు, హస్తములు మాత్రమే 47 శిరోభేదములు 48 నాట్యాభినయోర్హములగు దృష్టిభేదములు ఎనిమిది విధముల నుండును. 49 ప్రధాన భ్రూభేదము లాఱు విధములు. 50 హస్తాభినయము వాని వినియోగము 51 వాచికాభినయము వాక్సంబంధమైనది. 52 వాచికాభిజ్ఞత సాహితీ సంజనితము 53 పాఠ్యాభినయ మభినయమునకుఁ బ్రాధిమ మొసంగును. 54 వాగనుభావములు లక్ష్యములు 55 వాగనుభావములు పండ్రెండు విధములు. 56 లలితోచ్చారణము భావ సౌకుమార్యాదులను పెంచును. 57 నిర్దుష్టత వాచికమున కత్యావశ్యకము 58 వాక్యవిరామములు ఈషద్విరామములు ఆశ్చర్యార్థక ప్రశ్నార్థకములు వాచికలక్ష్యములు 59 నిరర్గళాలాపములు శ్రావ్యములు 60 గాత్రమునకుఁ బ్రయత్నమున ధ్వనిసౌలభ్య మేర్పడును. 61 షట్కాలస్వరావృత్తములలో నకారసాధనములు గాత్రమునకు ధ్వని సమ్మేళనోద్యోగమునఁ దోడ్పడును 62 గాత్రసౌలభ్యము భావసమ్మేళమునకు సోపానమువంటిది 63 శాస్త్రీయ గానము సర్వభావబోధకము రసదాయకమునగు 64 రాగములు శ్రుతిమనోహరములు 65 శ్రుతిలయములు గీతాంగములు 66 ఉత్తమకృతులు రాగ విజ్ఞానదాయకములు 67 ప్రాసంగిక శ్రుతివాచికాభినయమును బోషించును 68 వాచికము శ్రావ్యాశ్రావ్యము లను రెండు విధములు గలది. 69 శ్రావ్యప్రసంగము జనాంతికము అపవారితమునన రెండువిధములు 70 అనుక్తాశ్రయవిషయ మాకాశభాషణము 71 ప్రసంగము లౌచితీధరితములు 72 లఘుప్రసంగము లానుషంగికములు 73 ఆనుషంగికములు క్షిప్రములు 74 దీర్ఘభాషణములు స్వగతతుల్యములు 75 ద్వ్యర్థియందుఁ బ్రధానార్థమునకే యభినయ ప్రాధాన్యమీయఁదగు 76 శేషార్థము ధ్వన్యాత్మకము సూచ్యము నగు 77 బహుళాంతరంగిక ప్రయోగములు లఘుప్రసంగాభినయమున కత్యావశ్యకములు 78 అన్యాశ్రయప్రసంగము లర్థదాయకములు 79 పద్యపఠనాభిజ్ఞత పూర్వపుణ్యప్రసాదము 80 రూపకప్రపంచమున గేయములది తృతీయ స్థానము 81 వస్త్వభివర్ణనావసరములఁ బద్యములుండఁదగినవి 82 స్థాయులు వివిధరసోద్దీపనములు 83 భావజన్యములు సాత్త్విక ప్రబోధకములు 84 విటుఁడు చమత్కారుఁడు 85 విదూషకుఁడు నవ్వించువాఁడు 86 చేటకుఁడు సంధికల్పనప్రవీణుఁడు 87 పీఠమర్దుఁడు కార్యపేశలుఁడు 88 స్వర

భేదములు పెక్కు సంచారిస్వభావముల నెఱింగించును. 89 నాట్య పాత్రలు పరిభాషాభాజనములు 90 నాట్యసంబోధనలు ధారణార్హములు 91 ప్రభుప్రాతిపదికసంబోధనము సర్వత్ర గర్హ్యము. సాత్త్వికాభినయము 92 సరళభావనగలది సత్త్వము 93 సత్త్వజనితములు సాత్త్వికములు- 94 సత్త్వభావచిత్రీకరణము సాత్త్వికాభినయము. 95 సాత్త్వికాంశము లపరిమితములు 96 సాత్త్వికము సమయసిద్ధము, పాత్రము నిమిత్తమాత్రము నగు 97 పాత్రమాతృక కావ్యము 98 సాత్త్వికము వ్యక్తిగతము 99 రసజ్ఞ హృదయము ప్రమాణము 100 స్థాయిస్థానము సత్త్వము 101 సంచారి వ్యభిచారు లేకార్థబోధకములు 102 సమయప్రధానము లభినయాంశములు 108 సాత్త్వికభావము లెనిమిదివిధములు 104 సంచారిభావములు త్రివిధాభినయాత్మకములు మిశ్రములు నగు 105 సంచారిభావములు ముప్పది మూఁడు విధములు 106 స్థాయిభావము లభినయార్హములు 107 స్థాయిభేదము లెనిమిది విధములలో నుండును 108 అయోగవిప్రలంభావస్థలు పదివిధములు 109 విరహవిప్రలంభము 110 మానవిప్రలంభము ద్వివిధము 111 హాస్యభేదము లాఱు విధములు భయానక భావములు బీభత్సభావములు రౌద్రభావములు.

## ఆహార్యాభినయము

రంగాహార్యములు. యవనికాదులు. ఆర్ద్రవర్ణములు. వివిధ ఛాయలు. పురుషుల కృత్రిమ కేశములు. స్త్రీల కృత్రిమ కేశములు. దుస్తులు. అలంకారములు. వర్ణలేపన పరికరములు. శుష్కవర్ణములు. దిద్దుడు పుడకలు- క్రీపీ హెయిరు. కోల్డు క్రీము. బ్లూమ్ ఆఫ్ రోజెస్. పెరల్ క్రీము. మేస్కారో. స్పిరిట్ గమ్. కాస్మాటిక్. పఫ్ఫులు. తొలిపూతలు. శుష్కవర్ణములు. వేషధారణము. కౌమార వేషములు. వృద్ధవేషములు. వివిధ భావచిత్రీకరణము. కరయుగ చిత్రీకరణము. పెట్టుడు ముక్కులు. మీసములు. గడ్డములు. విగ్గులు. విశేషాంశములు.

# ద్వితీయ ప్రకరణము

:o:

## రూపకము—సంగీతము.

1 సంగీతము నాదాధీనము 2 సంగీతము ద్వివిధము 3 సంగీతము సాధ్యము 4 అనాహతము లౌకికము 5 రూపకసంగీతము లౌకికము 6 రూపకాంగము సంగీతము 7 నాదము త్రిస్థాయికము 8 స్థాయులు ధ్వనిగుణీకరణములు 9 నాదము ద్వావింశతిశ్రుత్యాత్మకము 10 స్వరములు శ్రుతిభవములు 11 సప్తస్వరములు నియతములు 12 స్వరములు ద్వివిధములు 13 గమకము స్వరపోషకము 14 గమకము లసంఖ్యాకములు 15 తిరిపాదులు ముఖ్యములు 16 గ్రామములు శుద్ధ వికృతి సర్వోత్పాదకములు 17 షడ్జమధ్యమ గ్రామములు ముఖ్యములు 18 దేశ్యరాగములు నాలుగు విధములు 18 రాగములు త్రివిధములు 20 భావరాగములు ఘనయదేశ్యము లనఁబడునవి 21 రాగములు రసోత్పాదకములు 22 రాగములు దశలక్షణ లక్ష్యములు 23 రాగములు సమయసిద్ధములు 24 ఆలాపనము ద్వివిధము 25 తాళము దశప్రాణాత్మకము 26 సప్తతాళములు ప్రసిద్ధములు 27 సుశారీర లక్షణములు 28 ఆలాపక విలక్షణములు 29 సుశారీర లక్షణములు 30 స్వరములు సాధ్యములు 31 నియతశ్రుతి సాధనములు మూఁడు విధములు 32 షట్కాలా వృత్తములు ముఖ్యములు 38 రాగములు లక్షణబద్ధములు 34 పద్యములు రాగభాజనములు 35 భావోపక్రమము గ్రహము 36 భావవిస్తరణాంశ మంశము 37 భావాంతము న్యాసము 38 న్యాసము ప్రాణానుగతము 39 శేషము లైచ్ఛికములు 40 పద్యపఠనమునకు భావరాగసమ్మేళనము లక్ష్యము 41 గద్యకరణము ప్రథమధర్మము 42 రాగభావన ద్వితీయధర్మము 43 స్వరవర్ణ సమ్మేళనము తృతీయధర్మము 44 భావేతరసంచారము త్యాజ్యము 45 పద్యమయ స్వరూపము రాగము 46 కృత్రిమాలాపనము గర్హ్యము 47 రాగతాళప్రధానములు గీతములు 48 పాఠాంతరములు భావభంజకములు 49 గీతములు కర్తృకృతములు 50 గీతికాతాళ మదృశ్యము 51 వాద్యము లుపాంగములు 52 ఉపాంగవాద్యములు ప్రధానములు నగు-

# తృతీయ ప్రకరణము

——(:o:)——

## రూపకము—నాయకులు.

1 స్వీయ 2 ముగ్ధ 3 మధ్య 4 ప్రగల్భ 5 మధ్యాధీర 6 మధ్యాఅధీర 7 మధ్యాధీరాధీర 8 ప్రగల్భ 9 ప్రగల్భాధీర 10 ప్రగల్భాఅధీర 11 ప్రగల్భాధీరాధీర 12 జ్యేష్ఠ 13 కనిష్ఠ 14 పరకీయ 15 పరకీయాకన్య 16 పరకీయాపరోఢ 17 సామాన్య 18 స్వాధీనపతిక 19 వాసకసజ్జిక 20 విరహోత్కంఠిత 21 విప్రలబ్ధ 22 ఖండిత 23 కలహాంతరిత 24 ప్రోషితభర్తృక 25 అభిసారిక 26 ఉత్తమ 27 మధ్యమ 28 అధమ 29 ఉద్దీపన విభావములు 30 ఆలంబన విభావములు 31 యౌవనము 32 ప్రథమయౌవన 33 ద్వితీయ యౌవన34 తృతీయ యౌవన 35రూపము 36 లావణ్యము37 సౌందర్యము38 అభిరూప్యము 39 మార్దవము 40 సౌకుమార్యము41 ఉత్తమసౌకుమార్యము 42 మధ్యమసౌకుమార్యము 43 అధమసౌకుమార్యము 44 చేష్టలు 45 అలంకృతులు 46 గ్రీష్మ ఋతువు 47 వర్షర్తువు 48 శరదృతువు 49 హేమంత ఋతువు 50 శిశిర ఋతువు 51 వసంతర్తువు 52 అనుభావములు 53 చిత్తజానుభావములు 54 భావము 55 హావము 56 హేల 57 శోభ 58 కాంతి 59 దీప్తి 60 ప్రాగల్భ్యము 61 మాధుర్యము 62 ధైర్యము 63 ఔదార్యము 64 గాత్రజానుభావములు 65 లీల 66 విలాసము 67 విచ్ఛిత్తి 68 విభ్రమము 96 కిలికించితము 70 మోట్టాయితము 71 కుట్టమితము 72 బిబ్బోకము 73 లలితము 74 విహృతము 75 వాగారంభానుభావములు 76 బుద్ధ్యారంభానుభావములు 77 కావ్యప్రసిద్ధులగు నాయకులు నాల్గువిధముల నుందురు 78 ధీరోదాత్తుడు 79 ధీరశాంతుడు 80ధీరలలితుడు 81 ధీరోద్ధతుడు 82 శృంగారనాయికాప్రసిద్ధులగు నాయకులు మూడువిధముల నుందురు 83 పతి 84 ఉపపతి 85 వైశికుడు 86 శృంగారనాయకుడు మరల నాలుగు విధముల నుండును 87



అనుకూలుడు 88 దక్షిణుడు 89 ధృష్టుడు 90 శఠుడు 91 నాయకసహాయుడు నాలుగు విధముల నుండును 92 నాయకుడష్టగుణప్రధానుడు 93 శోభ 94 విలాసము 95 మాధుర్యము 96 గాంభీర్యము 97 స్థైర్యము 98 తేజస్సు 99 లాలిత్యము 100 ఔదార్యము 100 నాయకుడు కావ్యార్థప్రధానుడు. నాయకోద్యోగధర్మము వృత్తి. దేశకాలపాత్రాదియోగ్యము ప్రవృత్తి. వృత్తులు నాలుగువిధములు 101 కైశికి (11) కైశికి నాలుగు విధములు 102 నర్మము 103 నర్మస్ఫింజము 104 నర్మస్ఫోటము 105 నర్మగర్భము 106 సాత్వతి 107 సంలాపకము 108 ఉత్థాపకము 109 సంఘాత్యము 110 పరివర్తకము 111 ఆరభటి 112 సంక్షిప్తికము 113 సంఫేటము 114 వస్తూత్థాపనము 115 అవపాతనము 116 భారతి 117 కైశిక్యాదులు సర్వధా రసాశ్రయములు ధీరోదాత్తధీరశాంతనాయకులు మంత్రిసహాయులు, స్వోభయసహాయులు నగుదురు (14) ధీరలలితుడు మంత్రిసహాయుడు (15)ఋష్యాదులు సర్వనాయకులకు ధర్మసహాయులగుదురు (16) సైనికాదులు రాజశాసన నిర్వాహకులు (17)అభీరాదులంతఃపురపరిచారకులు (18) నాయకాంతరము లూహ్యములు.

---

# చతుర్థ ప్రకరణము

## రూపకము—రసము.

5 భావము భావనాబద్ధము 2 విభావము భావకారణము 3 విభావము ద్వివిధము 4 అనుభావము భావబోధకము 5 అనుభావము చతుర్విధము 6 అనుభావము సహజము ననుభవసిద్ధమునగు 7 సాత్త్వికమనుభావతుల్యము 8 వ్యభిచారులు భావపోషకములు 9 సంచారులు ప్రవేశకాదియోగ్యములు 10 సంచారిభావాభినయమే ప్రధానాభినయము 11 స్థిరభావము స్థాయి 12 ప్రయోగము త్రిస్థాయికము 13 రత్యాదులు స్థాయులు 14 స్థాయిత్రయీభావము రసము 15 రూపకరసము లష్టధాభిన్నములు 16 రసములంగ్యంగములు 17 స్థాయిత్రయీంటిభావము శృంగారము 18 శృంగార

ము ద్వివిధము 19 విప్రలంభ మైదు కారణములు కలది 20 మానవిప్రలంభము ద్వివిధము 21 త్రిస్థాయికోత్సాహము వీరము 22 త్రిస్థాయిక శోకభావము కరుణ 23 త్రిస్థాయిక విస్మయభావ మద్భుతము 24 త్రిస్థాయిక హాసభావము హాస్యము 25 స్థాయిత్రయీభయభావము భయానకము 26 జుగుప్సాస్థాయియే బీభత్సము 27 స్థాయిత్రయీక్రోధభావము రౌద్రము 28 ఆనందమే రసము.

---

# పంచమ ప్రకరణము

:o:

## రూపకము-నాటకము.

1 నటప్రవర్తితము నాటకము 2 నాటకము రూపకములలోనిది 3 రూపకములు పదివిధములు 4 పూర్వరంగ ప్రవర్తకుఁడు సూత్రధారుఁడు 5 తదన్య సూత్రధారుఁడు నటుఁడు, స్థాపకుఁడు ననఁబడును 6 నాందీపఠనము సూత్రధారుని ప్రథమ ధర్మము 7 ప్రస్తావము ద్వితీయధర్మము 8 ప్రస్తావము ఆముఖమనియు, స్థాపనమనియుఁ జెప్పఁబడును. 9 ప్రస్తావము సూత్రధారి నటీ మారిషాది నిర్వర్తితము 10 ప్రస్తావము భారతీవృత్తి సంకలితము 11 ప్రస్తావము మూఁడు లక్షణములు గలది 12 ఆముఖాంగములు పదుమూఁడు విధములు 13 ఋతుగాన మైచ్ఛికము 14 ప్రస్తావనానంతరారంభమును గలది ప్రయోగము 15 నాటక నాయకులు రాజర్షి దివ్యులు 10 నాటకేతివృత్తము ప్రఖ్యాతము, ఆధికారికమునగు 17 ప్రాసంగికము ద్వివిధము 18 ఇతివృత్తము పురుషార్థప్రదము 19 వస్తునాయక రసవిరుద్ధాంశములు త్యాజ్యములు 20 సంధ్యాదివిభజనము కర్తవ్యము 21 వస్త్వవస్థ లయిదు విధములు 23 వస్త్వంతరసంబంధము సంధి 23 సంధు లయిదు విధములు 24 ముఖసంధ్యంగములు పండ్రెండు విధములు 25 ప్రతిముఖాంగములు పదుమూఁడు విధములు 26 గర్భసంధ్యంగములు పండ్రెండు విధములు 27 అవమర్శసంధ్యంగములు పదుమూఁడు విధములు 28 నిర్వహణసంధ్యంగ



31 విష్కంభము లయిదు విధములు 32 శృంగార విధములు నాటక యోగ్యములు 33 వస్తునాయక రసవైరుధ్యములు త్యాజ్యములు 34 అంగిరస పోషణము సర్వత్రయోగ్యము 35 నిర్వహణసిద్ధ మద్భుతము 36 యుద్ధాదులు సూచ్యములు 37 నాయకవధాదులు సర్వథాగర్హ్యములు 38 ప్రధానాంశముల పరిత్యాజ్యములు 39 పాత్రనిర్గమ మంకాంతము 40 ప్రవేశకాదులంక పూర్వస్థములు 41 ఆపంచదశాంకము నాటకము 42 ప్రకరణము నీత్యాత్మకము 43 ఇతివృత్త ముత్పాద్యము 44 ప్రకరణ నాయకుఁడు ధీరశాంతుఁడు 45 త్రివిధనాయికలు ప్రకరణ పరిగ్రాహ్యలు 46 ప్రకరణము త్రివిధము 47 భాణమేకాంకము 48 ఇతివృత్తము కల్పితము ప్రవృద్ధమునగు 49 నాయకుఁడు ధూర్తుఁడు 50 అది విటప్రవర్తితము 51 ఆకాశభాషణములు వస్తువిస్తరములగు 52 ముఖనిర్వహణములు ముఖ్యములు 53 భాణప్రసంగము లుభయ రసాత్మకములు 54 ప్రహసనము త్రివిధము 55 ఇతివృత్త ముత్పాద్యము 56 డిమము బహునాయక సంకలితము 57 వస్తువు ప్రఖ్యాతము 58 డిమము చతుస్సంధి సంభరితమే 59 రసము రౌద్రము 60 ఆముఖాదులు నాటకతుల్యములు 61 వ్యాయోగము బహునాయకనిబద్ధము 62 ఇతివృత్తము ఖ్యాతము 63 నాయకులుద్ధతులు 64 వ్యాయోగము సంధిక్రియము 65 యుద్ధమస్త్రీనిమిత్తము 66 హాస్యశృంగారేతరములు రసములు 67 ఏకాంకచరితము వ్యాయోగము 68 ప్రస్తావము నాటకసామ్యమును గలది 69 బహుళ ప్రయోజనములను గలది సమవాకారము 70 ఇతివృత్తము ప్రసిద్ధమైనది 71 ద్వాదశనాయకులను గలది 72 సమవాకారమున కంగీరసము 73 సమవాకారము సంధిచతుష్కము 74 సమవాకారము త్రియంకము 75 విందాద్యములు ప్రయుక్తములు 76 ప్రస్తావన నాటకతుల్యము 77 అష్టాదశ నాడీనిబద్ధము సమవాకారము 78 వీధి భాణతుల్యము 79 అంకేతివృత్తము ద్వివిధము 80 అంకము ప్రాకృత నాయక ప్రసిద్ధము కరుణ రసప్రధానమును 81 యుద్ధాదులు వాక్యాత సూచ్యములు 82 సంధి వృత్త్యంగములు భాణతుల్యములు 83 ఈహామృగేతివృత్తము త్రివిధము చతురంకమునగు 84 గర్భావమర్శములు త్యాజ్యములు 85 నరదివ్యులు నాయక ప్రతినాయకులు 86 ఈహామృగము నాలు గంకములు మూఁడు సంధులు గలది 87 సంకీర్ణ రూపక ప్రధానమైనది నాటిక 88 వస్తువుత్పాద్యము 89 నాటికాశృంగారముదాత్త వస్తుసంజనితము 90

నాయకుడు లలితుడు 91 నాటికా చరితము చతురంక కలితము 92 నాట్యరాసక త్రోటకము లుపరూపకములు.

---

# షష్ఠ ప్రకరణము

## రూపకము—ప్రయోగము

1 ప్రయోగము ద్వివిధము 2 ద్విధాన్యము లౌకికము 3 ద్విధాభిన్నము సమాజము 4 ఖండసంపూర్ణాధీత మౌత్సాహికము 5 ఔత్సాహికము త్పాద్యము 6 ఔత్సాహిక విధానములు వివిధములు 7 లౌకికప్రయోగము వ్యావహారికమే 8 విద్వత్సమాజ మౌత్సాహికతుల్యము 9 అధ్యక్షుడు తదధికారి 10 దేశికుడు ప్రయోగాధికారి 11 దేశికుడు సూత్రధారుడును నగు 12 సూత్రధారుడు ద్విధాభిన్నుడు 13 వస్తుప్రవర్తకుడు పాత్రధారుడును నగు 14 నటు లనుయాయులు 15 నటేతరులు సహాయులు 16 రూపకము ప్రయోగయోగ్యము 17 యోగ్యరూపకము కాలికము 18 వస్తువు సంగ్రహము స్పష్టమునగు 19 పాత్రలు సంక్షిప్తములు 20 రూపకానన సలక్షణమైనది. 21 యోగ్యరూపక మభినయప్రకాశమునుగలది 22 రూపకాగ్రము పరిమితము 23 రూపకము వాస్తవికము 24 పాత్రోచిత భాష పరిగ్రాహ్యము 25 దేవలక ధాత్మకములు త్యాజ్యములు 26 దేశకనిర్ణీత పాత్రములు నటులచే ధరింపబడునవి 27 ప్రయోగమభ్యాస పూర్వకము 28 ప్రథమాభ్యాసము వస్తుపరిచితిని గలిగించినది. 20 ద్వితీయాభ్యాసము వాచికాది ప్రయత్నములను గలది 30 తృతీయాభ్యాస మభినయ పునస్సృతము 31 చతుర్థాభ్యాసము సర్వలక్షణ లక్షితము 32 పంచమాభ్యాసము బహిరంగ ప్రయోగతుల్యము.

---

# సప్తమ ప్రకరణము

## రూపకము—రంగము

1 రూపకము రంగము 2 బందరు రంగాలు 3 గుంటూరు రంగాలు 4 నర్సారావుపేట రంగం 5 విశాఖపట్నం రంగాలు 6 విజయనగరం రంగాలు



7 బళ్లారి రంగాలు 8 రాజమహేంద్రవర రంగాలు 9 కాకినాడ రంగాలు 10 నెల్లూరు రంగాలు 11 మదరాసు రంగాలు 12 చిత్తూరు రంగాలు 13 తెనాలి రంగాలు 14 బెజవాడ రంగాలు 15 సికింద్రాబాదు రంగాలు 16 నర్సాపురం రంగాలు 17 ఏలూరు రంగాలు 18 సంచార రంగాలు 19 సమాలోచనం.

---

# అష్టమ ప్రకరణము

## రూపకము—కావ్యము

1 రూపకము కావ్యము 2 కందుకూరు వారి కావ్యాలు 3 వేదం వారి కావ్యాలు 4 శ్రీపాద వారి కావ్యాలు 5 తిరుపతి వేంకటేశ్వర కావ్యాలు 6 వడ్డాది వారి కావ్యాలు 7 చిలకమర్తి వారి కావ్యాలు 8 ధర్మవరం వారి కావ్యాలు 9 కోలాచలం వారి కావ్యాలు 10 పానుగంటి వారి కావ్యాలు 11 కాళ్లకూరి వారి కావ్యాలు 12 ముత్తరాజు వారి కావ్యాలు 13 బలిజేపల్లి వారి కావ్యాలు 14 కలగలపు కావ్యాలు 15 నా కావ్యాలు 16 సమాలోచనము.

---

# నవమ ప్రకరణము

## రూపకము— నటుడు.

1 రూపకము నటుడు. 2 శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులుగారు, 3 బ్రహ్మశ్రీ ఎడవల్లి సూర్యనారాయణరావుగారు, 4 శ్రీమాన్ విద్వాన్ [illegible] పంచాంగం వేంకటరామానుజాచార్యులుగారు 5 బ్రహ్మశ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్యగారు 6 బ్రహ్మశ్రీ కపిలవాయి రామనాథశాస్త్రిగారు 7 మ॥ రా॥ శ్రీ పారుపల్లి సుబ్బారావుగారు 8 మ॥ రా॥ శ్రీ స్థానం నరసింహారావుగారు 9 మ॥ రా॥ శ్రీ చిలకలపూడి వేంకటేశ్వరశర్మగారు.

# దశమ ప్రకరణము

## రూపకము—పాత్రము

1 రూపకము పాత్రము 2 ముగ్గురు యుగంధరులు 3 ప్రతాపుడు పేరిగాడు 4 జనార్దనుడు 5 చెనమకి 6 వల్లిఖుస్రూలు 7 విద్యానాథుడు 8 ఇద్దఱు పఠాణులు 9 ఆషాబీ 10 తందాన పాటగాడు 11 హరిశ్చంద్రుడు 12 శ్రీకృష్ణతులాభారము 13 శ్రీకృష్ణుడు 14 సత్యభామ 15 రుక్మిణి 16 దశరథుడు 17 దుష్యంతుడు 18 చింతామణిలో సుబ్బిశెట్టి 19 భవానీ శంకరుడు 20 చింతామణి 21 పేటికావాద్యకులు ( Harmonist ) 22 కీ॥ శే॥ బాపట్ల కాంతయ్యగారు 23 మ॥రా॥శ్రీ ఎ. రామానుజంగారు 24 మ॥రా॥శ్రీ వల్లూరు కౌస్తుభభూషణరావుగారు 25 బ్రి॥ మూర్తి సీతారామయ్యగారు 26 బ్రి॥ యడవల్లి నాగేశ్వరరావుగారు

---

## చిత్రపటవివరణము

1 శ్రీ దేశోద్ధారక కా॥ నాగేశ్వరరావు పంతులు 2 హానరబుల్ వేమవరపు రామదాసుపంతులు 3 పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి గ్రంథకర్త 4 శ్రీ మోతే నారాయణరావు జమీందారు 5 నటరాజు 6 వాసకసజ్జిక, అభిసారిక కలహాంతరిత స్వాధీనపతిక 7 ఖండిత ప్రోషిత భర్తృక విరహోత్కంఠిత, విప్రలబ్ధ 8 విస్మయస్థాయి కిలకించితము విచ్ఛిత్తి విలాసము 9 లలితము మోట్టాయితము కుట్టమితము బిబ్బోకము 10 శోకము ఉత్సాహము రతిస్థాయి 11 దక్షిణ నాయకుడు శఠుడు ధృష్టుడు అనుకూలుడు 12 ప్రథమయౌవన 13 ద్వితీయయౌవన 14 జనార్దనుడు బుర్రా శేషగిరిరావు విద్యానాథుడు రా॥ సర్వేశ్వరశాస్త్రి యుగంధరుడు నె. నాగరాజరావు 15 పేరిగాని రంగమును సుగుణవిలాస సభ మద్రాసు 16 ఆంధ్రనాటక కళాపరిషత్తు తెనాలి 17 ఏలూరు సీతారామాంజనేయ నాటక సమాజము, మృచ్ఛకటిక రంగములు ఆటు 18 లక్కరాజు విజయ గోపాలరావుగారి అనసూయ భానుమతి స్త్రీ పఠాన్ సింగరాజు నాగ భూషణరావు ఆషాబీ పి. నారాయణగారు

## చిత్రపటవివరణము

త్రివర్ణముఖపత్రము- శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1 హానరబుల్ వేమవరపు రామదాసు పంతులుగారు 2 శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారు 3 పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి గ్రంథకర్త- 4 నటరాజు 5 వాసకసజ్జిక 6 పులవర్తి ఘంటయ్యశాస్త్రి 7 చిట్టూరు నరసింహంపంతులు 8 అభిసారిక 9 కలహాంతరిత 10 స్వాధీనపతిక 11 ఖండిత 12 ప్రోషితభర్తృక 13 విరహోత్కంఠిత 14 విప్రలబ్ధ 15 విస్మయస్థాయి 16 కిలికించితము 17 విచ్ఛిత్తి 18 విలాసము 19 లలితము 20 మోట్టాయితము 21 కుట్టమితము 22 బిబ్బోకము 23 దక్షిణనాయకుడు 24 శఠనాయకుడు 25 ధృష్టనాయకుడు 26 అనుకూలుడు 27, 28 శోకము 29 ఉత్సాహము 30 రతిస్థాయి 31 ప్రథమయౌవన 32 ద్వితీయయౌవన 33 ఛత్రపూర్ జగన్మోహన్ థియేటరు, బందరు 34 ఆంధ్రనాటక కళాపరిషత్తు తెనాలి 35, 36 నేషనల్ థియేటరు బందరు 37 విక్టోరియా మెమోరియల్ డ్రమాటిక్ క్లబ్, నరసారావుపేట 38 ఆంధ్రసభ చెన్నపురి 39 విద్యావినోదినీ సభ పెద్దాపురము 40 వై-ఎస్ కె-వి నాటకసమాజము, నరసపూర్ 41 అఫీషియల్ థియేటరు గుంటూరు 42 శ్రీ సీతారామాంజనేయ నాటకసమాజము ఏలూరు 43 సుగుణవిలాస సభా సంస్కృత నాటకశాఖ చెన్నపురి 44 కీ॥ శే॥వ ఈమని లక్ష్మణస్వామిగారు బందరు 45 శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారు 46 కీ॥ శే॥ కందాళై శ్రీనివాసన్ గారు 47 వెదురుమూడి శేషగిరిరావు పంతులుగారు 48 శ్రీమూర్తి సీతారామయ్యగారు, 49 శ్రీ యడవల్లి నాగేశ్వరరావుగారు 50 శ్రీ ఎ. రామానుజులుగారు 51 శ్రీ యడవల్లి సూర్యనారాయణరావుగారు 52 శ్రీ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు (కబీరు) 53 శ్రీ యడవల్లి సూర్యనారాయణరావుగారు (దుష్యంతుడు) 54 డాక్టరు జి-వి. సుబ్బారావుగారు (వెట్టివాడు) 55 డాక్టరు జి-వి సుబ్బారావుగారు (యుగంధరుడు) 56 శ్రీ సింగరాజు నాగభూషణరావుగారు, బాపట్ల యుగంధరుడు) 57 శ్రీ సింగరాజు నాగభూషణరావుగారు (పిచ్చివాడు) 58 శ్రీ వెల్లూరు నాగరాజరావుగారు 59 వారి పాపారాయుడు పాత్రము

60 శ్రీ మాధవపెద్ది వేంకటరామయ్యగారు, తెనాలి 61 వారి దుర్యోధన పాత్రము 62 శ్రీ సి-యస్-ఆర్ ఆంజనేయులుగారు 63 వారి రామదాసు పాత్రము 64, 65 శ్రీ లక్కరాజు విజయగోపాలరావుగారి స్త్రీ పాత్రములు 66 శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారు 67 వారి వీరబాహు పాత్రము 68 శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారు (కణ్వుడు) 69 శ్రీ వేమూరి రామారావుగారు, భవానీశంకరుడు 70 శ్రీ కపిలవాయి రామనాథశాస్త్రిగారు 71 వారి కృష్ణపాత్రము 72 శ్రీ వి వెంకటాచలమయ్యగారు, సుగుణవిలాస సభ, మద్రాసు (దొంగ) మృచ్ఛకటికము) 73 వారి [illegible] పాత్రము 74 శ్రీ నిడసనమెట్టు కొండలరావుగారి భావచిత్ర సముదాయము 75 మంగిపూడి రామలింగశాస్త్రిగారి భావచిత్రములు 76 శ్రీ ముప్పిడి జగ్గరాజుగారి స్త్రీ పాత్రములు 77 శ్రీ జి. రాఘవేంద్రరావుగారు ([illegible]) 78 శ్రీ స్థానం నరసింహారావుగారు 79, 80 వారి స్త్రీ పాత్రములు 81 శ్రీ అవధాని పురుషోత్తముగారు 82 వారి ప్రాచీన సుందరి 83 మధ్యకాల సుందరి 84 వారి యీనాటి సుందరి 85 శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులు గారు (హిరణ్యకశిపుడు పాత్రము) శ్రీ బెంగుళూరు వాసుదేవరావుగారు (లీలావతి) 86 శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు (దుష్టబుద్ధి) శ్రీ టి. శ్రీనివాసాచారిగారు (విషయ) 87 శ్రీ రా॥బ॥పి. సంబంధ మొదలియారు బి-ఏ-బి-యల్ సుగుణవిలాససభ మదరాసు (హేమ్లెటు పాత్రము) 88 శ్రీ కే. నాగరత్నము అయ్యర్ (విజయ) శ్రీ పి. సంబంధ మొదలియారు గారు (మనోహరుడు) 89 శ్రీ రంగవడివేలు మొదలియారు గారు బి-ఏ బి-యల్ సుగుణవిలాస సభ మదరాసు 90 వారి [illegible] పాత్రము 91 శ్రీ రా-సా-డి. వెంకటరమణయ్యగారు బి-ఏ సుగుణవిలాససభ మదరాసు (మదరాసీ) 92 వారి లంబాడి పాత్రము 93 శ్రీ-వి-వి గోపాలరత్నంగారు సుగుణవిలాససభ, మదరాసు (గోపిక) 94 శ్రీ స్థానం నరసింహారావుగారు (గోపనార) 95 సుసర్ల రామచంద్రరావుగారు [illegible] థియేటరు బందరు (స్త్రీ పాత్రము) 96 శ్రీ॥ శ్రీ॥ వంగల ఆంజనేయులుగారు (నలుడు) 97 శ్రీ పి-వి రామానుజంశెట్టిగారు, సుగుణవిలాససభ, మదరాసు ([illegible] పేరిగాడు) 98 శ్రీ జ్యోస్యుల శేషయ్యగారు (దమయంతి) 99 శ్రీ॥ శ్రీ॥ వెంపటి వెంకటేశ్వర్లుగారు (నలుడు) 100 శ్రీ కొచ్చెర్లకోట రంగారావుగారు (హిరణ్యాక్షుడు) 101 శ్రీ లక్ష్మణరావుగారు (చారుదత్తుడు)



శ్రీ ఆరణి సత్యనారాయణగారు (వసంతసేన) మృచ్ఛకటికము) 102 శ్రీ లక్ష్మణరావుగారి చారుదత్తుడు పాత్రము 103 శ్రీ ఆలమూరి పట్టాభిరామయ్యగారు (మైత్రేయుడు) శ్రీ కొచ్చెర్లకోట రంగారావుగారు (శకారుడు) (మృచ్ఛకటికము) 104 వసంతసేన శకారుడు (105) శ్రీ ముంజులూరి కృష్ణరావుగారు (శర్విలకుడు) 106 శ్రీ ఆరణి సత్యనారాయణ గారు (వసంతసేన) (మృచ్ఛకటికము) 107 శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు (వీరబాహువు) 108 బుర్రా శేషగిరిరావుగారు (జనార్దనుడు) శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు (యుగంధరుడు) శ్రీ రామాయణం సర్వేశ్వరశాస్త్రిగారు (విద్యానాథుడు) (ప్రతాపరుద్రీయము) 109 సుగుణవిలాససభ, మద్రాసు (పేరిగానిరంగము) 110 శ్రీ కడియాల రత్తయ్యగారు (సత్యభామ) శ్రీ ఉప్పలూరి సంజీవరావుగారు (రుక్మిణి) 111 శ్రీ పారుపల్లి సుబ్బారావుగారు (రాధ) 112 శ్రీ కారుపర్తి నాగలింగంగారు 113 శ్రీ బి. రామకృష్ణరావు (సోహ్రాబు) సింగరాజు నాగభూషణరావు (రుస్తుము) 114 శ్రీ॥ శ్రీ॥ మహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు 115 శ్రీ॥ శ్రీ॥ ముత్తరాజు సుబ్బారావు పంతులు ఎం.ఏ గారు 116 శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు 117 శ్రీ॥ శ్రీ॥ ధర్మవరము కృష్ణమాచార్యులు గారు 118 శ్రీ॥ శ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారు 119 శ్రీ [illegible] సుబ్బరాయుడుగారు 120 శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు 121 శ్రీ బొమ్మకంటి కృష్ణమూర్తిగారు 122 శ్రీ లక్కరాజు విజయగోపాలరావుగారు (సుమతి) 123 సింగరాజు నాగభూషణరావుగారు (పఠాన్) పి. నారాయణగారు (ఆషాబి) 124 శ్రీ [illegible] పీతాంబరరావుగారు 125 శ్రీ [illegible]చార్యులుగారు 128 బెల్లంకొండ సుబ్బారావు గారు 120 గూడపాటి నరసింహారావునాయడు గారు 130 వల్లూరి వెంకట సుబ్బారావుగారు డాక్టరు కె, గోపాలస్వామి అయ్యంగారు.

(1) [illegible] ఘటశతపంచాననాది బిరుదాంకితులు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు శతావధాని

(2) (ఎ) హరిప్రసాదరావుగారు హరిశ్చంద్రుడు
కోపల్లె హనుమంతరావు గారు చంద్రమతి

(బి) హరి ప్రసాదరావుగారు — దుష్యంతుడు
కోపల్లి హనుమంతరావుగారు — శకుంతల

(3) పిల్లలమర్రి సుందరరామయ్యగారు

(4) మద్దాలి శేషగిరిరావుగారు — నలుడు

(5) సి. యస్. నటేశంగారు

(6) గూడపాటి నరసింహారావు నాయుడుగారు — యముడు

(7) డి. జగన్నాయకులు — చింతామణి

(8) పారుపల్లి సత్యనారాయణగారు — స్త్రీ పాత్రము

(9) కృష్ణ నాట్యసభ తెనాలి.

(10) బెల్లంకొండ సుబ్బారావుగారు, బి. ఎ.

(11) వలివేటి శ్రీమన్నారాయణమూర్తిగారు గుంటూరు

(12) హార్మోనియష్టులు.

(1) గాలి పెంచెల నరసింహారావుగారు

(2) వోగిరాల రామచంద్రరావుగారు

(3) ప్రభల సత్యనారాయణగారు,







పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి (గ్రంథకర్త)



# ఆంధ్ర నటప్రకాశిక

ప్రథమ ప్రకరణము.

## 1. గాంధర్వము—అభినయము.

గానము ధర్మముగాఁ గలవారు గంధర్వులు. గంధర్వులకుఁ జెందునది గాంధర్వము. పదార్థములను నభినయించునది "అభినయము". రసభావములను వ్యంజించునది కావున "వ్యంజక" మనియుఁ బఱఁగును.

## 2. గాంధర్వ ముపవేదము.

ఋగ్యజుస్సామాథర్వణము లనఁబడు నీ నాల్గు వేదములలోని ఋగ్వేదమునుండి వాద్యము, యజుర్వేదమునుండి యభినయము, సామవేదమునుండి గానము, అథర్వణవేదమునుండి రసము సంగ్రహింపఁబడి, పితామహునిచే మేళగింపఁబడి నిర్మింపఁబడినది. ఇదొక "ఉపవేద" మనఁబడును.

### 3. గానము తౌర్యత్రికాత్మకము.

నృత్తము, గీతము, వాద్యము, అను నీ మూఁడును దౌర్యత్రికము. ఈ మూఁటి సమ్మేళనమే తౌర్యత్రికాత్మక గానము లేక సంగీతము.

### 4. సంగీత శాస్త్రము.

శాస్త్రము శాసించునది. నృత్త గీత వాద్యములను వివరించి యందలి మంచి చెడుగులను నిర్ణయించునది సంగీత శాస్త్రము. అది "నాట్యశాస్త్రము", "భరతశాస్త్రము" అనియుఁ జెప్పఁబడును.

### 5. నాట్య శాస్త్రము.

నటుని కార్యము నాట్యము. నాట్యమును బోధించునది నాట్యశాస్త్రము.

### 6. భరత శాస్త్రము.

తౌర్యత్రికాత్మక మగు గాంధర్వవేదమునకు భావ, రాగ, తాళములు ప్రతిపాద్యములు. ఈ మూఁటి సమ్మేళనమే భరతము. భరతమునిచే వెలయింపఁబడి "భరతశాస్త్రము" నాఁబఱఁగు.

### 7, భావము చిత్తజము.

నిర్వికార చిత్తమునందు జ్ఞానేంద్రియపంచక మూల



మున జనించు నొకానొక వికారము లేక "భావన". అనఁగ భావింపఁ బడునది. "తలఁపు" అనియుఁ జెప్పనగు.

### 8. శ్రుతిమనోహరాలాపము రాగము.

భావమును శ్రుతిపేయముగ నాలాపించునదియు, స్వర వర్ణాదులచే నలంకరింపఁబడిన ధ్వన్యంతర ప్రస్తారణాదికములచే హృదయములఁ గరఁగించునదియు నగు నాలాపము రాగము.

### 9. స్వర భావ గమనక్రమావబోధకము తాళము.

మొట్టమొదట జనించిన చిత్తజవికార మనఁబడు నా భావము స్వర వర్ణాలంకృతము లగు గీతికాదులలో విస్తరింపఁ బడు నప్పటి, గమనవైఖరులు తెలియునటు లఱచేయియందు లేక యట్టి చేయి యందలి కాంస్య తాళ వికారమునందుఁ గుడియఱచేయిచేతను లేక దానియందలి కాంస్యతాళమునను బుట్టింపఁబడు ఘాతజ ధ్వని.

### 10. తాండవ లాస్య సమ్మేళనస్వరూపము తాళము.

తాండవము నిలిచి యభినయింపఁదగినది. లాస్యము కూర్చుండి యభినయింపఁదగినది. తాండ వాధిదైవము శివుఁడు. లాస్యాధిదేవత లకులాశక్తి యగు పార్వతి. లకులాశక్తి శివశక్తుల సంజ్ఞాక్షర సంపర్కమే "తాళ" మనియుఁ జెప్పఁబడును.



శ్రీ వడ్డాది సుబ్బారాయడుగారు



### 14. నాట్యము నాటకోచితము.

కావ్య తత్త్వ ప్రకటనము, రసోత్పాదనము ముఖ్యధర్మములుగాఁ గలుగు నాటక ప్రయోగమునఁ బ్రవర్తింపఁదగినది నాట్యము.

### 15. నృత్తము రసభావలేశమును బాత్రప్రాధాన్యమును గలది.

భావాభినయ రహితమై కేవల లయాలీలానుగతంబునఁ బరంగుచు రూపక నటుల కప్రధానమై యుండునది నృత్తము.

### 16. నృత్యము భావాశ్రయము.

ప్రతి పదార్థ పరిబోధకమై భావనముల నర్తనాదికములతోఁ బరిస్ఫుట మగునదియు రూపకనటులకుఁ బ్రధానమైనదియు నగునది నృత్యము.

### 17. అభినయము రెండు విధములు.

"సూక్ష్మము" "స్థూలము" అను సంజ్ఞలను గలిగి యభినయము రెండు తెఱఁగులుగ నుండును.

### 18. సూక్ష్మాభినయము త్యాజ్యము.

అంగోపాంగ పరిస్పందములచే భావప్రస్తావముగు

యోగ్యమగు నీ సూక్ష్మాభినయము రూపక నటులచేఁ బరిహ రింపఁ దగి యుండును.

### 19. స్థూలాభినయము సర్వథా యోగ్యము.

పదార్థము కంటె వేఱైనది వాక్యార్థము. ఈ రెండర్థ ములనుండియు భేదించునట్టిది భావార్థము. సర్వసాధారణముగ నీ కడపటి రెండర్థములే స్థూలాభినయమునఁ బ్రకటింపఁబడుట కర్హము లగునవి.

### 20 స్థూలాభినయమునకు లోకము ప్రమాణము.

స్తంభము, రోమాంచము, మున్నగు సత్త్వజనిత భావ ములు, రతి, ఉత్సాహము, శోకము, మొదలగు స్థాయి భావములు సర్వసామాన్యములు. దేశము, కాలము, జాతి, సంస్కారము, వయస్సు కారణములు కాఁగ, ననుభవములు సర్వథా భిన్నరూపములలో వ్యక్త మగుచుండును. ఇట్టులస స్థూలాభినయమునకు లోకమే శరణ్యము కాక మానదు.

### 21. నటుఁడు లోకజ్ఞుఁడు.

నటునిది స్థూలాభినయము. పదార్థభిన్నమగు భావ మయ స్వరూప మది చిత్రింపఁదగినది. సూక్ష్మాభినయోచిత ములగు సాంకేతిక హస్తములు, శిరములు, దృష్టులు నిందుప యోగింపఁబడవు. పాత్రల రూపములు, భాషణములు, కర్మములు, అనుభవములు మున్నగునవి సర్వము లోకమునుండి



కీ. శే. ఈమని లక్ష్మణస్వామిగారు, బందరు



కే. శే. కందాడై శ్రీనివాసన్ గారు



శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారు



శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు



ఎం. రామదాసుపాత్రము





శ్రీ లక్కరాజు విజయగోపాలరావుగారి స్త్రీ పాత్రములు





యే నటుఁడు గ్రహింపఁ దగినవి. నటుఁ డిట్టి తన యనుభవము నభినయమునకు జతపఱచి దిదృక్షులఁ దనియించును. లోకానుభవ రహితున కట్టి యభినయసౌలభ్య మలవడదు.

### 22. నటుఁడు సర్వాంగ సుందరుఁడు.

చిక్కని దేహము, కన్నులు, ముఖము మున్నగు నంగ వికారములను గలవాఁడు భావప్రకటనమును స్ఫుటముగను సుకుమారముగను జూప నశక్తుఁడు. సర్వావయవములు పుష్టములు, తేజోవంతములు, మనోహరములు నయి యుండవలెను. ఎచ్చట నే యవయవ మెంత యందమున నొప్పి యుండవలెనో యచ్చట నా యవయవ మంతగ నమరి యుండవలెను. ఆరోగ్యమును శ్రద్ధమెయిఁ గాపాడుకొననేర్చినవాఁ డిట్టి యవయవ సౌందర్యము నందఁగలఁడు. వ్యాయామ మత్యావశ్యకము. పరిశ్రమము పటుత్వము నొసఁగి నటుని సౌందర్యమును బోషించును. సుందరుని నాట్యము సహజ లాలిత్య సౌకుమార్యములను గలిగి దిదృక్షుల నాకర్షించును.

### 23. నటుఁడు భాషాభిజ్ఞుఁడు.

కావ్యము భాషామయము. అభినయాశ్రయమగు కావ్యపాఠము విద్యావిహీనున కెటు లర్థము కాఁగలదు! నిరర్థకాభినయము రసజ్ఞుల నెటు లలరింపఁగలదు! "నాటకాంతమ్ హి సాహిత్యమ్". దీని నెంతని నిర్ణయింపఁగలము!

24. నటుఁడు భావజ్ఞుఁడు.

ఇచ్చట భావ మనఁగ హృదయమని యూహింపఁ దగినది. పదార్థ గ్రహణమునకుఁ జాలిన ప్రతిభాలేశము భావ పరిగణనమునకుఁ జాలదు. ఉచితజ్ఞత యన్నిసమయము లందును గాఁదగినది. నటుని శాస్త్రి లోకానుభవము లా రెండు నేర్పులను గలిగించునవి.

25. నటుఁడు వస్తు వివేకి.

రూపక రచన ప్రస్తుత మొక పద్ధతిని లేదు. నటు లీ కారణమున గత్యంతరము లేక కొన్ని విలక్షణములలో నాట్యాంశమును గ్రహించుచున్నారు. మఱికొందఱు కావ్య మాత్రృక నతిక్రమించి వేలనపుఁ గల్పనములను జతపఱచు చున్నారు. ఈ రెండు కారణములనుజేసి రూపక వస్తుప్ పాజ్ఞుల మన్ననలను బడయకున్నది. వస్తువివేకి యగు నటుఁడు రసాత్మక రూపకమును మాత్రమె సంగ్రహించును. పని పట్టినచో నొకదాని సృష్టించుటకును సమర్థుఁడగును.

26. నటుఁడు ప్రగల్భుఁడు.

అనుభవించుట, యనుభవించిన దానినిఁ బ్రకటించుట కవికివలె నటునకును ముఖ్యధర్మములు. కవి తనదు భాషా స్వాతంత్ర్యము ననుసరించి భావితార్థమును బ్రకటించును. నటుఁడు తత్తదుచితాచార సాంప్రదాయములను జతపఱచి దానినిఁ బ్రకటించును.



కావ్యము కాల్పనికము. అభినయమును నట్టిదే. ఈ భావము నీ విధమున నిట్టి హస్తమున లేక యిట్టి ముఖ మునఁబ్రకటింప నగునను నియమము నటుఁడు పాటింపఁదగినది కాదు. అభినయాంశములగు సర్వాంగిక క్రియలు, గుణ ములు సమయమునకుఁ దగునటులు నటునకు స్ఫురింపఁదగినవే. ఇఁక లక్షణ శాస్త్రముల ప్రయోజనము భావాది పరిచితినిఁ బ్రసాదించు నంతవఱకే.

27. నటుఁడు నిగ్రహుఁడు.

నాట్యము కళ. రాగ మెంతలో నగపఱచునో విరాగ మంతలో శ్రుతపఱచును. శోక ముండిన చోటనే సంతో షమునకును బీఠ మేర్పఱచును. తా ననుభవించునో లేదో యన్యుల ననుభవింపించును. అటులని దీని నింద్రజాలము తోఁ బోల్పఁదగదు. నటుఁడు మాయల వాఁడును గాఁడు. నాట్యము పవిత్రమైనది. నిర్మలానందమును ఘటించునది. నటుని మనోనిగ్రహమే నాట్యమునకు స్థాయి.

28. నటుఁడు పవిత్ర హృదయుఁడు.

మనస్సు చంచలమయినది. దానిని నియమబద్ధముగఁ జేయ నేరికిని కష్టతమము. వ్యసనము లనేకములు. మితి మించినచో నవి దుర్వ్యసనములై మానవునకు విడువరాని వగును. బాల్యంబాది దుర్వ్యసనములనుండి తొలఁగఁ బ్రయ త్నించువాఁ డొకింత సుఖువుగ హృదయనైర్మల్యమును

బడయఁ గలఁడు. మఱియొకఁడు సత్సాంగత్యమునను విద్యాది సంస్కార విశేషమునను, నీర్ష్యాసూయాదులను బాసి క్రమముగ భూతదయ, సర్వ సౌభ్రాతృత్వము, తృప్తి, శాంతి మున్నగు సత్త్వసంపద లలవఱచుకొనును. ఇట్టివాఁడు నటోద్యోగమున కెంతయు నర్హుఁడు. పరగత సుఖదుఃఖ స్వభావములను యథావిధి ననుభవించి నాట్యధర్మమును నిష్కళంకముగ నిర్వహించుటకును యోగ్యుఁడు. పవిత్రహృదయము నటునకు ముఖ్యమైన చేయూఁత.

## 29. నటుఁడు స్వతంత్రుఁడు.

కవి యుక్తి ప్రత్యుక్తులలోఁ బాత్ర స్వరూపమును జిత్రించును. నటుఁడు చతుర్విధాభినయములలో దానినిఁ బ్రదర్శించును. పాత్ర ధర్మము లోకప్రసిద్ధమగున దయ్యేనేని కవి నటుల హృదయములు పరస్పరము మేళగించి యభినయ సౌలభ్య మొదవించును. ఈ యుభయులలో ననుభవము పట్టున నెవరు కంటువడినను రసభావములకు సంఘట్టన మేర్పడక తప్పదు. అట్టి సమయములందు స్వతంత్రుఁడగు నటుఁడు స్వీయానుభవమును బురస్కరించుకొనియే పాత్రతత్త్వమును బ్రకటించును. అనుభవ విరుద్ధాంశములను గన్నుమూసి కొని యాతఁడు యథావిధి ననుకరింపఁడు. అనుకరింపఁ జాలఁడు. అస్వతంత్రాభినయము రసోత్పత్తి కెంతమాత్రము కారణము కాఁజాలదు.









కే. శే. వంగల ఆంజనేయులు గారు
నలుడు



చాకలి పేరిగాడు
శ్రీ పి. వి. రామానుజం శెట్టిగారు
సుగుణవిలాససభ, మదరాసు

### 30. నాటకము రసాత్మకము.

క్రమముఁ దప్పని కథావిస్తరణమును గలది నాటకము కాదు. నీతిని బోధించునదియుఁ గాదు. చరిత్రాత్మక మంతకంటెను గాదు. అట్టివి నాటకేతరములగు మఱికొన్ని రూపకములలోఁ జేరఁ దగినవి. నాటకము రసాత్మకమైనది మాత్రమే. (నాటకాది వివరములు వేఱొక ప్రకరణమునఁ దెలియఁదగినవి.)

### 31. తత్ప్రయోగ ముదాత్తము.

భావములు విభావానుభావాదులచేఁ బరిపక్వములై రసస్వరూపము లందుచున్నవి. కావ్యాంశము లుదాత్తభావములు. అవి మాత్రమే పవిత్రానంద దాయకములు. ప్రాచీన నాటకములు చాలవఱకట్టి యుదాత్తభావ లక్షణాదులకు లక్ష్యములు కాఁదగినవి.

నటుఁడు పవిత్రుఁడు. నటుని కార్యము పవిత్రమైనది. ఉదాత్తభావలక్షణాది పరిజ్ఞానమును బురస్కరించుకొనినదగు నాటకప్రయోగ మన్నివిధముల నుదాత్తమనుట సమంజసము.

### 32. రంగము రూపకాశ్రయము.

వస్తురూపమును దాల్చునది రూపకము. భావప్రకటన మొక్కటియే కాక కావ్యప్రపంచమే యభినయావసరమునఁ బ్రసన్నము కాఁదగినది. వస్తువు, స్థలము, కాలము,

అభినయము సమ్మేళన మగుటకు రంగమే యాశ్రయము.

### 33. వస్తువు కవి భావితము.

వస్తువు పురాణములకుఁబ్రత్యకుసాంఘికోదంతములకు లేక మఱియే యితర సందర్భములకు నిమిత్తమాత్రముగఁ జెందినఁ జెందవచ్చును. చెందకపోయినను బోవచ్చును. స్వానుభవ సిద్ధము, ఆనందప్రదము నగు యత్కించి ద్విషయమును బ్రధానముగఁ గొని తత్తదుచితమ్ములగు సకల స్వరూపములను గవి యేర్పఱచును. కవి భావితార్థమే రూపక వస్తువు.

### 34. కృషిమూల మభినయము.

నాటకము సమగ్రముగ నన్వయింపఁ బడుటకు విద్యాభినివేశము నటునకు మెండుగ నుండవలెను. నాటక ప్రయోగము పాత్రతత్త్వానుగుణ్యముగ నెఱపుటకు సంగీతాభినయాది కళలయందు మిక్కిలి యనుభవ మేర్పడవలెను. బహుళ ప్రయత్నమునఁ గాక యభినయసారళ్య మొదవదు. వారితకు నోరవడివోలె యభినయమున కభ్యాసమును దోడ్పడును.

### 35. ఫలము భూమికా ప్రసన్నము.

ధ్యానము, మననము, నిష్ఠ, ఉపాసనమునకు ముఖ్యాంగములు. నాట్యాభ్యాసము యోగ మనఁదగినది. ఉపాసన



గోపిక

శ్రీ వి. సి. గోపాలరత్నం గారు

సుగుణవిలాససభ, మదరాసు





నేషనల్ థియేటరు, బందరు



మునకు దేవతాప్రసన్నమువోలె నాట్యాభ్యాసనమునకు భూమికా సాక్షాత్కారము ఫల మనఁదగినది.

### 36. సంగీతము భావపోషకము.

ధ్వన్యంతర సంజ్ఞలు స్వరములు. స్వరభావసమ్మేళనములే రాగములు. అవి జనుల హృదయములను గరఁగించునవి.

కేవల శబ్దోచ్చారణము ప్రాణములేని శరీరమువంటిది. బహుళార్థ భావము లుదాత్తానుదాత్త స్వరితాది ధ్వన్యాలాపములచేతనే ప్రకటింపఁ దగినవి. సంపూర్ణార్థమును గల యే వాక్యమైనను సంగీత సాహాయ్యముననే భావమును స్ఫురింపఁ దగియుండును. ఇంతయేల! భాషింపఁబడు ప్రతిశబ్దము సంగీతమయ మనఁదగినది.

### 37. భావసమన్వయ స్వరూపము ప్రయోగము.

రూపక ప్రయోగము బహునటులచే జరుపఁబడునది. ఎవరి యనుభవమును వారు చిత్రింతురేని కావ్యభావము సమన్వయింపఁబడ నేరదు. పాత్రలు, వాని కార్యములు, భాషణములు మున్నగున వన్నియు నొక్క క్రమమునకుఁ గట్టుపడిననే కావ్యభావ మొక్క రూపున నేర్పడును.

### 38. విద్వదతీతము కళ.

రూపకభావ పరిజ్ఞానము విద్వదాసాదితము. ప్రతిభాజనితమగు తత్ప్రయోగము కళ. నటునకు భావపరిగ్రహణము

చిత్రీకరణము రెండును గాఁదగినవే. కావుననే నటుఁడు విద్వాంసుఁడు, స్వతంత్రుఁడు ననఁబడెను. విద్వదతీతమగు నాటక కళ విద్యాస్వతంత్రుఁడగు నటునిచేతనే యుపాసింపఁ దగినది.

## 39. అభినయము కావ్యము.

ఉత్తమ కావ్యము నిర్దుష్టానంద దాయకము. ఉదాత్తాభినయమును నట్టిదే. విమర్శకుని దృష్టికి భాషాకావ్య ధర్మమునుండి యభినయ మేరూపునను భేదించు భంగిఁ గన్పింపదు. కావ్యఫలము శాశ్వతమైనది. అభినయ ఫలము నట్టిదె యగుటచేఁ గావ్యమనఁ దగినది.

## 40. తత్ఫల మకురము.

ఫలోద్దేశమునఁ గావింపఁబడు కార్యము ఫలాంతమున నదృశ్య మగును. నిరపేక్షతోఁ గూడునది, నిఖిల ప్రపంచ మునకుఁ జెందునది, వృద్ధిక్షయము లెఱుంగనిది రసాత్మక రూపక జనితానందము. ఇది శాశ్వతము.

## 41. శాశ్వతానందమే బ్రహ్మానందము.

అభినయము తెప్పపాటులో నదృశ్య మగుచున్నది. అభినయానందము శాశ్వతమనుట సాహసమందురేమో! అటులు కాదు. అభినయార్థము పరమార్థమయినపుడు, అభి



నయరూపము విశ్వజనీనమయినపుడు, అభినయానందము శాశ్వతానంద మెటులు కాకపోవును? కావ్యము గౌరవింపఁ బడుట కెట్టి కారణములు కలవో యభినయకావ్యమునకును నట్టివె కలవు. అభినయానందమును శాశ్వతానంద మగుటచే బ్రహ్మానంద మనఁదగినది.

## 42. నాట్యాభినయము నాలుగు విధములుగ నుండును.

నాట్యాభినయ మన స్థూలాభినయమనియే యూహింపఁదగు. సూక్ష్మాభినయ చిహ్నితములగు నొకకొన్నియుఁ బ్రధాన రసమున నుపరసములవోలె సంక్రమింపఁదగినవి కలవు. అయ్యవి సూక్ష్మములైనను నప్పటున స్థూలములనియే పేర్కొనఁ దగు.

## 43. ఆంగిక, వాచిక, సాత్త్వి, కాహార్యములు స్థూలాభినయాంతరములు.

అంగ ప్రత్యంగోపాంగములకుఁ జెందునది „ఆంగికాభినయము". వాక్సంబంధి భావార్థ ప్రకటనము వాచికము. సత్త్వసిద్ధములగు భావములు, అవస్థలు చిత్రించునది „సాత్త్వికాభినయము". వస్త్ర, భూషణ, లేపనాదికరూప మాహార్యమనియుఁ బఱఁగును.

## 44. అంగాభినయాశ్రయము లవయవములు.

భావప్రకటనమునకు భాష ముఖ్యసాధనము. భాషిం

పలేని మూఁగ కేది సాధనము ? అవయవములేకద ! ఇట్టివో భాషాసాహచర్య మొదవినపుడే యవయవము లింకను స్పష్టముగ నర్థభావములను విన్పింపఁ గలవు.

45. అంగములు, ప్రత్యంగములు, ఉపాంగములు అని యవయవములు మూఁడు విధముల విభజింపఁబడినవి.

అంగము లాఱు. శిరస్సు, చేతులు, కంఠము, పార్శ్వములు, నడుము, పాదములు.

ప్రత్యంగము లాఱు. మూఁపులు, చేతులు, వీఁపు, కడుపు, తొడలు, పిక్కలు.

ఉపాంగములు పండ్రెండు. చూపు, ఱెప్పపాటు, నల్లగ్రుడ్లు, చెక్కిళ్లు, ముక్కు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరస్సు.

46. స్థూలాభినయమున ముఖ్యముగ వినియోగింపఁబడునవి, శిరస్సు, దృష్టులు, హస్తములు, మాత్రమే.

మనుజుఁడు భాషించునపుడంత నొకకొన్ని యాంగిక వికారము లుత్పన్నము లగుచుండును. అప్రయత్నాసాదితములగు నిట్టి వికారములు స్థూలాభినయార్హములు. అయినను నాట్యావసరమున నటుని వ్యక్తిత్వ మన్యగత మగుచున్నది. దానితో నన్యాంగిక ధర్మము లొకకొన్ని ప్రయోగసౌలభ్యము కొఱకు నటుఁ డవలంబింపవలసియు వచ్చుచున్నది. వ్రాలు



ఉత్తర్ థియేటర్ , గుంటూరు



వై. యస్. కె. వి. నాటకసమాజము, నరసపూర్



కొఱ కొరవడివోలె నాట్యోద్యోగి కిట్టిది ప్రారంభదశ నాఁబఱఁగు. శిరస్సు, దృష్టి, హస్తములకుఁ జెందిన యొకకొన్ని వికారము లాకారణమున నటులు కాఁగోరువా రలవఱచు కొనఁదగి యుందురు.

## 47. శిరోభేదములు.

1. సమము. 2. ఉద్వాహితము. 3. అధోముఖము. 4. ఆలోలితము. 5. ధుతము. 6. కంపితము. 7. పరావృత్తము. 8. ఉత్క్షిప్తము. 9. పరివాహితము.

### శిరోరూపములు—వాని వినియోగములు.

1. శిరము నేవైపునకు వంపక కదలింపక యథాయోగ్యస్థితిని నిలిపినపు డది “సమశిర” మనఁబడును.

ఇష్టదేవతా స్తుత్యవసరమందుండు సూత్రధారున కీ సమశిరోవిధాన మవధార్యము. జపతపోనిష్ఠానుష్ఠాన గరిష్ఠులగు మునిజనంబుల స్థితిని బ్రదర్శించుటకును నగును. ప్రభువు, సేనాపతి, ఉద్ధతుఁడు, నాయకుఁడు, స్వతంత్రుఁడు, విస్మయవిశిష్టుఁడు, దుఃఖధూర్వహుఁడు మొదలగువారు, స్త్రీ వేషధారులు, గర్వము, కోపము, ప్రీతి, స్తంభము, క్రియారహితత్వముల ననునయించు నపుడును ‘సమశిరము’ వినియోగింపఁబడును.

2. ఈషదూర్ధ్వగతము, సమము నగునది “ఉద్వాహిత” మనఁబడును.

ఆకాశము, తద్భవపదార్థములు, పొడవగు వస్తువులు గన్పఱచెడు నవసరమున ఉద్వాహిత శిర మెల్ల పాత్రధారు లును వినియోగింపఁ దగును,

3. క్రిందికిఁ గొంచెము ప్రక్కగ వాల్పఁ బడునది « అధోముఖ "మనఁబడును. వలపుగానినిఁ జూచునపుడు మదవతులకును, యౌవనప్రాదుర్భావ మొదవిన శృంగార విలాసినీ లాలసులకును సహజముగ జనించు «సిగ్గు" నీ శిరోభేదము ప్రకటింపఁగలదు. మఱియు « నుదాత్తభేదము" ప్రదర్శించుట కీ శిరము మిక్కిలి యొప్పు. నతి యొనర్చుట, ఆలోచించుట, అధఃపదార్థ నిర్ణయము, స్నానములందును వినియోగింపఁబడును.

4. చక్రాకృతి నొక పక్క కించుక త్రిప్పఁబడునది « అలోలిత" మనఁబడును.

ఉదాత్త నాయకోచిత మందస్మిత విలాస మీ శిరమున లలితగతినిఁ బ్రకటింపఁబడును. తలఁచిన కార్యము వ్యతిరేక ఫల మీయనున్నప్పటి వికల్పభావ మనునయించుటకును దగు. ( సూక్ష్మాలోలిత వినియోగము వేఱుగ నుండును. )

5. ఎడమనుండి కుడిప్రక్కకుఁ గదలింపఁబడునది «ధుత" శిర మనఁబడును.

నాస్త్యర్థము, పార్శ్వవస్తు సందర్శనము, అనునయము, అనిష్టము మున్నగున వీ శిరమునఁ బ్రదర్శింపఁదగినవి.



ప్రతాపరుద్రీయము

1. జనార్దనుఁడు—బుఱ్ఱా శేషగిరిరావుగారు 2. యుగంధరుఁడు—శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు 3. విద్యానాథుఁడు—శ్రీ రామాయణం పర్వేశ్వరశాస్త్రిగారు.



6. క్రిందుమీదుగఁ గదలింపఁబడునది “కంపిత” శిర మనఁబడును.

గర్భితమగు కోపభావ సూచనమున కిది మిక్కిలి తగు. బెదరించుట, “ఊ” కొట్టుట, మొదలగు నొకకొన్ని ప్రధాన భావములును దీనఁ బ్రకటితము లగును.

7. ప్రక్కగఁ ద్రిప్పఁబడునది, అభిముఖము కానిది, “పరావృత్త” శిర మనఁబడును.

అభిముఖ్యాలాపములయందును, గ్రియలయందును వస్తువులందును ఉదాత్తనాయికా నాయకుల్లకుఁ గలిగిన విరక్తి భావమును మిక్కిలి సమర్థముగ నీ శిరమునఁ బ్రకటింప నగును. అతిశయించిన “సిగ్గు” నిది వివరించును.

8. పార్శ్వోర్ధ్వగతము, ఈషత్కంపితము నగునది “ఉత్క్షిప్త” మనఁబడును.

అనుచరులు విన్పించు విషయమునుగూర్చి నాయకుఁడు కాని మిత్రాదుల వచనముల కితరులుకాని సూచించు సమ్మత హృదయ భావార్థములను బ్రకటింప నిది సమర్థమైనది. మఱియు దారిఁ జూపుట, అజ్ఞాపించుటలందును వినియోగం పఁదగినది.

9. ఇరుప్రక్కల వింజామరమువోలె త్రిప్పఁబడునది. “పరివాహిత” మనఁబడును.

కార్యభంగమునఁ జెదరిన మనస్సుఁగల స్త్రీ పురుషుల యాశాభావమును సూచింపఁ గలదు. పురుషులయొక్కయు

6. క్రిందుమీఁదుగఁ గదలింపఁబడునది ‘‘ కంపిత ’’శిర మనఁబడును.

గర్భితమగు కోపభావ సూచనమున కిది మిక్కిలి తగు. బెదరించుట, ‘‘ఊ’’ కొట్టుట, మొదలగు నొకకొన్ని ప్రధాన భావములును దీనఁ బ్రకటితము లగును.

7. ప్రక్కగఁ ద్రిప్పఁబడునది, అభిముఖము కానిది, ‘‘పరావృత్త’’శిర మనఁబడును.

అభిముఖ్యాలాపములయందును, గ్రియలయందును వస్తువులందును ఉదాత్తనాయికా నాయకుల్కుఁ గలిగిన విరక్తి భావమును మిక్కిలి సమర్థముగ నీ శిరమునఁ బ్రకటింప నగును. అతిశయించిన ‘‘ సిగ్గు ’’ నిది వివరించును.

8. పార్శ్వోర్ధ్వగతము, ఈషత్కంపితము నగునది [illegible]’’ మనఁబడును.

అనుచరులు విన్పించు విషయమునుగూర్చి నాయకుఁడు కాని మిత్రాదుల వచనముల కితరులుకాని సూచించు సమ్మత హృదయ భావార్థములను బ్రకటింప నిది సమర్థమైనది. మఱియు దారిఁ జూపుట, అజ్ఞాపించుటలందును వినియోగం పఁడగినది.

9. ఇరుప్రక్కల వింజామరమువలె [illegible]బడునది. ‘‘ పరివాహిత ’’ మనఁబడును.

కార్యభంగమునఁ జెదరిన మనస్సుఁగల స్త్రీ పురుషుల యాశాభావమును సూచింపఁ గలదు. పురుషులయొక్కయు



శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు (వీరబాహువు)



శకారుడు (మృచ్ఛ.)

శ్రీ ముంజులూరి కృష్ణరావుగారు



వసంతసేన (మృచ్ఛకటికము)

శ్రీ ఆరణి సత్యనారాయణగారు

నాయకుల కోరచూపులకును నిది గుఱుతుగా నుండును. తదన్యములగు స్వాభిప్రాయసూచనము, విలాస విభోధము లందును సాచీ దృష్టి వినియోగింపఁబడును.

4. ఇరుప్రక్కల సారింపఁబడునది 'ప్రలోకిత' దృష్టి.

ప్రక్కలనుండు వస్తువులను జూపుటయందుఁ బ్రలోకిత వినియోగింపఁబడును. సంజ్ఞ, చలనము, కలవరములను బ్రకటించును.

5. కనుఱెప్పలను సగభాగము విప్పిచూచునది 'నిమీలిత దృష్టి' అనఁబడును.

ఋషివేషధారుల కిది ముఖ్యము. జపతపో నిష్ఠలను స్ఫురింపఁజేయును. మ్రొక్కునపుడు, పరవశత్వమనుభవించునపుడు, సూక్ష్మదృష్టిని సయించునపుడు నిమీలితదృష్టి లక్షింపఁదగినది.

6. ఊర్ధ్వోన్నమిత 'ముల్లోకిత దృష్టి' అనఁబడు.

ఏత్తైన గోపురము, ధ్వజము, మున్నగునవి సూచించుపట్టునను, అతిశయాకాంక్షను గాంభీర్యమును నుద్దేశించుపట్టునను 'ఉల్లోకితదృష్టి' వినియోగింపఁబడును.

7. వడిఁగలిగి క్రింది మీదులను బారఁజూచునట్టిది, 'అనువృత్త' మనఁబడును.

తీక్ష్ణానువృత్తము, లలితానువృత్తము, నన ననువృత్తము రెండు విధముల భావింపఁదగును. తీక్ష్ణానువృత్తము కోపమునను, లలితానువృత్తము ప్రేమముననను, వినియోగింపఁబడి క్రమముగఁ గసరుటయుఁ జేరఁబిలుచుటయు సూచింపఁగలవు.

8, నేలను జూచునట్టిది 'అవలోకితదృష్టి'.

వేదఱికమునఁ బొడమెడు దైన్యము, యోజన, అను వానినిఁ దలఁపించును. మఱికొన్ని విశేషాంశములందును వినియోగము కలిగియుండును.

49. ప్రధాన భ్రూభేదము లాఱు విధములు.

కనుబొమలును ముఖాభినయాత్మకములైన దృష్టి వికారములతోఁ బాటుగ నర్థగాంభీర్య మొదవింప దక్షములు. అట్టివి యాఱు విధములు.

1. సహజ. 2. పతిత. 3. ఉత్క్షిప్త. 4. చతుర. 5. రోచిత. 6. కుంచిత. ఈ యాఱును భ్రూభేదములు.

1. ఏ వికారములు లేక సమమై యుండునది 'సహజ'

నాయికా నాయకుల కులశీలాత్మక సత్సాంప్రదాయములను బ్రకటించు పట్టున 'సహజ' వినియోగింపఁబడును.

2. చలనములేని యా బొమలను వాల్చునట్టిది 'పతిత'

ఒకని మేలును జూచి యోర్వలేకపోవుట, ఈర్ష్యను వహించుట, రోతపడుట, ఈ భావములందు 'పతిత' విని



యోగింపఁబడును. విస్మయాశ్చర్యములనుగూడ సూచించును.

3. ఒకటి లేక రెండు కనుబొమలు మిక్కిలిగ పైకి నిలుపఁబడునేని యది "ఉత్క్షిప్త" మనఁబడును.

ఇది నాయిక నాయకునిపై యొకప్పుడుజూపెడు ప్రణయకోపమును బ్రకటించును. ఉదాత్త నాయకోచితమగు నొక విధమైన శృంగారభావము నెఱిఁగించును.

4. కనుబొమలు రెండును గొంచెము కలయికతో గదలించినచో నది చతురభ్రూవికార మనఁదగు.

ఈయది నాయికా నాయక పరస్పర ముఖసంస్పర్శము సంతోషము, వేగిరపాటు, నయింపఁబడునపుడు ప్రకటింపఁబడును.

5. లలితముగ నొక కనుబొమ [illegible]బడిన 'రేచిత'

రహస్యమును వినునపు డిది ప్రయోగింపఁదగినది హాస్యరసాభినేతల కిది తఱచుగ నలవఱచుకొనఁదగినది.

6. ఒకటిగాని రెండు బొమలుగాని ముకుళింపఁబడినపుడది "కుంచితభ్రూ" వనఁబడును.

శృంగార్త నాయిక తనదు కోరికను నాయకుని యెదుట సలజ్జావనతవదనయై బయల్పఱచునపుడును, (ఇట్టిది గాత్రజానుభావములలోని దగు 'మోట్టాయిత' మనఁబడెడు నొక 'వికార' మని యెఱుంగ నగును.)

శృంగార రస పారవశ్యమున లోనఁద్రుష్టిపడుచుండియు, నధరాదిక గ్రహణావసరములందు నాయకునియెదుటదుఃఖము నటించు నాయికా భావమును ( ఇదియె "కుట్టమితా"ను భావము) నయించు నపుడును,

ప్రియాగమ సమయమున నాయికకుఁ గలుగు ముఃఖవికాసము ( ఇది విలాసానుభావము ) సలక్షణముగ నటించు నపుడును,

ఒకానొక శృంగారసమయమున శోకము, కోపము, కన్నీరు, సంతోషములతోఁగూడిన నాయికానుభావ వికారమును ( ఇది కిలికించితము ) బ్రదర్శించునపుడును, 'గుంచితభ్రూ' వభినయింపఁ బడఁదగినది.

### 50. హస్తాభినయము—వాని వినియోగము.

హస్తములసంఖ్యాకములు. సంయుతాసంయుతము లనఁబఱఁగు పతాక, త్రిపతాకాది వివిధ వికారములన్నియు సూక్ష్మాభినయముననే ప్రయోగార్హములు.

స్థూలాభినయము పదార్థ ప్రాధాన్యము గలదికాదు. పదార్థప్రధానములగు నిట్టి హస్తవికారములు సర్వథా త్యాజ్యములు. వ్యావహారికములు సహజములు నగు, అంజలి, సూచి, మున్నగునవి మాత్రమే యోగ్యములు.

### 51. వాచికాభినయము వాక్సంబంధమైనది.

పరస్పర భావ ప్రకటనమునకు వాక్కును బోలిన మఱి



శ్రీ నాయుడు నాగలింగారు



సోహ్రాబు, రుస్తుము

(సోహ్రాబు) శ్రీ బి. రామకృష్ణరావు (రుస్తుము) సింగంజు నాగభూషణరావు

శ్రీ ఉప్పలూరి సంజీవరావుగారు



శ్రీ కడియాల రత్తయ్యగారు





యొక ప్రధానవస్తువు లేదు. ఇట్టి వాక్కునకు స్వరము జీవము వంటిది. స్వర విన్యాసము, స్థాయిభేదము, భావము ననుసరించియు, రసము ననుసరించియు జతపఱుపఁ దగినవి. అర్థము, భావము, రసము, ఉచ్చము, నీచము లాదిగాఁగలుగు వాని ధర్మము తెలుఁగక, స్వరము లేక స్వరాత్మకమగు భాష ఉచ్చరింపఁబడినచోట రసాభాస మటుండ పెక్కులగు ననర్థకములును వాటిల్లఁగలవని శ్రుతులును ఘోషించెడు.

## 52. వాచికాభిజ్ఞత సాహితీసంజనితము.

వాక్కును శాసించునది వ్యాకరణ శాస్త్రము. భావ ప్రకటనమునకు యోగ్యములగు వివిధమార్గము లెఱిఁగించునది యలంకార శాస్త్రము. కావ్యసాంప్రదాయముల బోధించునవి సాహిత్యదర్పణము, రసగంగాధరము, కావ్యప్రకాశము, మున్నగునవి. గురుకులావాసముననో, యభ్యాస వశముననో యొకకొంత నీపైవానికిఁ జెందిన లక్ష్య లక్షణాత్మక విజ్ఞాన మొదవినవారు మాత్రమే కావ్యార్థ భావములను గ్రహింపఁగలరు,

## 53. పాఠ్యానుభవ మభినయమునకుఁ బ్రౌఢిమ నొసంగును.

పఠింపఁ దగినది పాఠ్యము. అది తాను ధరించు పాత్రమునకు మాత్రమే చెందదు. కావ్యాద్యంతము పఠింపఁ దగినదే.

ఒక్కెడ భాషింపఁ బడిన వాక్యమునకుఁ గల ప్రయోజనము, సంబంధము, వేఱొక్కెడ స్ఫురింపఁ గలవు. ఒక పాత్రకుఁ జెందిన వాక్య మింకొకని వాక్యముతో నన్వయించును. ఒక యంకమున మొలకెత్తిన భావము వేఱొక యంకమునఁ జిగిరించి యింకొక యంకమున ఫలించును. ఇట్టి వింకెన్నియేని భాషావైచిత్ర్యము లుక్తి ప్రత్యుక్తులలోఁ గన్పట్టును. అధమము రెండు మూఁడు పర్యాయము లైనను, నట్టివి యోజించుచు గ్రంథమంతయుఁ జదువఁ దగును. దానఁ బాత్ర్యమంతయు ననుభమునకు వచ్చును. ఈ యనుభవ మభినయావసరమున దివ్య ప్రతిభను గలిగించును. అభినయమును బ్రౌఢత్వమును బడయును.

### 54. వాగనుభావములు లక్ష్యములు.

అర్థబోధక పదములు, వాక్యములు, కొన్ని యనుభావములను గలిగియుండును. అయ్యవి ముఖ్యముగ వాచికాభినయమునకు వన్నెఁదేఁగలవు.

### 55. వాగనుభావములు పండ్రెండు విధములు.

1. మనస్సునకు సంతోషము కలిగినపుడు భాషింపఁ బడునది ‘ఆలాపము’.

2. దుఃఖముచేఁ బలుకఁబడునది ‘విలాపము.’

3. ఉక్తి ప్రత్యుక్తులలో సానురాగమున వచించునట్టిది ‘సల్లాపము’.



శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు





కీ. శే. ముత్తరాజు సుబ్బారావు పంతులు ఎం. ఏ. గారు

4. నిరర్థక వచనము 'ప్రలాపము'.

5. చెప్పినదానినే మరలఁ జెప్పునట్టిది 'అనులాపము'.

6. ఒకటి పలికి దానినే తిరిగి వేఱు భావమునఁ బలుకునది 'అపలాపము'.

7. స్థలాంతరుఁడగు నాయకునకు నాయికయో లేక ప్రతినాయకునకు నాయకుఁడో యిటులే యొకఁడు లేక యొకతె యింకొకనికో యొకతెకో దూతముఖమునవో లేక దూతికాముఖమునవో చెప్పిపంపునట్టిది 'సందేశము'.

8. నేను జెప్పినవే యతఁడు లేక యది చెప్పిన మాట లుగఁ బలుకఁ బడునది 'అతిదేశము'

9. వాఁడు, వీఁడు, నీవు, నేను, లను గలిగి పలుకునది 'నిర్దేశము'.

10. అన్యార్థమున నుండునది 'అపదేశము'.

11. శిష్యులకు బోధింపఁ బడునది 'ఉపదేశము.'

12. అన్యాధారమునఁ గోరికను దెలుపునది వ్యపదేశము మొదలగునవి.

56. లలితోచ్చారణము భావసౌకుమార్యాదులను బెంచును.

శృంగార సంభాషణము లతి సుకుమారములై నవి. వాక్పారుష్య మిట్టి సందర్భముల నెంతమాత్రము తగదు. శబ్దము లన్నియు విశుద్ధములుగ నుచ్చరించుట సమంజసము. శబ్ద వైకల్యము, సాంకర్యము, సర్వథా త్యాజ్యములు.

### 57. నిర్దుష్టత వాచికమున కత్యావశ్యకము.

దోషములనేక విధములు. 1. అప్రయుక్తము 2. అసమర్థము 3. సందిగ్ధము 4. క్లిష్టము 5. అశ్లీలము 9. విరుద్ధము 7. క్రమభంగము 8. పునరుక్తము 9. ఛందోభంగము 10. అస్పష్టము 11. అస్ఫుటము. 12. అపార్థము 13. విరసము మున్నగున వందుఁ బ్రధానములు.

1. వ్యవహారమున లేనిది 'అప్రయుక్తము'.

2. అర్థమును లేక అన్వయమును గలిగింపఁ జాలనిది అసమర్థము.

3. అన్వయావసరమునఁ జీకాకు పఱచునట్టిది సందిగ్ధము.

4. సందిగ్ధము గూఢము నగు నర్థముఁగలది క్లిష్టము.

5. సభ్యత్వమును బాసిన జుగుప్సార్థక భాషణము అశ్లీలము.

6. జగత్ప్రసిద్ధముకాని ధర్మమును గలది విరుద్ధము.

7. అర్థ క్రమము, వస్తు క్రమము, పాత్ర క్రమములను లేనిది క్రమభంగము.

8. పాఠ్యమును మఱచి చెప్పిన దానినే రెట్టించుట పునరుక్తము.

9. పద్యపాద నిర్ణీతములగు గణ, యతి, ప్రాసములను బాయుట ఛందోభంగము.



10. మాటలు తొట్రుపాటుఁ గలిగి విశదములు కాకుండుట 'అస్పష్టము'.

11. భావమునకుఁ దగిన గాంభీర్యమును బడయలేకుండుట 'అస్ఫుటము'.

12. ప్రధానార్థమును విడిచి యన్యార్థమును బ్రకటించుట 'అపార్థము'.

13. శృంగార వీరములందలి లాలిత్య గాంభీర్యములను బోలిన యన్ని రసోచితలక్షణములకంటె వేఱై యుండుట 'విరసము'. ఇట్టివి వాచికాభినయమున నుండఁదగవు.

### 58. వాక్యవిరామములు, ఈషద్విరామములు, ఆశ్చర్యార్థక ప్రశ్నార్థకములు వాచికలక్ష్యములు.

ముగిసినది, ముగియనున్నది, ఆశ్చర్యమగునది, ప్రశ్నించునది,' యను భేదమును దెలుపని వాచికము సర్వథా గర్హ్యము.

### 59. నిరర్గళాలాపములు శ్రావ్యములు.

ఉచ్చరింపలేకయు, విషయమును మఱచియు, సందేహమునఁబడియుఁ బ్రసంగముల గమనము కుంటువడునేని యభినయమును వెలితి పడకమానదు.

### 60. గాత్రమునకుఁ బ్రయత్నమున ధ్వనిసౌలభ్య మేర్పడును.

గాత్రమునకు మాధుర్య సౌకుమార్యాదిక సంపదలు

సహజసిద్ధములై నెగడుటకుఁ బూర్వజన్మసుకృత ముండవ లయు. సహజసౌందర్య మేర్పడిన సుందరికిఁ గృత్రిమాలంకారము లనావశ్యకము లగునటులు సుశారీరునకు సాధకము లనావశ్యకములే యగును. సహజసౌకుమార్య మలవడని గాత్రజ్ఞుఁడు కొన్ని ప్రయత్నములు విధిగాఁ జేయవలసి యుండును.

## 61. షట్కాల స్వరావృత్తములలో నకారసాధనములు

గాత్రమునకు ధ్వనిసమ్మేళనోద్యోగమునఁ దోడ్పడును.

మంద్ర, మధ్య, తారము లనునివి మూఁడు విధములైన స్థాయిభేదములు. ప్రతిస్థాయియందును సప్త స్వరాంతరస్థానము లిమిడియుండును. అభ్యాసవశముననే యాయా శ్రుతులు, గద్య, పద్య, గీతాలాపములందుఁ బరిస్ఫుటములు, స్పష్టములు, సుకుమారములు, మధురములు కాఁగలవు. దాన రసప్రసరణమునకును సౌలభ్య మేర్పడును.

## 62. గాత్రసౌలభ్యము భావసమ్మేళనమునకు సోపానమువంటిది.

సంగీతభావము స్వరప్రధానమైనది. సాహిత్యభావము వర్ణాత్మకమైనది. స్వర వర్ణ సమ్మేళనముకంటె గుప్తస్వర గీతికాది భావసమ్మేళనోద్యోగము కష్టతరము, ననుభవసిద్ధము నగు. గాత్రము స్వాధీనముఁన లేనివాని వాచిక వర్ణము లపస్వరస్థానములలో వెల్లివిరిసి భావైక్యతను దూరము చేయుచుండును.



## 63. శాస్త్రీయగానము సర్వభావబోధకము, రసదాయకము నగు.

సంగీతశాస్త్ర మపారమైనది. దాని మాహాత్మ్య మనుభవైకవేద్యమే. సంగీత మనుభవింప నేరనివాఁడు పశుతుల్యుఁడనుట సాహసము కానోపదు.

నాట్యము పవిత్రమైన దగుటచే సంగీతము శాస్త్రబద్ధమైనది వినియోగింపఁబడవలసి యుండును. సంగీతసాహిత్యముల సన్నిహితసంబంధము తెలిసిననే పాత్ర ప్రధానాభినయమును సక్రమముగ నటుఁడు నిర్వహింపఁగలుగును.

సంగీతము ప్రతిభాసంజనితమై బ్రహ్మానందమును బ్రసాదించును. కవితవోలె నిదియు జన్మముతోడ జనింపఁదగినది. ఇట్టిచో శాస్త్రాభ్యసన మెందులకందురేమో! సహజసిద్ధమైన సంగీతవాసనాబలము సారగ్రహణమునకుఁ జాలదు. సారము శాస్త్రగతము. సంగీత సాహిత్యముల కవినాభావ సంబంధము. సంగీతసాహిత్యాభిజ్ఞునకు రసస్వరూపము కరతలామలకము.

## 64. రాగములు శ్రుతిమనోహరములు.

మనోగతభావము శబ్దగతమై విస్తరింపఁబడి యొకయపూర్వరుచి నిచ్చును. రుచిలేని కల్పనము కేవల శబ్దాడంబర మనఁ బఱఁగును.

స్వరకల్పనము సాత్త్వికస్థాయిసంకలితము, రసజ్ఞుని

హృదయైకసంజనితము నగు. రసాత్మక స్వరసంచారమే రాగము. రసములేనిది విరాగము. అది త్యాజ్యము.

పాఠ్యాద్యంతములు రాగాత్మకములు. రాగజ్ఞుని భాషణములు, గీతాలాపములు శ్రుతిమనోహరములు.

### 65. శ్రుతిలయములు గీతాంగములు.

పదార్థభావములయొక్క యైక్యమే శ్రుతి. శ్రుతివర్జితాలాపము లన్నియు రసహీనములు.

గమనక్రమము లయ. క్రమభంగమే లయభంగము. పద్య గద్య గీతము లన్నిట శ్రుతిలయముల సంబంధము పాయనిదై యుండును.

### 66. ఉత్తమకృతులు రాగవిజ్ఞానదాయకములు.

కృతులు స్వరభావ సమ్మేళనమున జనించునవి. భాషాభావమునకుఁ గల స్వరభావసంబంధమును శాస్త్రజ్ఞుఁడుకాని వాఁ డనుభవింపనేరఁడు. కేవల శాస్త్రజ్ఞునకుఁ గవితాప్రౌఢియు నలవడుట దుస్తరము. సహజకవితానుభవ మొదవిన సంగీత శాస్త్రజ్ఞుఁడు తన యనుభవవిజ్ఞానమును జగదుపకృతినిఁ గోరి 'కృతు' లనఁబడు నీ గీతికారాజములలో వెదచల్లుచుండును.

రాగతాళములు కృతులకుఁ బ్రాణతుల్యములు. భాష శరీరమువంటిది. స్వరాలంకారసంచారము లాభరణములు. ఇట్టి సుకుమారసుందరగభీరసంగీతగీతికామూర్తివంత మేపెక్కి విజ్ఞాన మొసంగనేరదు!



పాటల ప్రౌఢి సంగీతశాస్త్రానుభవజన్యమైనది కాదు. పాటల పద్ధతు లంత ప్రమాణములైనవియుఁ గావు. వాని యందములు కృత్రిమములు. వాని సోకడ లనుకరణములు. వాని భావములు సంకరములు. వారవనితావిలాసగౌరవము వంటి దీ బజారుపాటల బడాయి.

నాట్యము పవిత్రమైనది. నాట్యవస్తువు పవిత్రమైనది. నాట్యప్రయోజనము పరమకైవల్య ప్రదము. నాట్యప్రసంగములు, నాట్యగీతములు, వేయేల నాట్యసర్వస్వము సర్వథా శాస్త్రీయసాంప్రదాయములయందే విరాజిల్లఁదగినది.

సంగీతము సరళీస్వరములనుండియు నుపాసింపఁదగినది. దానిని బాల్యప్రభృతిఁ బరిశ్రమించుచుండినవాఁడు కొంత కాలమునకు సంగీత స్వాతంత్ర్యమును బడయఁ గలఁడు. అట్టివాఁడు నాట్యావసరమునందు సహితము స్వరసాహిత్యముల నతి సులభముగ మేళగింపఁ గలఁడు. అందలి యానందమును దా ననుభవించుటయె కాక శ్రోతలకును బంచిపెట్టఁగలఁడు.

కృతిపాఠములు ముఖ్యముగ నాయా కర్తలనుండి వినఁదగినవి. కృతికిఁజెందిన పల్లవి, అనుపల్లవి, చరణము, లనువానిలో రాగోత్పత్తి, రాగస్థితి, రాగసిద్ధి, క్రమానుగతిని విస్తరింపఁబడి యుండును. తాళమును దాని ననుసరించియె గమించుచుండును. ప్రతిభావంతుఁ డొకటి రెండు పర్యాయము లించుక శ్రద్ధాసమేతుఁడై కృతిసరణి నాలిం

చియు, ననుభవించియు, ననుకరించియు, యత్నించునేని యందలి రాగసౌందర్య స్వరూపమును సాక్షాత్కరించుకొనఁ గలఁడు. అనుభవవైదగ్ధ్యమునఁ గొంతకాలమునకు రాగస్వాతంత్ర్యమును గూడఁ బడసి వాచికాభినయవ్యాపారమున నుచిత గతిని వినియోగించి శ్రోతల నలరింపఁగలఁడు. ఉత్తమకృతులు తప్పక యిట్టి విజ్ఞానమును గలిగించును.

**67.** ప్రాసంగికశ్రుతి వాచికాభినయమును బోషించును.

పాత్రల ప్రసంగములు పరస్పరసంబంధమున స్థాయి తత్త్వమును బ్రదర్శింపఁదగినవి. ఏవాక్యమున కావాక్యము కాలికముగాఁ బలుకఁబడినపు డిట్టి ప్రయోజనము కలుగదు. భావక్రమమును వృద్ధిక్షయములను సూత్రప్రాయమున వెన్నంటునట్టి యాలాపసరణి శ్రుతియనందగు.

వర్ణనాలాపములు దీర్ఘములుగా నుండునపుడు ప్రాసంగికశ్రుతి సులభముగ గ్రహింపఁదగి యుండును. ప్రసిద్ధనటులాయా సమయములందంతట నీ క్రమమును బ్రకటించుచునేయుందురు. ఈ సూత్రమున దీర్ఘాలాపనక్రమము శ్రుతియనియు నయ్యది పాఠ్యాద్యంత మనుసరింపఁబడుట వస్తుతత్త్వ చితీకరణమునకుఁ బ్రధానదోహద మగుననియుఁ దెలియఁదగి యుండును.

**68.** వాచికము శ్రావ్యాశ్రావ్యము లను రెండువిధములు గలది.

ఎల్లరు వినఁదగినది శ్రావ్యప్రసంగము. అదియే



ప్రకాశ మనఁబడుచున్నది. అశ్రావ్యము తనలోఁదా ననుకొనునది. ఇది స్వగతమని పిలువఁబడుచున్నది.

**69.** శ్రావ్యప్రసంగము 'జనాంతికము' 'అపవారితము' నన రెండు విధములు.

త్రిపతాకహస్తవికారమున (అనామిక మనఁబడు చిటికెనవ్రేలికిఁ బ్రక్కనుండు వ్రేలును వంచియుఁ, గడమవి చాచియుఁ, బొట్టనవ్రేలునఁ, జూపుడు వ్రేలును జేర్చియుఁ, బట్టఁబడునట్టిది.) నన్యుని మఱుఁగుపఱచి యింకొకనితోఁ బలుకఁబడునది 'జనాంతిక' మనఁబడును. అన్యుల కడ్డముగ నిలిచి యొకనితో వచింపఁబడునట్టిది లేక యాలోచింపఁ బడునట్టిది 'యపవారిత' మనఁబడును.

**70.** అనుక్తశ్రావ్యవిషయ మాకాశభాషణము.

ఎవరును బలుకకయే పాత్రధారునిచే నుద్దేశింపఁబడునట్టిది 'యాకాశభాషణ' మనఁబడును.

**71.** ప్రసంగము లౌచితీభరితములు.

'ఔచితి' యనఁ దగినదని యర్థము. అది జాతి, కాలము, దేశము, ధర్మము, అవస్థ, భావము, రసము, మున్నగు ననేక సందర్భములకుఁ జెందియుండును. ఇప్పట్టున లోకానుభవముకంటె "ఔచితిని" నిర్ధరింపఁదగినది మఱియొక్కటి లేదు. అట్టిది నటులు ముఖ్యముగఁ బాటింపఁదగియుండును.

**72. లఘుప్రసంగము లానుషంగికములు.**

పాత్రలు పరస్పరము భాషించుకొనునట్టివి దీర్ఘవాక్యములుగ నుండుట స్వభావవిరుద్ధము. నాటకసంబంధి వచనములు సర్వథా కుఱుచలు. అవి యొక్కని వాక్యభావము ననుసరించి జనించునవి.

**73. ఆనుషంగికములు క్షిప్రములు.**

కుఱుచలు, వ్యవహారసిద్ధములు, ఉక్తిప్రత్యుక్తులు, భావానుగుణ్యములు, రసోద్దీపనములు నగు నిట్టి ప్రసంగములు వెనువెంటనె చెప్పఁదగినవి.

**74. దీర్ఘభాషణములు స్వగతతుల్యములు.**

యథాయోగ్యప్రయోగము నాట్యము. సభ్యులు కేవల దిదృక్షులు. నటప్రసంగములు సభ్యోన్ముఖములు కాఁబడవు. స్వగతము లనుభవైకసిద్ధములు. కాలము భావానుగతము.

**75. ద్వ్యర్థియందుఁ బ్రధానార్థమునకె యభినయప్రాధాన్య మీయఁదగు.**

చంద్రహాసలోని కుంభీనసుఁడు, సునందనిలోని సుమతి, ముద్రారాక్షసీయచాణక్యుఁడు మున్నగు పాత్రలవి చాలభాగము రెండర్థములుగల ప్రసంగములు. అందలి ప్రధానార్థమె యభినయార్హమైనది.



**76. శ్లేషార్థము ధ్వన్యాత్మకము, సూచ్యము నగు.**

అభినయార్హముకాని శ్లేషార్థము శ్రోతల కనుమానమును గలిగించునదిమాత్ర మగును. ఇట్టిది గూఢాభినయమనఁదగు. అది సర్వథా యాంగికాభినయముననె సూచింపఁదగి యుండును.

**77. బహుళాంతరంగికప్రయోగములు లఘుప్రసంగాభినయమున కత్యావశ్యకములు.**

వాచికాభినయమున దెబ్బదిమూఁడవ సూత్రమునకుఁ జెందిన యానుషంగిక ప్రసంగము లన్యపాత్రములతోఁ దఱచుగ జతపఱుపఁబడుచుండిసనే తత్సమయసిద్ధములగు భావము లనేకములు స్ఫురింపఁగలవు.

**78. అన్యాశ్రయప్రసంగము లనర్థదాయకములు.**

విద్యమానరంగములలోఁ బద్యములయెడఁ జూపఁబడెడు శ్రద్ధలో శతాంశమైనను బ్రసంగములయెడఁ జూపఁబడుచున్నటులు కన్పింపదు. ఆ కారణమునఁ బ్రసంగములు స్మృతియందుండక యితరులనుండి తెలియ నపేక్షపడుచుండును. ఏతత్ప్రయత్న నిమగ్నులకుఁ బ్రాసంగికాభినయము దుష్కరము కాకమానదు.

**79. పద్యపఠనాభిజ్ఞత పూర్వపుణ్యప్రసాదము.**

పద్యపఠన మొక సామాన్యమైన పని కాదు. ప్రసం

గములకంటె నతిశయించిన భావకల్పనము, శ్రుతిమనో హర కవితాప్రాగల్భ్యము, దానికిఁదగిన సుందరగమనము, అలంకారము మున్నగు ననేక సంపదలకుఁ బద్యములు నిల యములు. కేవల కథాత్మకములుకాక కాల్పనిక కవితా రసాత్మకములగుట నాటకములకుఁ బ్రధాన ధర్మమగునని యొ ప్పుకొనెడువారు పద్యప్రాధాన్యమును సహిత మొప్పకొనక తీరదు.

ఛందోబద్ధమగు గమన మున్నపుడె తదనుగుణ్యమగు పాఠ్యక్రమమును గావలసియుండును. అట్టిచో సంగీతసమ్మే ళన మనుల్లంఘ్యము.

పద్యసారము సాహితీవిశేషముకోలఁది యనుభవింపఁ దగినది. సంగీతరహస్యము తెలుంగుటయు నట్టిద. శాస్త్రి జ్ఞుఁడు కానివానికి సంగీతసాహిత్యములను సమ్మేళనపఱచు పని కొఱుకరాని కొయ్యవంటిది. ఇన్నియుండియు గాత్రి మాధుర్య మేర్పడనిచోఁ, బద్యపఠనమంతయు నిరర్థకము కాక మానదు. సుశారీరమనునది «విద్యాదానేన తపసా భక్త్యావా పార్వతీపతేః ప్రభూత భాగ్యవిభవైః సుశారీర మవాప్యతే" అని చెప్పఁబడి యున్నది.

**80. రూపక ప్రపంచమున గేయములది తృతీయస్థానము.**

రూపకము మూఁడుభాగములు గద్యములచేతను నరభాగము పద్యములచేతను శేషించినది వలయునేని గేయ



ములచేతను బూరింపఁదగును. అయ్యవి భావప్రాధాన్య తనుబట్టియు సమయసామరస్యమును గలిగియుఁ జేర్పఁ దగి యుండును. గేయము లంత యావశ్యకములైనవి కావు.

**81. వస్త్వభివర్ణనావసరములఁ బద్యము లుండఁదగినవి.**

రసాశ్రియములగు విషయము లన్నియుఁ గాల్పనిక ములు. కల్పనావసరములకు బహుభంగుల పద్యములు యోగ్యములు.

**82. స్థాయులు వివిధ రసోద్దీపనములు.**

పాత్రావస్థను బాఠ్యక్రిమ మనుసరింపఁదగినది. అవ స్థాసంబంధిస్థాయి శ్రుతి. దాని యుపక్రిమ మిచ్ఛానుగతము. సంచారవిషయమునఁ దత్సంబంధి మంద్ర, మధ్య, తారస్థా యులు జతపఱుపఁదగినవి. హాస్య శృంగారములకు మధ్య మ, పంచమములు, వీర రౌద్రములకు షడ్జ, ఋషభములు, గరుణకు గాంధార, నిషాదములు, బీభత్స, భయానకము లకు ధైవతము ననునవి యనుగమింపఁ దగియుండును. ఈ స్థాయులు రసముల నుద్దీపించునవి.

**83. భావజధ్వనులు పాత్రితత్త్వప్రిబోధకములు.**

శృంగారమున సస్మిత సరసాలాపములు, వీరమున మదాలాపములు, కరుణయందు సశోకగద్గదాలాపములు, అ ద్భుతమున విస్మయాలాపములు, హాస్యమున సరసచతు

రాలాపములు, భయానకమున గభీర భయదాలాపములు, బీభత్సమున గాద్గదిక వికారాలాపములు, రౌద్రమునఁ, బరుషక్రోధాలాపములును దగియుండునవి.

ఉదాత్త, ఉద్ధత, శాంత, లలితభావములు నాయక ప్రసిద్ధములగు తత్త్వములు. తజ్జనితాలాపము లాయాధర్మముల ననుసరింపఁ దగియుండును. లలిత సుకుమారాలాపములు శృంగారనాయకునకును, బ్రశాంతసంభాషణములు ప్రకరణప్రధానునకును, గభీరములైనవి ధీరోదాత్తునకును, ఈర్ష్యాసూయాత్మకవచనములు రూపక ప్రతినాయకునకును జెందునట్టి ప్రధాన చిహ్నములుగఁ బరిగణింపఁబడును.

### 84. విటుఁడు చమత్కారుఁడు.

శృంగారనాయకునకు సహాయులగువారు * నాలుగు విధముల నుందురు. అందొకఁడు విటుఁడు. వాని ప్రసంగములు చమత్కారభాజనములు. కంఠధ్వని, వాక్యార్థప్రకటనము తద్ధర్మమును బోధించుభంగి నుండఁదగును.

### 85. విదూషకుఁడు నవ్వించువాఁడు.

ఇతఁడు పైనలుగురులోని మఱియొకఁడు. విరహావిదగ్ధుఁడగు నాయకుని నవ్వించునట్టిది వీని ధర్మము. ఏతత్పాత్రధారుల ప్రసంగములు హాస్యరసోచిత ధ్వన్యాత్మకములై యుండవలయు.



### 86. చేటకుఁడు సంధికల్పనప్రవీణుఁడు.

ఇతఁడు తృతీయసహాయుఁడు. నాయికానాయకులకుఁ, బొడమ ప్రణయవైమనస్యమును దొలఁగించు నేర్పుఁగలవాఁడు. వీని ప్రసంగములు నయ వినయాద్యశేష చాతురీసంభరితములు.

### 87. పీఠమర్దుఁడు కార్యపేశలుఁడు.

ఇతఁడు చతుర్థసహాయుఁడు. నాయకునకుఁ గొంచెము తక్కువగఁ దుల్యుఁడగువాఁడు. వీని సంభాషణములు కార్యనిర్వహణైకవిదగ్ధములు గభీరములు నగు.

### 88. స్వరభేదములు పెక్కు సంచారిస్వభావముల నెఱిఁగించును.

1. గ్లాని:— ఇది మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము మున్నైన వ్యాపారములవలన జనించునట్టిది. ఇట్టి భావమును బ్రకటించునవి హీనస్వరాలాపములు.

2. నిర్వేదము:— ఇది తత్త్వజ్ఞానము, లేమిఁడి, సంకటము, ప్రియావియోగము, దుఃఖములనువానిచే జనించునట్టిది. ఈ భావమును దెలుపునవి దీనాలాపములు.

3. శంక:— చౌర్యము, హింస, మిత్రద్రోహము మొదలగు నపరాధములను జేసినవాని కితరులనుండి భయ

కారణములు తటస్థింపనున్నపుడు కలుగునట్టిది. ఈ భావమును దెలుపునవి గద్గదాలాపములు.

4. అసూయ:— పరులయొక్క కులము, విద్య, బలము, సంపద, యశస్సు, ప్రౌఢి, మున్నగు సుగుణములను జూడఁజాలని యీర్ష్యను గలవానికిఁ గలుగునట్టి స్వభావము. దీనినిఁ బ్రకటించునవి యుపేక్షాలాపములు.

5. మదము:— మధుపానజనిత మోహాదికవికారములచేఁ గలుగునట్టి భావము. దీనినిఁ దలపించునవి సంభ్రమాలాపములు. అం దధమమదమునకుఁ జెందునవి క్రూరవికారాలాపములు.

6. శ్రమ:— క్రీడ, నృత్తము, ప్రయాణము, సురతము, భారవాహకత్వము, మొదలగు పనులచేఁ బుట్టునది. తజ్జనితములగునవి మందాలాపములు.

7. వ్రీడ:— నాయకునిచేఁ జేయఁబడిన దేహస్థములగు సురతచిహ్నములను జూచి నాయకుని యెట్టయెదుట నేమో పలుకఁ బ్రారంభించు నాయికకును, బరస్పరానురాగాతిశయమ్మున నొకచోఁ జేరి ప్రప్రథమున నొండొరుల భావములను బ్రకటించుకొనునప్పటి నాయికానాయకులకును గలుగు నట్టిది. సుకుమారసుందరగర్భితాలాపములు తగునవి.

8. చపలత:— ఒకానొక ప్రియవస్తువును గూర్చిన యాస, మఱియొక్క మనుజునియందో, లేక వానికార్యమునందో కలుగు ద్వేషము, మొదలగు భావములవలన హృదయము కలఁత నొందినపుడు పుట్టునది. ఈ భావమును దెలుపునవి పరుషాలాపములు.



9. హర్షము:— తలఁచిన కార్యము ఫలించుట, ప్రియమిత్రులనో లేక ప్రియాంగనలనో సందర్శించుట, భోగభాగ్యము లబ్బుట, మున్నగు లాభములవలనఁ గలుగునట్టిది. ఇందునకుఁ దగునవి ప్రియాలాపములు.

10. ఆవేగము:— ఉత్పాతము, వాయువు, అగ్ని, ప్రళయము, మున్నగు నప్రియములవలనఁ గలుగునట్టి తడఁబాటును 'ఆవేగ' మందురు. దీనికిం దగునవి భయాలాపములు. ప్రియశ్రవణావేగమునకుఁ దగునవి ప్రియాలాపములు.

11. జడత:— ఇష్టానిష్టశ్రవణము, విరహము, దుఃఖము, ప్రియాప్రియానుభవాతిశయజనితభావము 'జడత' యనఁబడును. ఈ భావము ననునయించునవి మందాలాపములు లేక యలసాలాపములు.

12. గర్వము:— అధికారము, అష్టైశ్వర్యములు, రూపయౌవనకులశౌర్యధైర్యాదికములు మున్నగువానిచే నెదుటివానిని సరకు సేయక తృణీకరించునట్టిది. మఱియు నవమానించునట్టిది. ఈ భావమును బ్రకటించునవి పరుషాలాపములు.

13. విషాదము:— తాఁ జేయఁదలఁచినదానినిఁ జేయలేకపోవుట, కోరినవస్తువు లభింపకపోవుట, భావికష్టములు స్మృతికిఁ దగులుట, తన తప్పును దాను దెలిసికొనుట, వీనివలన జనించునది. ఈ భావమునకుఁ దనగువి ఆర్తాలాపములు

లేక దీనాలాపములు. అధమవిషాదమునకుఁ జెందునవి రోదనములు. (హరిశ్చంద్రుఁడు, నలుఁడు మున్నగు నుదాత్త పాత్రలకు రోదనము లేసమయములందును బనికిరావు.)

14. ఔత్సుక్యము:— తలఁచిన కార్యము "ఎన్నఁడు ఫలించునా" యని త్వరపడు స్వభావము. దీనిం దెలుపునవి త్వరాలాపములు.

15. నిద్ర:— ఊరక తిని కూర్చుండుట, అధికముగఁ బనిఁ జేయుట, మిక్కిలి భుజించుట, పెక్కుదినము లాహారమే లేకయుండుట, అతిశయించిన జ్వరము తగులుట, విరహానలసంతప్త మగుట మున్నగు సమయములఁ బుట్టునది. దీనికిఁ జెందునవి హీనాతిహీనస్వరాలాపములు.

16. అపస్మారము:— వాత, పిత్త, శ్లేష్మము లతిశయించుట, దోషించుట, భూతాదులావేశించుట, పంధించుట మొదలగు సమయములందు జనించునది. ఈ భావము నభినయింపఁ దగునవి ఘుర్ఘురాలాపములు.

17. ఉన్మాదము:— ధనధాన్యములు పోవుట, ప్రేమింపఁబడినవాఁడు నశించుట, విఘ్నములతిశయించుట, మున్నగు సమయములఁ బుట్టునట్టిది. ఈ భావమునఁ బొడమునవి సంబంధరహితాలాపములు. ఇష్టనాశోన్మాదమునఁ బుట్టునవి నృత్తగీతాత్మక వికారాలాపములు.

18. మరణము:— వ్యాధిజము, అభిఘాతజము నగునది. దీనికిం దగునవి స్తబ్ధాలాపములు.



## వివిధనాయికాప్రసంగ స్వభావములు.

1. శీలార్జవశోభితయగు స్వీయవి సుకుమారములు, లలితములు, లజ్జాత్మకములు నగు.

2. ముగ్ధాలాపములు మార్దవములు, మధురములు, లజ్జాత్మకములు నగు.

3. మధ్యాప్రసంగములు వినయోదారములుఁ, గోమలములు, లజ్జాత్మకములు నగు.

4. మధ్యాధీరయొక్క ప్రసంగములు కుటిలములు, వక్రములు నగు.

5. మధ్యా అధీరాలాపములు వక్రములుఁ, గ్రూరములు నగు.

6. మధ్యా ధీరాధీరాలాపములు క్రూరములు, గాద్గద్యకలితములు నగు.

7. ప్రగల్భా ప్రసంగములు మదమనోహరములు, సౌకుమార్య గాంభీర్య కలితములు నగు.

8. ప్రగల్భాధీరవి కపటములు, సుకుమారములు, మనోహరములు నగు.

9. ప్రగల్భాఅధీరాలాపములు సుకుమార సుందరములు, చాతురీకలితములు, భయప్రదములు నగు.

10. ప్రగల్భా ధీరాధీరాలాపములు వక్రములుఁ,

కుటిలములు, సగర్వములు, భయప్రదములు, మనోహర
ములు నగు.

11. పరకీయాలాపములు చతురములు, మనోహర
ములు, సరసములుఁ, గపటములు నగు.

12. పరకీయా కన్యాలాపములు మృదులములు,
మంజులములు, లజ్జాకలితములు నగు.

13. పరకీయా పరోఢాలాపములు కైతవములు, సర
సములు, సవినయములు నగు.

14. సామాన్యనాయికాప్రసంగములు విద్యాప్రగ
ల్భములుఁ, గైతవములు, సుందరములు, సవిలాసములు నగు.

15. ఉత్తమనాయికాలాపములు ప్రశాంతములు,
సరసములు నగు.

16. మధ్యమనాయికాప్రసంగములు ధర్మాధర్మ ప్రసి
ద్ధములు, మనోహరములు నగు.

17. అధమనాయికాలాపములు పరుషములు, సక్రో
ధములు నగు.

18. ఏతన్నాయికాసహకారిణులగు దూతి, దాసి,
సఖి, చేటి, ధాత్రేయియాలవి నమ్రములు, దీనములు, సర
సములు నగు.

89. నాట్యపాత్రలు పరిభాషాభాజనములు.

నాటకగతపాత్రలకుఁ బ్రయోగావసరమునఁ గొన్ని



పరిభాషాపదములు ప్రసిద్ధార్థకములై యుండును. వాచికా
భినయసౌలభ్యముకొఱ కట్టివియు గ్రహింపఁదగినవి.

1. అజ్జుక—వేశ్య ; 2. ఆవుత్తుఁడు—భావ ; 3. భావుఁ
డు—విద్వాంసుఁడు ; 4. అవుకుఁడు—తండ్రి ; 5. కుమారుఁడు
భర్తృదారకుఁడు—యువరాజు ; 6. భట్టారకుఁడు, దేవుఁడు—
రాజు; 7. భర్తృదారిక—రాజుకూఁతురు; 8. దేవి—పట్టాభిషిక్త
యగు రాణి; 9. భట్టినీ—రాజునకుఁ జెందిన కడమభార్యలు;
10 రాష్ట్రియుఁడు—రాజుబావమఱఁది; 11 అంబ—తల్లి; 12.
వాసువు—బాలిక, చిన్నపడుచు; 13 మారిషుఁడు—పూజ్యుఁడు;
14 అత్తిక, అంతిక—అక్క;

90. నాట్యసంబోధనలు ధారణార్హములు.

నాట్యమునందలి పాత్రలయొక్క సంబోధనలకుఁ
జెందునవియు, నాచారసిద్ధములైనవియు నగుఁ గొన్నిపదములు
స్మృతియందుండఁ దగినవి.

1. మున్యాదులకు భగవచ్ఛబ్దము; 2. బ్రాహ్మణులకు,
మిత్రులకు, అగ్రజులకు ఆర్యా! 3. నటీసూత్రధారులకుఁ
బరస్పరము ఆర్యా! 4. శిష్యులు, పుత్రులు, తమ్ముఁడు ము
న్నగు పిన్నలకు వత్సా! 5. పెద్దలకు గురూ! జనకా! తాత!
పూజ్య! పూజ్యపాద!; 6. సూత్రధారుఁడు పారిపార్శ్వకుని
సంబోధించునపుడు భావ!; 7. పారిపార్శ్వకుఁడు సూత్రధా

రుని బిలుచునపుడు మారిష! మార్ష!; 8. భృత్యులు రాజును సంబోధించునపుడు దేవ! స్వామి! మహారాజా!; 9. నీచులు రాజును బిలుచునపుడు భట్టారకా! మహాప్రభూ!; 10. భృత్యులు రాజు మొదలైన పూజ్యులగు పెద్దలయొక్క భార్యలను సంబోధించునపుడు దేవి! స్వామిని! మాత!; 11. విదూషకుఁడు పట్టమహిషిని సంబోధించునపుడు రాజ్ఞి! భవతి!; 12. రాజవిదూషకులు పరస్పరము సంబోధించుకొనునపుడు వయస్యా!; 13. నాయికావయస్యలకుఁ బరస్పరము సఖీ!; మొదలగునవి.

### 91. ప్రభుప్రాదిపదికసంబోధనము సర్వత్ర గర్హ్యము.

రాజు నెవరును బేరున సంబోధింపఁ దగదు. విద్యామానరూపకానేకములందును, నటులయందును నిట్టి సంబోధనాచారము కన్పట్టుట శోచనీయము.

## సాత్త్వికాభినయము.

### 92. సరళభావనఁ గలది సత్త్వము.

సరసభావపరంపరకు స్థానము మనస్సు. అది సూక్ష్మములలో సూక్ష్మము, స్థూలములలో స్థూలము. అణువులకు నణువు, మేరువునకు మేరువు. దాని రూపము సముద్రమువంటిది. దాని పనులు తరంగములట్టివి. దాని లోతు దానికే తెలియదు. దాని తత్త్వ మెవరికి తెలియును!



మనుజునకు మనస్సు కనఁబడదు. మనస్సునకు మనమందఱము బట్టబయలు. అది నవ్విన సుఖము. నవ్వకున్న దుఃఖము. పలుకులు ప్రబంధములు. చేష్టలు జంగమములు. అది విశ్వములోనిదో, విశ్వము దానిలోనిదో! విమర్శనాతీత మా రహస్యము.

### 93. సత్త్వజనితములు సాత్త్వికములు.

సత్త్వము సానుభూతిఁ గలది. అది యితరుల సుఖము నెటులనుభవించునో, దుఃఖమునుసహిత మటులే యనుభవించును. వినఁబడు పలుకులుఁ, గనఁబడు వస్తువులకుఁ జెందిన యన్నిరుచులు దాని పరిచితినిఁ గలవి. సర్వసారసంగ్రహణ పటిష్ఠము, సార్ద్రభావసమర్థమునగు నిట్టి సత్త్వమున జనించునవి, సత్త్వమునకుఁ జెందునవి సాత్త్వికము లనఁబడును.

### 94. సత్త్వభావచిత్రీకరణము సాత్త్వికాభినయము.

భావసమయపరిశీలనమునను, ననుభవమునను హృద్గతమైన తత్త్వమును, లేక, క్రియలను జిత్రించుట సాత్త్వికాభినయ మనఁబడును.

### 95. సాత్త్వికాంశము లపరిమితములు.

పరుల సుఖదుఃఖములందు లయించునట్టిది సత్త్వము. తత్సంబంధి భావములు సాత్త్వికములు. అవి పుట్టుటకుఁ గారణము లగునవి సాత్త్వికాంశములు. అవి గణనాతీతములు.

కొన్ని సత్త్వములు పాషాణతుల్యములు. అట్టివి ప్రస్తుతవిషయికములు కావు. కరఁగునట్టి స్వభావములేని సత్త్వము పరుల యనుభవములందు నెంతమాత్రము లయింపనేరదు. అట్టిది మానవత్వమును బడయని పాషాణముకాక మఱి యేదికాఁ గలదు!

సత్త్వము కలవాఁడు సౌహృదయుఁడు. కష్టము నెంతమాత్రమును సహింపలేని వెన్నవంటి దీతని మనస్సు. దానిది మిక్కిలి దూరదృష్టి. అదొకప్పుడు పరుఁడు చూచుదానికంటె నెక్కుడు చూడఁగలదు. ఎక్కుడనుభవింపను గలదు. దాని భావము లనేకములు. దాని క్రియ లనంతములు.

సాత్త్వికభావ మన్యవిషయావబోధనముననో, యవలోకనముననో జనించుచున్నది. అన్యము లనుటచే నవి మనుజునకుమాత్రమే కాక విశ్వమున కంతటికిని జెందునవనియు నూహింప నగు. జంగమస్థావరవిశిష్టములగు సాత్త్వికాంశము లీకారణమున గణియింప శక్యముకాకయుండును.

### 96. సాత్త్వికము సమయసిద్ధము, పాత్రము నిమిత్తమాత్రము నగు.

అన్యములవలన రాఁదగిన వన్నియు ననుమానప్రమాణములచే నిర్ధరింపఁదగినవి. కేవల స్థిరముల విషయమునైనచో నొకింత దృఢముగ నిర్ణయింపవచ్చును. నాట్యవిషయికములు బహుళముగ చరములకుఁ జెందునవి. అంత



రంగికప్రయోగము లెన్ని జరిగినను, ఎన్ని యభినయపద్ధతులేర్పఱచుకొనఁబడినను, రంగ మెక్కునప్పటి కట్టివి యాదృచ్ఛికములు కాకమానవు. ఇట్టియెడ సాత్త్వికములును సమయసిద్ధము లగుట నిశ్చయము.

“అవస్థానుకృతిర్నాట్యమ్” అను ధనంజయుని సూత్రవాక్యభావ మొకవిధమున విచారణార్హమగుచున్నది. అవస్థలు జగత్ప్రసిద్ధము లగుట నిశ్చయమే. తదనుభవరూపములు సర్వసామాన్యములని యెట్లనఁగలము! ఇప్పట్టున ననుకరింపఁదగునది పాత్రతత్త్వమా, లేక, నటతత్త్వమా?

పాత్ర యప్రత్యక్షమైనది. తదనుభవ మనుకరించుటకసాధ్యమైనది. ఆ కారణమునఁ బాత్రము నిమిత్తమాత్రము, పాత్రావస్థ యనుకరణార్హము. తన్నిష్పత్తి సాత్త్వికాభినయమనఁదగియుండును.

### 97. పాత్రమాతృక కావ్యము.

కవి సృష్టి కావ్యము. పాత్రమా ప్రపంచమునందలి యొక వ్యక్తి. అతని రూపము కవియొక్క యనుగ్రహోపాదితము. కావ్యమే పాత్రతత్త్వమునకు మాతృక.

### 98. సాత్త్వికము వ్యక్తిగతము.

అభినయ మొకవిధమున వ్యాఖ్యానము వంటిది. ఆద్యంత మట్టిదిమాత్రము కాదు. రసస్ఫూర్తికిఁ గల్పన మవ

సరము. వస్తు, నాయక, రసములకుఁజెందిన విరుద్ధాంశము లు పరిత్యజింపఁబడి కావ్యమందును గాల్పనికములై కన్ప ట్టును. లక్షణజ్ఞు లట్టియవసరములను గవియొక్క ప్రతిభా ప్రక టనములుగాఁ బరిగణించియున్నారు.

నటుఁడు వ్యాఖ్యాత. పాత్ర మీతని మాతృక. అవస్థ ప్రకృతిసిద్ధము. నిష్పత్తికి యభినయము సాధనము. ప్రస్తు తాభినయము సాత్త్వికము. అది వ్యక్తిగతము.

### 99. రసజ్ఞహృదయము ప్రమాణము.

కావ్యవస్తువునకుఁ, గావ్యతత్త్వమునకుఁ జెందిన పరిచితి పాఠకునకు, లేక, దిదృక్షునకు భావనావైదగ్ధ్యమును గలిగించి, హృదయకోశమును వికసింపఁజేసి, దానిని రసానుభవమునకు సుముఖముగ నొనర్చును. అభినయావస్థలు, క్రియలు, భాషణములు గ్రమక్రమముగ భ్రమమాపాదనము లగుచుండును. దాని యనంతరమున హృదయ మార్ద్రవంతమై యానందమున లయించును. ఆ హృదయమే సాత్త్వికాభినయమునకుఁ బ్రమాణము కాఁదగినది.

### 100. స్థాయిస్థానము సత్త్వము.

శృంగార వీరాది రసములకు నెలవులు రత్యాదికము లగు స్థాయులు. వాని స్థానములు సత్త్వములు.

### 101. సంచారివ్యభిచారులు లేకార్థబోధకములు.

స్థాయిసుముఖములై చరించునవి కనుక సంచారు





శ్రీ ముప్పిడి జగ్గరాజుగారి స్త్రీ పాత్రములు





ఈర్ష్య (రెండు చిత్రములు)
శ్రీ బి. రాఘవాచారి

లనియు, స్థాయిసముద్రమునందుఁ దరంగములవలె వృద్ధి క్షయము లనుభవించుచుఁ దత్సముద్రమునందే వ్యభిచరించు నవగుటచే వ్యభిచారిభావములనియుఁ జెప్పఁబడును.

### 102. సమయప్రధానము లభినయాంశములు.

సత్త్వసిద్ధము సమయము. అది స్థూలము. సూక్ష్మములనందగు పరిస్తారభావము లనేకములు. అట్టివి నాట్యరంగమున కనావశ్యకములు. అర్థవంతములు, రసవంతములు నగు నంశములే సాత్త్వికాభినయమునకుఁ దగునవి.

### 103. సాత్త్వికభావము లెనిమిది విధములు.

1. స్తంభము; 2 రోమాంచము; 3. స్వేదము; 4. స్వరభేదము; 5. వేపథువు; 6. వైవర్ణ్యము; 7. అశ్రువు; 8. ప్రళయము. ఈ యెనిమిది భావములు సాత్త్వికములు.

1. స్తంభము:— అతిశయించిన సంతోషమో, భయమో, కోపమో, విషాదమో, అద్భుతమో, కారణమగుటచే మనస్సున జనించునది. ఈ భావము ననుసరించునది, ప్రకటించునది నిష్క్రియాంగత్వము.

2. రోమాంచము:— ప్రియమైన లేక రసవంతమైన యొక వస్తువును, లేక, క్రియను, జూచునప్పుడో, విను

నప్పుడో, ఉత్సాహకారణము కలిగినప్పుడో జనించునట్టిది. ఈ భావమును బ్రకటించునది గగుర్పాటు.

3. స్వేదము :— రత్యాదికశ్రమముననో, వ్యాయామముననో, సంతోష, క్రోధ, భయములకుఁ గారణము కలుగుటచేతనో, తీక్ష్ణాతపముననో జనించునట్టిది. ఈ భావమును నయించునవి, యొడలు తుడుచుకొనుట, వీవన లుపయోగించుట, మారుతము నభిలషించుట మొదలగునవి.

4. స్వరభేదము :— సుఖానుభవజనితపారవశ్యమున జనించునట్టిది. దీనినిఁ బ్రకటించునట్టి ప్రధానక్రియ లలితస్వరాలాపకలితమగు ధ్వనివిన్యాసము.

5. వేపథువు :— భయకారణము కలిగినపుడు, కోపమతిశయించినపుడు, జనించునట్టిది. దీనికిఁ దగిన సాత్త్వికక్రియలు స్మరణము, దేహము వణఁకుట.

6. వైవర్ణ్యము :— విషాదము విస్తరించుట, రోషము మిక్కుటమగుట, కారణము లగుటచే జనించునట్టిది. ఈ భావమును ముఖవైవర్ణ్యము, శరీరకార్శ్యము ప్రకటింపఁగలవు.

7. అశ్రువు :— వ్యసనము, కోపము, సంతోషము కారణములై జనించునట్టిది. దీనినిఁ బ్రకటించునట్టి క్రియలు కనులు తుడుచుకొనుట, కన్నీరు విడలించుట మొదలగునవి.

8. ప్రళయము :— వివిధోత్పాతములు కారణములుకాఁగ జనించునట్టిది. దీనిని నయించునవి స్మృతిభ్రమము, చీకాకు మొదలైనవి.



**104.** సంచారిభావములు త్రివిధాభినయాత్మకములు, మిశ్రములు నగు.

వాచికము, ఆంగికము, సాత్త్వికములను మూఁడు విధములైన యభినయములలోఁ బ్రకటింపఁదగునవగుటచే నీ సంచారిభావములు మిశ్రము లనఁబడుచున్నవి.

105. సంచారిభావములు ముప్పదిమూఁడు విధములు.

1 నిర్వేదము ; 2 గ్లాని ; 3 శంక ; 4 అసూయ ; 5 మదము ; 6 శ్రమము ; 7 ఆలస్యము ; 8 దైన్యము ; 9 చింత ; 10 మోహము ; 11 ధృతి ; 12 స్మృతి ; 13 వ్రీడ ; 14 చపలత ; 15 హర్షము ; 16 ఆవేగము ; 17 జడత ; 18 గర్వము ; 19 విషాదము ; 20 ఔత్సుక్యము ; 21 నిద్ర ; 22 అపస్మారము ; 23 సుప్తి ; 24 విబోధము ; 25 అమర్షము ; 26 అవహిత్థ ; 27 ఉగ్రత ; 28 మతి ; 29 వ్యాధి ; 30 ఉన్మాదము ; 31 మరణము ; 32 త్రాసము ; 33 వితర్కము. ఇందలి కొన్నిఁటి యుత్పత్తులు, వాని వాచికవిధానములు, 88 వ సూత్రమున వివరింపఁ బడినవి.

1 నిర్వేదము :— (88 సూ.) దీనినిఁ బ్రకటించునది ముఖాదిక దైన్యము.

2 గ్లాని :— (88 సూ.) ఇందుఁ జిక్కిన దేహము, వైవర్ణ్యము, నిరుత్సాహము, గ్రుడ్లు తిరుగుట, చూపఁ దగు.

3 శంక :— (88 సూ.) పార్శ్వములను జూచుట, ముఖమున విన్నదనము, ముసుఁగు వేసికొనుట, గాద్గద్యము తగు.

4 అసూయ :— (88 సూ.) మొగమొక ప్రక్కకుఁ ద్రిప్పికొనుట, కనుబొమలు ముడుచుట, ఉపేక్షించుట తగు.

5 మదము :— (88 సూ.) గర్వపుఁ జూపులు, మందస్మితము, ముఖమెఱ్ఱనగుట తగు.

6 శ్రమము:— (88 సూ.) నిట్టూర్పులు, ఆవులింత, మందగమనము, ముఖనేత్రములు కుటిలములగుట, తగు.

7 ఆలస్యము:— నిర్లక్ష్యము, మందస్వభావము, గర్వము, మున్నగువానివలనఁ గార్యములను జాగుచేయునట్టిది. ఇందుఁ గ్రియాద్వేషము, ఆవులింత, నేత్రములు నలుపుట, పడియుండుట, కూర్చుండుట, కన్నులు మూఁతలుపడుట, తగు.

8 దైన్యము:— పేదఱికము, వ్యసనము మొదలగువానిచేఁ గలుగు కొద్దితనము. దీనిని మలినదేహము, మాంద్యము, ప్రకటింపఁగలవు.

9 చింత:— కోరినవి లభింపనందునను, ఉన్నభాగ్యము మొదలైనవి నశించుటచేతను గలుగునట్టిది. ఇది చిక్కిన దేహము, వాల్చినతల, నిట్టూర్పులు ప్రకటింపఁదగునవి.



10 మోహము:— భయవియోగాదులచేఁ గలుగు మానసికవిస్మృతి. ఈ భావమునఁ గ్రియారహితత్వము, దేహభ్రమము, భూపతనము, చక్షుభ్రమణము, చూపనగు.

11 ధృతి:— శాస్త్రాదిక జ్ఞానసంపత్తిచేఁ గలుగునట్టిది. ఈ భావమునందు నిర్విచారస్థితి చూపఁదగినది.

12 స్మృతి:— ఆత్మవిజ్ఞానముచేఁ గలుగు ననుభూత విషయస్మరణము. ఇందు శిరమాడించుట, కనుబొమలు కదలించుట, కన్పుఱపఁ దగియుండును.

13 వ్రీడ:— (88 సూ.) తలవాల్చుట, మోజించుట, ముసుఁగిడుకొనుట, గోళ్లు గిల్లుకొనుట, నేలనుగీఱుట, మొలకనవ్వు, మున్నగునవి చూపఁదగు.

14 చపలత:— (88 సూ.) అనాలోచితాలింగనము, చూచుట, వెళ్లమనుట, కఠినపుమాటలాడుట, కొట్టుట, ఆజ్ఞాపించుట, మొదలైనవి చూపఁదగు.

15 హర్షము:— (88 సూ.) ముఖవికాసము, ప్రియభాషణము, ఆలింగనము, రోమాంచము, చేతులుతట్టుట, ప్రదర్శనీయములు.

16 ఆవేగము:— (88 సూ.) వేగముగ నడచుట, వస్త్రములను దీసికొనుట, కప్పుకొనుట, కన్నులు తుడుచుకొనుట, అంగవిభ్రమము, మనస్సు చెడుట, చేతులను భుజమూలములయందుఁ జేర్చుట, అడుగులు తడఁబడుట,

తిరిగితిరిగి చూచుట, భయము, వణఁకు, రోదనము, ఇవి అప్రియావేగమునను, ఆలింగనముఁ జేసికొనుట, వస్త్రాభరణాదు లొసంగుట, రోమాంచము, మొదలైనవి ప్రియావేగమునను జూపఁదగు.

**17** జడత:— (88 సూ.) ఇందు ఱెప్పపాటు లేకయుండుట, చెవులు వినకయుండుట, మౌనము వహించుట, పరవశుఁడగుట, చూపఁదగినవి.

**18** గర్వము:— (88 సూ.) ఇందు అహంభావము, ఆజ్ఞోల్లంఘనము, పరాఙ్ముఖము, మౌనము, పరుషభాషణము, నిర్లక్ష్యము, స్వీయావయవదర్శనము, ఒడలు విఱుచుకొనుట, చూపఁదగినవి.

**19** విషాదము:— (88 సూ.) నిరుత్సాహము, దీర్ఘచింతనము, కార్యాకార్యములు తెలియకుండుట, ఎవరిని తలయెత్తి చూడకుండుట, ఊరక భ్రమియించుట, ధ్యానించుట, మొదలగునవి ప్రదర్శనీయములు.

**20** ఔత్సుక్యము:— (88 సూ.) వేగముగ నడచుట, పడకలోనుండి లేచుట, చింతించుట, శరీరము బరువగుట ప్రకటింపఁదగు.

**21** నిద్ర:— (88 సూ.) ముఖము భారమగుట, కన్నులు మూయఁబడుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, తెలివిలేకయుండుట, దేహాసంకోచము, నయింపఁదగునవి.



**22** అపస్మారము:— (88 సూ.) ఇందు వణఁకుట, పరుగెత్తుట, పడుట, స్తంభించుట, తిరుగుట, పండ్లు కొఱుకుట, చేతులు విసరుట, నేత్రముల విక్రియ, నోట నురుఁగులుక్రక్కుట, అభినయార్హములు.

**23** సుప్తి:— నిదురయొక్క యాధిక్యత సుప్తియనఁబడును. కనులు మూయఁబడియుండుట, కలఁగనుట, మున్నగునవి ప్రకటింపఁదగును.

**24** విబోధము:— నిదురమేల్కొనుట విబోధ మనఁబడును. ఇందుఁ గన్నులు నలుపుకొనుట, బాహువిక్షేపము, అంగుళీమోటనము, తలను గోకికొనుట, దేహమును ద్రిప్పుట మొదలైనవి ప్రదర్శనార్హములు.

**25** అమర్షము:— అవమానముచేఁ గలుగు క్రోధము. ఇందు స్వేదము, శిరఃకంపనము, తలవంచుకొనుట, చింతించుట, ఉత్సాహము, ఉపాయములను వెదకుట, మున్నైనవి ప్రకటింపఁదగును.

**26** అవహిత్థ:— ధైర్యము, ప్రాభవము, నీతి, సిగ్గు, సాధ్వసము, దాక్షిణ్యము, అపజయము, మొదలగువానిచేఁ గలుగు ఆకారగుప్తి. ఇందు వేఱుగఁ జెప్పుట, ప్రక్కలు చూచుట, కపటధైర్యము మొదలగునవి చూపఁదగును.

**27** ఉగ్రత:— అపరాధము, అవమానము, దొంగతనము, నిగ్రహము, అసత్ప్రలాపములనువాని వలనఁ గలిగింపఁబడిన త్వరభావము ఉగ్రత యనఁబడును, ఇందు ముఖ

మెత్తపారుట, తలయాడించుట, చెమట పట్టుట, బంధించుట, కొట్టుట, బెదరించుట, మున్నగునవి చూపఁదగు.

28 మతి:— శాస్త్రార్థపరిజ్ఞానము మతి యనఁబడును. ఉచితకార్యములను జేయుట, సంశయమును బోఁగొట్టుట, ఉపదేశించుట, కనుబొమలాడించుట, ఊహాపోహములు తగి యుండును.

29 వ్యాధి:— దోషోద్రేకవియోగాదులచేఁ గలుగు జ్వరరోగవిశేషము. దేహము శుష్కించుట, వ్యర్థాంగవిక్షేపము, నిట్టూర్పు, కన్నీరు, కంపము, మున్నగునవి ప్రకటింపఁదగును.

30 ఉన్మాదము :— (88 సూ.) వియోగజోన్మాదమునఁ బరుగెత్తుట, విలపించుట, సంబంధములేక పలుకుట, పడుట, లేచుట, కారణములేక నవ్వుట, మొదలగునవియును, ఇష్టనాశోన్మాదమున, భస్మధారణము, నృత్యగీతములు, తృణాదికమాలాధారణము మున్నినవి పెక్కులు చూపఁదగు.

31 వ్యాధిజమరణము:— (88 సూ.) దేహకాంతి పోవుట, శ్వాసగతి నశించుట, మాట నిలిచిపోవుట, కన్నులు మూఁతలు పడుట, ఎక్కిళ్లు కలుగుట, పరిజనముల నపేక్షించుట మున్నగునవియును, అభిఘాతజమరణమున నేలనుబడుట, ఏడ్చుట మొదలైనవియును దగు.

32 త్రాసము:— భయకారణజనితభావము. ఇందు భ్రమము, గాద్గద్యము, స్తంభము, ఉత్కంపము మున్నగు



శ్రీ వేదురుమూడి శేషగిరిరావు పంతులుగారు



శ్రీ మాస్త్రి సీతారామయ్యగారు



శ్రీ యడవల్లి నాగేశ్వరరావుగారు



శ్రీ ఎ. రామానుజులుగారు



నవి ప్రదర్శింపఁదగు.

33 వితర్కము :— సత్యాసత్యనిర్ణయము వితర్కము. ఇందుఁ గనుబొమలెగురవేయుట తలయాడించుట, మున్నగునవి ప్రకటింపఁదగు.

### 106. స్థాయిభావము లభినయార్హములు.

రసాశ్రియములగు నీ స్థాయులు కొన్నిలక్షణములచే స్ఫురింపఁదగియుండును. అట్టివి సాత్త్వికాభినయమునఁ బ్రదర్శింపఁదగునవి.

### 107. స్థాయిభేదము లెనిమిది విధములలో నుండును.

1. రతి; 2. ఉత్సాహము; 3. శోకము; 4. విస్మయము ; 5. హాసము ; 6. భయము ; 7. జుగుప్స ; 8. క్రోధము ననునవి.

1 రతిస్థాయి:— ఇందు వాలుచూపులు, కనుబొమలెగురవేయుట, ప్రియవాక్యము, మందస్మితము మున్నగునవి కలుగును.

**2.** ఉత్సాహస్థాయి:—ఇందు సమయమును జూచుట, ధైర్యము, త్యాగము, ఆరంభము మొదలగునవి కలుగును.

**3.** శోకస్థాయి :— ఇందు వైవర్ణ్యము, బాష్పము, ముఖశోషణము, స్తంభము, నిట్టూర్పు మున్నగునవి ప్రదర్శింపఁ దగు.

4. విస్మయస్థాయి :— ఇందుఁ బులకరించుట, శ్లాఘించుట, నేత్రవికాసము చూపనగును.

5. హాసస్థాయి:—ఇందు వికారపుఁజూపులు, ముక్కు, పెదవి, చెక్కిళ్లు, కదలుట మొదలైనవి కలుగును.

6. భయస్థాయి :— ఇందు దేహము వణఁకుట, ముఖము వాఁచుట, గాద్గద్యము మున్నగునవి కలుగును.

7. జుగుప్సస్థాయి :— ఇందు ఒడలు కదలించుట, వెనుకకు నడచుట, మొగముఁ ద్రిప్పికొనుట, ముక్కు మూసికొనుట, మున్నగునవి చూపఁదగును.

8. క్రోధస్థాయి:— (ఆక్షేపాదులచేఁ గలుగు మనఃప్రజ్వలనము.) ఇందు నాసాపుటము లదరుట, కనుగ్రుడ్లు త్రిప్పుట మున్నగునవి ప్రదర్శింపఁదగును.

శత్రువిషయిక క్రోధమునఁ బెదవులు కొఱుకుకొనుట, కనుబొమలు వక్రములుచేయుట, పండ్లు కొఱుకుట, చేతులు నలుపుకొనుట, దేహము వణఁకించుట, అస్త్రశస్త్రములను వెదకుట, తన భుజములను దానుజూచుకొనుట, గర్జించుట మొదలైనవి యభినయింపఁదగును.

భృత్యవిషయికమునఁ గన్నీరుకార్చుట, ధ్యానించుట, కదలకుండుట, నిట్టూర్పులు విడుచుట, మాటలాడకుండుట, తలవంచుకొనుట, కుటిలముగఁ జూచుట మున్నగునవి తగు.

మిత్రక్రోధమున గర్భితభాషణము, కన్నులెఱ్ఱనగుట నయింపఁదగునవి.



పూజ్యక్రోధమునఁ దన్నుతాను నిందించుకొనుట, తలవంచుకొనుట, ప్రత్యుత్తర మీకుండుట, గాద్గద్యము మున్నగునవి కలుగును.

స్త్రీవిషయికమున వంకరచూపు, పెదవులదరుట, కడగన్నులెఱ్ఱనగుట, నిశ్వాసములు కన్పడఁదగునవి.

పురుషవిషయికములు పైయటులె కలుగును.

108. అయోగవిప్రలంభావస్థలు పదివిధములు.

అది దశావస్థలను గలది. 1 చక్షుఃప్రీతి; 2 చింత; 3 సంకల్పము; 4 గుణనుతి; 5 క్రియాద్వేషము; 6 తాపము; 7 లజ్జాత్యాగము; 8 ఉన్మాదము ; 9 మూర్ఛ ; 10 మృతి యనునవి.

1. చక్షుఃప్రీతి:—నాయకాలాపము వినుట, నాయకునిఁ జూచుట మున్నగువానిచేఁ గలుగునది. ఇందు సంతోషము, రోమాంచము, హర్షము, భయము, చపలము, సిగ్గు, స్తంభము నయింపఁదగిన యనుభావములు.

2. చింత:— నాయకసమావేశమును గూర్చి చింతించునట్టిది. ఇందు నిట్టూర్పు, ధ్యానము, దేహము సోలుట, హస్తాభరణాదులను దడవుకొనుట, స్వేదము, ఒడలు పులకరించుట, విద్వేషము, నిర్లక్ష్యములగు చూపులు ప్రదర్శనీయములు.

3. సంకల్పము :— సందర్శనాభావమున జనించు

భావన. ఇందు ఔత్సుక్యము, స్వేదము, రోమాంచము, స్మరణము, శ్వాసము, కనులు మూసికొనుట, ఇతర వ్యాపారములు తెలియకుండుట ప్రకటింపఁ దగు.

4. గుణనుతి :— నాయకుని గుణములను వర్ణించునట్టిది. ఇందు రోమాంచము, డగ్గుత్తికఁగల పలుకులు, సాభిప్రాయములగు చూపులు, చెలికత్తెలతోడి సంప్రదింపులు, చెక్కిళులందుఁ జెమట, ఉత్సాహము, హర్షము, స్మరణము చూపఁదగు.

5. క్రియాద్వేషము:— నాయకేతరవస్తువులందలి విరాగము. ఇందు చింత, నిశ్వాసము, దైన్యము, కన్నీరు విడుచుట, నిదుర లేకయుండుట, వెలవెలపోవుట, విషాదము, సొలుట మున్నగు ననుభావములు చూపఁ దగు.

6. తాపము :— ప్రియాగమన మాలస్యమగునప్పుడు తపింపఁ జేయునట్టిది. ఇయ్యది వైవర్ణ్యము, కన్నీరు, స్వరభంగము, పడకలోఁ బొరలుట, నిట్టూర్పు, ముఖము వాడుట మొదలగు ననుభావములచేఁ బ్రదర్శింపఁ దగు.

7. లజ్జాత్యాగము :— నాయకసమావేగమున మానాభిమానములను త్యజించునట్టిది. ఇయ్యది యాజ్ఞ నుల్లంఘించుట, గౌరవమును దలఁపకుండుట, విషాదము, వ్యగ్రత, దైన్యము లనువానినిఁ గలిగియుండును.

8. ఉన్మాదము :— నాయకానుబద్ధచిత్తోద్వేగమునఁ గలుగు మానసిక భ్రమావస్థ. ఇందు ఇష్టవస్తుద్వేషము,



నిట్టూర్పు, తెప్పపాటు లేకుండుట, హేతువులేక నవ్వుట, ధ్యానించుట, పాడుట, మూర్ఛపోవుట, నిర్నిమిత్తముగ నడచుట, లేచుట, శంకించుట, దుఃఖించుట, గర్వించుట, రోషపడుట మొదలగు వికారములు చూపఁ దగు.

9. మూర్ఛ :— తాపాతిశయమున క్షీణించిన జ్ఞానమునుగలది. ఇందు ఇష్టానిష్టము లెఱుంగకుండుట, పిలిచినఁ బలుకకుండుట, దేనినిఁ జూడకుండుట, వినకుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు సన్నగిలుట, చేష్టలుడుగుట, అంటినఁ దెలియకుండుట కననగు.

10. మృతి :— మన్మథవ్యాపారములవలనఁ గలుగు మరణేచ్ఛ. మందమారుతాదుల నాశ్రయించుట, వెన్నెలలోనికిఁ బోవుట, స్వీయసంపదలను జెలులకప్పగించుట, వనముల కరుగుట, కోవెలాలాపములను వినుట, ప్రాణత్యాగోపకరణములను సిద్ధపఱచుకొనుట, సబాష్పావలోకనము ఇత్యాదులు ప్రదర్శనార్హములు.

### 109. విరహవిప్రలంభము.

ఇందు ఉత్సాహము, చింత, నిట్టూర్పు, వితర్కము మున్నగునవి కలుగును.

### 110. మానవిప్రలంభము ద్వివిధము.

ప్రణయమానము, ఈర్ష్యామానము నను నీ రెండును మానవిప్రలంభమునకుఁ జెందునవి.

### ప్రణయమానము.

ఇందు మాటలాడక యుండుట, ముఖముఁ ద్రిప్పికొని యుండుట, విలాసమున విదలించుట మున్నైనవి కలుగును.

### ఈర్ష్యామానము.

ఇందు మాటలాడకయుండుట, తృణీకరించుట, ఆవలి మొగమగుట, సహింపలేకుండుట, బెదరించుట, కొట్టుట, కన్నీరు విడుచుట ప్రకటింపఁ దగు.

### ప్రవాసవిప్రలంభము.

ఇందుఁ జిక్కిపోవుట, తెల్లనగుట, నిట్టూర్పు, చింత, దీనభావము, కన్నీరు, శిరోజములు చిక్కుఁబడి వ్రేలాడుట మున్నగు భావక్రియలు ప్రదర్శనార్హములు.

### శాపవిప్రలంభము.

ఇందు చింత, సంతాపము, నిశ్వాసము, పాండిమము మొదలైన భావములు పొడకట్టును. అయోగవిప్రలంభ దశావస్థాదికములు తదితరావస్థ లన్నిటియందును యథోచిత ప్రకటనార్హములై యుండును.

### సంభోగశృంగారము.

ఇందు స్తంభాదికములు, లీలావిలాసాదులు, ప్రసన్న ముఖకాంతులు, సమయసిద్ధములగుఁ గొన్ని సంచారిభావ



ములు చూపఁదగియుండును. మఱియు నిది సంక్షిప్తము, (నవనవోన్మేషలజ్జాదికలలితోపచారాపాదితము.) సంపన్నము (ఎడఁబాసియుండి కూడిన వారిది.) నను రెండు విధములు గలది.

### వీరరసభావములు.

ప్రసన్నముఖకాంతి, ఔత్సుక్యము, చింత, హర్షము లనువానినిఁ గలవి.

### యుద్ధవీరభావములు.

తేజము, అభయప్రదానము, హర్షము, గర్వము, అమర్షము మున్నగునవి.

### దయావీరభావములు.

ఊఱడింపుఁ బలుకులు, స్థిరత్వము, మతి, ధృతి మున్నగునవి.

### దానవీరభావములు.

మందస్మితాలాపనావలోకనములు, ధనధాన్యాదిక ప్రదానములు, గుణాగుణవిచారములు, ధృతి, హర్షము మొదలగునవి.

### కరుణభావములు.

శిరోజ, వస్త్ర, దేహములయొక్క వికారములు, కన్నీటి చూపులు, ముఖవైవర్ణ్యము, చేతులను దలపైఁ

బెట్టికొనుట, నిట్టూర్పులిడుట, హాహాకారము లొనర్చుట మున్నగు ననేక భావములు గలది.

అద్భుతరసభావములు.

ప్రసన్నముఖరాగము, తెప్పపాటు లేకయుండుట, విశాలదృష్టులు, శిరఃకపోలాదికచలనములు, కొన్ని వ్యభిచారి భావములు గలవి.

హాస్యభావములు.

మృగపక్ష్యాదిక స్వరానుకరణములు, చమత్కార ద్వ్యర్థిప్రసంగములు, వెక్కిరించుట మున్నగు ననేక విధము లైన భావములు గలవి.

111. హాస్యభేదము లాఱు విధములు.

స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము నను నీ యాఱును హాస్యభేదములు.

స్మితము.

కడగంటి చూపులు, వ్యక్తమైన నవ్వులు, విప్పారిన చెక్కిళ్ళతోఁ దెలియఁబడని దంతములుగల నవ్వు 'స్మిత' మనఁబడును. ఇతి ఉత్తమనాయకులకుఁ జెందునదై యుండును.

హసితము.

వికసితగండప్రదేశములతో, ముఖ, నేత్రములతోఁ గొంచెముగఁ జూడఁదగిన దంతములుగల నవ్వు 'హసిత' మనఁ



బడును. ఇది ఉత్తమనాయకోచితమై యుండును.

విహసితము.

వంపఁబడిన చూపుతో, జెక్కిళ్ళతో, మధురమై, సమయసంజనితమై, వికసితముఖావలోకనాత్మకమైయుండు నవ్వు విహసిత మనఁబడును. ఇది మధ్యమనాయకోచితమై యుండును.

ఉపహసితము.

విప్పారిన ముక్కుతో, నాలుకయందలి కడఁగంటి చూపులతో, వంచఁబడిన భుజ, శిరస్సులను గలిగిన నాయకునిచేఁ జేయఁబడిన నవ్వు ఉపహసిత మనఁబడును. ఇది మధ్యమనాయికానాయకులకుఁ జెందునది.

అపహసితము.

కదలని భుజ శిరస్సులతోఁ, గన్నీటి చూపులతో ధ్వని కలుగునటుల నవ్వఁబడునది యపహసిత మనఁబడును. ఇది యధమనాయికానాయకప్రసిద్ధము.

అతిహసితము.

ధ్వన్యాత్మకము, సబాష్పము, అధికము, అనంతము నగునది యతిహసిత మనఁబడును. ఇదియు నధమనాయక ప్రసిద్ధము.

### భయానకభావములు.

ముఖాంగికకంపనము, పార్శ్వావలోకనము, గమనావేగము, నమస్కృతి మున్నగున వనేకములు.

### బీభత్సభావములు.

వెనుకాడుట, ముఖావలోకనవికారములు మున్నగునవి.

### రౌద్రభావములు.

శత్రూద్ఘాటనము, శిరఃకంపనము, పరుషభాషణము మున్నగు ననేక సమయోచితభావములు కలవి.

### ఆహార్యాభినయము.

వస్త్ర, భూషణ, మాల్య, లేపన, వర్ణాదు లాహార్యములు. రూపకరసభావముల నయించునట్టి వాని సమ్మేళన మాహార్యాభినయము.

### రంగాహార్యములు యవనికాదులు.

సభ్యాభిముఖోన్నతస్థానము రంగము. దాని నలంకరించునవి యవనికలు, ఉపరిపల్లవములు, పార్శ్వాంచలములు, దీపములు మున్నగునవి.

### యవనికలు.

1. ధౌతాచ్ఛాదనము ; 2. అధిదేవతాధేయము ; 3. రాజవీథి ; 4. రాజాస్థానము ; 5. ప్రాసాదాంతరము ;



6. దుర్గము ; 7. అంతఃపురము ; 8. ప్రమదావనము ; 9. తరంగిణి ; 10. చెఱసాల ; 11. గ్రావాయనము ; 12. కాంతారము ; 13. అరణ్యము ; 14. కృష్ణవర్ణాచ్ఛాదనము మున్నగునవి ప్రధానములు.

### ఉపరిపల్లవములు.

ఒక్కొక్క యవనికయొక్క పైభాగమున వ్రేలాడఁగట్టఁబడునవి. దృశ్యార్థస్వభావముల ననుసరించి రంగోపరిభాగమునందంతట నలంకరింపఁబడఁ దగునవి.

### పార్శ్వాంచలములు.

ఇవి యవనికలయొక్కయు, నుపరిపల్లవములయొక్కయుఁ బ్రధానవర్ణముల ననుసరించి రంగోభయపార్శ్వములం దలంకరింపఁబడఁ దగునవి.

### దీపములు.

ఇవి రాంగికవైశాల్యము ననుసరించి యథోపరి పార్శ్వము లను మూఁడు వైపులనుండియు సమానకాంతుల నిచ్చునవిగ నమర్పఁబడఁదగి యుండును. అటులు కాక యేప్రక్కను దీపములు లోపించినను నటుని వేషము,ముఖాంగికాభినయము వికృతముగఁ గన్పట్టును.

### నటాహార్యములు వివిధములు.

1. వర్ణములు ; 2. కృత్రిమకేశములు ; 3. కృత్రిమ

శ్మశ్రువులు ; 4. కృత్రిమ చిబుకములు ; 5. దుస్తులు ; 6. అలంకారములు మున్నగునవి.

ఆర్ద్రవర్ణములు ; ( Grease paints. )

ఈయవి, ఆంగ్లదేశస్థులగు బర్నర్ (Berner ), లీచినర్ ( Leichner ), స్టీన్ ( Stein ), డోరిన్ ( Dorin ) వారలచే సిద్ధపఱుపఁబడినవి. ఇవి కణికల రూపమునను, మఱికొన్ని చూర్ణరూపమునను నుండును. వీనిపై యాయా ఛాయలు తెలియునటులు 1, 2, 3, 4, 5 మున్నగు సంఖ్యలు గుఱుతులుగ వేయఁబడియుండును. కొన్ని యావనులకు, మఱికొన్ని వృద్ధులకు, నాయా వయోధర్మముల ననుసరించి యుపయోగింపనగునటులు ప్రత్యేకముగఁ జేయఁబడియుండును.

లీచినరు పెయింట్లు. ( Leichner's Grease Paints.)

1, వ నెంబరు, పేల్‌ఫ్లెష్ (Pale Flesh, ) ; 1½ లైటు ఫ్లెష్ (Light flesh) ; 2. ఫ్లెష్ (Flesh) ; 3. డీపుఫ్లెష్ (Deep flesh) ; 3½, డార్కు-ఫ్లెష్ (Dark flesh ) ;4. వారియర్ ఆర్ సెయిలరు (Warrier or Sailor) ; 4½, గిప్సీ (Gipsy) ; 5, యెల్లోయిష్ ఫ్లెష్ ( Yellowish flesh Lt) ; 5½, యెల్లోయిష్ ఫ్లెష్ (Yellowish flesh) ; 6, ఓల్డుమాన్ (Old man) ; 6½, డార్కు- సాలో ( Dark Sallow) ;



7, ఆఫ్రికన్ బ్రౌన్ (African brown ) ; 8, మొగల్ చైనీస్ (Mogul Chinese ) ; 9, రెడ్డిండియన్ (Red Indian) ; 12, బ్లాక్ (Black) ; 13 ములాటో (Mullatto. Lt. Brn.) ; 20, వైట్ (white) ; F డీఫ్ యెల్లో (Deep yellow) ; K. యెల్లో ఫ్లెష్ (yellow flesh) ; 35, కార్మయిన్ వర్మిలియన్ (Carmine Vermillion ) ; కార్మయిన్ నెంబర్లు 1, 2, 3. ఇట్టి వింకెన్నియో కలవు.

వివిధ ఛాయలు.

1. ధూసరవర్ణము (Grey) :— ఇది తెలుపు, నలుపు రంగులు చేరుటవలనఁ గలుగునట్టి ఛాయ.

2. మౌక్తికవర్ణము:— (Pearl) ఇది తెలుపు, నలుపు నీలము, నను నీ మూఁడు రంగులు చేరుటవలనఁ గలుగునట్టి ఛాయ.

3. నారింజరంగు (Orange) ఇది పసుపుపచ్చ, ఎఱుపు రంగులు చేరుటవలనఁ గలుగునట్టి ఛాయ.

4. ఊదారంగు:— (Violet ) ఇది యెఱుపు, నీలము, తెలుపు రంగులు కలియుటవలనఁ గలుగునట్టి ఛాయ.

5. ఆలివ్:— (Olive ) ఇది పసుపుపచ్చ, నీలము, నలుపు, తెలుపు రంగులు సమముగఁ గలియుట వలనఁ గలుగునట్టి ఛాయ.

6. మాంసపువర్ణము:— (Flesh) ఇది తెలుపు, పసుపుపచ్చ, సిందూరము, చిత్రవర్ణములుకలిసిన యొకవిధమగు మన్ను, గలియుటవలనఁ గలుగునట్టి ఛాయ.

7. తామ్రవర్ణము:— (Copper) ఇది ఎఱుపు, పసుపుపచ్చ, నలుపు రంగులు కలియుటవలనఁ గలుగు నట్టి ఛాయ.

8. జంబీరవర్ణము:— (Lemon) ఇది తెలుపు, పసుపుపచ్చ రంగులు కలియుటవలనఁ గలుగు నట్టి ఛాయ.

9. Cream colour :— ఇది తెలుపు, పసుపుపచ్చ రంగులు కలియుటవలనఁ గలుగు నట్టి ఛాయ.

పురుషుల కృత్రిమ కేశములు.

1. రాజవేషములకుఁ దగునవి:—(Kings wigs.)
2. గిరజాలు గలవి:— (Babree wigs.)
3. వివిధ వర్ణముల వక్రకేశములు:— (Shakespear wigs.)
4. కాఫ్రిదేశపు శిరోజవికారములు:— (Coffrree wigs.)
5. చీనాదేశపు వేణీవికారములు:— (Chinese wigs)
6. బట్టతల విగ్గులు :— (Bald wigs.)
7. సగము బట్టతల:— (Half bald wig.)



8. యోగుల శిరోజవికారములు:— (శంకరుఁడు, విశ్వామిత్రుఁడు, కణ్వుఁడు, నారదుఁడు, వానప్రస్థులు, మున్నగువారికిఁ దగునవి)
9. శ్రీకృష్ణుని వ్రేలుముడి.
10. క్రొపుతల విగ్గు.
11. రామలక్ష్మణుల జటాజూటములు.
12. మీసములు, గడ్డములు.

స్త్రీల కృత్రిమ కేశములు.

1. నొక్కులు నొక్కులుకలిగి పొడుగుపాపటతోఁ గూడిన నిడివివెంట్రుకలు కలది. ఇది నాయికాపాత్రలకుఁదగునది.
2. నొక్కులులేకయె దీర్ఘశిరోజములను గలిగియుండునది.
3. నుదురుమీఁద నుంగరములవలె చుట్టఁబడిన వెంట్రుకలతోఁగూడినది.
4. అల్లఁబడిన జడనుగలది.
5, వివిధదేశీయపద్ధతులకుఁ జెందునవి.

దుస్తులు.

1. రాజులు ధరించు వెండిచమికీపనిఁ గలిగినవి.
2. రాజులు ధరించు వేటదుస్తులు.
3. పిల్లలు ధరించు మోకాలుబంటిదుస్తులు.
4. రాజచిహ్నములుగల దుస్తులు.
5. సైనికదుస్తులు.

6. చక్రవర్తుల శిరోవేష్టనములు.
7. రక్షకభటుల తలపాగలు.
8. చీరలు,
9. రవికలు, మున్నగునవి.

### అలంకారములు.

ఆయా దేశ కాల పాత్రముల ననుసరించి స్త్రీలు, పురుషులు ధరించునట్టి పెక్కువిధములయిన కాసులపేర్లు, ముత్యాలహారములు మున్నగునవి. కత్తులు, విల్లునమ్ములు, యోగదండములు, రుద్రాక్షపేరులు మొదలగునవియుఁ గానగునవి.

### వర్ణలేపనపరికరములు.

గ్రీస్‌పెయింటులలోని నీలము, ఎఱుపు, పసుపుపచ్చ, నలుపు, తెలుపు నను నీ యైదురంగుల కణికలు ముఖ్యములు.

### (Powders.) శుష్కవర్ణములు.

ఇవి పైని వివరింపఁబడిన పెయింటులవలె యన్నివర్ణములను గలిగియుండును. ఇందు దట్టమగు వర్ణమునిచ్చు పొడులు లేఁతలగు తొలిపూఁతలపైనను, లేఁతవర్ణమునిచ్చు పొడులు దట్టములగు తొలిపూఁతలపైనను నుపయోగింపఁబడును.

### (Lining Sticks.) దిద్దుడుపుడకలు.

ఇవి యన్నివిధములైన ముఖాంగికభావవికారముల నేర్పఱచుకొనుట కుపయోగింపఁబడునవి. ఇట్టివి వివిధఛాయలలో నుండును.



### (Crepehair) క్రీప్‌హేయిరు.

ఇది చిక్కుఁదీర్చి జడగా నల్లఁబడియుండెడు వెంట్రుకలను గలది. ఇది యనేకరంగులలో నుండును. దీనితో మీసములు, గడ్డములు, కనుబొమలు వలయువిధమున నమర్చుకొందురు.

### (Cold Cream.) కోల్డుక్రీము.

దీనినిఁ దొలిపూఁతకుముందు ముఖమున రాచుకొని తుడిచివేసికొందురు. ఇది ముఖముననుండు సొట్టలు, గుంటలు మున్నగువానియందు పెయింటులను జక్కఁగ నంటునట్లు చేయును. రంగులను దుడిచివేయుటకును నుపయోగపడును. ముఖవర్ణమునకు నిలుకడఁ గలిగించును. కొన్ని పెయింటుల వలనఁగలుగు చర్మవ్యాధులను రాకుండఁజేయును. అయిన నిది కన్నులందుఁ బడినచో దురదలు గలిగించును. ఆ కారణమునఁ గంటిఱెప్పలకు "వేసలైన్" అనఁబడు మఱియొక పదార్థము నుపయోగింతురు.

### బ్లూముఆఫ్‌రోజెస్. (Bloom of Roses)

ఇది యొక ద్రవపదార్థము. దీనినిఁ బెదవులకుఁ జెక్కిళ్లకు నుపయోగింతురు. ఈ సందర్భమున "క్రింసనులేకు"ను గూడ నుపయోగింతురు.

## పెరల్ క్రీము. (Pearl Cream.)

ఇది యొక సువాసనఁ గల ద్రవపదార్థము. దీనినిఁ బొడి వర్ణములతోఁ గలిపి చఱచుకొనుదురు.

## మేస్కారో. (Mascaro.)

దీనినిఁ దడిపిన కుంచియతోఁ దీసికొని వెండ్రుకలకు నద్దికొందురు. ఇదియు ననేక రంగులలో నుండును. వయస్సునకుఁదగిన శిరోజవికారములను జిత్రించుటకు ముఖ్యముగ నుపయోగపడును.

## స్పిరిట్ గమ్. (Spirit Gum.)

ఇది యొక జిగురుఁగల ద్రవపదార్థము. దీనిని మీసములు, గడ్డములు, కనుబొమలు మున్నగువానిని నంటించుకొనుట కుపయోగింతురు.

## కాస్మాటిక్. (Cosmatic.)

ఇది యొక పరిమళమునుగల మైనము. దీనితో మీసము, కనుబొమలు మున్నగువానిని నిలుపుట, వాల్చుట, చుట్టుట మొదలగు వికారములలో దిద్దికొందురు.

## పఫ్ఫులు. (Puffs.)

ఇది పొడివర్ణములను ముఖమున నద్దికొనుట కుపయోగపడును. బంతిపువ్వువలె గుండ్రముగను, చతురముగను జేయఁబడి యుండును.



చిన్ని పళ్లెము, మైనపు వత్తి, కుంచియలు, తుడుపుడు గుడ్డలు, కత్తెర, దువ్వెన మున్నగునవియు ముఖ్యములు.

## తొలిపూఁతలు. (Foundations.)

1 వ సంఖ్యగల "పెయింటు"ను దెల్లని దేహచ్ఛాయఁ గల స్త్రీలు, లేక, పురుషులు, 3. వ సంఖ్య గల పెయింటుతోఁ గలిపి తొలిపూఁతగ వేసికొనఁదగు. ఇట్టిది మిక్కిలి లేఁత యగు ఛాయను గలిగియుండును.

2 వ సంఖ్యను గలది యౌవనస్త్రీ వేషముల కుపయోగింపఁ బడునది. తెల్లని ముఖచ్ఛాయఁ గలవారు దీనిని $2\frac{1}{2}$, సంఖ్యను గలదానితోఁ గలిపి వేసికొందురు.

3, $3\frac{1}{2}$, 4. సంఖ్యలను గలవి 5, 6, సంఖ్యల ఛాయలతో సరిపోవునవి. ఇవి యౌవనపురుషు లుపయోగింపఁ దగునవి.

లీచిసర్సువారి రంగుల కణికలలోను, బర్నర్సువారి రంగుల కణికలలోను 5 వ, సంఖ్యనుగల కణికలు పసుపుపచ్చ వర్ణమును గలవిగ నుండును. 9 వ, సంఖ్యనుగలది కమలిన పసుపువర్ణముగ నుండును. ఈ9 వ, సంఖ్యనుగలది పై 5 వ, సంఖ్యను గలదానితోఁ గలిపి వేయునప్పు డొక ముఖ్యమగు ఛాయ కలుగఁగలదు.

## శుష్కవర్ణములు.(Powders.)

ఇవి పైని వివరింపఁబడినవానివలె యనేకఛాయలతో నుండునవి. లేతలగు దొలిపూఁతలపై గాఢచ్ఛాయలనుగల చూర్ణములును, గాఢవర్ణమునుగల తొలిపూఁతలపై లేతలగు చూర్ణములును నుపయోగింపఁ దగియుండును.

## వేషధారణము.

ముఖమును శుభ్రపఱచుకొనినపిదప "కోల్డుక్రీమ్"ను జక్కఁగ రుద్దుకొని తుడుచుకొనవలెను. తమతమ శరీరచ్ఛాయల ననుసరించి యొక "గ్రీస్‌పెయింటు"ను దీసికొని గడ్డము చుట్టును చంద్రాకారముగను, జెక్కిళులయొక్కయు, నుదుటియొక్కయుఁ బైభాగమున నక్షత్రాకారముగను, మెడయొక్క యిరుప్రక్కలను గొంచెముగను, జక్కఁగఁ జఱచుకొనఁ దగును. చర్మమంతటను సమముగఁ గలియునటులు చూచుకొనవలయును. కనుబొమల పైనను, ముక్కుమీఁదను, బెదవుల మీఁదను వర్ణమును సమానముగ నుండునటులు లక్షించుకొనుచుండవలయును. కనుబొమల పైనుండి తలవెండ్రుకల పర్యంతము వర్ణమును బైకిఁ జఱచుకొనఁదగును. చెవులకుఁ, జెవుల గుంటలకు, వానిముందు వెనుకలకు, మెడకు, గంఠమునకుఁ దొలిపూఁత చక్కఁగ నంటునటులు చేసికొనఁదగు. బుగ్గలయొక్క పల్లపుసీమలందును, గన్నులయొక్క పల్లములందును, గణతలయందును, దదితర



భాగములందు వేయఁబడిన వర్ణముకంటెఁ గొంచెము తెలుపుతోఁ, గూడిన లేతరంగు నుపయోగింపఁ దగును. ఒక చిన్న యద్దమును గైకొని యందుండి నిలువుటద్దములోనికి ముఖార్థభాగమునుగాని, ముఖ పార్శ్వభాగమునుగాని ప్రతిబింబింపఁజేసికొని వాని యాధారమున వలయు దిద్దుబాటులను జేసికొనవలయును. తదనంతరమునఁ జెక్కిళులందుఁ గొంచెము "రోజు"ను లేక, "క్రిమ్‌సన్" రంగును రాచికొని దానిని ముఖవర్ణముతోఁ గలియునటులు చక్కపఱచుకొనఁ దగును. పెదవులకు వేయు "రోజు"ను నడిమి వ్రేలుతోఁ గైకొని మూయఁబడిన పెదవుల మధ్యభాగమునం దంటించుకొని దాని నిరుప్రక్కలకును సమముగ రుద్దుకొనవలయును. నేర్పుమెయిఁ బెదవుల కొనలను దిద్దికొనఁదగును. ఆ దిద్దుబాటునందేమాత్రము లోపము కలిగినను నోరు పెద్దదిగను, వక్రముగను గన్పించును.

మనుజుని ముఖము మూఁడు సమాన భాగములను గలది. భ్రూమధ్యస్థానమునుండి నాసికాగ్రపర్యంతమగునదొక భాగము. అందుండి చిబుకాంతమగు భాగము పూర్వోక్త భాగమునకుఁ దుల్యమగునది. భ్రూమధ్యభాగమునుండి ఫాలాంతమగు భాగము పైరెండు భాగములలోని యే భాగమునకైనను సమానముగ నుండఁదగునది. ఆ భాగములటులు లేని నటుఁడు వర్ణసమ్మేళనమున వానిని ముఖ్యముగఁ జక్కపఱచుకొనుచుండవలయును.

నాసికాగ్రభాగమునుండి చిబుకాంతస్థమగు భాగము భ్రూమధ్య ప్రభృతి నాసికాంతమగు స్థానముకంటెఁ బొడవుగ నున్నపు డార్ద్రమగు “రోజు”ను గడ్డముపై నొకింత సమముగ రుద్దుకొనఁదగు. అపుడు నాసిక చిన్నదిగ నగును. గడ్డము పొట్టిదిగను, నాసిక పొడవుగను నుండునేని లేత యగు ‘ఫ్లెష్’ రంగును గడ్డముయొక్క యగ్రభాగమునఁ జఱచుకొనఁదగు. అపు డది చిన్నది కాఁగలదు. ముక్కుయొక్క దిమ్మయందు “హైలైట్” రంగు నుపయోగించుటచేత నది స్పష్టముగఁ గన్పడఁ గలదు.

కన్నులు పెద్దవిగఁ జేయనెంచునపుడు ముఖమున రంగు వేయుటకుఁ బూర్వమె తడిపిన సబ్బునొకదానిని నలిపి బొమలపై నంటించుకొనఁదగును. అది యెండిన పిదపఁ దొలిపూఁతను మొగమునందును, బొమల పైనను సమానముగఁ జఱచుకొనఁదగును. అనంతరమున దిద్దుపుడకలచే బొమలను వలయునటులు తీర్చుకొనవలెను. అటులు కాక ముందుగనే తొలిపూఁతను వేసికొని యాపిమ్మట బొమలను విశాలములుగను, వక్రములుగను వలయు రీతిని జిత్రించుకొను నాచారమును గలదు. ఆవెనుక నాయా తొలిపూఁతలకుఁ దగియుండెడు చూర్ణములను “పఫ్”తో నద్దికొని వర్ణాలంకారమును బూర్తిచేసికొందురు.

కనుబొమల మధ్యను వెండ్రుక లున్నయెడల నవి చూచువారి కొక వికృతముఖభావమును స్ఫురింపఁ జేయును.



అట్టియెడ వానిని వర్ణముతో మఱుఁగుపఱచుకొనవలసి యుండును. కనులయొక్క కొలుకుల మధ్యప్రదేశ మొక కన్నుయొక్క పొడవును గలిగియుండును. కన్నులు చిన్నవియుఁ దన్మధ్యభాగము విశాలమును నగునపుడు దిద్దుపుడకల సాహాయ్యమునఁ గనుబొమలను నాసికాగ్రపర్యంతములుగఁ దీర్చికొనఁదగు.

కనుబొమలు తీర్చుకొనుటలో నల్లని తలవెండ్రుకలు కలిగి, నల్లని కన్నులు కలవారు “బ్రౌన్” రంగు నుపయోగింపవలెను. దిద్దుపుడకతోఁ గనుకొలుకులనుండి పాతికయంగుళము విడిచి, బొమల చివర వఱకును గీఁతను గీచుకొనిన యెడలఁ గన్నులు గాంభీర్యమును గలవిగఁ గన్పట్టును. శిరోజములతో సరిఁబోలు వర్ణమును మాత్రమే బొమలకు వేయవలసియుండును. కనుబొమల కొనలు వెండ్రుకలతో నంతమగున వగుటచే దిద్దుపుడకలతోఁ బెద్దవిగను, జిన్నవిగను దిద్దికొనఁబడినపుడును, గుంచియతోఁ గూడ నొకపరి బొమల చివర భాగములను దొలిరంగుతోఁ జిత్రించుకొనవలసియుండును.

తనకంటె మించిన వయస్సుఁ గలుగు నొక సుందర పాత్రమును ధరింపనెంచు నటుఁడు కొన్ని ప్రధానముఖవికారములను జతపఱచుకొనవలసి యుండును. భ్రూయుగాంతరమునఁ దీర్చికొనఁబడునట్టి యల్పరేఖచేఁ దద్వయోధర్మసూచకమగు నొక ముడుతను దెలుపఁగలఁడు. ఫాలభాగమునఁ

గూడ నటులే కొన్ని రేఖలను జిత్రించుకొనవలసి యుండును. పెదవులకు వేయనగు "రోజ్" రంగును బైనఁ జెప్పఁబడిన విధమునఁ బెదవుల కొనలందును, నధరమునందును, చిబుకమునందును, దానికి మధ్యనుండు పల్లపుఁ బ్రదేశములందును దీర్చికొనుటవలన వలయు నాకృతులను బడయవచ్చును. చిబుకమునందు ముడుతలు, లేక, పగుళ్లు మున్నగునవి యుండునెడల నవియు నా "రోజ్" వర్ణముననే దిద్దికొనఁదగు. ఆయా వయోధర్మములనుబట్టి దిద్దుబాటులు సుందరముగఁ గనిపించునంతవఱకు మాత్రమె యిట్టి మార్పులు చేసికొనఁదగియుండును.

తొలిపూఁతలపై లేఁతలగు చూర్ణములు వాడునపుడు చర్మము నిండుగను, దట్టమగునవి వాడునపుడు చిక్కనిదిగను గన్పట్టును. నలుబది వత్సరములవానికిఁ గణతలనుండి వెండ్రుకలు నెరయ నారంభించునవగుటచే నవి యాభాగమునఁ దెల్లని "మాస్కరో"తోఁ జిత్రింపఁబడఁదగి యుండును.

"మాస్కరో" పెక్కు ఛాయలను గలది. నటు లాయాఛాయల ననుసరించి దాని నుపయోగింతురు. అయినఁ జముదుగలిగిన వెండ్రుకలయం దియ్యది యంటనేరదు. అంటినచోట సబ్బునీళ్ళచేఁ గడిగిన సులభముగఁ బోఁగలదు. కన్నులందుఁ బడఁదగదు.

## కౌమారవేషములు.

వర్ణముల సమ్మేళనమున వలయు వయోరూపములను



1. వాసకసజ్జిక (చూ. పు. 163)
2. అభిసారిక (చూ. పు. 164)
3. కలహాంతరిత (చూ. పు. 164)
4. స్వాధీనపతిక (చూ. పు. 162)



1. ఖండిత (చూ. పు. 163)
2. ప్రోషిత భర్తృక (చూ. పు. 164)
3. విరహోత్కంఠిత (చూ. పు. 163)
4. విప్రలబ్ధ (చూ. పు. 163)



నటుఁడు చిత్రించుకొనఁదగియుండును. సహజసౌందర్యము చెడకుండునటులు చూచుకొనుట యీ విధానమునఁగల ముఖ్యధర్మము. అందుఁగొఱకుఁ బూర్వోక్తవిధమున నిప్పట్టునఁగూడఁ దొలిపూఁత వేసికొనవలసియుండును. అటుపై నార్ద్రవర్ణముల నుచితగతిని జఱచుకొనఁదగును. ఇందుఁ గన్నులదాపున నుండునట్టి యార్ద్రమగు "రోజు"ను బుగ్గల యం దిడుకొనఁగూడదు. ఆరూపమునఁ జెక్కిళుల యందమును మఱుఁగుపఱచి వాని జీర్ణస్వభావమును మొదటఁ జిత్రింపవలసి యుండును. పెదవుల ఛాయను, దిట్టతనమును, నాకారమును వయోధర్మము ననుసరించి దిద్దికొనవలసియుండును. కనుఱెప్పల పైభాగమును 'జూవినైల్' చూర్ణముతోడనే యలంకరింపఁదగును. వర్ణలేపనమునకుఁ బూర్వమె చెంపల యొక్కయు, ఫాలముయొక్కయు ముడుతలను గనిపెట్టి 'గ్రే' రంగును గలుగు దిద్దుడుపుడకలతోఁ దీర్చికొనవలసియుండును. భ్రూమధ్యమున నొకటి రెండు సన్నని రేఖలను జిత్రించుకొనుటవలన ముకుళిత ముఖవికారమును బ్రకటింపవచ్చును. కన్నులచుట్టును నుండెడు స్వాభావికవళులను నేర్పుమెయి దిద్దికొనుటవలననే వయోధర్మము ముఖ్యముగఁ బ్రస్ఫుటము కాఁదగియుండును. నాసికనుండి పెదవులమీఁదుగ గడ్డము వఱకు నిరుప్రక్కలను వ్రాలియుండు నొక కొన్ని వళులును దిద్దికొనవలసి యుండును. గడ్డమునందలి యెముక వ్యాపించి యుండు విధము ననుసరించి యా రేఖను జిత్రించుకొనుట వలనఁగూడ వయస్సిద్ధమగు నొక లక్షణ మేర్పడఁగలదు.

## వృద్ధవేషములు.

వార్ధక్యమున ముఖ్యముగఁ గనిపెట్టి చిత్రించుకొనఁదగునవి, చర్మమునఁ బొడమునట్టి ముడుతలు, పటుత్వమును బాసిన చెంపలు, ముక్కు, గడ్డము, మున్నగునవి. ముఖాంగములును నట్టివెయగు. అట్టి ‘వళులు’ లేక ‘ముడుతలు’ దిద్దికొనునపుడు ‘బ్రౌన్’ లేక ‘లేక్’ వర్ణము లుపయోగింపఁదగియుండును. అటుపిమ్మటఁ దెలుపుతోఁగూడిన తొలిపూఁత రంగుతోడనే వానికొనలు చక్కఁపఱచుకొనఁదగియుండును.

నిండు ముసలితనమును జిత్రించుకొనవలసి యుండునపుడు ‘రోబస్టు ఓల్డుఏజ్’ అని వ్రాయఁబడియుండు పెయింటునుగాని, బర్నర్, లీచినర్’ల 9 వ, నంబరునుగల ఎఱుపు రంగుతో, 5 వ, నెంబరు పసుపుపచ్చను గలిపికాని, తొలిపూఁతగఁ బూయవలసి యుండును. ఈ దశకుఁ జెందిన పాత్రయొక్క ముఖవర్ణమును జిత్రించుకొనునపుడు, నుదుటిభాగమునందుఁ గడమభాగములందలి వర్ణముకంటె నొకఛాయను దక్కువుగఁ గలదానిని మాత్రమె యుపయోగింపవలసి యుండును.

తొలిపూఁతగ నుపయోగించుకొనఁబడు “పెయింటు” ఎఱుపుతోఁ గలిసియుండునేని ‘లేక్’ రంగును, నలుపుతోఁ గలిసియుండునేని ‘బ్రౌన్’ రంగును, దొలిపూఁతతోఁ గలిపి వేసికొనవలసియుండును. ముడుతలు, గుంటలు, మెడప్రక్కలు, మున్నగునవి ‘గ్రే’ రంగుతో దిద్దికొనవలసియుండును



అన్నిభాగములును దిద్దుట యయినవెనుక ‘క్రిమ్సన్’ రంగును గాని, ‘బ్రౌన్’ రంగునుగాని, తొలిపూఁతకై యుపయోగించుకొనఁబడిన పెయింటుతోఁ గలిపి, కనుకొలుకుల ప్రక్కల నుండి, యాయా యవస్థలకుఁ దగియుండెడు, నన్నివిధములయిన ముఖవికారములను దిద్దికొనవలసి యుండును.

కన్నులచివర కొన్ని ముడుత లుండును. సుఖదుఃఖములు రెండును సమానముగ ననుభవించువారియందవి కనుగొనలనుండి కణతలపర్యంత మొకటియుఁ, గణతల పైభాగమున కొకటియు, బుగ్గల పైయెముక పైవఱ కొకటియు, లక్షింపఁదగియుండును. దుర్మార్గులకు, సన్మార్గులకు నివి కణతల పైభాగమునకే వ్యాపించియుండును. సంతోషముగల మానవులకుఁ గనుగొలుకులనుండి, బుగ్గల పైయెముకల మీఁదుగఁ, జెక్కిళుల క్రిందివైపునకు వ్యాపించియుండును.

ముక్కుయొక్క డిప్పలమీఁదనుండి రెండురంధ్రముల వఱకును, ఆ రెండురంధ్రముల ప్రక్కలనుండి పెదవుల కొలుకులవఱకును, వానికి సగయంగుళము ప్రక్కవఱకును, పెదవుల చివరలనుండి యిరుప్రక్కలను గడ్డముమీఁదకును,ముడుత లుండును. పెదవుల ప్రక్కలనుండి వచ్చునట్టి ముడుతలు గడ్డముమీఁదికి నిడివిగ నుండిన-చో నీచస్వభావమును వెల్లడింపఁగలవు. అపహసించునట్టి ముఖాకృతిని సహితము ప్రకటింపఁగలవు. గడ్డముక్రిందనుండి మెడపూసవఱకును, మెడనుండి దవడలయొక్క చివరలవఱకును వ్యాపించునట్టి రేఖలు,

గడ్డముయొక్క వ్రాలుడు వైఖరిని బ్రకటింపఁగలవు. ఈ పైని వివరింపఁబడిన రేఖలను 'గ్రే' పుడకలతోఁ దీర్చికొనిన యనంతరమున, 'బ్రౌన్' తోఁగాని, 'లేక్' తోఁగాని కలిసిన తొలి పూఁతరంగుతో ఛాయల నిచ్చుకొనవలసియుండును. కంటి రెప్పలపై 'లిప్‌రోజ్'ను పెయింటుఁజేసినచో, ముదిమిని బ్రకటింపవచ్చును. మఱియు నట్టిది విచారభావమును జాటఁ గలదు.

కనుబొమలు దట్టములై వ్రాలుచుండునవిగఁ జిత్రింపఁ దగునవి. ఇందునకు బొమలపై "పెయింటు" లనుబూయఁ దగదు. 'స్పిరిటుగమ్' ను బొమలపై రాచుకొని, యాయా వయస్సులకుఁ దగునదియుఁ, దలవెండ్రుకల వర్ణముతోఁ దులదూఁగునట్టి వర్ణమును గలదియునగు, 'క్రేపీహేరును' జుట్టలు చుట్టలుగ నంటించుకొనఁదగు. ఆ పిమ్మటఁ దొలిపూఁతయొక్క వర్ణమునుగల చూర్ణమును (Powder) నద్దికొనఁ దగును. అట్టిది తెలుపుతో మిళితమయిన పసుపుపచ్చరంగును గలదిగ నుండుట మేలు. మెడయందు నల్లని చూర్ణమును జల్లుకొనుటవలన దాని సహజదౌర్బల్యమును జాటనగును.

పండ్లకు నల్లని మైన మంటించుకొనుటచేత బోసినోరు చూపఁదగియుండును. చెంపలు, ముక్కు, 'రోజు' చూర్ణమున నద్దికొనవలయును.

### వివిధభావచిత్రీకరణము.

సుకుమార ముఖభావ చిత్రీకరణమున "జూవినైల్



గ్రీజు" పెయింటునుగాని, లేక, దానితో దట్టమగు 'పింక్' చూర్ణమును గలిపికొనికాని యుపయోగింపఁదగును. ముఖరేఖలు పూర్వోక్తక్రమమ్మున దిద్దికొనఁదగునవి. నాసికనుండి వ్యాపించునట్టివి మిక్కిలి ముఖ్యములు. కపోలములు 'రోజు' చే నలంకరింపఁబడునవి.

గర్వితవృద్ధముఖభావ చిత్రీకరణమునఁ గనుబొమల లోపలి మూలలను మూయవలసి యుండును. అటుపిమ్మట వానిని యూర్ధ్వోన్నతములుగ దిద్దికొనఁదగును. బొమలకొనల నుండి బుగ్గలక్రిందకు నిలువుననుండు రేఖలను, భ్రూమధ్యస్థ రేఖలను, గనిపెట్టి నేర్పుమెయిఁ జిత్రించుకొనవలసియుండును.

ఔత్సాహిక ముఖభావ చిత్రీకరణమున 'పింకిష్' పెయింటును దొలిపూఁతగ నుపయోగింపనగు. కనుబొమలు ధనురాకార కలితములుగఁ గాఁదగునవి. కనుకొలుకులనుండి యధమ మొకమూఁడు రేఖలు, బుగ్గల చివరలకు వ్యాపింపఁ జేయుటయు ముఖ్యము.

చిడిముడిపాటును గలుగు ముఖభావమును జిత్రించునపుడు, తెలుపుతోఁగూడిన పసుపుపచ్చ పెయింటు నుపయోగింపఁదగును. ముడుతలు, నిమ్నస్థలములు 'బ్రౌన్' పెయింటుతో దిద్దికొనఁదగునవి. ముక్కుకొనలనుండి పెదవుల కొనల వఱకును, పెదవుల కొనలనుండి గడ్డముయొక్క క్రిందిభాగము వఱకును వ్యాపింపనగు భావరేఖలు, వక్రములుగ నుండఁ దగవు. కన్నులయొక్క లోగుంటలు, బుగ్గల యెముకల

పర్యంతము పరిస్ఫుటములుగఁ జేయఁదగునవి. కనుబొమల నుండి క్రిందికిఁ ఛాయలుగ వెడలింపఁబడెడు రేఖలవలనఁ గూడ, నీభావము ప్రకటింపఁబడఁగలదు. పెదవులు కొంచెము మందములుగ, 'రోజు' చే నలంకరింపఁబడఁదగునవి. కన్నులు విశాలములగుటకు నార్ద్రమగు 'రోజు'ను ఱెప్పలపైనను, గొనలయందును, గొంచెముగ దిద్దికొనవలసియుండును. నాసికాగ్రభాగము నించుక రక్తవర్ణాత్మకముగను జేయనగు. అటుపై లేఁతలగు చూర్ణములను (Powders) నద్దికొనుటతో నీ భావ చిత్రాలంకారమును బూర్తిఁజేసికొననగును.

కార్మికుని ముఖభావ మేర్పఱుటకు „ డీప్‌సన్‌బర్నట్ " (Deep Sunburnt) పెయింటును దొలిపూఁతగఁ బూయనగు. కంటిచుట్టును గలుగు ముడుతలను బైపెయింటుతోఁగాని, లేక, దానితోఁగలుపఁబడిన 'లేక్' వర్ణముతోఁగాని, యేర్పఱచుకొననగును. బుగ్గలయందుఁ గొంచెముగ 'రోజు'ను నుపయోగింపవచ్చును. వ్రేళ్లు, వాని కణుపులు బలిష్ఠములుగ నుండఁదగు. ముక్కు మైనమువలన వానిని వలయునటు లేర్పఱచుకొనఁనగు. మఱియు వాఁడు సరోగుఁడై యుండునెడ, ముఖమునకు 'లేఁతపెయింటు'నే తొలిపూఁతగ వాడవలసియుండును. ముడుతలు, నిమ్నస్థలములు, 'గ్రే, లేక, 'బ్రౌన్, వర్ణము లనఁబడు నా రెంటిలో, నే యొకవర్ణమునుగల దిద్దుడుపుడకలతో నైనను నేర్పఱచుకొననగు. ఉన్నతప్రదేశము లెక్కుడు తెలుపుతోఁగూడిన పెయింటులచేఁ దీర్పవలసియుండును



శరీరమునఁగాని, ముఖమునఁగాని మచ్చలుండునెడల, „యెల్లో యిష్ బ్రౌన్,,గ్రీజు పెయింటుతో నక్కడక్కడ చుక్కలు చుక్కలుగా నేర్పఱుపఁదగు. కరతలములు నిటులే చేయఁదగియుండును.

వ్యాకులిత ముఖభావ చిత్రీకరణమునఁ జిక్కిన కన్నులు వాడినముఖము, ముఖ్యముగ లక్షింపఁదగియుండును. 'గ్రే, వర్ణమున నిమ్నప్రదేశములు దిద్దఁదగు.

### కరయుగచిత్రీకరణము.

పాత్రానుగుణ్యమగు వర్ణముననె కరములు, గరతలములు, గన్పఱుపఁదగునవి. సుకుమారపాత్రధారణమునఁ గరతలముల వెనుకభాగములందుఁ, దెల్లని వర్ణమును గలిగింపనగును, ఈ సందర్భమున „ఫ్లెష్,, ఛాయనుగలుగు „లిక్విడ్ వైట్,,ను రెండుచుక్క లుపయోగింపవచ్చును. వ్రేళ్ల యొక్క సందులందును, నఱచేతులందును „పెయింటు,,ల నుపయోగింపఁదగదు. ఎక్కుడుగ నీ ద్రవపదార్థ ముపయోగింపఁబడునపుడు స్వభావవిరుద్ధమగు వికార మేర్పడును. స్త్రీపాత్రధారు లొకింతగఁ బెదవులకు వేయఁదగు „రోజ్,,ను గొంచెము గోళ్లచివరలం దుపయోగింపనగు. బాహువులు వ్రేళ్లు పలుచనివిగఁ జూపనెంచునపుడు లేఁతలగు వర్ణములను గల „పెయింటు,,లను వాని వెనుకభాగమునను, ముంజేతుల పైభాగమునను, రాచుకొననగు. „గ్రే,, వర్ణమును వ్రేళ్ల

యొక్క సందులందును నుపయోగింపఁదగును. వ్రేళ్లను బలుచని విగఁ జూపుటకు ‹‹బౌలీన్ రంగుకంటె, ‹‹రెడ్,, వర్ణ ముప యోగమైనదిగ నెంచఁదగు. అటులుకాక ‹‹బ్రౌన్,, రంగు నుపయోగించినయెడల వ్రేళ్ళను మాలిన్యముతోఁ గూడినవిగఁ గన్పడఁజేయును.

పెట్టుడుముక్కులు.

ముక్కులను బెద్దవిగ నమర్చుటకు ‹నోస్‌పట్టీ, (Nose Putty) అను మైన ముపయోగింపఁబడఁదగునది. మొగమునఁ దొలిపూఁతను వేసికొనకపూర్వమె యా మైనమును వలయు నంతగఁ గైకొని, యుండగ నలిపి, నాసికాకారమునఁ దీర్చి, ముక్కున నంటించుకొనఁదగును. అటు లంటించునపుడు ముందుగ ‹స్పిరిట్ గమ్, (Spirit Gum) ను ముక్కుపై బులిమి దానిపై దూది నంటించవలయును. అందుపై నీ ‹నోస్‌పట్టీ, ని దాఁపినచో స్థిరముగ నిలుచుట కవకాశ మొద వును. అటులుకాక యూరక ‹స్పిరిట్ గమ్, తో మాత్రమె యంటించినచో చర్మముపై నంటకుఁబూర్వ మేమాత్రము పెయింటుకాని, ‹క్రీము, కాని యున్నను, లేక, పిమ్మట దాఁప రించినను బట్టీని సడలించి నాట్యసమయముననే యొకప్పుడూడి పడఁజేయవచ్చును.

ముక్కున కన్నివైపులను ‹పట్టీ,నిఁ జక్కఁగ నంటిం చుమూలమున బుజ్జిముక్కు, సొట్టముక్కు, చప్పిడిముక్కు,



హేమ్‌లెటుపాత్రము
శ్రీ రా. బ. పి. సంబంధమొదలియారు, బి. ఎ., బి. యల్.
సుగుణవిలాససభ, మదరాసు



విజయామనోహరులు

1. విజయ——శ్రీ కే. నాగరత్నము అయ్యార్
2. మనోహరుడు——శ్రీ పి. సంబంధమొదలియారుగారు
సుగుణవిలాససభ, మదరాసు



పొడవుముక్కు, పొట్టిముక్కు, వంకరముక్కు, మున్నగు ననేక తెగలకుఁ జెందునట్టి, యేముక్కునైనను గలిగించుకొనవచ్చును. అద్దములో దాని యాకారమును జక్కఁగఁ జూచుకొని యెట్టిలోపమును లేనటులు స్థిరపఱచుకొనిన యనంతరమున, దానికేమాత్రము దగులకుండునటులు, శేషించిన ముఖభాగమునందంతట 'కోల్డుక్రీమ్' (Cold Cream) ను రుద్దుటయుఁ దుడిచికొనుటయుఁ గావింపనగు. ఆపిమ్మట దాను ధరింపఁబోవు పాత్రయొక్క వర్ణమునకుఁ దగియుండునట్టి 'పెయింటు' ను బట్టీ పైననుగూడఁ దొలిపూఁతగఁ బూయఁదగును.

పట్టీముక్కుఁ నూడఁదీయునపుడు దారము నొకదానిని రెండుచేతులను బట్టుకొని పట్టీయొక్క యతుకుడుప్రదేశమునఁ గోయఁదగు. శేషించుదానిని 'కోల్డుక్రీము' తోఁ దుడిచివేయవచ్చును.

'నోస్‌పట్టీ' తోడనే గడ్డములనుగూడఁ బెక్కువిధముల నమర్చుకొనఁదగును గాని నాట్యావసరమున నటుఁడు పాడునపుడో యాడునపుడో యవి కదలి యూడిపోవుట తటస్థపడును. అయినఁ బ్రస్తుతమట్టి పొడుగుగడ్డములు, బుగ్గలు, ముఖములు మున్నగునవన్నియుఁ గాగితములపై పూయఁబడిన వర్ణాకారములుగలవి విస్తరించి దొరకుచుండుటచేత నట్టి యవసరములందీ పట్టీనుపయోగించు నాచారముకన్పడుటలేదు.

## మీసములు, గడ్డములు.

మీసములు, గడ్డములు వలయువిధమున నమర్చుకొనుటకు 'క్రీపీహెయిర్' ముఖ్యముగఁ గాఁదగునది. అది సహజశిరోజములకంటె, రెండు మూఁడు ఛాయలను దక్కువగఁ గలిగియుండఁదగు. యౌవనమున నల్లనివర్ణమును గలదియుఁ గౌమారాంతమున 'గ్రే' వర్ణమును గలదియు, వార్ధక్యమునఁ దెల్లనిరంగుఁగలదియు సర్వసాధారణముగ నెల్లరచే నుపయోగింపఁబడుచుండును.

'క్రీపీహెయిర్' జడయాకారమున నుండునట్టిది. మూఁడు, లేక నాలుగంగుళముల మేరకు దానినిఁ గత్తిరించి తీసికొని, చిక్కువిడఁదీసి, దువ్వెనయొక్క కొనపండ్లతోఁ దెగకుండగను, ముడుతలు లేకుండగను మెల్లగ దువ్వఁదగు. అటులు చేసినపిదప వలయు నాకృతిననుసరించియుఁ, బొడవు మందములనుబట్టియుఁ జేతనుండునపుడె దాని నొకయాకారమునకుఁదెచ్చి, యాపిమ్మట దాని నుంచఁదగిన ప్రదేశము నందు 'స్పిరిట్ గమ్' ను రాచుకొని యంటించుకొనఁదగు. మీసములును నటులే కత్తిరించి పెదవుల పైభాగమున 'స్పిరిట్ గమ్' ను రాచి యంటించుకొని, యాపిమ్మట హెచ్చుతగ్గులు లేకుండునటులు కత్తిరించుకొనఁదగు. రెండుకొనలను సమానముగ నుండునటులు చూచుకొనఁదగును. ముక్కురంధ్రముల మధ్యనుండు దిమ్మను గుఱిగాఁజూచుకొని, మీసముల మధ్యభాగమునుసహితము కత్తిరించుకొనఁదగు.



పొడవుగడ్డము లమర్చుకొనవలసియుండునపుడు 'క్రీపీహెయిర్' నంతటి పొడవుఁగలదానినిఁ దీసికొనవలయును. అటులు గ్రహింపఁబడిన దానినిఁ గొంచెము తడిపి, యొక గుండ్రమైన కొయ్యకుఁ జుట్టఁదగును. ఇటులు చేయుటచేత 'క్రీపీహెయిర్' నందు ముడుతలు లేక యుండును. దానినిఁ దీసికొని కొంచెముకొంచెముగఁ గత్తిరించుకొని యొకచో నుంచుకొనఁదగును. ఆపిమ్మట బుగ్గలపైనుండి క్రిందికి దిగులాగున 'స్పిరిట్ గమ్' తోఁ గ్రమక్రమముగ నంటించుకొనవలయును. అటులు చేయుటలోఁ జర్మమంతయుఁ గ్రమ్మియుండునటులు చూచుకొనుచుండవలయును. ఏభాగమున, నేరూపున, నెంతబలముగ నుండవలయునో, యెంతయల్పముగ నుండవలయునో, యాయాపాత్రల వయోధర్మములను బట్టి యూహించి, యటులె క్రమముఁ దప్పక యాగడ్డము నేర్పఱచుకొనఁదగును.

మొదటనుండిన చిన్నమీసములపైఁ బెద్దమీసముల నేర్పఱచవలసి యుండునపుడును బైయటులె 'స్పిరిటిగమ్'తో నంటించుకొనవచ్చును. ఇఁక నామీసముల కొనలను 'కాస్మాటిక్' లోఁ జేర్చి నిలుపుట, వాల్చుట, చుట్టుట మున్నగు పద్ధతులను జూపవచ్చును. ఇటులే కనుబొమలనేని యలంకరింపనగును. హృదయోపరి కేశములు, గర్ణాంతర కేశములు మున్నగునవి సహితమూ, 'క్రీపీహెయిర్'న సమర్చుకొనఁదగియుండును.

## విగ్గులు.

విగ్గులను ధరించుకొనుటకుఁ బూర్వము సహజశిరోజ

ముల వర్ణమును విగ్గుల వర్ణముతో సమముగ నుండునటు లా
యావర్ణములను, గణతలయందును, మెడయందును రుద్దుకొన
వలయును. 'మేస్కారోసు' దొలిపూఁతగ నుపయోగింపఁ
బడిన పెయింటుతోఁ గలిపి, రుద్దుకొనినచో శిరోజములు విగ్గు
రంగునఁ జక్కఁగఁ గన్పట్టఁగలవు.

విగ్గు నమర్చుకొనునపుడు దాని వెనుకనుండు కొనలను
దన రెండుచేతులను గైకొని తలయొక్క ముందుభాగమునుండి
తొడుగుకొనఁదగును. కనుబొమలతో విగ్గుయొక్క ముంగటి
కొనలతో గుటె నిలుపుకొనుచుఁ గ్రమముగ లలాటోపరిభాగ
మునకు జరుపుకొనఁదగును.

'బ్లండర్ విగ్గు' నొకదానిని ముందుగ ధరింపనగును.
ఇయ్యది ప్రధానముగనుండు విగ్గునకు లోపల నుండఁదగునది.
చిత్రీకరణమున కనేకవిధముల నియ్యది తగియుండఁగలదు.
వలయు వర్ణముల నీ 'బ్లండర్' విగ్గుపై చులకనగ రుద్దనగును.
అయిన నిది శిరమున కెంతపొంకముగ నమర్పఁబడిన నంత
మేలు. అటులు కానిచో ముఖ్యమగు విగ్గుతో దీనిని జోడిం
చుటయు నొక దుష్కరకార్యము కాకపోదు.

చర్మమున కీడఁబడిన తొలిపూఁత 'బ్లండర్ విగ్గు'పై
యొకింత బలమైనదిగఁ గన్పట్టును. దానినపుడు లేఁతలగు
పెయింటులతోడను, జూర్ణములతోడను (Powders) జక్క
పఱచుకొనవలసి యుండును. పెద్దలగునవి, 'బ్లండర్ విగ్గు'నకు
మించియుండునవి, యగు విగ్గుల నొకప్పు డత్యవసరసమయము



లందు నటుఁడు ధరింపవలసివచ్చును. అట్టియెడఁ గణతల
యందు 'స్పిరిట్ గమ్ము', నొకింత రాచుకొనివిగ్గుచివరనంటించు
కొనవలసి యుండును. నుదుటి పైభాగముననుండు విగ్గు
యొక్క లోభాగముననుగూడ నూలుతోడనో లేక 'టేపు'
తోడనో, 'రిబ్బన్'తోడనో బిగించుకొననగును. ప్రయో
గము ముగియులోపల నీ 'బ్లండర్ విగ్గు' ను దలనుండి కద
లింపరాదు. ప్రధానములగువానినేని తలనుండి తీయుటకాని,
తీసి వీవనలుగ నుపయోగించుటకాని, యెంతమాత్రముచేయఁ
దగదు. చెదరిన వెండ్రుకలను గలవియుఁ, గదలిన స్థానము
లను గలవియు నగు విగ్గులను ధరించిన నటుఁడు, చూచువారికి
ననేకవిధముల వికృతాకారకలితుఁడై కన్పట్టును. తల
కట్టుఁ గలవారు శిరోజముల కొకటి రెండు ముడులు వేసికొనిన
పిదప, విగ్గులు ధరింపనగును. ఆపిమ్మట సూదులచేత ముడు
లతో నవి బిగియునటులు చేసికొనవలెను.

## విశేషాంశములు.

పాత్రలయొక్క దేశము, కాలము, జాతి, వయస్సు,
అవస్థ యనువాని ధర్మముల ననుసరించి వేషములు వేసికొనఁ
దగునవి. వీనికిముం దేయే 'పెయింటు' లేయే దీపకాంతులలో
నెట్టిరూపముల నిచ్చునవియు విచారింపవలసియుండును.రంగస్థ
దీపములతోఁ దుల్యములగు దీపములనుగల ప్రదేశములందే
వర్ణలేపనముఁ జేసికొనఁదగును. కానిచో రంగమునకు వచ్చు
నప్పటికి నటుని ముఖవర్ణము విపరీతవికారములను బడయును.

సహజసౌందర్యమెుదవిన నటీనటులు పెయింటుల యన సరము లేకయె యెుకింత చూర్ణోపయోగమున స్ఫురద్రూపులై కన్పట్టఁ గలరు. దుర్బల కపోలములు కలవారు 'రోజ్' చూర్ణమును నేర్పుతో నద్దుకొనుటవలన యా లోపమును బాయఁ గలరు. ప్రస్ఫుటదీపకాంతులను బడయని యడవులు, వెన్నెలరాత్రులు, మున్నగు చీకటినెలవులఁ బ్రవేశించునపుడు మాత్రమా 'రోజ్'ను దుడిచివేసికొనవలసియుండును. కానిచో నది ముఖాంగికవైకల్యమును ఘటించునదగును.

పార్శ్వస్థ దీపములకంటె నూర్ధ్వదీపకాంతు లతిశయించి యుండునపుడు, నటుని ముఖభావములు ఛాయాంతరంగములవలనఁ జెదరఁగొట్టఁబడఁగలవు. అయిన నట్టి దీపములు ముందున కుబుకఁబడిన ముఖాంగమును గలవారికి నుపకరించి వారిని సమరూపమునఁ గన్పఱపఁగలవు. రంగస్థదీపములు రంగమునంతను బ్రకాశింపఁజేయునవిగ నుండఁ దగునవి. క్రీనీడల నిచ్చునవగునేని రంగముపై యుండు నటుని యెుక్క ముఖభావములు క్లిష్టములు కాక మానవు.

"కోల్డుక్రీమ్" పయినిఁ బూయఁబడిన 'రోజ్' వర్ణమువలనఁ జర్మమున కొకప్పుడు కొన్ని విలక్షణములు కలుగవచ్చును. ఇటులె కంటిఱెప్పలపై వేసికొనఁబడిన 'పర్పుల్' వర్ణమును 'కోల్డుక్రీమ్' తోఁ దుడుచునపుడును, సబ్బుతోఁ గడుగునపుడును, గొన్ని ప్రమాదములు కలుగవచ్చును. పెయింటులను గ్రొత్తగ నుపయోగించునపుడు చర్మము



ముడుతలు పడుట, దురదలు పెట్టుట, బిఱుసెక్కుట, కన్పట్ట వచ్చును. కొందఱకు ముక్కులనుండియుఁ గన్నులనుండియు నీరు కారవచ్చును. మఱికొందఱకుఁ దుమ్ములువచ్చుట, పడిశము పట్టుట, స్వరము భేదించుట మున్నగునవి కలుగవచ్చును. ఆకారణమున 'కోల్డుక్రీమ్'ను మొట్టమొదట ముఖమునందు రుద్దికొని, పిమ్మట దట్టమగు మెత్తని తుండుగుడ్డతోఁ జక్కఁగఁ దుడిచికొనవలసి యుండును. వర్ణలేపనావసరమున నాసికారంధ్రములందు దూదియుండలను బెట్టుకొనుటవలనఁ దుమ్ములు రాకుండఁ జేసికొనవచ్చును.

ముఖవర్ణమును సులభముగఁ దొలఁగించుపట్టున 'క్రిస్కో' వాడఁదగునది. 'కోల్డుక్రీమ్', 'కోకో బట్టర్', 'వేసలైన్' అనునవియు నుపయోగింపఁ దగును. ఈ కడపటి రెండును స్త్రీలుపయోగించినచో వెండ్రుకలు మొలచుటకుఁ గారణమగును.

ఎఱుపుతోఁ గూడిన ధూమ్రవర్ణము లేక శ్యామలవర్ణముఁ గల, తనూచ్ఛాయతో నుండువారు తెలుపుతోఁగూడిన పసుపుపచ్చ రంగును దొలిపూఁతగ నుపయోగింపనగును. 'స్టీన్స్' (Stein's) నెం. 2 రు, వర్ణము సహితమీ సందర్భమునఁ బెక్కురచే వాడఁబడుచున్నది. కౌమార వయోధర్మమునుగలుగు స్త్రీపురుష పాత్రములకు నెం. 1 రు తోఁ గలిసిన నెం. 3. రు యుపయోగింపఁదగునది. నెం. 1రు ప్రత్యేకముగ వాడఁదగునది కాదు.

మధ్యమనీలము, బలిష్ఠధూమ్రము, గోధుమము, శ్యామలము, సింధూరము, 'క్రోమ్, 'లేక్, యను నీ వర్ణములను గల దిద్దుపుడక లన్ని పాత్రములకు నుపయోగింపఁదగునవి. 'పర్పుల్, 'మీడియమ్‌గ్రీన్, 'బ్లూ, 'రెడ్‌బ్రౌన్, 'యెల్లోబ్రౌన్, 'గ్రీన్, యను నీవర్ణములను గలవి ముఖ్యముగ స్త్రీపాత్రములకుఁ దగియుండునవి. 'లీచినర్సు, 'కార్మయిన్, నెం 111 రు పెదవుల కుపయోగింపనగును. 'పింక్, వర్ణమును దెల్లని ముఖములకు, ఎఱ్ఱని తలవెంట్రుకలుగల పిల్లలకు నుపయోగింపనగును. 'మీడియమ్‌వెట్‌రోజ్,తో నొకింతగఁ గలుపఁబడిన 'డోరెన్‌రోజ్, నెం 18 రు చూర్ణమును మొగమున కద్దుటవలన యువచ్ఛాయలను గలిగింపవచ్చును. నలుపుతోఁగూడిన యెఱ్ఱని ముఖచర్మముఁగలవారు నెం 4 రు చూర్ణము నుపయోగింపఁదగును. దట్టమగు పసుపుపచ్చవర్ణము, 'పింక్, వర్ణముతోడను, నీరెండును 'జువినైల్, చూర్ణముతోడను గలుపఁబడి యుపయోగింపఁబడిన మంచివన్నెలు రాఁగలవు.





# ఆంధ్రనటప్రకాశిక.

ద్వితీయ ప్రకరణము.



## రూపకము—సంగీతము

### 1. సంగీతము నాదాధీనము.

ఆత్మ, అగ్ని, మనస్సు, వాయువు నను నీ నాల్గును గారణములు కాఁగ, బ్రహ్మగ్రంథి యనఁబడు మానవశరీర మూలాధారమున జనించునట్టిది నాదము. నాదమునుండి యక్షరము, అక్షరములనుండి శబ్దము, శబ్దములచే వాక్యము, వచస్సుల వలన లోకవ్యవహారము జరుగఁదగునవి.

సంగీతము నృత్త వాద్య గీతములతోఁ గూడినది. నృత్తము నాదోద్భవము. వాద్యము తదనుకరణము. గీతమఖిలైకమాతృక. అది నాదాత్మకము. గీతమును బ్రధానము

గాఁగల సంగీతసర్వస్వ మాకారణమున నాదాధీనము కాఁదగునది.

## 2. సంగీతము ద్వివిధము.

గీతము సామవేదమునుండి గ్రహింపఁబడినది. అది సంగీతమునకు స్వరూపము. భరతముని యీ రూపమును శివుని సమ్ముఖమునఁ బ్రసన్నపఱచెను. అటులు భరత తుంబుర నారదాది మహర్షులచేతను, మఱియుఁ బెక్కు భక్తశిఖామణుల చేతను స్వర్గాదిలోకములందు భక్తిపురస్సరమ్ముగ నాలాపింపఁబడుచుండును. అట్టి సంగీతము మార్గ మనఁబడుచున్నది.

దేశ కాల పాత్ర మతాచార సాంప్రదాయములకుఁ జెందిన వివిధ శబ్దోచ్చారణములలో, రుచులలో, రీతులలో దుఃఖార్తి శోక నిర్వేదములను నిర్మూలముఁజేయునదిగను, సకల జనులను రంజించునదిగను గావింపఁబడునట్టి నృత్త వాద్య గీతములతోఁ గూడిన యీ సంగీతము దేశ్య మనఁబడుచున్నది. మార్గము, దేశ్యము నను నీ రెండును సంగీతమార్గము లనఁబడుచున్నవి.

## 3. సంగీత ముపాస్యము.

దమును రూపముగాఁ గలవారు త్రిమూర్తులు. నాదాత్మకమగుసంగీతమాకారణమున లౌకికాది కాలికవ్యవహారములం దుపయోగింపఁబడుటకంటె సకలజనులచే నుపాసింపఁబడఁదగినదనుటయే లెస్స.



వివిధనాదములు మేళగించుటచే జనించు నవ్యక్తమధుర నినాదవికార మైహికాఖిలసుఖసంతోషములను ప్రసాదించును. మఱియు భక్తిపూర్వక గాన మాముష్మిక ఫలముల నొసంగును,

## 4. అనాహత మలౌకికము.

ఆహతా నాహతములన నాదము రెండువిధముల నుండునది. ప్రాణానిలసంజనిత మాహతము. తద్భిన్న మనాహతము.

కేవల గురూపదేశమున భావింపఁబడునదియుఁ, దపోనిష్ఠాగరిష్ఠులగు మునులచే నుపాసింపఁబడునదియు, ముక్తినిచ్చునట్టిదియు, స్వయంభూతమగునదియు ననాహతనాదము.తన్నాదమయసంగీతము ప్రణవైకచిణిచిణీభాజనము. అది రూపకాదులం దుపయోగింపఁబడఁ దగునది కాదు. కావుననే యది ‘యలౌకిక’ మనఁబడినది.

## 5. రూపకసంగితము లౌకికము.

రూపకములు భక్తిప్రధానములు కావు. అవి శృంగారవీరాద్యుదాత్తరసాలంకృతములు. పాత్రలయొక్క వ్యక్తి భావ ప్రాచుర్యములను నయించునట్టి సరసాలాపములుకాని, దేవతాస్తుతి పూర్వకములు కావు తత్సంబంధి గద్య పద్య గీతములు. రూపక గీతికాదులు మానవభావనాబద్ధమగు

భావమును, దదుద్దీపనమగు గమనమును ముఖ్యముగఁ బ్రదర్శించునట్టివి. ఆత్మోద్దీపితమనఃప్రేరితాగ్నివాయుసంపర్కజనితాహతనాదము రూపకాది గీతికామూలము. స్వరసమ్మతమగు నిట్టి గానము లౌకికము.

### 6. రూపకాంగము సంగీతము.

భావమూలము భాష. రూపకము భాషామయము. భాషార్థ భావములను బ్రకటించునదియే సంగీతము.

రూపకార్థ మభినయముచేఁ బ్రతిపాదింపఁ బడునది. అభినయమునకు భావమే ప్రధానము. వాచి కాంగిక సాత్త్వికాహార్యము లనఁబడు చతుర్విధాభినయములలో నటుఁడు నయించునది రూపకభావమే కాని యర్థముకాదు. నయింపఁబడు నీ భావ మంగి యనఁదగునది. కారణ మగునదే అంగము. రూపక విషయమున సంగీతము వాచికాంగిభావమున కంగముగా నుండఁ దగునది.

### 7. నాదము త్రిస్థాయికము.

హృదయము నాదజస్థానము. నాదము తదాదికపాల పర్యంతము సంచరించును. దానియూర్ధ్వగమన 'మారోహణ' మనియు, నధోగమన 'మవరోహణ'మనియుఁ, జెప్పఁబడును. ఆరోహణము నాదమును గ్రమముగ వృద్ధిపఱచునదియు, నవరోహణము కొద్దిపఱచునదియు నగు. ఆరోహణావరోహణముల కాలవాలమగు నీ శరీరభాగము హృదయము,



కంఠము, శిరస్సు నన మూఁడువిధములుగ విభజింపఁబడెను. స్ఫుటాస్ఫుటములగు నాదభేదముల కవి నిలయములు. ఆ కారణమున నవి మంద్ర, మధ్యమ, తారస్థాయు లనఁబడునవి. సంగీతమునకు జీవమనఁదగు నాద మీమూఁడు స్థాయులందును సృష్టి, స్థితి, లయముల నందునట్టిది. కావుననె నాదము త్రిస్థాయిక మనఁబడెను.

### 8. స్థాయులు ధ్వనిగుణీకరణములు.

మంద్ర, మధ్య, తారములు స్థాయులు. ప్రతిస్థాయియందును సప్తస్వరోత్పాదకములగు నేఁడు నాడు లుండును. హృదయనాడీ సప్తకధ్వనికంటెఁ, గంఠనాడీసప్తకధ్వని రెండింతలుగ స్ఫుటమై యుండును. శిరస్సప్తకధ్వని మఱియు రెండింతలు హెచ్చియుండును. నాదము నిటు లుత్తరోత్తరము పోషించు ధర్మమును గలవి స్థాయులు.

### 9. నాదము ద్వావింశతిశ్రుత్యాత్మకము.

శారీర వైణిక సూక్ష్మాతిసూక్ష్మములగు ధ్వన్యుత్పాదక నాడీభేదములు, తద్భవములగు స్వరానేక సంచారములు, గణియింప శక్యములైనవి కావు. షడ్జ పంచమ విభాగజన్యములగు శ్రుతు లిరువదిరెండువిధముల నుండునవి. ఆహతనాద మూలమగు సంగీత మీ యిరువదిరెండు శ్రుతులనుమాత్రమె కలిగియుండునది. తద్భిన్నలక్షణ లక్ష్యములగు విశేష

శ్రుతులు, తన్మయసంగీతము రూపకావసరమున కప్రస్తుతములు.

## 10. స్వరములు శ్రుతిభవములు.

పూర్వోక్త మంద్రాది స్థాయులకుఁ జెందిన నాడీధ్వని భేదములె శ్రవణములచే వినఁబడునవి కనుక 'శ్రుతు'లనఁబడుచున్నవి. ఆ ధ్వనుల కిడఁబడిన సంజ్ఞలే 'స, రి, గ, మ, ప, ద, ని' యను నా సప్తస్వరములు. ధ్వనులే శ్రుతులు. తద్భవములే స్వరములు.

### స్వరవివరణము.

'స' ఇది 'రి' మొదలుకొని 'ని' పర్యంతమగు నాఱు స్వరములకు జన్మస్థాన మగుటచేతను నాసిక, కంఠము, ఉరస్సు తాలువు, జిహ్వా, దంతము నను నీ యాఱుస్థానముల కారణమునఁ బుట్టునదగుటచేతను 'షడ్జమ'నఁబడియెను.

'రి' ఇది గోవులయందు ఋషభమువలె స్వరసమూహమున గాంభీర్యమునుగలది యగుటచేతను వృషభధ్వని ననుకరించుటచేతను, శీఘ్రగతిని హృదయమును బ్రాపించుటచేతను, 'ఋషభ'మనఁబడుచున్నది.

'గ' గాంధర్వసుఖమును బ్రసాదించుటకు ముఖ్యకారణమైనది కనుక నిది 'గాంధార' మనఁబడియెను.

'మ' సప్తస్వరమధ్యంగత ధ్వనిభేదమగుటచే నిది 'మధ్యమ' మనఁబడుచున్నది.



'ప' సప్తస్వరములలోని యైదవస్థానమునకుఁ జెందునదగుటచే నిది 'పంచమ' మనఁబడియెను.

'ధ' స్వరసప్తక షట్స్థాన ధీరభావమును ధరించునదగుటచే 'ధైవత' మనఁబడియెను.

'ని' షడ్జాది ధైవతాంతములగు స్వరానేకములను ముగించు నేడవస్థానమును జెందునదగుటచే నిది 'నిషాద' మనఁబడుచున్నది.

ఇవి క్రమముగ మయూరము, ఋషభము, మేషము, క్రౌంచము, పికము, అశ్వము, గజములకుఁ జెందిన వాగ్వికారములను బోలిన ధ్వనులను నిచ్చునవిగ నెంచఁబడును.

షడ్జస్థానములు నాలుగు, ఋషభమునకు మూఁడు, గాంధారమునకు రెండు, మధ్యమమునకు నాలుగు, పంచమమునకు నాలుగు, ధైవతమునకు మూఁడు, నిషాదమునకు రెండును గలిసి యిరువదిరెండు శుద్ధ వికృతిభేదములను గలిగి శ్రుతులన వ్యవహరింపఁబడుచున్నవి.

## 11. సప్తస్వరములు నియతములు.

తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతి, ఇవి షడ్జ శ్రుతులు. ఇందలి 'ఛందోవతి' నియతశ్రుతి. ఇదియె వ్యవహారసిద్ధమగు శుద్ధషడ్జము.

దయావతి, రజ్జని, రతిక, ఈ మూఁడును ఋషభ శ్రుతులు. ఇందలి 'రతిక' యనఁబడునది నియతఋషభము.

రౌద్రి, క్రోధి, అను నీ రెండును గాంధారశ్రుతులు. ఈ కడపటి 'క్రోధి' యనఁబడునది నియతగాంధారము.

వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని, ఈ నాలుగును మధ్యమసంబంధి ధ్వనులు. ఇందలి 'మార్జని' నియత మధ్యమము.

క్షితి, రక్త, సందీపిని, ఆలాపిని, అను నీ నాలుగును బంచమధ్వనులు. ఇందలి కడపటి 'యాలాపిని' నియత పంచమము.

మదంతి, రోహిణి, రమ్య, అను నీ మూఁడును ధైవత శ్రుతులు. ఇందలి 'రమ్య' నియతధైవతము.

ఉగ్ర, క్షోభిని ఇవి నిషాదశ్రుతులు. 'క్షోభిని' యనఁబడు నీ కడపటిధ్వని నియతనిషాదశ్రుతి.

## 12. స్వరములు ద్వివిధములు.

నియతశ్రుతులతోఁ గూడిన స్వరములు 'శుద్ధము'లనియు వానికిఁ గొంచెము హెచ్చియు, లేక, తగ్గియు నుండునవి 'వికృతము'లనియుఁ జెప్పఁబడును.

కైశికీనిషాదము, కాకలీనిషాదము, చ్యుతషడ్జము, అచ్యుతషడ్జము, సాధారణఋషభము, సాధారణ గాంధారము, అంతరగాంధారము, చ్యుతమధ్యమము, అచ్యుతమధ్యమము, త్రిశ్రుతిపంచమము, కైశికిపంచమము, చతుశ్శ్రుతిధైవతము, ఈ పండ్రెండును వికృతస్వరములు.



### శుద్ధవికృతులు తెలియువిధము.

హార్మోనియమునందుఁ దొలుదొల్త నొక్కఁబడు మెట్టునఁ బలుకునది షడ్జము. దాని ప్రక్కది శుద్ధఋషభము. దాని నంటియుండునది చతుశ్శ్రుతి ఋషభము మఱియు నది శుద్ధగాంధారము. దాని ప్రక్కనుండునది సాధారణగాంధారము. అదియె షట్శ్రుతి ఋషభము. దాని వెనుకనుండునది యంతర గాంధారము. అటుపిమ్మట శుద్ధమధ్యమము. ఆ వెనుకఁ బ్రతి మధ్యమము. దాని తరువాత పంచమము. అంతటఁ గ్రమముగ శుద్ధధైవతము. పిమ్మట చతుశ్శ్రుతిధైవతము. అదియె శుద్ధనిషాదము. అనంతరము షట్శ్రుతి ధైవతము. అదియె కైశికీ నిషాదము. తరువాత కాకలీనిషాదముగ గ్రహింపఁ దగు.

## 13. గమకము స్వరపోషకము.

సంగీతము ధ్వన్యాత్మకము. ధ్వనులే స్వరములు. కేవల స్వరము లక్షరము లట్టివి. శబ్దము కొన్నియక్షరము లను గలది. శబ్దార్థభావము లుచ్చారణమునుబట్టి స్ఫురించు నవి. సంగీతవిషయమున స్వరములు కూర్చుటచేతనే రాగ భావాత్మకములగు సంగతు లేర్పడుచున్నవి. శబ్దములవలె నిట్టి స్వరసముదాయములును బలుకుఁ బెంపును బడయఁదగు నవి. అట్టి వాగ్విన్యాసము స్వరములఁ బరస్పర సంబంధము ననుసరించియు, గమనము ననుసరించియుఁ బాఠకునిచేఁ బ్రదర్శింపఁదగియుండును. రాగాదిభావ పరిజ్ఞానమున స్వరముల

నుచ్చరించునట్టి కొన్నివిధములైన వాగ్వైఖరులె 'గమకము' లనఁబడుచున్నవి. ఇట్టి వైఖరులచేతనే స్వరములు, స్వరాలంకృత రాగాలాపములు మున్నగునవి సర్వము భావ స్వరూపముల నేర్పఱచుచున్నవి. ఆ కారణమున గమకము స్వర పోషక మనఁబడినది.

## 14. గమకము లసంఖ్యాకములు.

గమకము లనఁబడు నీ కంపనములు రాగకళల నుద్దీపించు మూలమున రాగస్ఫూర్తినిఁ గలిగించుటకుమార్గములు కాఁదగునవి. ఇట్టివి చాలవఱకుఁ బ్రతిభా జనితములు. పెక్కులు మిశ్రమములు. కొందఱు చెప్పినటు లవి పది యని లేక పదునైదని నిర్ణయించుటకు వలనుపడదు. గమకముల నవయవములుగఁబడసిన రాగమనఁబడు స్థాయవాగము లోనవి తఱచుగ లక్షింపఁదగునవి. రాగార్ణవ తరంగములగు కళలవలె స్వరపోషకము లనఁబడు నీ గమకములును బాలకుని యనుభవ ప్రపంచమునఁ బుట్టు ననంతదృశ్యములన, గణియింపరాక యుండును.

## 15. తిరిపాదులు ముఖ్యములు.

తిరిపము, కంపితము, స్ఫురితము, లీనము, ఆందోలితము, వలి, త్రిభిన్నము, కురుళము, ఆహతము, ఉల్లసితము, ప్లావితము, గుంఫితము, ముద్రితము, నామితము, మిశ్రిత



మునను నీ పదునైదును దిరిపాదు లనఁబడు ముఖ్య గమకములు.

1. తిరిపము:— రాగము నాలాపించునపుడొక ప్రధాన స్వరమున నిలిచి దానిని డాసిన మఱియొక స్వరకళను లేక ఛాయను గ్రహించునట్టిది.

2. కంపితము:— ఒక స్వరమును బ్రక్కనుండు స్వరచ్ఛాయ రాకుండుభంగి దాని నంటియు నంటనియటులు కదలించునట్టిది.

3. స్ఫురితము:— ఒక స్వరమును జంటగఁ బలికించునపుడు దాని దిగువను లేక మీఁదను బై స్వరద్వయమధ్యమునఁ గొంచెముగఁ బలుకునటులు చేయునది. ఉ॥ 'స స' అను స్వరద్వయమునకు 'సనిస' అనియు లేక 'సరిస' అనియుఁ బలుకఁబడఁదగునది. ఇందలి 'స' దిగువనుండు 'ని' లేక పైననుండు 'రి' అను నీ రెండు స్వరములును దద్గమక స్వరము లనఁదగునవి.

4, లీనము :— ఒక స్వరముయొక్క ప్రక్కనుండు స్వరచ్ఛాయతో లయించునటులు పలుకఁబడునట్టిది.

5. ఆందోలితము :— ఒక స్వరమునే నాలుగైదక్షరముల కాలము నిలిపి యూఁగించుచుఁ బ్రక్కనున్న స్వరచ్ఛాయను స్వల్పముగఁ బలికించునట్టిది.

6. వలి :— ఒక స్వరమును వేఱొక స్వరచ్ఛాయతో లయించుకొఱ కీష్చనట్టిది.

7. త్రిభిన్నము :— ఏక సమయమున మూఁడుతంత్రులను మీటి, మూఁడు స్వరముల నొక్కపర్యాయముపలికించునట్టిది. ఇట్టిది వీణావాదమునఁ దెలియఁదగునది.

8. కురుళము :— ఒక స్వరస్థానమునుండి పలుకుబిగువునఁ బ్రక్కనుండు స్వరచ్ఛాయ ననుసరించునట్టి యొరయిక. ఉ॥ 'నీ ధా పా మా' యని దిగునపుడు 'నీ, సధా, నిపా, ధమా' యని పలికించునట్టిది. ఇదియు వీణావాదమునఁ దెలియఁదగునది.

9. ఆహతము :— (దీనినె రవజాతియందురు.) ఒక స్వరమునుండి వేఱొక స్వరమునకు దిగునపుడును (అవరోహణమున) ఎక్కునపుడును (ఆరోహణమున) మధ్యనుండు స్వరములను విడువకయె కొంతకొంతగఁ బలికించునట్టిది. ఉ॥ 'గ' నుండి 'స' వఱకు దిగునపుడు 'గరి, రిస,' యనియు నారోహణమున 'సరి, రిగ,' యనియుఁ బలుకునట్టిది. ఇదియు జంత్రమునఁ దెలియఁదగునది.

10. ఉల్లసితము :— ఒక స్వరమునుండి వేఱొక స్వరమున కెక్కునపుడు, దిగునపుడు, మధ్యనుండు స్వరముల ననుసరించుచు జాఱునట్టిది. ఉ॥ 'ప, నుండి 'స, వఱకు నెక్కునపుడు 'పద నిస' యనియు దిగునపుడు 'సని దప,' యనియు జాఱునట్టిది,

11. ప్లావితము :— కొన్నిమాత్రల కాల మొక స్వర



మునందే నిలిచి ప్రక్కనుండు స్వరచ్ఛాయను గ్రహించునట్టిది.

12. గుంఫితము :— నాదావరోహణారోహణములందుఁ బుట్టింపఁబడు నొక విధమగు హుంకారగర్జనము. ఇది గుంఫితమనియు, హుంఫితమనియు వ్యవహరింపఁబడును.

13. ముద్రితము:— ముఖద్వారమును విప్పకయే పలికించు నాదమునకుఁ జెందిన యొకానొక చక్కని పోషకవికారమనఁదగునది.

14. నామితము :— రాగభావానుగుణ్యముగ స్వరధ్వనిని సూక్ష్మముగఁ బలికించునప్పటి లలితకంపనము.

15. మిశ్రితము :— ఒకటికంటె నెక్కుడు గమకములు గలిసి పలుకునట్టిది.

16. గ్రామములు శుద్ధవికృతి స్వరోత్పాదకములు.

సంగీతము శుద్ధవికృతిస్వరోభయాత్మకము. స్వరారోహణావరోహణములు మూర్ఛనలు. తన్మయ స్వరసముదాయములను గలవి గ్రామములు.

ధ్రువవీణ, చలవీణ యను నీరెండును బ్రాచీనజంత్రములు. వీని సాహాయ్యముననె లక్షణజ్ఞులు శ్రుతులు, మూర్ఛనలు, గ్రామములు మున్నగువానిని గ్రహించియుండిరి. గ్రామములవలననె రాగాదిప్రధానములగు నీ శుద్ధవికృతిస్వరములు లక్షింపఁబడినవి.

## 17. షడ్జమధ్యమగ్రామములు ముఖ్యములు.

షడ్జాది నిషాదపర్యంతములగు నొకయేఁడు గ్రామము లీపైనఁ జేర్కొనఁబడిన వీణలయొక్క యాధారమునఁ జేయఁబడినవి. అందు గానయోగ్యములగునవిగ షడ్జమధ్యమ నిషాదగ్రామములు చెప్పఁబడినవి. మఱి కొన్నియుఁ గొన్నిట నటులే భావింపఁబడినవి. శుద్ధస్వరసప్తకము షడ్జగ్రామము నను, చతుశ్శ్రుతి ఋషభాంతర గాంధారములు మధ్యమగ్రామమునను, చతుశ్శ్రుతి ధైవత కాకలీనిషాదములు నిషాదగ్రామమునను లక్షింపఁబడినవగుటచే షడ్జ మధ్యమ నిషాదము లనఁబడు నీ మూఁడుగ్రామములును గొన్నిట ముఖ్యములుగఁ బరిగణింపఁబడియుండెను.

ఎట్లున్నను గ్రామములు శుద్ధవికృతి స్వరసంపాదనమునకుఁ గారణములగుట ధ్రువపఱుపఁబడెను. ఆ కారణమునఁ దద్బోధకములు, రూపకాదియోగ్యములు నగు నొక రెండు గ్రామములు మాత్రమె వ్యవహారసిద్ధము లైనవి. అవియె శుద్ధ స్వరోత్పాదక షడ్జగ్రామము, వివిధ వికృతిస్వరబోధక మధ్యమగ్రామము ననఁబడునవి. తదితరములగు గాంధార నిషాదాది గ్రామము లుచ్చరించుటకు సాధ్యపడని తారస్థాయికి మించిన పెక్కు స్వరములతోఁ గూడునవియు, మానవశారీరమునకు దుర్లభము లైనవియు నగుటచే స్వర్గాదిలోక యోగ్యములుగను మార్గసంగీతలక్ష్యములుగను నెంచఁబడినవి. కావుననే షడ్జ మధ్యమము లనఁబడు నీ రెండుగ్రామములు



దేశ్యసంగీతమునకు ముఖ్యములైనవిగ లక్షణజ్ఞులచే నిర్ధరింపఁబడినవి.

## 18. దేశ్యరాగములు నాలుగు విధములు.

రాగాంగరాగములు, ఉపాంగరాగములు, భాషాంగ రాగములు, క్రియాంగరాగములు నన రూపకాదియోగ్య సంగీతమునకుఁ జెందిన రాగము లొక నాల్గువిధముల నుండును.

### రాగాంగరాగములు.

శుద్ధ వికృతి నామకోభయ స్వరసమ్మిళితములు, సప్త స్వర సంపూర్ణములునై రాగానేకములను బుట్టించునట్టివి. ఇవియె మేళకర్తలనఁబడుచున్నవి. అట్టి కర్తరాగములే రాగాంగము లనఁబడునవి.

### ఉపాంగరాగములు.

పైనిఁ దెలుపఁ బడిన రాగాంగరాగములలో జనించునట్టివి జన్యరాగములు. ఈ రాగములే యుపాంగరాగములనఁబడునవి.

### భాషాంగ రాగములు.

ఒకానొక రాగాంగరాగమున జనించి స్వీయములగు ప్రకృతి వికృతి స్వరములతోఁ బాటుగ మఱియొక రాగాంగ రాగమునకుఁ జెందిన యొకటి రెండు వికృతి స్వరములను

గ్రహించి యాలాపింపఁబడునవి భాషాంగరాగము లనఁబడునవి.

### క్రియాంగరాగములు.

రత్యాది స్థాయిభావములనుబోషించునవియు, యుద్ధాది మహాత్కార్యోద్యోగుల కిందిగ్రయోత్సాహజనకము లగునవియుఁ గ్రియాంగరాగము లనఁబడునవి.

### 19. రాగములు త్రివిధములు.

సంపూర్ణములు, షాడవములు, ఔడవములు నన నీ రాగములు మూఁడువిధముల నుండును.

### సంపూర్ణములు.

ఒక స్థాయియందుఁ బండ్రెండు స్వరములుండును. అందు షడ్జము, శుద్ధమధ్యమము, ప్రతిమధ్యమము నను నీ నాల్గు స్వరములు గాక శేషించిన ఋషభ గాంధార ధైవత నిషాదము లవస్థాభేదములు గలవి. ఆ యవస్థలు ఋషభ గాంధారముల కొక యాఱును, ధైవత నిషాదముల కొక యాఱును గలుగునవి. ఈ ఋషభగాంధారావస్థలను నిషాదావస్థలచే గుణించునపుడు ముప్పదియా ఱవస్థాభేదములు కలుగును. అవి శుద్ధమధ్యమముతో ముప్పదియాఱును బ్రతిమధ్యమముతో ముప్పదియాఱును నుండునవి. ఈ మొత్తము డెబ్బదిరెండు భేదములను గలవి మేళకర్త లనఁబడుచున్నవి.





దొంగ (మృచ్ఛకటికము)
శ్రీ డి. వెంకటాచలయ్యగారు, సుకుమారవిలాససభ, మద్రాసు



నారి కృష్ణదాసిము



శ్రీ కమలాబాయి రావుసాహెబు గారు



ఇవి యారోహణావరోహణములందంతట సప్తస్వరములను బూర్ణముగఁ గలిగియుండుటచే సంపూర్ణము లనఁబడుచున్నవి.

### షాడవములు.

ఆరోహణావరోహణములలో నాఱుస్వరములను గలిగి యుండునవి షాడవరాగము లనఁబడును. అవి శుద్ధములు, సంకీర్ణములు, వక్రములు నన మూఁడుభేదములను జెంది యుండును. ఆరోహణావరోహణములం దొకే స్వరమును వర్జించునవి శుద్ధములనియు, వేఱు వేఱు స్వరములను బాయు నవి సంకీర్ణములనియు,ఁ గుటిలగమనమును గలవి వక్రము లనియుఁ జెప్పఁబడును.

### ఔడవములు.

ఆరోహణావరోహణములం దైదుస్వరములను గలుగు నవి ఔడవరాగము లనఁబడును. ఇవియుఁ బూర్వోక్త విధమున శుద్ధ సంకీర్ణ వక్రభేదములచేఁ దెలియఁదగి యుండును.

**20.** భావరాగములు ఘన నయ దేశ్యము లనఁబడునవి.

ఘనరాగములు, నయరాగములు, దేశ్యరాగములు నను నీ మూఁడువిధములయిన రాగములును రసభావోద్దీపకము లగుటచే భావరాగములనఁ దగునవి.

### ఘనములు.

యుద్ధాది సమయములందుఁ గార్యోద్యోగులకు స్వ

యభావముచేత నింద్రియోత్సాహమును గలిగించునవి ఘనరాగము లనఁబడును. అవి నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీరాగము, కేదారము, నారాయణగౌళ, రీతిగౌళ, సారంగనాట, భౌళి, యనఁబడునవి.

### నయములు.

సుకుమార సుందర ముఖావలోకన సంభాషణాదులచేఁ గామినులు కాముకులను మోహపరవశులఁ జేయు విధమున నియ్యవి వినునంతనే శ్రోత్రల కమందానందము నించునవిగ ననుభవజ్ఞులచే భావింపఁబడి నయరాగము లనఁబడినవి. పైనిఁ జెప్పఁబడిన ఘనములు, క్రిందఁజెప్పనున్న దేశ్యములుగాక మిగులునవన్నియు నయరాగము లనఁదగునవి.

### దేశ్యములు.

ఉత్తరాది దేశీయగాయకవతంసులనుండి గ్రహింపఁబడిన యొక కొన్ని రాగకళాంశములతోఁ గూడ వినువారి హృదయములఁ బరవశములుగఁజేయునట్టి ఫరజు,కమాచి, కాఫీ, దర్బారు, జింగళ, మున్నగునవి దేశ్యరాగము లనఁబడును.

## 21. రాగములు రసోత్పాదకములు.

ప్రస్తుత మొకకొందఱు వాదించుచున్నటులు సంగీతము రసభంజకమనుట కెంతమాత్రము వలనుపడదు. పెక్కు సంగీతగ్రంథములందు నవరసోత్పాదక రాగములు పే



ర్కొనఁబడియున్నవి. శృంగారమునకు భూపాళము, హాస్యమునకు వసంతము, కరుణకు ఫలమంజరి, వీరమునకు నాట, భయానకమునకు మాళవి, శోకమునకు శ్రీరాగము, రౌద్రమునకు భైరవి, అద్భుతమునకు బంగాళ, తగిన రాగములుగఁ గొన్నిటఁ జెప్పఁబడినవి. మఱియు శాంతరసమున కన్ని రాగములును బాడఁదగినవిగ నెంచఁబడి యుండెను. కొన్నిట వీరము, శృంగారము, కరుణ, హాస్యము నను నీ రసచతుర్థమునకు సంపూర్ణ రాగములును, వీర రసమునకుఁ గేవల షాడవరాగములును, రోగోప శమనము, గ్రహశాంతి మున్నగుఁ గార్యావసరములకు ఔడవ రాగములును బాడఁ దగునవిగఁ జెప్పఁబడెను.

పదములు, కీర్తనములు, జావళులు, మొదలగునవి రాగపూర్వకములైనవి. రసము నుత్పాదించు శక్తివంతములు కాకపోవునేని, గేయాదు లటులు రాగపురస్సరములు కాకుండెడివి. ఉండినను నన్నియు నన్ని రాగములందుఁగాక యొకే యొక రాగమందైనను నిబద్ధములై యుండెడివి.

భాషణము మనోభావమును బ్రకటించు నట్టిది. ఉదాత్తానుదాత్తస్వరితాదికధ్వనివిన్యాసమె తత్ప్రకటనమునకు ముఖ్యకారణము. ఇట్టిదగు ధ్వనివిన్యాసమేశబ్దమయసంగీతము

రత్యాది భావములు మనోగతములై యుండునప్పటి మనుజుని వాగ్వైఖరులు పరస్పరభిన్నములై యుండుట భావజ్ఞు లెఱుఁగని విషయము కాదు. రాగము లట్టి రసోత్పాదక

స్వరభావ ప్రస్తారజనితము లగుటచేతనే త్యాగరాయాది ప్రసిద్ధ వాగ్గేయకారకుల కృతులందంతటఁ దత్తదుచిత భావార్థద్యోతకములై నెగడుచున్నవి. ఈ కారణములను బట్టి రాగములు రసోత్పాదకములని ధ్రువపడఁగలదు.

## 22. రాగములు దశలక్షణ లక్ష్యములు.

గ్రహము, అంశము, న్యాసము, మంద్రము, తారము, అపన్యాసము, సన్యాసము, విన్యాసము, అల్పత్వము, బహుత్వము నన రాగము లొక పది లక్షణములను గలిగి యుండును.

### గ్రహము.

రాగప్రారంభమునకు స్థానమగు స్వరము 'గ్రహమనఁబడును. సంగతులకుఁ బ్రధానమైనదియు గ్రహస్వరము కాఁదగునది. అన్ని రాగములందును షడ్జస్వరమె గ్రహస్వరముగ లోకవ్యవహారమునందు లక్షింపఁబడుచున్నది. ఈ షడ్జమే సర్వసామాన్యమగు 'గ్రహ' స్వరమని పెక్కు లక్షణజ్ఞుల యభిప్రాయము.

### అంశము.

రాగము పాడునపుడు కొన్ని స్వరస్థానములు సంగతులనఁబడువానినిఁ బ్రస్తరించుటకుఁ గారణము లగుచుండును



రాగాంశమును జాటుచు హృదయరంజకమై యుండు నట్టి స్వరస్థానమే 'అంశ' మనఁబడును.

### న్యాసము.

రాగము ముగించుటకు, లేక, సంగతులు ముగించుటకు స్థానమై యుండునట్టి స్వరము 'న్యాస' మనఁబడును.

### మంద్రము.

మంద్ర మధ్య తారము లనఁబడు స్థాయులు తద్గతస్వర సప్తక ధ్వనిగుణీకరణ కారణములు. మంద్రస్థాయి హృదయస్థ స్వరసప్తక ధ్వన్యల్పత్వమును సూచించునట్టిది. మంద్రగత స్వరములు గుణీకృతములు కావు. అవి ధ్వన్యంతర భాజనములు. రాగప్రస్తారకారకములగు ధ్వనులకు స్థానమగు నిది 'మంద్ర' మనఁబడును.

### తారము.

ఉచ్చ స్వరాత్మకమైనది తారము. మంద్రగత స్వరములు గుణీకృతములై తారమునఁ బలుకఁబడును. తద్గతరాగ స్వరాలాపము 'తార' మనఁబడును.

### అపన్యాసము.

రాగము నాలాపించునపుడు స్వరపారజ్ఞులు కొన్ని నియమములను లేక పద్ధతులను నవలంబింతురు. అట్టివి

రాగాధారస్వరములను దోడుచేసికొని సంచారమునకుమార్గము లగుచుండును. ఆయా మార్గములకు, ముగింపఁబడిన సంచారములకు, స్థానమైయుండు స్వరమే 'యపన్యాస' మనఁబడును.

### సన్యాసము.

రాగమును గొన్నిఖండములుగ నేర్పఱచుకొని యాలాపించుట కొందఱు గాయకులయొక్క లక్షణము. అట్టి ఖండములు పాడి ముగించునట్టిది 'సన్యాస' మనఁబడును.

### విన్యాసము.

పూర్వోక్తరాగఖండములందు రాగాంశమగు కళను క్షణక్షణముఁ జూపించునదియు, శ్రుతి మనోహరమగునదియు నగు నావృత్తస్వరము 'విన్యాస' మనఁబడును.

### అల్పత్వము.

ఆరోహణావరోహణస్వరము లాయా రాగములకు రాగాంగరాగలక్షణము ననుసరించి యేర్పడునవి. వాని ప్రయోగము గాయకుని భావస్వాతంత్ర్యమును బట్టి కాఁదగునది. ఆ విధమున లక్షణస్వరములలోనిదగు నొక స్వర మేదో యొక రూపమున నల్పముగ నుపయోగింపఁబడుచు రాగాంశమును స్ఫురింపఁజేయుచుండును. అదియె సకృత్తుగ నుపయోగింపఁబడునపు 'డనభ్యాస' మనియు, మధ్య నొక స్వరమును విడచి



దాని నంటియుండు నన్యస్వరమును స్ఫురించునపుడు 'లంఘని' మనియుఁ జెప్పఁబడును.

### బహుత్వము.

ఇది పూర్వోక్తధర్మమునకు భిన్నమైనట్టిది. రాగాలాపనమునఁ దఱచుగ నుపయోగింపఁబడుచు 'బహుత్వ' మనఁబడుచున్నది. ఇది బహుళప్రయోగమున 'నభ్యాస'మనియు రాగాద్యంత ప్రసన్నమున 'నలంఘన'మనియుఁ జెప్పఁబడును.

ఈపై లక్షణము లన్నియు సూత్రప్రాయమున దేశ్యరాగములం దంతటలక్ష్యములు కానక్కఱలేదనియు, గ్రహాంశన్యాసము లనఁబడు నొక మూఁడు లక్షణములు మాత్రము విధిగ నుండఁదగుననియుఁ బలువురి యభిప్రాయము.

## 23. రాగములు సమయసిద్ధములు.

రాగములు ముఖ్యముగఁ గొన్ని సమయములందుఁ బ్రయోగయోగ్యతను గలిగియుండును. సమయసమ్మేళనమున రాగము రసోత్పాదనమునకుఁ గారణము కాఁదగునదని లక్షణజ్ఞుల నమ్మకము.

దేశాక్షి, దేవగాంధారి, భౌండి, ధన్యాసి, మారువ, దేవక్రియ, మందాళి, గౌరి, భూపాళము, నను నీరాగములు ప్రాతఃకాలమునందు 3 నుండి 6 ఘంటలవఱకును,

కురంజి, సావహుళి, ఘంటారవము, రామక్రియ, బిలహరి, మలహరి, ముఖారి, యమున, రేగుప్తి, భైరవి, యను నీ రాగము లుదయము 6 నుండి 9 ఘం॥ వఱకును,

మేఘరంజి, సారంగ, భల్లాతి, మధ్యమావతి, దేశి, నీలాంబరి, మంగళదేశిక, అను నీ రాగములు 9 నుండి 12 ఘం॥ వఱకును,

మోహన, కళ్యాణి, ఘూర్జరి, శంకరాభరణము, పూర్వి, వసంత, అను నీ రాగములు 12 నుండి 3 ఘం॥ వఱకును,

నారాయణి, హిందోళి, సౌరాష్ట్ర, తోడి, రామళి, గౌరి, వరాళి, పంతువరాళి, ఉసేని, మాళవి, లలిత, అను నీ రాగములు సాయంతనము 3 నుండి 6 ఘం॥ వఱకును,

మేళావళి, కాంభోజి, సావేరి, బేగడ, పున్నాగ, నాట అను నీ రాగములు సాయంతనము 6 నుండి 9 ఘం॥ వఱకును,

గుండక్రియ, మనోహరి, మంగళకౌశిక, కేదారి, ఆహిరి, అసావరి, బంగాళ, ఫాళి, అను నీ రాగములు మధ్యరాత్రి మందు 9 నుండి 12 ఘం॥ వఱకును,

జోగిని, చిత్రవేళ, కర్నాట, సురటి, మంజరి, అను నీ రాగము లపరరాత్రమునందు 12 నుండి 3 ఘం॥ వఱకును బాడఁదగునవిగ నెంచఁబడెను.



కె. శే. ధర్మవరము కృష్ణమాచార్యులుగారు



శ్రీ. శే. కోలాచలం శ్రీనివాసరావు గారు

## 24. ఆలాపనము ద్వివిధము.

రాగవిస్తరణ మాలాపనము. అది యాక్షిప్తిక,రూపకము నన రెండు విధముల నుండును. స్వర పదార్థ వాచికములను గలిగి గేయాదులమూలమున విస్తరింపఁ బడునట్టిది ‘ఆక్షిప్తిక’ యనఁబడును. ఇది గ్రహస్వరమగు మధ్యషడ్జమును సాధారముగఁ గలది. ఆలాపనము తన్మూలమున నారంభమై, మధ్యస్థాయికిఁ జెందిన ఋషభగాంధార స్వరస్పర్శమున వ్యాప్తమై, తారస్థాయి గతమగు ఋషభగాంధార మధ్యమపంచమ పర్యంతమున కారోహించి, యందుండిమధ్యస్థాయి షడ్జమున కవరోహించి పూర్తి కావింపఁబడుచున్నది. ఇట్టి యుపక్రమోపసంహారభాజనమగు రాగాలాపనము ‘ఆక్షిప్తిక’ యనఁబడును.

గీతాది ప్రబంధమూలమునఁ గాక కేవల ధ్వనివిస్తరణమున రాగము నాలాపించుట ‘రూపక’ మనఁబడును. ప్రస్తుత గాయకులు పల్లవిఁ బాడుటకు ముందుఁ జేయునట్టి రాగాలాపనము రూపక మనఁబడునది. ఇదియు మతంగాది పూర్వాచార్యులనాఁటిది కాక, యిటీవల నుత్తరదక్షిణాది దేశములనుండి సంక్రమించిన యాలాపన పద్ధతిగఁ గన్పట్టుచున్నది. మఱియు రాగమును మధ్యషడ్జములోఁ బ్రారంభించి మంద్రస్థాయినిఁ బ్రస్తారాశ్రయముగఁ జేసికొని మధ్యస్థాయియందును, నటుపిమ్మటఁ దారస్థాయియందును రాగమును విస్తరించి మూర్ఛనాప్రస్తారములచేఁ దదాలాపనమును

మధ్యకాల త్రికాలములుగ గుణీకరించుచు మధ్యషడ్జములో ముగించు నాచారమును బూర్వోక్త దేశస్థులనుండియే యిప్పుడిప్పుడు మన గాయకులు గ్రహించి రంజన మొడఁగూర్చుచున్నారు. ప్రాచీన శాస్త్ర సాంప్రదాయములను బట్టియు నీ పద్ధతి యోగ్యమైనదిగ భావింపఁబడుచున్నది.

తారస్థాయిషడ్జమునుండి రాగమును బ్రారంభించి పంచమమువఱకును విస్తరించి యారంభముననె మూర్ఛనా ప్రస్తారముల నేకరువుఁ బెట్టుచు నొక్కక్షణమున వినువారికి విసుగుఁ గొలుపునట్టి మన గాయకుల ప్రాచీనపద్ధతులు నటు లవలంబింపఁదగునవి కావు.

## 25. తాళము దశప్రాణాత్మకము.

కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము, అను నీ పదియును దాళ ప్రాణములు.

### కాలము.

ఎనిమిది క్షణము లొక లవము. ఎనిమిది లవము లొక కాష్టము. ఎనిమిది కాష్టము లొక ఱెప్పపాటు లేక నిమిషము. ఎనిమిది నిమిషము లొక కళ. రెండు కళ లొక చతుర్భాగము. రెండు చతుర్భాగము లొక యనుద్రుతము. రెండనుద్రుతము లొకద్రుతము. రెండు ద్రుతము లొక చతుర



శ్రలఘువు. రెండు లఘువు లొక గురువు. మూఁడు లఘువు లొకప్లుతము. నాలుగు లఘువు లొక కాకపాదముగఁ దాళావసరమున నెంచఁబడునట్టి కాలము.

### మార్గము.

గుణీకృత కాలాలాపనము 'మార్గ'మనఁబడును. అనఁగ మొదటఁబాడిన కాలమును రెట్టించునట్టిది. దీనిని రెండవ కాల మందురు. ద్విగుణీకృతమగునది మూఁడవ కాలము. వ్యవహారసిద్ధములగు నిట్టి కాలములలోఁ బాడఁబడునది మార్గ మనఁబడును.

### క్రియ.

ధ్రువమనఁబడు శబ్దముతోఁగూడిన 'చిటిక', గుడి చేయియం దెడమచేయితోఁ జేయఁబడు 'శమ్య' మనఁబడు ఘాత, ఎడమచేయియందుఁ గుడిచేతఁ జేయఁబడు 'తాళ' మనఁబడు ఘాత, అభిముఖ హస్తద్వయముచేఁ జేయఁబడు 'సన్నిపాత' మనఁబడు ఘాత సశబ్దక్రియలు.

ఎత్తఁబడిన పతాక హస్తముయొక్క వ్రేళ్లను ముడుచునట్టి పనిఁ గలిగిన యావాపము, ముడిచిన వ్రేళ్లను విప్పునట్టిదగు నిష్క్రామము, దానిని విదలించునట్టి విక్షేపము, ముందఱకుఁ దెచ్చునట్టి ప్రవేశకము నిశ్శబ్దక్రియలు. ఈ రెండు విధములైన సశబ్ద నిశ్శబ్ద తాళవ్యాపారములు 'క్రియ' లనఁబడును.

### అంగము.

తాళాక్షర సంఖ్యను దెలుపునవి 'అంగము' లనఁబడును. అవి ద్రుతము, అనుద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము ననఁబడునవి.

### గ్రహము.

గ్రహమన గ్రహించుటయని యర్థము. తాళాక్షర సంఖ్యలో గీత మెత్తఁబడిన సంఖ్యాక్షరము 'గ్రహ' మనఁబడును. అది యతీతము, అనాగతము, సమము నన మూఁడు విధముల నుండును.

### అతీతము.

గీతము నడిచినపిమ్మట నడుపఁబడు తాళ 'మతీత'మనఁబడును.

### అనాగతము.

గీత మారంభింపఁబడకయే తాళము ప్రారంభమగునపు 'డనాగత' మనఁబడును.

### సమము.

తాళమును గీతమును నొకే పర్యాయము ప్రారంభ



మగునపుడు 'సమ' మనఁబడును. ఈ మూఁడువిధములకుఁ జెందనిది 'విషమగ్రహ' మనఁదగునని కొందఱి మతము.

### జాతి.

ఆచారాది ధర్మములచే మనుజుని జాతి యెటులు నిర్ణయింపఁబడుచున్నదో లఘ్వక్షర గమన వైశాల్యమును బట్టి తాళముయొక్క జాతియు నటులు స్పష్టపఱుపఁ బడుచున్నది. తాళవిషయమున నిట్టి జాతు లైదు విధములుగ నుండును. అవి త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణము లనఁబడునవి.

మూఁడుమాత్రలుగలది త్రిశ్రము. నాలుగక్షరములను గలది చతురశ్రము. అయిదుఁగలది ఖండము. ఏఁడుగలది మిశ్రము. తొమ్మిదిగలది సంకీర్ణమనియుఁ దెలియఁదగు.

### కళ.

కళలు గతు లనఁబడునవి. పైని వివరింపఁబడిన జాతులకుఁ జెందిన లఘ్వక్షర కాలములలో నొక్కొక్క యక్షర కాలము కలిగియుండు నక్షరసంఖ్యలు త్రిశ్రాది గతులనఁబడును. గీతికాగమనము ననుసరించి యిట్టి గతులు తెలియఁదగునవి. ఇవియు జాతులవలెనె క్రమముగ 3, 4. 5, 7, 9 సంఖ్యలను బఱఁగుచు త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతు లనఁబడుచున్నవి.

## లయ.

పూర్వోక్త సశబ్ద నిశ్శబ్ద క్రియలయొక్క యంతరములందుఁ బఱఁగు సమయసామరస్యము 'లయ' యనఁబడును. ఇట్టి లయజ్ఞానము గాయకునకుఁ బూర్వజన్మసుకృతవిశేషమునఁ బుట్టువుతో నలవడఁదగునది.

## యతి.

లయ పరివర్తనమునకుఁ గారణమగు తాళాక్షరస్థానము 'యతి' యనఁబడును. గీతికాది కర్తల కిట్టి యతిజ్ఞానము ముఖ్యముగఁ గాఁదగునది.

## ప్రస్తారము.

స్వరములవలెఁ దాళములును బ్రస్తరింపఁ దగునవి. ధ్రువాది సప్తతాళములు తజ్జాతులు గలిసి, యేర్పడునట్టి ముప్పదియైదు తాళములు కాక, మిగులునవి ప్రస్తారతాళము లనఁబడునవి. అట్టివి నాట్యమునఁ బ్రయోగింపఁబడవు.

## 26. సప్తతాళములు ప్రసిద్ధములు.

ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము, ఝంపతాళము, త్రిపుటతాళము, అటతాళము, ఏకతాళము అను నీ యేడును వ్యవహారసిద్ధము లగునవి.



లఘువు, అనుద్రుతము, ద్రుతము నను నీ మూఁడును సప్తతాళములకు ముఖ్యాంగములు.

## లఘువు.

అఱచేయియందుఁ గుడిచేతఁ గొట్టఁబడిన యొక ఘాతయు, నటుపిమ్మట నాయా జాతులకుఁ జెందు నక్షర సంఖ్యలను దద్ఘాతతోఁ గలిపి లెక్కించునట్టి క్రియయునుగలది 'లఘు' వనఁబడును.

## అనుద్రుతము.

ఎడమచేయియందుఁ గుడిచేయిచేతను, గుడి యఱచేయియం దెడమ యఱచేయిచేతను జేయఁబడు నొక్క ఘాతను మాత్రము గలది యనుద్రుత మనఁబడును.

## ద్రుతము.

ఎడమచేయియందుఁ గుడిచేయిచేతను, గుడి యఱచేయియం దెడమ యఱచేయిచేతను జేయఁబడు నొక ఘాతయు 'నుసి' యనఁబడు నొక విసరుటయుఁ గలది 'ద్రుత' మనఁబడును.

## ధ్రువతాళము.

ఒక లఘువు, ఒక ద్రుతము, రెండు లఘువులు గలది ధ్రువతాళ మనఁబడును. అన్ని తాళములును జాతిభేదము

లను బొందునపుడు తమకుఁ జెందు లఘ్వక్షర భేదములచేతనే యిది యీజాతి తాళమని తెలియఁదగి యుండును. ద్రుతాను ద్రుతముల కిట్టి మార్పు లుండవు. ఈ ధ్రువతాళమునకుఁ జెందిన లఘువు 1 కి మూఁడక్షరము లుండునపుడు తిశ్రజాతి ధ్రువమనియు, నాలుగక్షరము లుండునపుడు చతుశ్రజాతి ధ్రువమనియు, నైదక్షరము లుండునపుడు ఖండజాతి ధ్రువమనియు, నేఁడక్షరము లుండునపుడు మిశ్రజాతిధ్రువమనియుఁ, దొమ్మిదక్షరము లుండునపుడు సంకీర్ణజాతిధ్రువమనియుఁ జెప్పఁబడుచుండును. అయినఁ దాళాంగము, లేక, స్వరూప మనఁదగు లఘ్వాది క్రమము మాత్ర, మేతాళమందును దప్పియుండఁ గాదు. అనఁగ బైనిఁ దెలుపఁబడినటులు మొదట లఘువు, దాని వెనుక ద్రుతము, నాపిమ్మట రెండులఘువులు ననునిట్టి క్రమమున కెంతమాత్రము భంగము కలుగరాదు. అన్ని తాళములందును నాయా తాళక్రమ మిటులె తప్పక యనుసరింపఁబడవలసి యుండును.'

### మఠ్యతాళము.

ఒక లఘువు, పిమ్మట నొక ద్రుతము, నా వెనుక నొక లఘువును గలది. ఇదియు నాయా జాతులందుఁ బైనఁ దెలుపఁబడిన విధమున లఘ్వక్షర భేదములను జెందునది.

### రూపకతాళము.

ఒక ద్రుతము, ఒక లఘువును గలది. పై యటులె



నైదు జాతులందును లఘ్వక్షర భేదములను బొందుచు వర్తింపఁదగునది.

### ఝంపతాళము.

ఒక లఘువు, ఒక యనుద్రుతము, ఒక ద్రుతముఁ గలది. ఇదియు నైదు జాతులందును బై యటులె ప్రవర్తింపఁదగునది.

### త్రిపుటతాళము.

ఒక లఘువు, రెండు ద్రుతములును గలది. ప్రస్తుత వ్యవహారమున నాదితాళ మనఁబడునది యాదితాళము కాదు. అది త్రిపుటతాళ లక్షణానుగుణ్యముగ నొక లఘువు, రెండు ద్రుతములును గలది. అయిన నా లఘువు ఘాతతోఁ గలిసి నాలు గక్షరములను గలిగిన దగుటచే నది చతుశ్రజాతి త్రిపుట యనఁదగునది. విద్యార్థులచే సరళీస్వరములతో నిది మొట్టమొదట సులభముగ నభ్యసింపఁబడున దగుటచే నాది తాళ మనఁబడుచున్నది.

### అటతాళము.

రెండు లఘువులు, రెండు ధ్రుతములు గలది. జాతి భేదములు పూర్వోక్తవిధమున సంక్రమింపఁదగునవి.

ఏకతాళము.

ఒక్క లఘువును మాత్రము గలది. దీని యక్షర సంఖ్యయు జాతిభేదములను బట్టి యుండఁదగునది.

## 27. కుశారీరలక్షణములు.

శ్రుతిలోఁ జేరకుండుట, పరుషముగఁ బలుకుట, చాలు సంత నాదము నీయకుండుట, రక్తి నింపకుండుట, సంగతులను సులభముగ నుచ్చరింపలేకపోవుట, త్రిస్థాయులందు స్వేచ్ఛగ సంచరింపలేకపోవుట, మున్నగునవి కుశారీరలక్షణములు.

## 28. ఆలాపకవిలక్షణములు.

పండ్లు బిగియఁబట్టి పాడుట, బొబ్బరుమని యఱచుట, ఊఱుముచున్నటులు పెద్ద రొదఁజేయుట, స్వరోచ్చారణమందు స్థైర్యమును బాయుట, సంహారోపసంహారము లెఱుఁగక సందేహమునఁ బాడుట, శరీరావయవముల నూరక కదలించుట, తల వెండ్రుకలను విరఁజిమ్ముకొనుట, చూచుట కసహ్యమగునటులు నోరుఁ దెఱచియు, నాలుకను జాచియుఁ గన్నులఁ జేవురింపఁజేసియు, మొగముఁ జిట్లించియు వికృతాకారమునవర్తించుట, కారణము లేకయె కొన్నిచోటులఁ బెద్దగను గొన్నిచోటులఁగొద్దిగను నాదమును గల్పించుట, కాకమునలెఁ గ్రూరధ్వనులను బొనర్చుట, తాళమును బాయుట, ఒంటెవలె నూరక గొంతును సాగించుట, మేకవలె నెమరువేయుట,



కంఠనాళములను బుగ్గలను నుబ్బించుట, గళమును వక్రముగఁ జేసికొనుట, చేతులను ద్రిప్పుట, కన్ను లెగురవేయుట, కన్నులను మూసికొనుట, చెవి మూసికొనుట, గీతికారసానుభవభావమునఁ గాక యేదో యొక సహజవికృతముఖభావమున వర్తించుట, స్వరస్థానములను సంకరములు జేయుట, శబ్దముల నస్పష్టములుగను, నస్ఫుటములుగను బలికించుట, ఊరక వణఁకించుట, త్రిస్థానములను బరిత్యజించుట, రాగాదిలక్షణము లెఱుఁగక తోఁచినటు లాలాపించుట, ఒక రాగమును వేఱొక రాగముతోఁ గలుపుట, ఎల్లయెడ గమకమును బ్రదర్శించుట, ముక్కుతోఁ బాడుట, అసహజ ధ్వనులను బ్రదర్శించుట, మున్నగునవి పెక్కు లాలాపకులయందుఁ గన్పట్టు విలక్షణములు. నటు లిట్టి దోషముల నెంతమాత్రము రానీయరాదు.

## 29. సుశారీరలక్షణములు.

మంద్ర, మధ్య, తారము లనఁబడు మూఁడు స్థాయులందును సంచారసౌలభ్యమును గలిగియుండుట, కష్టము లేకయె సంగతులను బలుకఁగలుగుట, గాంభీర్య మాధుర్య సౌకుమార్యము లొదవుట, శ్రుతియందు లయించుట, ఎటులు పాడినను వినుట కింపుగ నుండుట, ఆద్యంతము రక్తినించుట, మున్నగునవి సుశారీరమునకుఁ గల లక్షణములు.

## 30. స్వరములు సాధ్యములు.

శుద్ధ వికృతి స్వరము లొక్కొక్క స్థాయియందుఁ

బదియాఱు విధముల నుండునవి. వీని స్థానము లభ్యాస వశమునఁగాని శారీరమునకు జతపడునవి కావు. గాత్రమునఁ బాడఁదలఁచువా రందఱు జంత్రసాహాయ్యముననో గురు ముఖముననో యాయా స్వరస్థానములను దెలిసికొని తమ గాత్రములకు వానినిఁ బలుకు పాటవ మొదవెడు విధమున నెల్లవేళల సాధనములు జేయుచుందురు.

వాచికాభినయము ముఖ్యముగ సంగీతప్రధానమైనది. శారీరసారళ్యము, రాగపరిజ్ఞానము, శ్రుతి, లయ, అను నీ నాల్గు విధములైన సంగీత సంపదలు నటులకుఁ గాఁదగునవి. తత్ఫలప్రాప్తికిఁ గొన్ని మార్గములు సహకారులు కాఁగలవు. సరళీస్వరసాధనము లిందుకొఱకుఁ జేయఁబడుచున్నవి. అవి కాక మఱికొన్ని పద్ధతులు తత్సౌలభ్యమును బ్రసాదింపఁదగు నవి కలవు. నాదపూరణము, నాదస్తంభనము, నాదాంత రాలప్తి, స్థాయిత్రయీసంచారము మిక్కిలి యుపయోగ పడునవి.

శారీరసారళ్యమును బడయఁదలఁచు నటుఁ డొక హార్మోనియమును సంపాదింపనగు. అందలి మొదటిమెట్టు నుండి పదియాఱవ మెట్టువఱకు నుండునవి మంద్రస్థాయి స్వర ములుగ గ్రహింపనగు. ఆ స్థాయియందుఁ దన గాత్రమున కందిపుచ్చుకొనునటు లుండునట్టి 1, 2, 3, 4, 5, తెల్ల మెట్టులలో నొకదానినిఁ గాని, వాని నంటియుండు నల్లమెట్టు నొకదానినిఁగాని శ్రుతిగ నిర్ణయించుకొనఁదగు. అటులు



నిర్ణయింపఁబడిన శ్రుతిస్వరము షడ్జ మనఁబడునది. దానిని 'స' అని తెలియఁదగు.

హార్మోనియమునందుఁ బై విధమున నేర్పఱచుకొనఁబడిన యే స్వరమైనను షడ్జస్వరము కాఁదగియుండును. చూ. ద్వి. సూ.12. దానిని లేక యితరస్వరములను,నిండుగఁ బలికించుచుఁ దదనుగుణముగ నూపిరిని నిలుప నేర్చునంతవఱకు శారీర మునఁ బలికించునట్టిది నాదపూరణ మనఁబడు మొదటిసాధన ముగ నెంచనగు.

పై విధమున నభ్యసింపఁబడు షడ్జాదిస్వరనాదపూర ణము క్రమక్రమముగఁ గొంతకాలమున కొకటి మొదలుకొని యైదు నిమిషముల పర్యంతము స్ఫుటముగను, గభీరముగను, మనోహరముగను శారీరమున నిలిపి పలికించుచుండిన యది నాదస్తంభన మనఁబడు రెండవసాధన మగును.

షడ్జాదిస్వరము లిరువదిరెండు శుద్ధ వికృతి భేదము లను గలవి. 'స, రి, గ, మ, ప, ద, ని' యనఁబడునవి యందలి నియత శ్రుతులు. ఛందోవతి యనఁబడు షడ్జమున, తీవ్ర, కుముద్వతి, మంద్ర, యనఁబడున వంతరములు. అటులే దయావతి, రంజని, యనునవి ఋషభమునకును, రౌద్రి, గాంధారమునకును, వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, యనునవి మధ్య మమునకును, క్షితి, రక్త, సందీపిని, యనునవి పంచమము నకును, మదంతీరోహిణులు ధైవతమునకును, ఉగ్ర, నిషా

దమునకును శ్రుత్యంతరములుగ నెంచఁదగునవి. ఇట్టివి గురుముఖముననో, జంత్రసాహాయ్యముననో, ప్రతిభావిశేషముననో గ్రహించి పూర్వోక్తసాధనములచే శారీరమున కలవఱచుకొనునట్టిది 'నాదాంతరాలప్తి,' యనఁబడు మూఁడవ సాధనమగును.

పై యభ్యాసములు జరిగినవెనుకఁ గ్రమముగ నాయా స్వరములను, శ్రుత్యంతరములను మధ్యస్థాయియందును, నటుపిమ్మటఁ దారస్థాయియందును నారోహణావరోహణములలో సంచరింపఁజేయు నేర్పును బడయునట్టిది 'స్థాయిత్రయీసంచార' మనఁబడు నాల్గవసాధన మగును.

### 31. నియతశ్రుతిసాధనములు మూఁడు విధములు.

'స, రి, గ, మ, ప, ద, ని' యను నీ సప్తస్వరములు నియతములు. ఇవి గాత్రమున సరళముగఁ బలుకఁబడి రసోత్పాదకము లగుటకు నటులు మూఁడు పద్ధతులలో నభ్యాసముఁ జేయఁదగియుండును.

పూర్వోక్తవిధమున శ్రుతిస్థానములను శారీరమున నలవఱచుకొనినపిమ్మట షడ్జాదులగు నియతస్వరములలో నొక్కొక్క స్వరమును నెట్టి యన్యస్వరసంపర్కమును బడయక యథావిధిగను, శుద్ధముగను, సరళముగను, దీర్ఘకాలము పలికించుచుఁ గ్రమక్రమముగ సప్తస్వరముల నొక్కొక్క



స్థాయియం దారోహించియు, నవరోహించియు నభ్యసింపఁదగునది.

ప్రతి స్వరమును బ్రక్కనుండు స్వరచ్ఛాయతోఁ బుట్టించుచుఁ గ్రమారోహణావరోహణములఁ బలికించునటు లభ్యసింపఁదగునది. అనఁగ 'స, రి, గ, మ, ప. ద, ని'యను నీ స్వరములను నారోహణమునందు 'సా, గరీ, మగా, పమా, పా, నిదా, సనీ, సా' అనియు, నవరోహణమున 'సా, దనీ, పదా, పా, గమా, రిగా, సరీ, సా' అనియుఁ బలికించుట.

పై రెండువిధములైనవెనుక నారోహణమున 'సా, రిరి, లేక, రీగరీ, గగ, లేక, గామగా, మా, పా, దద, లేక, దానిదా, నిని, లేక, నీసనీ, సా' అనియు నవరోహణమున 'సా, నిని, లేక, నీసనీ, దద' లేక, దానిదా, పా, మా, గగ, లేక, గామ్మగా, రిరి, లేక, రీగరీ, సా' అనియు నభ్యసింపఁదగునది.

### 32. షట్కాలావృత్తములు ముఖ్యములు.

మొదటఁ బాడఁబడిన గీతికకు లేక పద్యమునకు లేక రాగమునకుఁ బట్టెడు దాళసమయమునందా గీతిక లేక పద్యము లేక రాగము రెండు పర్యాయములు పాడఁబడునపు డది రెండవకాలమనియు, నాలుగుపర్యాయములు పాడఁబడునపుడు మూఁడవ కాలమనియు, నెనిమిది పర్యాయములు పాడఁబడునపుడు నాల్గవ కాలమనియుఁ, బదియాఱు పర్యాయ

ములు పాడఁబడునపు డైదవ కాలమనియు, ముప్పదిరెండు పర్యాయములు పాడఁబడు నపుడు షట్కాలమనియుఁ జెప్పఁబడును. ఇందు మొదటి మూఁడు కాలములు మాత్రమె రంజన మొడఁగూర్చున వగుటచే రూపకాదియోగ్యము లనఁబడినవి. శేషించునవి మిక్కిలి వడిఁగలిగినవియుఁ, బదార్థములను బ్రకటింప నేరనివియు, శ్రుతిసారళ్య మొదవనివియు నగునవి. కేవల ప్రజ్ఞాప్రకటనైకభాజనము లగుటచే నట్టివి రసోత్పాదకములు కాకపోయినవి. రూపకాదుల కవి యనుపయోగము లనఁబడినవి.

నియతస్వరములు శారీరమున నన్నికాలములందును బలికింపఁ దగునవి. నటుల కిట్టి సాధనములు శారీరసారళ్యమును గలిగింపఁదగునవి. ధ్వనిసౌలభ్య మొదవినఁగాని పాత్రార్థభావములకుఁ దగియుండునటులు రాగము నాలాపించునట్టి ప్రౌఢిమ మేరికిని యలవడఁజాలదు. ఈ స్వరములు మొదటి కాలమున నొక్కొక్క తాళాక్షరమునం దొక్కొక్క స్వరము చొప్పున దీర్ఘముగ నాలాపింపఁదగును. రెండవకాలమునఁ దాళాక్షర మొకటింటికి రెండు స్వరములును, మూఁడవకాలమున నాలుగు స్వరములును, నాల్గవ కాలమున నెనిమిది స్వరములును, నైదవకాలమునఁ బదియాఱు స్వరములును, నాఱవ కాలమున ముప్పదిరెండు స్వరములును, నారోహణావరోహణములలో నావర్తింపఁదగి యుండును.

రెండు స్వరములను గలవి జంటలు. అవి సస, రిరి,



గగ, మొదలగునవి. అంత కెక్కుడు స్వరములను గల ససస, రిరిరి, సససస, రిరిరిరి, మొదలగునవియు జంటలనియే పిలువఁబడుచున్నవి. ఒక స్వరమునఁ బలికి దాని నంటి యుండు నొక స్వరమునుగాని యంత కెక్కుడు స్వరములను గాని పలుకకయె దాఁటి మఱియొక స్వరమును బలుకునట్టివి దాఁటు లనఁబడును. అవి 'సగ, సమ, రిప' మొదలగునవి. ఇట్టివియుఁ బూర్వోక్తవిధమున నన్నికాలములందును శారీరమునఁ బలుక నలవఱచుకొనఁదగి యుండును. ఒకపరి స్వరోచ్చారణము, వేఱొకపరి తద్గతాకారాది ప్రాణోచ్చారణముఁ జేయఁదగు.

### ౩౩. రాగములు లక్షణబద్ధములు.

జన్య జనకాదిరాగములు, తల్లక్షణములు నింతకు ముందె చెప్పఁబడినవి. తత్సంబంధిజ్ఞానము నటులకు ముఖ్యముగఁ గాఁదగునది. దాని నార్జించుటకుఁ గొన్ని పద్ధతులు తోడ్పడఁగలవు.

జనకరాగములు సంపూర్ణములు. జన్యములు తద్భవములు. ఇవి షాడవౌడవాది భేదములను గలవి. వాని శ్రుతులు సర్వథా జనకరాగముల ననుసరించి యుండునవి. ఎల్ల సంగీత గ్రంథములందును వీని వివరణములు కలవు. నటు లాయా రాగములకుఁ జెందిన లక్షణము లన్నియు

నచ్చోటఁ దెలిసికొని వానిని ముఖస్థములుగఁ గావించుకొనఁ దగును.

పాడఁదలఁచిన రాగములను, వాని లక్షణములను బై విధమునఁ దెలిసిన యనంతర మాయా రాగలక్షణ స్వరములను లేక వాని యకారాది ప్రాణములను ననుదినము ప్రథమాది షట్కాలములందును బలికించుచుండవలెను. ఈ ప్రయత్నమున గేయాదులను బాడునపు డాయా రాగస్వరస్థానములు వాచికసౌలభ్యములై నెగడును.

ప్రసిద్ధ వాగ్గేయకారకకృతములగు కృతులు పదములు ననేకములు కలవు. అవి సకలలక్షణ లక్షితములు. తన్మయరాగములు భావోద్దీపకములు. మఱియు నొక రాగమునఁ బెక్కు కృతులు మున్నగునవి చెప్పఁబడినను రాగానుగమనమున నన్నియు నన్నిరాగములుగ భ్రమింపఁజేయునట్టి ప్రౌఢిమ మందియుండును. నటుఁ డిట్టి వెన్ని పఠించిన నంత యనుభవమును సంపాదింపవచ్చును. గీతికాపాఠ్య బాహుళ్యమే, నటునకు రాగానేకసంచారసాంప్రదాయములను బోధపఱచును. దాననే శ్రుతి, లయ యను నీ రెండు ప్రధాన సంపదలును నటునియందు దృఢపడఁగలవు.

### 34. పద్యములు రాగభాజనములు.

భావమును దెలుపునట్టి మనోజ్ఞరచనను గలది కవిత. ఆ కారణమున గద్యములును గావ్యము లనఁబడుచున్నవి.



అయిన నవి పద్యములవలె గణ యతి ప్రాసములను గలవి కావు. తత్తద్గమనములును నైచ్ఛికము లనఁబడునవి. ఇట్టివి ప్రాసంగిక శ్రుతి మాత్రముననె శ్రవణోత్సవ మొడఁగూర్చునవి.

పద్యములు చాలవఱకు భావాభివర్ణనాతిశయమున నలరారునట్టివి. భాష, గమనము, అలంకారము మున్నగున వన్నియుఁ బ్రకృతిభిన్నమగు కవితాప్రపంచమునకుఁ జెందునవి. భావావనీవిహారవిదగ్ధమగు ధ్వన్యాలాపనములం దిట్టి పద్యములెల్ల మేళగింపఁబడినఁగాని తన్మయ రసభావములు శ్రోతల హృదయముల నాకర్షింపనేరవు.

రాగములు స్వరములచేతను, వర్ణములచేతను, గేవల ధ్వనులచేతను నాలాపింపఁబడునవి. అవియే రాగాంగోపాంగ భాషాంగ క్రియాంగరాగము లనఁబడునవి. అవి జన్యజనకాది భేదములను బట్టియు నారోహణావరోహణములందుఁ గలుగు శ్రుతిభేదములనుబట్టియు రూపమును బడయునవి. ఏతల్లక్షణానుబద్ధములగు రాగములన్నియు నాయా రత్యాది స్థాయిభావములను ముఖ్యముగఁ బురస్కరించుకొని విస్తరింపఁబడఁ దగునవి. కావుననె పద్యభావ ప్రకటనమున కిట్టివి యత్యావశ్యకము లగుచున్నవి. లక్షణ విరుద్ధములగు రాగాలాపనము లిట్టి ప్రయోజనమును గలిగించునవి కావు.

పద్యము భావమును విస్తరించునట్టిది. రాగమును

భావమును బురస్కరించుకొనియే యాలాపింపఁబడునట్టిది. గణబద్ధమగు పద్యగమనము ధ్వన్యాశ్రయము. రాగగమనమును నట్టిదే. అయిన నీ రాగధ్వనులు ప్రాణము లట్టివి. పద్యవర్ణములు ప్రాణులు. అనఁగఁ బ్రాణములను గలవి. ఆ కారణమునఁ గూడఁ బద్యములు రాగభాజనము లనక తప్పదు.

## 35 భావోపక్రమము గ్రహము.

అన్ని రాగములు షడ్జమును గ్రహస్వరముగఁ గలవి. రూపకవిషయమునం దటులు గ్రహింపఁదగదు. ప్రయోగమున సంగీతము ప్రధానమైనది కాదు. ఇప్పట్టునఁ బద్యభావ మంగి యనఁదగునది. భావప్రకటనమునకు సహకారిగ నుండు నీ రాగాలాపన మా కారణమున నంగముగ నుండఁ దగునది. కావుననె కేవల సంగీతశాస్త్ర సాంప్రదాయమునకుఁ జెందు నీ షడ్జస్వర మభినయప్రధానమగు భావము నాలాపించు పట్టున గ్రహముగ గ్రహింపఁ బడకున్నది.

పద్యభావము ననుభవించు నటుఁడు తత్తదుచితస్థాయిలకుఁ జెందిన ధ్వనిసముదాయమును బురస్కరించుకొని పాఠ్యము నుపక్రమించును. కానిచో శృంగారము కరుణ మున్నగు రసములకుఁ దగియుండు సుకుమార సుందరాలాపములను వీరబీభత్సాది రసోచిత ప్రస్ఫుటాలాపముల కొప్పెడు షడ్జస్వరస్థానమునుండి యారంభింపఁ జాలఁడు. అటు లారం



భించినచో రసాభాసము కాకతప్పదు. పద్యభావమునకుఁ దగిన మంద్రాది స్థాయులలోని యే స్వరమైనను నా కారణమున గ్రహస్వర మనఁదగునది. అనఁగఁ బద్యపాఠ్య ముపక్రమింపఁబడిన యే స్వర స్థానమైనను రూపకరాగములకు గ్రహస్వరము కాఁదగియుండునని తెలియనగును.

## 36. భావవిస్తరణాంశ మంశము.

కేవల రాగాలాపనమున సంగతు లనఁబడునవి ప్రస్తరింపఁబడుటకు స్థానమైయుండు జీవస్వరస్థాన మంశముగ భావింపఁబడుచున్నది. రూపకపద్యాత్మకరాగము నాలాపించు నపు డాయంశ మించుక భేదప్రవృత్తినిఁ గలిగియుండును. పద్యభావము నొక కొంత ప్రస్ఫుట పఱచునట్టి విరామస్థాన మంశముగ గ్రహింపఁదగునది.

## 37. భావాంతము న్యాసము.

కేవల రాగాలాపములందు సంగతులు ముగింపఁబడు స్థానము న్యాస మనఁబడుచున్నది. రూపక విషయమునఁ బద్యభావము ముగియుటకుఁ గారణమగు పద్యాంతవర్ణమె న్యాస మనఁదగునది.

## 38. న్యాసము ప్రాణానుగతము.

పద్యాంతవర్ణము న్యాసము. అది భావమునకును, నా భావము ననుసరించిన రాగమునకును విరామస్థానము. అట్టి

స్థానమున నుండునది, 'అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ' మున్నగు సచ్ఛ లనఁబడు ప్రాణములలో నొకదానినిఁ గలది, వర్ణము. రాగాలాపనమంతయు నాయా వర్ణప్రాణములను బాయక యనుసరింపఁదగునది. తద్భిన్నమగు నాలాపసరణి భావమును భంజించునదగుటచే రూపకప్రయోగమున నెంతమాత్రము వినియోగింపఁబడదు.

## 39. శేషము లైచ్ఛికములు.

పూర్వోక్తగ్రహాంశన్యాసములు కాక మంద్రాది బహుత్వపర్యంతములగు రాగలక్షణములు శేషము లనఁబడునవి. అట్టివి నటుల రాగానుభవము ననుసరించియు, సంగీత సాహితీస్వాతంత్ర్యమును బురస్కరించుకొనియుఁ బ్రయోగింపఁబడునవి. కావుననె యవి యైచ్ఛికము లనఁబడినవి.

## 40. పద్యపఠనమునకు భావరాగసమ్మేళనము లక్ష్యము.

పద్యపదార్థములచే స్ఫురింపఁబడునది భావము. మఱియునది స్థాయి యనఁబడునది. స్వరార్థములచే నేర్పడి గాయకుని హృదయార్థమును బ్రసన్నపఱచునట్టిది రాగము. భావార్థ హృదయార్థము లనఁబడు నీ రెండర్థములయొక్క కలయిక సమ్మేళన మనఁబడును. పద్యపఠనావసరమున నిట్టి సమ్మేళనమె ముఖ్యముగ లక్షింపఁదగునది.



రసభావాది యోగ్యములగు రాగములు వేఱొకచోఁ జేర్కొనఁబడియున్నవి. ఏలకో గాయకులాయా లక్షణములను బాటించుచుండుట లేదు. మఱియు వారు కేవల స్వర సంచారాతిశయముననే రాగములను బ్రస్తరించుచు స్థాయి భావమును గలనైనఁ బ్రదర్శింపకున్నారు. ఆ కారణమున వారి యాలాపనములు నటులచే ననుకరింపఁబడుట కనర్హములగుచున్నవి. శ్రోతలను సహింత మాకర్షింపకున్నవి. ఇట్టిచో లక్ష్యరహితములగు నా ప్రాచీనభావరాగములనుగూర్చియెట్టి నిశ్చయమును జేయుటకు శక్యము కాకున్నది.

శుద్ధ వికృతి స్వరము లన్నియు ధ్వనిస్థానములను మాత్రము చూపునవి. వాని నుచ్చరించు విధము గాయకుని స్థాయిభావమును బురస్కరించుకొని యుండునది. పద్యభావానుభవులగు నటు లన్నిరాగములను రసోద్దీపనములుగ జేయఁదగియుందురు. ఇట్టి ప్రౌఢిమ యొక కొన్నిమార్గములలో లభింపఁ దగియుండును.

## 41. గద్యకరణము ప్రథమధర్మము.

పద్యభావమునకుఁ దగిన రాగమును జతపఱచ నెంచు నటుఁడు తొలుదొల్త నా పద్యమును గద్యముగఁ జేసికొనఁ దగు. అనంతరమున నందలి ప్రతిపదార్థములను దెలియఁ దగు. ఆ పిమ్మట నాయా పదార్థప్రయోజనమునుబట్టియుఁ బ్రాధాన్యమును బట్టియు నేర్పడునట్టి స్థాయిభావమును బుర

స్మరించుకొని యొకటి రెండు మూఁడు పర్యాయములు తత్తదుచితోదాత్తానుదాత్త స్వరితాది క్రమములను, స్ఫుటా స్ఫుటోచ్చారణ విధానములను, లాలిత్య గాంభీర్యాదిధర్మములను లక్షించుచు సహజసరణిని దానిని భాషింపఁదగు. ఈ ప్రయత్నమున నాయా పద్యములకుఁ గారణములగు స్థాయి భావములు, పదప్రయోజనములు నటునిహృదయమునందును వాక్కునందును బాదుకొనఁగలవు.

## 42. రాగభావన ద్వితీయధర్మము.

పూర్వోక్త విధమునఁ బద్యభావమునకుఁ గారణముగ స్థిరపడిన స్థాయిభావము రతి, ఉత్సాహము, శోకము, హాసము, ననువానికిఁ జెందునపుడు రాగాంగరాగములలో నొకదానిని నిర్ధరించుకొనఁదగు. ఉత్సాహస్థాయికిఁ జెందునపుడు ఘనరాగములలో నొకదానిని లేక షాడవరాగములలో నొకదానినిఁ జేకొననగు. రతి, శోకము, హాసము లనువానికి ఘనేతరములగు నయరాగములు, దేశ్యరాగములు చేకొనఁదగునవి. శేషించునట్టి స్థాయులకుఁ జెందునపుడు ఔడవరాగములలో నొకటి నిర్ధరించుకొనఁ దగియుండును.

## 43. స్వరవర్ణసమ్మేళనము తృతీయధర్మము.

రాగము జన్యజనకాది భేదములలో దేనికి చెందునదియు, నారోహణావరోహణములం దేయే స్వరములను గలిగి



శ్రీ నిడసనమెట్టు కొండలరావుగారి భావచిత్రసముదాయము



మంగిపూడి రామలింగశాస్త్రిగారి భావచిత్రములు

యుండునదియు నేయే స్వరములను వర్జించి యుండునదియు లక్షింపఁదగు. ఏతత్స్వరసంచారమునను, ధ్వన్యనుభవమునను రాగము నాలాపించు విధమును స్థిరపఱచుకొనఁదగు. పద్యభావకారణముగఁ జేసికొనఁబడిన హృదయస్థాయి ననుసరించు నా యాలాపన మప్పటికి హృదయరంజకధ్వన్యుత్పాదనమునకు సమర్థమగును.

పద్యపదములు భావమునుబట్టి బహుళపద్ధతులలోఁ భాషింపఁబడఁ దగునవి. పదగత వర్ణములు స్వరమూలములు. తత్స్వరములు రాగముల నాశ్రయించునవి. ఆయా రాగస్వరములు పద్యవర్ణములతోడఁ గ్రమముగ మేళగింపఁబడఁదగునవి. ఇట్టిది పద్యపఠనమునకుఁ గాఁదగిన ముఖ్యధర్మము.

## 44. భావేతరసంచారము త్యాజ్యము.

పద్యములయొక్కయు రాగములయొక్కయు సమ్మేళనమునఁ గలుగు నాదలాలిత్యముచే శ్రోతలకు స్ఫురించునట్టి నటహృదయము స్థాయిభావ మనఁదగునది. అది యా నటుఁడు ధరించు పాత్రయొక్క యవస్థను బ్రతిబింబించునట్టిది. ప్రశాంతోద్ధతాది వివిధభేదములతోఁ గూడిన యాయా పాత్రలయొక్క తత్త్వములకును భాషణములకును సంబంధింపకుండు నెట్టి ధ్వన్యాలాపనము లేక రాగాలాపనము పద్యపఠనమున నుండఁదగునది కాదు.

### 45. పద్యమయస్వరూపము రాగము.

విద్యమాన రంగములందు నటులు తఱచుగఁ బద్య పఠనమునఁ బదార్థభిన్నాలాపనమును గావించుచుందురు. ఆ రూపమునఁ గాక రాగస్వరూపము బయల్పడ నేరదను కొనెడు వారి భావము హర్షింపఁదగునది కాదు. రాగభావాభిజ్ఞుఁడగు నటుఁడు పద్యోపక్రమసంహారములయందె యాయా రాగోత్పత్తిస్థితిలయములను బ్రదర్శింపఁగలఁడు.

### 46. కృతిక్రమాలాపనము గర్హ్యము.

స్వరసాధన మెఱుఁగక యక్కడక్కడ నొక కొన్ని సంగతులను సంపాదించుకొని యా మూలముననె ప్రసిద్ధ గాయకుల ననుకరింపఁదలఁచు నటుఁడు రంగమునఁబడు కష్టము సహింపరానిదై యుండును. మఱియు నతఁడు సహజాభినయలాలిత్యమును సహితము కోల్పోయి పరిహాసపాత్రుఁడగును. ప్రయత్నపూర్వకముగ నాలాపింపఁబడు నెట్టి రాగమును లేక పాఠ్యమును వినుటవలన నానందము కలుగదు.

### 47. రాగతాళప్రధానములు గీతములు.

గీతములు పద్యములవలె రాగవిజ్ఞానమాత్రమునఁ బఠియింపఁదగునవి కావు. అవి సర్వథా భావోచిత రాగతాళములచే నలరారునట్టివి. పాడునపు డాయా రాగతాళములం



దేది లోపించినను గీతికామార్దవము చెడి రసాభాసము కాక మానదు.

### 48. పాఠాంతరములు భావభంజకములు.

కృతులు ప్రసిద్ధ వాగ్గేయకారకులయొక్క భావితార్థములను బురస్కరించుకొని రచింపఁ బడునవి. తత్త్వములు, కీర్తనములు మున్నగునవియు నటులే జ్ఞానులయొక్కయు, భక్తులయొక్కయు సాత్త్వికరూపములను బ్రకటించునవి. పదములు, జావళులు, మొదలగున వింకెన్నియొ యిటులు వెలువడినవి కలవు. అవి యన్నియు నాయా గీతికాది లక్షణములకు, రసభావములకు మాత్రమె లక్ష్యములుగ నుండఁదగునవి. వాని ననుకరించునట్టివి భావభంజకములు.

### 49. గీతములు కర్తృకృతములు.

రూపకగీతములు పద్యములటులె తత్కృతి కర్తచేతనే చెప్పఁబడఁదగునవి. అన్యరచనలు భావాదియోగ్యములు కానేరవు. కృత్యాదిపాఠాంతరములును గర్హింపఁదగునవి. విజాతీయగీతికాపాఠాంతరములు సహితము విధమెఱుఁగక ప్రయోగింపఁబడవు.

### 50. గీతికాతాళ మదృశ్యము.

గీతమును బాడునపుడు కొందఱు గూఢముగను, మఱి కొందఱు బహిరంగముగను గరచరణములచేఁ దాళమును

వేసికొనుచుందురు. రసాభినయ నిమగ్నుఁడగు నటుఁ డటులాచరింపఁదగదు. అయ్యది నటుని తాళవిజ్ఞానాభావమును సూచించుటయె కాక దిదృక్షుల కసహ్యముగను గన్పట్టును. ఆ కారణమునఁ దాళము నటుని హృదయముననె లక్షించుకొనఁదగునది.

## 51. వాద్యము లుపాంగములు.

పద్యములు రాగములచేతను, గేయములు రాగ తాళములచేతను మేళగింపఁబడునవి. స్వరసమ్మేళనమునఁ గలుగు రాగములు, శబ్దమయములగు తాళములు, ముఖ్యముగ నొక్క శ్రుతియందు లయింపఁదగునవి. శ్రుతియె సంగీతమునకు జీవము. శ్రుతిలేని యాలాపన మేదియు వినఁదగునది కాదు. శ్రుతివాద్యము రూపకప్రయోగమునకు ముఖ్యోపాంగముగ నుండఁదగునది.

గీతికాలాపనమునఁ బ్రధానముగను బద్యపఠనావసరమున నప్రధానముగను సహకారిగానమును బ్రవర్తించునట్టి వాద్యవిశేషము ద్వితీయోపాంగముగ నుండఁదగునది. సంగీత ప్రధానాంగమగు గీతము ననుగమించు నీ యుపాంగికవాద్యసాహాయ్యమునఁ బాఠకునకు విశ్రాంతి కలుగును. అట్టిది భావికల్పనమును స్ఫురింపఁజేయును.

గేయాది నిబద్ధములగు తాళములు నటునిచేఁ బ్రసన్నపఱచఁబడునవి కావు. భాగవతప్రసిద్ధములగు కాంస్య



తాళవికారములచేఁ బ్రవర్తింపఁబడునవియుఁ గావు. రూపకగీతములు మిక్కిలి లలితములైనవి. మఱియు నవి రసము నుద్భవింపఁజేయునవి. ప్రస్ఫుటధ్వన్యాటోపభాజనములగు వాద్యవికారములు రసభావభంజకము లగుటచేఁ ద్యజింపఁబడి ప్రయోగావసరమున మృదులనాదోత్పాదకములగు మఱికొన్ని వాద్యవికారములు ప్రస్తుతమున నుపయోగింపఁబడుచున్నవి. అట్టివి ఘంటావాద్యము లనఁబడుచున్నవి.

గీతికాగమనము శబ్దమయ తాళప్రస్తార భాజనమగు వాద్యరూపమున ననుగమింపఁబడఁ దగునది. గీతోపాంగమగు వాద్యముయొక్క సౌలభ్యమునఁ గాక గీతికాంతర శబ్దాలంకారములు శ్రవణోత్సవమును నింపవు. ఇట్టి వాద్యధర్మమును నెఱపునవి మృదంగము, తబలా, కంజీర, ఘటము, మున్నగునవి. వీనిలో మృదంగము, లేక, తబలా యను నీ రెండును బ్రధానముగను శేషించునవి యప్రధానముగను నుండఁదగునవి.

ప్రస్తుత రంగములందు గాంధర్వపేటిక (హార్మోనియము) శబ్ద వాద్యవికారము (తబలా) యను నీ రెండు వాద్యములు మాత్రమె యుపయోగింపఁబడుచున్నవి. గాంధర్వపేటికయందు శ్రుతియనునది లేకయె, వాద్యకులు రెండుచేతులను వాయించుచున్నారు. ఇంక నా శబ్దవాద్యవికారమును శబ్దలక్షణ తాళలక్షణము లెఱుఁగని కించిజ్ఞులు పలువు రుపయోగించుచున్నారు. నటుని గానము శ్రుతి

లోపమునను సహకారివాద్యసమ్మేళనాభావమునను శ్రోత
లను దనియింపకుండుటయె కాక రసభావములను భంజించు
నదియు నగుచుండెను.

గాంధర్వపేటిక (హార్మోనియము) లక్షణానుబద్ధము
లగు ధ్వన్యానేకములను, గాత్రానుగుణ్యములగు లాలిత్యాది
భావానేకములను బలుకునట్టి సమగ్రసాధనములను గలది
కాదు. ఇయ్యది శ్రుతివాద్యమునకుఁగాని తుదకు గీతాను
కరణమునకుఁగాని తగియుండుననుటకు వలనుపడదు. పూ
ర్వోక్తములగు నుపాంగవాద్యవిశేషములలో నిది యొకటిగ
మాత్ర ముండఁదగునది. అందును నాయా యవసరము
లందు మితముగ నుపయోగింపఁ బడఁదగునది.

మృదంగము శబ్దవాద్యవికారములలో నెల్ల మిక్కిలి
ప్రాచీనమైనది. అందన్ని విధములైన శబ్దాలంకారములు
పలికింపఁబడఁదగి యుండును. తబలావాద్యము పార్శీ
పాటల సంకరపద్ధతులకుఁ దగియుండు వాద్యసౌలభ్యము
కొఱకుఁ బ్రస్తుతకాలమున రంగములందంతట నుపయో
గింపఁబడుచున్నది. ఏది యెటులున్నను శబ్దభావపారజ్ఞుఁ
డగువాఁ డుపయోగించునేని యిదియు నన్నివిధములఁ దగి
యుండునని చెప్పవచ్చు. కుడి యెడమల కలయికచేఁ బలి
కింపఁబడు నొకకొన్ని శబ్దస్వభావములు మార్దంగిక స్వభావ
ములతోడను మార్దంగిక స్వభావము లీ తబలా స్వభావము
లతోడను వస్తుధర్మము ననుసరించి భేదింపక మానవు. ఈ



రెండు వాద్యములును నాయాసమయములనుబట్టి యుపయో
గింపఁబడఁదగి యుండును. అటులుకాక యిందేయొకటి
వాడఁబడినను వాద్యలోపము కలుగకుండును.

### ఘటము.

ఇది మృదంగమునకుఁ బిదప నుపయోగ పడఁదగునది.
మార్దంగిక వాద్యలక్షణములచేతనే యీ ఘటవాద్య ధర్మ
ములును లక్షింపఁబడునవి. అయినఁ గొన్ని విధములగు
శబ్ద ప్రస్తారము లీ ఘటమునుండి మిక్కిలి లలితములుగను,
సుకుమారములుగను జనింపఁగలవు. అయ్యవి శ్రోతల కవ్య
క్తానందమును ఘటించుటయె కాక వారి చిత్తముల నతిసుల
భముగ భావపరవశములుగఁగూడఁ జేయఁగలవు. ఈ కారణ
ములచే నియ్యదియుఁ బ్రయోగావసరమున నాయా సమయ
ములకుఁ దగునటు లుపయోగింపఁబడఁదగునది.

### కంజీరా.

ఇయ్యదియు నొక విధమగు శబ్దవాద్య ధర్మమును
బొనర్చునట్టిది. మృదంగము, ఘటము, ననఁబడు నారెండు
వాద్యములకంటె నీ వాద్యమున ముఖ్యముగ శబ్దావృత్తములు
వాని ప్రస్తార చమత్కృతులు ప్రదర్శింపఁబడఁదగునవి. వాద్య
ములు ప్రధానములై యుండు సమయములందియ్యది ముఖ్య
ముగ నుపయోగింపఁబడఁదగునది.

## తంబుర.

ఇయ్యది శాస్త్రీయ శ్రుతిసమ్మేళన మొసఁగునట్టి ప్రాచీనజంత్రము. దీని ధ్వని సజీవమైనది. రూపక ప్రయోగమునం దిది శ్రుతికొఱకుఁ దప్పక యుపయోగింపఁ దగునది. అయిన నీ తంబుర రంగస్థుఁడగు నటుని సమీపమున నుండని కారణమున నొక్కదానినుండి వెడలునట్టి శ్రుతిధ్వని నటునకు దుర్గ్రాహ్యముగ నుండును. ఆ కారణమున శ్రుతికొఱకు రెండు తంబురలు నాట్యావసరమున నుపయోగింపఁబడఁదగి యుండును.

## గాంధర్వపేటిక. (హార్మోనియము)

ఇయ్యది వీరరసాత్మకములగు గేయములను, ననుదాత్త హాస్యరసోద్దీపనములగు గీతికావికారములను, వెక్కు నటులచే నిర్వర్తింపఁబడు నర్తన గీతములను, యాలపాటలను ననుగమింపఁదగునది. అన్యసమయములయం దిది మఱికొన్ని వాద్యములలో నప్రధానమైనదిగ వినియోగింపఁబడఁదగి యుండును.

## వాయులీనము. (ఫిడేలు)

ఇయ్యది శృంగార కరుణ రసములకుఁ జెందునదియు, గమకాది సకలలక్షణములను గలదియు, మొదటికాలమున





నేషనల్ థియేటర్, బందరు



మందముగను లలితముగను బాడఁదగునవియు, నుదాత్తనాయికానాయకులచే నాలాపింపఁబడునవియు నగు గీతికాది పాఠ్యములను ననుగమింపఁ దగియుండును. గాంధర్వవేటికతోఁ బాటుగ నీ వాయులీనమును రూపకప్రయోగమునందు ముఖ్యముగ నుపయోగింపఁబడఁదగియుండును. మఱియుఁ దంబురవలె నిదియు నొకటికంటె నెక్కుడుగను నుపయోగింపఁదగునది. ఉదాత్త స్త్రీ వేషధారులు పాడునపుడు వాయులీనమునకు బదులుగ ,,చితారు" ,,వీణ" యను నీ వాద్యము లుపయోగింపఁ బడిన నింకను లెస్స.

## మృదంగము.

ఇయ్యది ప్రస్తుతమున రంగములం దుపయోగింపఁ బడుట లేదు. పూర్వోక్త సమయములందు మృదంగము మఱియు ,,కంజీర" ఘటము, మున్నగునవియు ముఖ్యముగ నుపయోగింపఁ బడిననే యాయా భావములు పరిస్ఫుటములు కాఁగలవు.

## ఘంటావాద్యము

ఇయ్యది కాంస్యలోహమునఁ జేయఁబడు నొక లలిత వాద్యవిశేషము. దీనిచేఁ దాళమునే కాక తాళబోధకము గు నొకపాటి వాద్యమై దర్థ్యమును సహితము ప్రదర్శింప

వచ్చును. దీనినుండి వెడలు మనోజ్ఞనాదము మిక్కిలి కొనియాడఁదగి యుండును.

### ఉపాంగవాద్యములు ప్రధానములును నగు.

పూర్వోక్తములగు వాద్యములు నటాలాపనముల ననుగమించునపుడు „ఉపాంగములు" గను నటనిర్గమనానంతరమునఁ బ్రధానములుగను నుపయోగింపఁ బడఁదగియుండును.





# ఆంధ్ర నట ప్రకాశిక.

## తృతీయ ప్రకరణము.



## రూపకము—నాయకులు.

స్వీయ :—

సకలగుణసంపన్నయుఁ బతిబద్ధానురాగయు నగు స్త్రీ స్వీయ యనఁబడును. అది ముగ్ధ, మధ్య, ప్రగల్భ, అను మూఁడు విధములు గలది.

ముగ్ధ :—

నూత్నయౌవనయు, లజ్జావతియు, మృదుల కోపయుఁ గ్రీడామనోహరయు, నగునట్టిది ముగ్ధ యనఁబడును.

మధ్య :—

మదలజ్జాసమానయు, ఉద్యన్నవయౌవనయు, సురతయోగ్యయు, నగు నది మధ్య యనఁబడును.

ప్రగల్భ :—

మానవృత్తిచేత 'మధ్య' నాయిక ధీర, అధీర, ధీరా ధీర, అన మూఁడువిధముల నుండును.

మధ్యాధీర :—

అపరాధినాయకునితో సాభిప్రాయములగు వక్రాలాపము లాడునది మధ్యాధీర యనఁబడును.

మధ్యాఅధీర :—

అపరాధినాయకుని పరుషాలాపములచే ఖేదపఱచునది మధ్యాఅధీర యనఁబడును.

మధ్యాధీరాధీర :—

వక్రోక్తులచేతను, బరుషభాషణములవలనను సబాష్పయై నాయకునిఁగూర్చి పలుకునది మధ్యాధీరాధీర యనఁబడును.

ప్రగల్భ :—

సంపూర్ణయౌవనోన్మత్తయు, మన్మథవ్యాపారపారంగతయు, రత్యాసక్తయు, నాయకాదరసులభయు, నల్పసంతోషయు నగునది ప్రగల్భ యనఁబడును. "మధ్య" వలె నిదియు మానవ్యాపారముచే ధీరాదిభేదములలో మూఁడు విధముల నొప్పుచుండును.

ప్రగల్భాధీర :—

క్రీడావసరములందుఁ బ్రేమ ముండియు నపరాధి



నాయకుని నుపేక్షించుచుఁ గాపట్యమును బచరించునట్టిది ప్రగల్భాధీర యనఁబడును.

ప్రగల్భాఅధీర :—

రోషావేశమున నాయకుని బెదరించియుఁ గొట్టియుఁ, గలంచునది ప్రగల్భాఅధీర యనఁబడును.

ప్రగల్భా ధీరాధీర :—

క్రీడయం దుపేక్ష, బెదరించుట, తిట్టుట, కొట్టుట, మున్నగు వ్యాపారములు గలది ప్రగల్భాధీరాధీర యనఁబడును. ధీరాదిభేదములు గల మధ్యాప్రగల్భలు జ్యేష్ఠ కనిష్ఠ, అన రెండువిధముల నుందురు.

జ్యేష్ఠ :—

నాయకునిఁ బ్రేమమున కధికముగఁ బాత్రమై యుండునది జ్యేష్ఠ యనఁబడును.

కనిష్ఠ :—

కొంచెము కొరవడిన ప్రేమమును బడయునది కనిష్ఠ యనఁబడును.

పరకీయ :—

పరునియందలి యనురాగవ్యాపారములను మఱుఁగుపఱచు మనస్సును గలది పరకీయ యనఁబడును. అది కన్య యనియుఁ బరోఢయనియు రెండు విధముల నుండును.

పరకీయాకన్య :—

మధ్యస్థయౌవనము, సిగ్గు, చాతుర్యము కలిగి తలిదండ్రుల పోషణమున వృద్ధినందుచు వనవిహారాదిక క్రీడలయం దాసక్తియుఁ బ్రియునియందు ముగ్ధభావములును గలది పరకీయాకన్య యనఁబడును.

పరకీయాపరోఢ :—

భర్తయందుఁ బ్రేమమును గృహధర్మనిర్వహణౌత్సుక్యమును గలిగియుఁ బరపురుషాభిలాషమున మెలఁగునది పరకీయాపరోఢ యనఁబడును.

సామాన్య :—

విద్యాప్రాగల్భ్యము, గాంధర్వముఁ గలదయ్యుఁ గపటానురాగములను బచరించుచు నెల్లర వశపఱచుకొని ధనము కొఱకు జీవించునది సామాన్య యనఁబడును.

మధ్య మొదలుకొని సామాన్యవఱకును గలుగు నీ పదియాఱుగురు నాయికలు శృంగారావస్థాభేదములచే నొక్కొక్కరు నెనిమిదెనిమిది విధములుగ నుందురు.

స్వాధీనపతిక :—

అనవరతము ప్రియానురాగమును గలిగి సంతోషించుచుండునది. దీని వ్యాపారములు స్మరపూజ, వనవిహారము, జలక్రీడ, పుష్పాపచయము మున్నగునవి.



వాసకసజ్జిక :—

ప్రియాగమనావసరమునందుఁ దా నలంకరించుకొనియుఁ గేళీగృహ మలంకరించియుఁ గనిపెట్టుకొనియుండునది. దీని వ్యాపారములు ప్రియుని రాకనుగూర్చి యోజించుట, సఖులతోడి వినోదము సలుపుట, దూతికను సాభిప్రాయమునఁ జూచుట, నాయకుఁడు వచ్చుమార్గమును జూచుట మున్నగునవి.

విరహోత్కంఠిత :—

పెద్దకాలము రాకను జాగుసేయు ప్రియుని విలంబము నోర్వక విషాదమొందునది. దీని వ్యాపారములు సంతాపపడుట, చిన్నబోవుట, ప్రియాద్వేషము, కన్నీరు విడుచుట, సఖులతోఁ జెప్పికొనుట మొదలైనవి.

విప్రలబ్ధ :—

చెప్పినట్లు సంకేతస్థానమునకు నాయకుఁడు రాని కారణమున మన్మథపీడితురాలై యుండునది. దీని వ్యాపారములు నిర్వేదము, చింత, ఖేదము, దైన్యము, కన్నీరువిడుచుట, నిట్టూర్పులు నిగుడ్చుట, మూర్ఛఁజెందుట మున్నగునవి.

ఖండిత :—

సంకేతస్థానమునకుఁ జెప్పిన సమయమునకు రాక, యన్యభోగచిహ్నములతోఁ బ్రాతఃకాలమునఁ దన్నుఁజేరు నాయకుఁడు కలది. దీని వ్యాపారములు నిట్టూర్పు లిడుట,

పలుకకుండుట, కన్నీరు విడుచుట, ఖేదపడుట, భ్రమించుట, మూలుగుట మొదలగునవి.

కలహాంతరిత :—

చరణపతితుఁడగు నాయకుని సఖులయెదుట మొదటఁ దృణీకరించి పిదప పశ్చాత్తప్త యగునది. దీని వ్యాపారములు నిట్టూర్పులిడుట, భ్రమించుట, మనస్తాపపడుట, ప్రలాపించుట, స్తంభాదిభయభావములను బ్రదర్శించుట మొదలగునవి.

ప్రోషిత భర్తృక :—

దేశాంతరగతుఁడై యుండిన నాయకునిఁగూర్చి ఖేదపడునది. దీని వ్యాపారములు నిదురలేకయుండుట, చిక్కుట, శకునములు చూచుట, మలినాంబరయగుట, నిలిచినచోట నిలువకుండుట, ఎప్పుడును బండియుండుట, కలతనందుట మున్నగునవి.

అభిసారిక :—

కామపీడితయై నాయకుఁడుండు స్థలమునకుఁ బోవునట్టిది. దీని వ్యాపారములు చింత, సంతాపము మొదలగునవి.

ఈ పైనిఁ జెప్పఁబడిన 128 భేదములు గల నాయికలు ఉత్తమ, మధ్యమ, అధమ, లనఁబరఁగుదురు.

ఉత్తమ :—

అపరాధినాయకుఁడు తనకెంత యప్రియము మాచరించుచున్నను నాతని సహించి ప్రియ మాచరించునట్టిది ఉత్తమనాయిక యనఁబడును.



మధ్యమ :—

నాయకుఁడు తనయెడల వర్తించు విధమునసె తానును నాయకునియెడ వర్తించునట్టిది మధ్యమనాయిక యనఁబడును.

అధమ :—

నాయకుని నకారణముగఁ గోపించుట, ప్రార్థించినను గోపమును బాయకుండుట, ఈర్ష్య, కోపము, వ్యసనము మున్నగునవి కలిగియుండుట, ఎట్టి నికృష్టుఁడైనను నాయకునిఁ బ్రేమించుట మొదలగు గుణములు గలది యధమనాయిక యనఁబడును.

ఈ నాయికలకు సహకారిణులు దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని మొదలగువారు.

## ఉద్దీపన విభావములు.

నాయికానాయకుల నాశ్రయించినగుణములు, చేష్టలు, అలంకృతులు, చంద్రికాది తటస్థములును ఉద్దీపనవిభావములనఁబడును. అందు

## ఆలంబన గుణములు.

యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము,

ఆభిరూప్యము, మార్దవము, సౌకుమార్యము అను నీయేడును ఉద్దీపనగుణములు.

యౌవనము :—

నారీయౌవనములు మూఁడు విధముల నుండును. వాని చేష్టలు పరస్పరభిన్నములు.

ప్రథమ యౌవన.

ఈషచ్చపలావలోకనములు, సస్మేరముఖాంబుజము, అసమగ్రారుణాధరము, రమ్యాంగికవిలాసము, ఉద్యత్కుచాంకురవైదగ్ధ్యము, అస్ఫుటాంగిక సగర్వరజోగంధము గలది ప్రథమయౌవన యనఁబడును. దీని వ్యాపారములు మృదులస్పర్శమపేక్షించుట, క్రీడాదార్ఢ్యమును బడయకుండుట, సఖీవినోదమభిలషించుట, తనకుఁదా నలంకరించుకొనుట, సపత్నులయందుఁ గోపహర్షము లెఱుంగకుండుట, ప్రియుని యెడ లజ్జాలేశమున జరించుట, ఏకాంతభోగమునందు భయ మందుట మున్నగునవి.

ద్వితీయయౌవన.

పీవరస్తనౌచిత్యము, తనుర్మధ్యము, అరుణారుణపాణి పాదములు, కరికరోరూవైభవము, స్ఫుటాంగికసంధిబంధము, విపులనితంబసౌష్ఠవము, మనోజ్ఞనాభిగాంభీర్యము, జఘన భారసౌలభ్యము, అంగప్రత్యంగసౌందర్యముఁగలది ద్వితీయ



యౌవన యనఁబడును. దీని వ్యాపారములు భావజ్ఞసఖుల యందుఁ బ్రీతి, రిక్తానునయాలాపముల నతృప్తి, సపత్నులయం దసూయ, ఏకాంతక్రీడాస్థిరగర్వభావాదులు మున్నగునవి.

తృతీయ యౌవన.

అస్నిగ్ధముఖాంగికలావణ్యము, అధరారుణబాహుళ్యము, స్రస్తదేహపటుత్వము, కఠినస్పర్శముఁ గలది తృతీయ యౌవన యనఁబడును. దీని వ్యాపారములు ఏకాంతక్రీడాది విశేషచాతుర్యము, గాఢకాముకలోలత్వము, వశీకరణవైదగ్ధ్యము, నాయకాసూయారాహిత్యము, సపత్నీసౌమనస్యము మున్నగునవి. ఈ మూఁడవ యౌవననాయికకుఁ గావ్య యోగ్యత లేదు. ప్రథమ ద్వితీయ యౌవననాయికలు మాత్రమె శృంగారరసావిర్భావమునకుఁ దగియుందురు.

రూపము :—

అర్హాభూషణాదులచే నలంకరింపఁబడకయె యలంకరింపఁబడినట్లుగ నంగప్రత్యంగములు దేనిచేత శోభించుచుండునో యది రూప మనఁబడును.

లావణ్యము :—

మౌక్తికచ్ఛాయాతరళతారుణ్యమువలె నంగప్రత్యంగములయందే కాంతి చక్షుఃప్రీతిఁ గలిగించుచున్నదో యది లావణ్య మనఁబడును.

సౌందర్యము :—

అంగప్రత్యంగోపాంగములయొక్క యథోచితసంధి బంధనసన్నివేశము సౌందర్య మనఁబడును.

ఆభిరూప్యము :—

సమీపవస్తువుల కాత్మీయ గుణాధిక్యతవలనఁ దనదు సారూప్యమును గలిగించునది యాభిరూప్య మనఁబడును.

మార్దవము :—

స్పృశింపఁబడియుఁ బడనియటులుండు నాంగికమృదుల భావము మార్దవ మనఁబడును.

సౌకుమార్యము :—

ఇది ఉత్తమ మధ్యమ అధమము లన మూఁడు విధముల నుండును.

ఉత్తమసౌకుమార్యము.

పుష్పస్పర్శము సహితము సహింపనట్టి మృదులభావ ముత్తమ సౌకుమార్యము.

మధ్యమసౌకుమార్యము.

కరస్పర్శమును సహింపఁజాలని తనూమృదుత్వము మధ్యమసౌకుమార్యము.



అధమసౌకుమార్యము.

ఎండ మొదలగువానిని భరింపలేని శరీరసారళ్య మధమ సౌకుమార్య మనఁబడును.

చేష్టలు.

యౌవనప్రాదుర్భావమున నాయికానాయకులందు లక్షింపఁబడు కడఁగంటి చూపులు, మొలకనవ్వులు మున్నగునవి.

అలంకృతులు.

ఇవి వస్త్రములు, భూషణములు, పుష్పములు, మైపూఁతలు నన నాలుగువిధముల నుండును. అవి కాలము, రసము, పాత్రమునను వానికి సంబంధించి యుండఁదగునవి.

గ్రీష్మర్తువు.

1. వస్త్రములు :— వెలిపట్టు కోకలు, పలుచని వలువలు మొ॥

2. భూషణములు :— మణిమయ సువర్ణమేఖలలు, ముక్తాహారములు మొ॥

3. పుష్పములు :— అరవిందములు, పాటలములు మొ॥

4. మైపూఁతలు :— కర్పూరచందనపంక చర్చలు, లాక్షారసరాగరంజనములు (పాదములకు) మొ॥

### వర్షర్తువు.

1. వస్త్రములు :— సన్ననివియుఁ దెల్లనివియు నగు పట్టు వలువలు ప్రధానములు.

2. భూషణములు :— ముక్తాహారములు, కాంచీమణి కుండలములు ముఖ్యములు.

3. పుష్పములు :— జాజులు, పొగడలు, (ఇవి గలిగిన హారములు శిరములందును) మొగలి, కడిమి, పొగడ పువ్వుల పేరులు (చెవులందును) కలువపువ్వులు (కరములందును) నలంకరింపఁదగు.

4. మైపూఁతలు :— కాలాగురు చూర్ణమును గలుగు చందనచర్చలు ముఖ్యములు.

### శరదృతువు.

1. వస్త్రములు :— తెల్లని చీరెలు మున్నగునవి.

2. భూషణములు :— రత్నహారములు, కాంచన కుట్మలములు, నూపురములు మొ॥

3. పుష్పములు :— తెల్లపూవులు, ఎఱ్ఱకలువలు, తెల్లగలువలు, నల్లగలువలు (చెవులందు ధరింతురు) జాజులు, నల్లవావిలిపువ్వులు, మంకెనపువ్వులు, ఏడాకులనఁటి పువ్వులు ముఖ్యములు.

4. మైపూఁతలు :— చందనచర్చలు.



### హేమంతఋతువు.

1. వస్త్రములు :— కొంచెము ముదుక వలువలు మొ॥

2. భూషణములు :— మణిమయేతరములగు కేవల హారములు మొ॥

3. పుష్పములు :— లోధ్రములు, నీలోత్పలములు ముఖ్యములు.

4. మైపూఁతలు :— కుంకుమముపూఁతలు,(వక్షమున) కాలీయకచర్చలు. (మ్రానిపసుపు పూఁతలు ముఖమునకు)

### శిశిరఋతువు.

1. వస్త్రములు :— రంగుచీరెలు, పట్టుచీరెలు మున్నగు ముదుకవలువలు.

2. భూషణములు :— లోహాదికములు కానివి మాత్రమె యోగ్యములు.

3. పుష్పములు :— కలువపువ్వులు మొ॥

4. మైపూఁతలు :— కుంకుమముపూఁతలు, (వక్షమున) కస్తూరీ తిలకములు (ముఖమున)

### వసంతర్తువు.

1. వస్త్రములు :— లత్తుకరంగుఁ గలిగిన సన్నని

వస్త్రములు, కుసుంభరాగరంజితాంబరములు మొ॥

**2.** భూషణములు :— రత్నమేఖలలు, మణిమయ హారములు, కంకణములు, దండకడియములు మొ॥

**3.** పుష్పములు :— తామరలు, మల్లెలు, ఎఱ్ఱ గోరింటలు, కొండగోఁగులు, మామిడిచిగుళ్లు. (చెవులయందు ధరింతురు.)

**4.** మైపూఁతలు :— కస్తూరి కలిసిన చందనము.

## అనుభావములు.

రత్యాది స్థాయిభావములు, చింతాది సంచారిభావములు, ఏకటాక్ష భుజాక్షేపాదికక్రియలచే జ్ఞాపింపఁబడుచున్నవో యవి యనుభావము లనఁబడును. ఇవి చిత్తజానుభావములు, గాత్రజానుభావములు, వాగనుభావములు, బుద్ధ్యారంభానుభావములు అని నాలుగు విధములుగా నుండును.

## చిత్తజానుభావములు.

భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, ప్రాగల్భ్యము, మాధుర్యము, ధైర్యము, ఔదార్యము, ఈ పదియుఁ జిత్తజానుభావము లనఁబడును.

భావము :—

గ్రీవారేచకసంయుక్తమై భ్రూనేత్రాది ముఖాంగ



ములయందు వికాసమును గలుగఁజేయునట్టి చిత్తజవికారము భావ మనఁబడును.

హావము :—

భావము నొకింతగఁ బ్రకటించు నేత్రాదిక విక్రియ హావ మనఁబడును.

హేల :—

హావభావములు లలితాభినయరూపమున విన్యసింపఁబడి హేల యనఁబడును.

శోభ :—

రూపముచేతను, భూషణములచేతను నలంకరింపఁబడిన తనూవైభవము శోభ యనఁబడును.

కాంతి :—.

శోభ మన్మథవ్యాపారాతిశయప్రయోజనోద్యోగసమర్థమై కాంతి యనఁబడును.

దీప్తి :—

కాంతి యనునది వయోభోగదేశకాలగుణాదులచేత నుద్దీపింపఁబడియు విస్తరింపఁబడియు దీప్తి యనఁబడును.

ప్రాగల్భ్యము :—

భావాభినయావసరమందలి నిశ్శంకవృత్తి లేక ప్రతిభాప్రదుర్భావము ప్రాగల్భ్య మనఁబడును.

మాధుర్యము :—

అవస్థానుకరణప్రసిద్ధములగు నభినయవ్యాపారములందలి సారళ్యము మాధుర్య మనఁబడును.

ధైర్యము :—

ఎట్టి సమయములందును విడువని చిత్తవృత్తిని లేక స్థాయినిఁ గలది ధైర్య మనఁబడును.

ఔదార్యము :—

పరుషము, క్లిష్టము, కఠినము గాకయుండు సహజవినయభావము ఔదార్య మనఁబడును.

గాత్రజానుభావములు.

లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రిమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, విహృతము అను నీ పదియును గాత్రిజానుభావము లనఁబడును.

లీల :—

మధురాలాపములతోఁ గూడిన గుణములచేతను సడకలచేతను నాయకు ననుసరించుట లీల యనఁబడును.

విలాసము :—

(చూ 49 వ. సూ.)

విచ్ఛిత్తి :—

అల్పభూషణములను గలిగియుండియుఁ బూర్ణమైన



శోభను జెందియుండునది విచ్ఛిత్తి యనఁబడును.

విభ్రిమము :—

ప్రియాగమావసరమునందు భూషణాదికములను దాఱుమాఱుగా ధరింపఁజేయునట్టి మన్మథావేగము విభ్రమ మనఁబడును.

కిలికించితము :—

(చూ 49 వ. సూ.)

మోట్టాయితము :—

(చూ 49 వ. సూ.)

కుట్టమితము :—

(చూ 49 వ. సూ.)

బిబ్బోకము :—

గర్వభావమునఁ బ్రియవస్తువునందుఁ జూపఁబడు ననాదరము బిబ్బోక మనఁబడును.

లలితము :—

భ్రూనేత్ర హస్త పాదాద్యవయవముల సుకుమారాభినయవిధానము లలిత మనఁబడును.

విహృతము :—

ఈర్ష్య, అసూయ, కోపము, సిగ్గు మున్నగువానిలోని దేనినిఁగాని కలిగి, చెప్పఁదగినదానినైనను జెప్పక లజ్జాపుర

స్మృతములగు క్రియలచేఁ దెలుపఁబడునట్టిది విహృత మనఁబడును.

### వాగారంభానుభావములు.

పండ్రెండు విధములైనవి వాగనుభావములు. (చూ 55 వ. సూ.)

### బుద్ధ్యారంభానుభావములు.

ఇవి ప్రబంధాది శ్రవ్యకావ్య ప్రసిద్ధములగు రీతి, వృత్తి, పాకము, స్ఫురణము, ప్రాధాన్యము, అర్థము, యమకము మున్నగు ననేక విషయములకుఁ జెందినవై యుండును అట్టివి నాట్యేతరము లగుటచే విడువఁబడిన ట్లెఱుంగునది.

### 2. కావ్యప్రసిద్ధులగు నాయకులు నాలుగువిధముల నుందురు.

ధీరోదాత్తుఁడు, ధీరశాంతుఁడు, ధీరలలితుఁడు, ధీరోద్ధతుఁడు అను నీ నాయకులు నలుగురు రూపకాదికావ్యములందుఁ బ్రాధాన్యమును గలిగియుందురు.

ధీరోదాత్తుఁడు :—

సర్వశుభలక్షణాలక్షితుఁడు, విద్యాధికుఁడు, వినయాతిగూఢదర్పుఁడు, శాంతుఁడు, ఉదారుఁడు, ధీరుఁడు,



గంభీరుఁడు ననఁ బెక్కువిధముల నొప్పెడు క్షత్రకులసంజాతుఁడు ధీరోదాత్తుఁ డనఁబడును.

ధీరశాంతుఁడు :—

నయ దయా సత్య శౌచాదిక గుణధర్మములను గలిగి యొప్పెడు నమాత్య విప్ర వణిజాదులు ధీరశాంతు లనఁబడుదురు. (వీరు సర్వథా ప్రకరణములయం దభివర్ణింపఁ బడుదురు.)

ధీరలలితుఁడు :—

రాజ్యభార మన్యగతము గావించి లలితకళాదిక విలాసలాలసుండై భోగించు సుకుమారహృదయుఁడు ధీరలలితుఁ డనఁబడును.

ధీరోద్ధతుఁడు :—

ఆత్మస్తుతి, పరనింద, మాయ, దురహంకారము, గర్వము, కోపము, మాత్సర్యము, మున్నగువాని నధికముగాఁ గలిగి రూపకాదులందుఁ బ్రతినాయకుఁడుగా నభివర్ణింపఁబడు వాఁడు ధీరోద్ధతుఁ డనఁబడును.

### 3. శృంగారనాయికాప్రసిద్ధులగు నాయకులు మూఁడు విధముల నుందురు.

స్వీయ, పరకీయ, సామాన్య లనఁబడు నీ ముగ్గురు

నాయికలకును గ్రమముగ, పతి, ఉపపతి, వైశికుఁడు నను ముప్వురు నాయకులు పేర్కొనఁబడుచుందురు.

పతి :—

యథావిధిని స్వీయను బాణిగ్రహించినవాఁడగుటచే నీతఁడు సర్వవిధముల ‹పతి' యనఁ బ్రసిద్ధుఁడగును.

ఉపపతి :—

వివిధోపాయములచే నన్యవనితామనోధనమును హరించి క్రీడించువాఁ డగుటచే నీతఁడు "ఉపపతి" యనఁ బడును.

వైశికుఁడు :—

వివిధవేశ్యోపభోగసంపత్సమగ్రుఁడు, స్వైరవిహారవిలోలుఁడు, ధనధాన్యాదికసంపన్నుఁడు నగు నీతఁడు వైశికుఁ డనఁబడును.

4. శృంగారనాయకుఁడు మరల నాలుగువిధముల నుండును.

పైనిఁ జెప్పఁబడిన ముగ్గురు నాయకులందును నొక్కొక్కఁడు శృంగారసంబంధమునఁ జతుర్విధావస్థలను గలిగి యనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు నన నాలుగు విధముల నుండును.

అనుకూలుఁడు :—

ఇతరాపేక్షలులేక స్వస్త్రీయందే యనుకూలించి యుండువాఁడు లేక సుఖించువాఁడు ‹అనుకూలు' డనఁబడును.



దక్షిణుఁడు :—

తన్నాశ్రయించిన స్త్రీ లందఱందును సమాన ప్రేమమును జూపుచు రంజన మొదఁగూర్చువాఁడు ‹దక్షిణుఁ' డనఁబడును.

ధృష్టుఁడు :—

అన్యభోగచిహ్నావలోకనమున నీర్ష్యను జెంది తనను వారించు నాయికను ననునయప్రణామాదులచే ననుసరించువాఁడు "ధృష్టుఁడు" అనఁబడును.

శఠుఁడు :—

తనయం దధికానురాగము గలిగి మెలఁగెడు నాయికయందుసహితము కపటమున వర్తించుచు నహితముఁ జేయఁ జూచువాఁడు లేక, చేయువాఁడు "శఠుఁడు" అనఁబడును.

5. నాయకసహాయుఁడు నాలుగువిధముల నుండును.

శృంగారనాయకసహాయులగు పీఠమర్దుఁడు, విటుఁడు, విదూషకుఁడు, చేటకుఁడు నన నాలుగువిధముల నుందురు. వీరల గుణధర్మములు (చూ 84. 85. 86. 87. సూ.)

6. నాయకుఁడష్టగుణప్రధానుఁడు.

శోభ, విలాసము, మాధుర్యము, గాంభీర్యము, స్థైర్యము, తేజస్సు, లాలిత్యము, ఔదార్యము నను నీ యెనిమిది సాత్త్వికభావములను గలిగి రూపకనాయకుఁడొప్పెడు.

శోభ:—

నీచునియందు దయ, అధికునియందు స్పర్ధ, శౌర్యము, సామర్థ్యము మున్నగు భావములను గలది 'శోభ' యనఁబడును.

విలాసము :—

సస్మితోదారగమనాలోకనాలాపనములఁ జూడ నింపగు సుకుమారభావము "విలాసము" అనఁబడును.

మాధుర్యము :—

ఎట్టి సమయములందును వికార మెఱుఁగని మృదుల తనూభావము 'మాధుర్యము' అనఁబడును.

గాంభీర్యము :—

సుఖదుఃఖములను సమానముగ ననుభవించుచు వెలితిపడకుండునట్టి మనోభావము "గాంభీర్యము" అనఁబడును.

స్థైర్యము :—

విఘ్నపరంపరకు జంకక తలఁచినదాని నిర్వహింపఁ జూచు స్థిరభావము 'స్థైర్యము' అనఁబడును.

తేజస్సు :—

ఎట్టి కష్టములకుఁ జిక్కినను, ఎట్టిప్రాణాంతక సమయ



(మదరాసీ)
శ్రీ రా. సా. డి. వెంకటరమణయ్యగారు, బి. ఏ.
సుగుణవిలాససభ, మదరాసు



(లంబాడీ) శ్రీ రా. సా. డి. వేంకటరమణయ్యగారు, బి. ఏ.
సుగుణవిలాససభ, మదరాసు



మేతెంచినను నవమానమును సహింపనేరని మనోభావము 'తేజస్సు' అనఁబడును.

లాలిత్యము :—

వాచికాంగికసాత్త్వికములందలి సహజలలితభావము 'లాలిత్యము' అనఁబడును.

ఔదార్యము :—

అర్థించువానికి లేదనక తనదు సర్వస్వమును సమర్పించు నట్టి చిత్తవృత్తి 'ఔదార్యము' అనఁబడును.

### 7. నాయకుఁడు కావ్యార్థప్రధానుఁడు.

దృశ్యములు శ్రవ్యములు నన గావ్యములు రెండు విధములు. నాటకము దృశ్యకావ్యము. తత్ఫలము లేక వ్యవసాయము కావ్యార్థము. కావ్యగుణాలంకారసూత్రమునకుఁ బతకమువంటివాఁడగుటచే నాయకుఁడు ప్రధానుఁడుగాఁ బరిగణింపఁబడును. కావ్యఫలార్థమును గ్రహించుటయందు ముఖ్యుఁడగుటచేఁగూడ నతఁడు నాయకుఁ డనిపించుకొనును.

### 8. నాయకోద్యోగధర్మము వృత్తి.

ఫలప్రాప్తికి నాయకుఁ డవలంబించు వ్యాపారవిధము లేక దాని తత్త్వము వృత్తి యనఁబడును.

### 9. దేశకాలపాత్రాదియోగ్యము ప్రవృత్తి.

దేశము, కాలము, పాత్రము, వేషము, భాష, క్రియ మున్నగువానికిఁ దగిన నాయకుని వ్యాపారధర్మము ప్రవృత్తి యనఁబడును.

### 10. వృత్తులు నాలుగువిధములు.

కైశికి, సాత్వతి, ఆరభటి, భారతి, అను నీ నాలుగును నాయకుని వ్యాపారధర్మములను దెలుపు సంజ్ఞార్థకములు.

కైశికి :—

నృత్తగీతవాద్యాదిక విలాసములు, సస్మిత గభీర సరళావలోకనములు గలిగి, మృదులము, మంజులము, సుకుమారము నగు శృంగారవ్యాపారమును గలది కైశికి యనఁబడును.

### 11. కైశికి నాలుగు విధములు.

నర్మము, నర్మస్ఫింజము, నర్మస్ఫోటము, నర్మగర్భము నన నాలుగు విధములు గలది కైశికి.

నర్మము :—

స్నేహము లేక ప్రేమము నతిశయింపఁజేయు సుకు



మార పరిహాసవచనము నర్మ మనఁబడును. అది హాస్యనర్మము, భయనర్మము, శృంగారనర్మము నన మూఁడు విధములు. హాస్యార్థకము హాస్యనర్మము, భయార్థకమైనది భయనర్మము, రత్యతిశయార్థకము శృంగారనర్మము ననఁబడును. ఇందు శృంగారనర్మమనునది మరల ననురాగనర్మము, సంభోగనర్మము, మాననర్మము నన మూఁడువిధముల నుండును. భయనర్మముకూడ శుద్ధభయనర్మము, శృంగారభయనర్మము నన ద్వివిధముగా నుండును. ఈ యన్నివిధములైన నర్మము మరల వచోనర్మము, వేషనర్మము, చేష్టానర్మము లనఁబడు భేదములను గలిగి తుదకుఁ బదునెనిమిది విధముల హాస్యమును బ్రధానధర్మముగాఁ గలిగి యుండును.

నర్మస్ఫింజము :—

ప్రారంభమున సుఖము, అంతమున భయము, గలిగిన నాయికానాయకుల ప్రథమసమావేశనర్మస్వభావము నర్మస్ఫింజమనఁబడును.

నర్మస్ఫోటము :—

నాయికానాయకుల పరస్పరావలోకనాదికముల నందిన నర్మభావాంకురవిశేషము నర్మస్ఫోట మనఁబడును.

నర్మగర్భము :—

పరిహాసవ్యాజమున స్వీయాభిమతము నీడేర్చుకొనెడు నర్మోపాయవిశేషము నర్మగర్భ మనఁబడును.

సాత్వతి :—

శౌర్యధైర్యాది సత్త్వగుణ సంపన్నము, సోత్సాహము నగు నాయకుని యుద్యోగధర్మము సాత్వతి యనఁబడును. ఇది సంలాపకము, ఉత్థాపకము, సంఘాత్యము, పరివర్తకము ననఁబడు నాలుగంగములను గలది.

సంలాపకము :—

అధిక్షేపము, గర్వము, తేజము మున్నగు ననేకభావార్థములను గలుగు యుక్తి ప్రత్యుక్తులతో నిండిన పరస్పర గభీరపరుషాలాపవిధానము సంలాపక మనఁబడును.

ఉత్థాపకము :—

శత్రువును ముందుగ సమరమునకుఁ బ్రేరేపించుచు సగర్వముగఁ బిలుచునప్పటి నాయకుని వాగ్వ్యాపారము ఉత్థాపక మనఁబడును.

సంఘాత్యము :—

మణి మంత్ర తంత్రాదికములచేత శత్రుపక్షమునఁ



బ్రయోగింపఁబడు నుపాయముతోఁ గూడిన మిత్రభేదము సంఘాత్య మనఁబడును.

పరివర్తకము :—

సమయమునకుఁ జెందని కార్యాంతరమును జేయఁ జూచెడు నాయకుని వ్యాపారము పరివర్తక మనఁబడును.

ఆరభటి :—

కాపట్యము, తంత్రము, సంగ్రామము, మాయ, క్రోధము మొదలగు వ్యాపారములను గలది యారభటి యనఁబడును. సంక్షిప్తిక, సంఫేటము, వస్తూత్థాపనము, అవపాతకము అను నీ నాలుగును దీని యంగములు.

సంక్షిప్తికము :—

ప్రతినాయకున కొకవిధమున నవస్థాంతరమును గల్పించు వ్యాపారము సంక్షిప్తిక యనఁబడును.

సంఫేటము :—

విజయోత్సాహులగు నాయకప్రతినాయకులు చేయు సమరోద్యోగము సంఫేట మనఁబడును.

వస్తూత్థాపనము :—

మాయాపరికల్పితార్థములచే సత్యార్థములను సహి

తము మఱుఁగుపఱచు నుద్యోగము వస్తూత్థాపన మనఁ
బడును.

అవపాతనము :—

ధైర్య స్థైర్యములను భంగపఱచి మనస్సునకుఁ గల
వగము నింపునట్టి కథాకథనోద్యోగము అవపాతన మనఁ
బడును.

భారతి :—

సుకుమారార్థకల్పనములలో శబ్దవృత్తిప్రధానమై పఱఁ
గునది భారతి యనఁబడును.

**12. కైశిక్యాదులు సర్వథా రసాశ్రియములు.**

కైశికీవృత్తి శృంగార కరుణ రసములకును, సాత్వతి
వీర భయానకములకును, ఆరభటి రౌద్ర బీభత్సములకును,
భారతి హాస్య శాంతములకును మఱియు నన్నిరసములకును
నాశ్రియమై యుండును.

**13. ధీరోదాత్త ధీరశాంతనాయకులు మంత్రసహాయులు,
స్వోభయ సహాయులు నగుదురు.**

ధీరోదాత్తుఁడును ధీర శాంతుఁడును గార్యాలోచనా



వసరమున మంత్రిని సహాయుఁడుగాఁ గలిగి యుందురు లేక
సచివుఁడును దామును బరస్పరసహాయు లగుదురు.

**14. ధీరలలితుఁడు మంత్రిసహాయుఁడు.**

పూర్వోక్తలక్షణము లొదవిన ధీరలలితుఁడను నాయ
కుఁడు కార్యావసరమున సచివుని సహాయుఁడుగాఁ గలిగి
యుండును.

**15. ఋష్యాదులు సర్వనాయకులకు ధర్మసహాయు
లగుదురు.**

ఋషి, పురోహితుఁడు, గురువు, విద్వాంసుఁడు మున్నగు
పెద్దలు పూర్వోక్తనాయకుల కెల్లరకు ధర్మోపదేశకులై
యుందురు.

**16. సైనికాదులు రాజశాసననిర్వాహకులు.**

సైనికులు, సామంతరాజులు, సహచరులు, పుత్రులు,
మిత్రులు మున్నగువారు రాజుయొక్క ఆజ్ఞలను వహించు
వారు. దుష్టశిక్షణము, శిష్టరక్షణము ప్రధానముగ నుండు
రాజధర్మమును నెఱవేర్చఁదగినవారై యుందురు.

**17. ఆభీరాదు లంతఃపురపరిచారకులు.**

ఆభీరులు, మ్లేచ్ఛులు, కిరాతులు మొదలగు హీన

జాతులవారు రాజాంతఃపురంబుల సేవఁ జేయఁదగినవారై యుందురు.

## 18. నాయకాంతరము లూహ్యాములు.

నాయికలందువలె నాయకులందును ఉత్తమ, మధ్యమ, అధమ భేదములు కలవు. వారివారి గుణములనుబట్టియు, వృత్తులనుబట్టియు నట్టివి గ్రహింపనగును.





1. విస్మయస్థాయి (చూ. పు. 62) 2. కిలికించితము (చూ. పు. 24)
3. విచ్ఛిత్తి (చూ. పు. 174) 4. విలాసము (చూ. పు. 24)



1. లలితము (చూ. పు. 175)　2. మోట్టాయితము (చూ. పు. 23)
3. కుట్టమితము (చూ. పు. 23)　4. బిబ్బోకము (చూ. పు. 175)



# ఆంధ్రనటప్రకాశిక.

చతుర్థ ప్రకరణము.



## రూపకము—రసము

### 1. భావము భావనాబద్ధము.

ప్రకృతి కావ్యకారణములతోఁ గూడినది. కావ్య నాటకాదులును దత్తుల్యములు. కావ్యకారణముననే కవి హృదయము భావింపఁదగునది. చతుర్విధాభినయముననే నాటకతత్త్వముసహిత మూహింపఁదగునది. ఊహాంశమే భావము.

చూడఁబడు పదార్థములన్నియు రూపములను గలవి. అవి దృశ్యములు. శ్రవ్యములు వినఁదగునవి. అవి గద్య పద్య గేయాదులు. శబ్దములే వాని రూపములు. నాటకము దృశ్యశ్రవ్యాత్మకము. కావుననె యయ్యది మిశ్రమకళ యనఁబడుచున్నది. రామాదిపాత్రధారులగు నటుల

రూపములచేతను, ఆంగికవాచికాదివ్యాపారములచేతను దిదృ
క్షుల హృదయములకు స్ఫురించునట్టిది భావము.

భావము రూపరహితము. అది మనస్సునఁ బొడము
నట్టిది. దానికి ముఖము ప్రతిబింబము. కేవల వాచికము
భావబోధకమైనది కాదు. మనఃప్రేరితములగు వ్యాపారముల
యొక్కయు, వాక్యములయొక్కయు, ముఖాంగిక చలనముల
యొక్కయు సమయసిద్ధములగు వివిధవిస్తరములనుబట్టిప్రతిభఁ
గలవాని మనస్సున యోజన లుద్భవించును. అట్టి యోజనా
నేకములలోఁ బరిస్ఫుటమగునదే భావము.

### 2. విభావము భావకారణము.

కారణములేక **కార్యము** కలుగదు. కార్యకారణ
ముల కవినాభావసంబంధము. భావము కార్యము. దాని
నుత్పాదించుఁ గారణము లనేకములు. అవి స్థలములు, సమ
యములు, పదార్థములు, అలంకారములు, నాయికానాయ
కులు మున్నగునవి.

పల్లవిత కోరకిత కుసుమిత ఫలభారవంతములగు ప్రమ
దావనములు, ఉద్యానవనములు స్వైరవిహారుల కమందా
నందదాయకములు. వాని యవలోకనానుభవములు నిఖిల
వ్యసనోన్మూలనములు, వివిధ కార్యోత్పాదనకారణములు
నగు.



దేవాలయములు, భజనాగారములు, గురుజన పీఠ
ములు, మున్యాశ్రమములు మున్నగునవి విషయదూరములు,
ప్రశాంతములునై పూర్వోక్త కాముకాదివ్యసనములకుఁజెందని
మానసిక ప్రవృత్తులకుఁ గారణములు కాఁదగునవి.

వివిక్తప్రదేశములందుఁ జూచుటకు లేక యనుభ
వించుటకుఁ దగిన వస్తువైచిత్ర్యము లుండవు. నిఖిలవ్యాపా
రములచే విడువఁబడినవగు నిట్టి పవిత్రస్థలములు వ్యక్తితత్త్వా
నుగత వికారపోషకములై లౌకికాలౌకిక వ్యాపార కారణము
లగుచుండును.

సమయధర్మములు వివిధములు. ఋతుధర్మములును
నట్టివె యగు. కొన్ని ప్రశాంతములు మఱికొన్ని సుకు
మారశృంగారపోషకములు, కేవల వ్యవహారభాజనములు
నగు. వెన్నెల రాత్రులు విరహుల వేధించునవి. ప్రభా
తము మంత్రాది పఠనములకు, అర్ఘ్యాది కార్యములకుఁ గాఁ
దగునది. మధ్యాహ్నపరాహ్ణములు తద్భిన్నధర్మములను
గలవి. సమరాహ్ణసమయము క్రీడాయోగ్యమైనదానినుండి
భేదించునట్టిది. నృత్తగీతాదియోగ్యసమయము నిద్రా
సమయమునుండి భేదించునట్టిది. నిద్రాప్రసిద్ధమైనది వ్యవ
హారవిశిష్టము కాదు. సమయాంతరము లసంఖ్యాకము
లగు మనోవికారములకుఁ గారణములు.

దృశ్యవస్తుసముదాయమంతయుఁ బదార్థ మనఁదగు
నది. శుకపికముల క్రీడలు, మేఘాది గర్జనములు, మృగా

రావములు, జానపదుల ముగ్ధాలాపములు, విజ్ఞుల ప్రౌఢభాషణములు మున్నగునవన్నియుఁ బదార్థసముదాయమునఁ జేర్పఁదగునవి. అవి వర్ణనాతీత మానసిక వికారకారణములగుట జగత్ప్రసిద్ధము.

నిఖిల స్త్రీపురుషధార్యము లలంకారములు. సమయసిద్ధములగు వాని వివరములు పూర్వప్రకరణమునఁ జెప్పఁబడినవి. ఇట్టివి కార్యోత్పాదనములుగ నెంచఁదగునవి.

ఇతివృత్త ప్రధానులగు నాయికానాయకు లనేక తెగలకుఁ జెందియుందురు. వారి గుణాలంకార రూపములు, సత్త్వములు, వ్యక్తితత్త్వానుబద్ధములు, వివిధ భావోత్పాదన కారణములు నగు.

శ్రవ్యములం దిపై కారణములు కవికృతవర్ణనాలాపములలోఁ గార్యభావములకుఁ బ్రధాన కారణాంశములై స్పష్టపడఁదగునవి. దృశ్యములం దవి ప్రత్యక్షకారణములు కాఁదగునవి. కారణాంశమే విభావము.

## 3. విభావము ద్వివిధము.

ఆలంబనము, ఉద్దీపనము నన విభావము రెండు విధముల నుండును. వివిధ భావాశ్రయములగు రూపకపాత్రము లాలంబనవిభావములు. నటాభినయగుణములు, చేష్టలు, అలంకృతులు, వివిధాన్యదృశ్యములగు తటస్థములు మున్నగునవి యుద్దీపనవిభావములు.



శృంగారవీరములం దేదేని యొకటిమాత్రమె రూపకాదులందుఁ బ్రధానరసముగఁ బరిగణింపఁబడఁదగునది. శృంగార విషయమునఁ బరస్పర ప్రేమానురాగనిబద్ధచేతస్కులగు నాయికానాయకులు, వీరమున సధైర్యోత్సాహులగు నాయకప్రతినాయకులు, ఆలంబనవిభావము లనఁబడుదురు. బీభత్స భయాన కాద్భుతాద్యన్యము లంగరసము లనఁదగునవి. అవి యెల్లర నాశ్రయించునవి. సర్వపాత్రములు, దృశ్యములు వాని కాలంబనవిభావములు. పూర్వోక్తాలంబనగుణాదికములే యుద్దీపనవిభావములును నగు.

## 4. అనుభావము భావబోధకము.

భావ మప్రత్యక్షమైనది. కావుననే యది యూహాంశ మనఁబడినది. ఇట్టిచో భావగ్రహణమునకు మఱికొన్ని యాంగికాది వికారము లాధారములు కాఁదగి యుండును. అయ్యవి యనుభావము లనఁదగును.

రత్యుత్సాహశోకాదులు భావములు. రామాదిపాత్రధారులగు నటు లా భావమున కాలంబన విభావములు. ఆలంబనగతార్థములన్నియు జ్ఞాప్యములే కాని దృశ్యములు కావు. సస్మితసరళాలాపనావలోకనములు రతిని, ధైర్యప్రతాపాదు లుత్సాహమును, ముఖవైవర్ణ్యము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు మున్నగునవి శోకమును, నెఱిఁగించునవగుటచే జ్ఞాపకము లనఁదగునవి. జ్ఞాప్యమగు భావమునకు జ్ఞాపక

మగునదే యనుభావము. తెలుపఁబడునది భావము, తెలుపునది యనుభావమునని గ్రహింపఁదగును.

### 5. అనుభావము చతుర్విధము.

చిత్తజ గాత్రజ వాగ్బుద్ధ్యారంభానుభావములు నాలుగు విధముల నుండును. వాని వివరములకు (చూ. తృ. ప్ర.)

### 6. అనుభావము సహజము ననుభవసిద్ధము నగు.

శృంగారమున వికాసము, వీరమున విస్తరోత్సాహము, బీభత్సమున క్షోభము, రౌద్రమున విక్షేపము మున్నగు ననుభావములు సహజములు. తత్సంబంధి చేష్టాదికము లపరిమితములు. అట్టివి యనుభవసిద్ధములు.

సుఖదుఃఖములు, మిత్రత్వ శత్రుత్వములు, ఎల్లహృదయములచే నొక్కరూపున గ్రహింపఁబడి జ్ఞాప్యభావములగుచున్నవి. క్రమముగ సంతోష శోకానురాగ విరాగములు తత్సంబంధి జ్ఞాపకములు కాఁదగునవి. అట్టివే సహజానుభావములు.

పాత్రతత్త్వము, ఉత్తమ మధ్య మాధమభేదములలోఁ బరిగణింపఁదగునది. దాని జ్ఞాపక గుణచేష్టాదికములు పరస్పరము భేదించునట్టివి. అనంతములగు నా యనుభావములే



యనుభవసిద్ధములు. పూర్వోక్త కారణములచే జ్ఞాపకానుభావము సహజము ననుభవసిద్ధము నగుచున్నది.

### 7, సాత్త్విక మనుభావతుల్యము.

సాత్త్వికభావములు పూర్వప్రకరణమున వివరింపఁబడినవి. (చూ. ప్ర. సూ. 103.)

సమాహిత చిత్తజానుభవరూపము లపరిమితములు. స్తంభాదులగు నొకయెనిమిదిమాత్రమె లక్షణగ్రంథములందుఁ జెప్పఁబడినవి. సత్త్వసాగరబుద్బుదములగు సాత్త్వికములలో నీ స్తంభాదులు ప్రధానములుగ నెంచఁదగునవి. అవి సాత్త్వికసర్వస్వములు మాత్రము కానేరవు.

రత్యాదులు స్థిరములు, సత్త్వమయములునగు. అట్టివే జ్ఞాప్యములు. స్తంభాదులు సస్మితాలాపనావలోకనాద్యనుభావములవలె జ్ఞాపకములనుట సమంజసము.

సత్త్వము కారణానేకములను సమాస్వాదించునట్టిది. సత్త్వప్రేరితములే సాత్త్వికములు. వ్యక్తితత్త్వానుగమనమున నవి వేయివిధముల వ్యక్తములగుచుండును. సంతోషశోకము లతిశయించునపు డొకచో నిష్క్రియాంగత్వము, వేఱొకచోఁ దదన్యాటోపము స్ఫురించవచ్చును. మఱియు నొకానొక కారణమున జనింపఁదగిన సాత్త్వికము లామూలాగ్ర మెల్లవేళల నెల్లరయెడ ననుభోగ్యములు కావు. సుఖ

పారవశ్యమున నొక్కెడ స్వరభేద మొదవిన మఱొక్కెడ లలితాలాపనము, ఆనందబాష్పముఁ బొడఁగట్టవచ్చును. తనూకంపము, పునస్స్మరణము నను నీ రెండును గోపతాపము లనుమాత్రమె స్ఫురింపఁజేయునవి కావు. వైవర్ణ్యము కేవల విషాదబోధకమే కాక యనారోగ్యజనితమును గాఁ దగునది. జ్ఞాప్య జ్ఞాపకోభయధర్మాత్మకము, కాలికమునగు సాత్త్వికము సత్త్వప్రసిద్ధమగు సన్యతత్త్వ మొకదానిని స్ఫురించునట్టి యనుభావముతో సభేదమున వర్తింపఁదగి యుండును.

## 8. వ్యభిచారులు భావపోషకములు

నిర్వేదాదులు వ్యభిచారులు. అవి ముప్పదిమూఁడు విధములు. వాని వివరములు సాత్త్వికాభినయమునఁ జెప్పఁబడినవి. (చూ. ప్రః సూ. 105.)

భక్తియందు శాంతి, మైత్రియందు విశ్వాసము, పుత్రునందు వాత్సల్యము మున్నగునవియు, రత్యాదులును బోష్యభావములు. తదభిముఖ సంచారులు పోషకములు.

విప్రలంభశృంగారము నాయికానాయక సమాగమాభావమునఁ బొడమునట్టిది. అది కావ్యాంశమై శ్రోతలయొక్కయు, దిదృక్షులయొక్కయుఁ జిత్తముల నాకర్షించుటకు లేక లయించుటకుఁ గొన్ని యాంగికాది సంచారి



భావలక్షణములలోఁ బోషింపఁబడఁదగి యుండును. సంచారులు సర్వథా భావపోషకములు.

వీరము నాయకప్రతినాయకులయొక్క వైరానల ప్రజ్వలనాతిరేకభావోత్సాహమును బురస్కరించుకొని యావిర్భవించునట్టిది. గర్వామర్షహర్షాద్యభిముఖ సంచారులు దానినిఁ బోషించునవి. మఱియు దానవీరము ప్రసన్నముఖాంగికవ్యాపారములచేతను, దయావీరము కరుణరసార్ద్రావలోకనాదులచేతను బెంపఁబడునది.

ఇష్టనాశాది జనిత చింతావిలమనోవృత్తిభాజనము శోకము. అది నిర్వేదదైన్యాది వివిధసంచారిలక్షణములచేఁ బోషింపఁదగునది. సంచారులె భావపోషకములు.

పూర్వోక్తభావములే కాక మఱియుఁ జెక్కులు నైమిత్తికములనఁ బఱఁగునవియుఁ గలవు. అవి సమయోచిత సంచారిభావానేకములచే భావింపఁదగి యుండును. ఎల్ల నటులు వాని యాలంబనవిభావములు కాఁదగినవారు. పాత్రములు తత్తదుచిత భావాత్మకములై యభినయావకాశముల నేర్పఱచఁదగునవి.

పాత్రములు సంచారిభావానేకములకు నిలయములగుట దుస్తరవిషయము. ఒకానొకచో నసంభవమనియుఁ జెప్పనగు. అట్టి సమయములందు నటుఁడే స్వీయానుభవమును బురస్కరించుకొని యభినయావకాశములను గల్పించు

కొనియు, సంచారి సందర్భములను జతపఱచుకొనియుఁ బాత్ర భావమును గ్రమబద్ధముగను మనోహరముగను జిత్రించవలసి యుండును. సంచారిభావచిత్రీకరణమే యభినయభావ పోషకము.

### 9. సంచారులు ప్రవేశకాదియోగ్యములు.

ప్రసంగార్థములు క్రమాభినయానుబద్ధములు కావ్య వాక్యభావము లభినయసామాన్యములు. పాత్రతత్త్వ చిత్రీకరణము సమయోచిత సంచారిభావాపాదితము. పాత్రప్రసంగములు ముగిసి యూరక నిలువవలసివచ్చెడు సమయములందును, రంగమునం దొక్కఁడె నిలిచియుండు నప్పుడును, ప్రవేశకాంతరమునందును భావపోషకములగు నిట్టి సంచారిభావానేకములు నటుల ప్రతిభావిశేషముల ననుస రించి ప్రదర్శింపఁబడఁదగి యుండును.

### 10. సంచారిభావాభినయమే ప్రౌఢాభినయము.

యథాకథానుకథనమునుండి భేదించునదియు, రమణీ యార్థ ప్రతిపాదక మయినదియునగు చమత్కారవాగ్రచనము కవితాగౌరవమును సంపాదించును. అటులే పాత్రపాఠ్యార్థ ముల నతిశయించిన మానసిక తత్త్వానుభవమును జిత్రించు సంచారిభావాభినయలాలిత్యము కావ్యమర్యాదను గడిం చును. నటుని శాస్త్రానుభవము, కాల్పనికధీవైదగ్ధ్యము, భావావనీవిహారవిజ్ఞానము, ప్రేక్షకసత్త్వముల నాకర్షించి



నిరుపమానందమును సంఘటించును. తత్ప్రయోగము ప్రౌఢ మనఁబడును.

కావ్యపాత్రము లనేకనటులచే ధరింపఁబడునవి. పాత్ర ముల ప్రసంగాదులు కవికృతములు, స్థిరములు నగు. తత్స దార్థ భావముల నభినయించునదే యభినయము. ఇట్టిచో నది మఱియొక ప్రౌఢాంతర మెటులు బడయఁగలదు?

పలువురు భావజ్ఞులొక పాత్రమును ధరింతురు. పాత్ర పాఠ్యము నొక్కవిధమునఁ బఠింతురు. పాత్రభావమును బోషించుపట్టున నెవరి యనుభవమును వారు చిత్రింతురు. ఏతదభినయ చిత్రీకరణము ముఖ్యముగ సంచారి భావాశ్ర యమై దిదృక్షుల నాకర్షించును. ఆకర్షణశక్తి నొదవించు భావజ్ఞనటుని కాల్పనిక ప్రతిభావిశేషమే ప్రౌఢాభినయ మనఁబఱగును.

### 11. స్థిరభావము స్థాయి.

ఏది భావనానేకములచే భావింపఁబడుచున్నదో, ఏది విభావకారణమునకుఁ గార్యమగుచున్నదో, ఏది యాలంబన గుణచేష్టాలంకృతులచేతను మఱియుఁ దటస్థములచేతను నుద్దీ పింపఁబడుచున్నదో, ఏది సాత్త్వికానుభావములచే జ్ఞాపింపఁ బడుచున్నదో, ఏది యభిముఖ సంచారులచేఁ బోషింపఁబడు చున్నదో, ఆ సత్త్వమయార్థము స్థిరభావము. రూపకావ్యాం తము లక్షింపఁదగు నీ స్థిరభావము స్థాయి.

## 12. ప్రయోగము త్రిస్థాయికము.

రూపకము కావ్యము. అది యభినయమునకు మాతృక. వస్తువాగ్రచనలు తదంగములు. స్థిరభావ మంశము. అంకాదు లంశవిస్తరణోపకరణములు. వస్త్వాద్యఖిలాంగ సమ్మేళనస్వరూపము రూపకస్థాయి.

రంగము రూపకాశ్రయము. రూపకప్రకృతి నిది జ్ఞాపింపఁబడునది. చిత్రకారుఁడు తదధికారి. రక్తపీతశ్యామలాదివర్ణములు వానికి సాధనములు. రూపకభావసమయము ప్రతిపాద్యము. తద్భావావిచ్ఛిన్నరంజనము రంగస్థాయి.

అభినయము రూపకభావమును బ్రతిపాదించునది. రంగముతోఁబాటుగఁ బాత్రములును దద్భావాలంబనములు కాఁదగునవి. భిన్నాలంబనగతార్థభావముల కైక్యమును ఘటించునట్టి ప్రయోగకౌశల్య మభినయస్థాయి. ఈ మూఁడు స్థాయుల సమన్వయస్వరూపము రూపకప్రయోగము.

## 13. రత్యాదులు స్థాయులు.

సహవాససంబంధాదులవలన నాయికానాయకులకుఁ బరస్పరము జనించు ననురాగవిశేషము రతిస్థాయి.

యుక్తకార్యారంభమునందు నాయకప్రతినాయకులకు శక్తిసాహసాదులచే జనించు సవేగమనోవ్యాపారము ఉత్సాహస్థాయి.



ఫలాభావము, బంధునాశము మున్నగువానిచేఁగలుగు మనఃక్లేశము శోకస్థాయి.

అపూర్వపదార్థావలోకనము, చిత్రకథా శ్రవణము మున్నగు వానివలనఁ గలుగు మనోభావము విస్మయస్థాయి.

విపరీత వయోగుణరూపశీలాత్మకములగు పదార్థములను జూచుట, వినుట మున్నగునవి కారణములుకాగ జనించు భావము హాసస్థాయి.

శరభశార్దూలాదిభయంకరవస్తుసందర్శనమునను, దత్కథా శ్రవణమునను జనించు మనశ్చాంచల్యము భయస్థాయి.

దుర్గంధములు, దుస్సహములు నగు పదార్థములను జూచుటచేతను, నిందాశ్లీల వాక్యములను వినుటచేతను గలుగు మానసిక వికారము జుగుప్సాస్థాయి.

శత్రుకృతమత్సరవ్యాపారములు తెలియుట, దురాలాపములను వినుట మున్నగు కారణములచే జనించునట్టి భావము క్రోధస్థాయి.

విజ్ఞానాదిజనితనైర్గుణ్యమగు శాంతమును, రత్యంతర గతములగు వాత్సల్య విశ్వాసములును స్థాయు లనఁదగునవి.

## 14. స్థాయిత్రయీభావము రసము.

రూపకము దృశ్యము. ఇది సర్వవిధముల శ్రవ్యము నుండి భేదించునది. ప్రయోగము రూపక భావప్రతిపాద్యము. రూపక కవిత శ్రవ్యమువోలె శ్రవణమాత్రమున శ్రోతల నాకర్షింపనేరదు. రూపకసృష్టి దిదృక్షులకుఁ బ్రసన్నము కాఁదగునది. రూపకసర్వస్వము తత్ప్రయోగ సారళ్యము ననుసరించియే స్పష్టపడఁదగునది. కావుననే శ్రవ్యమువోలె నేకస్థాయికము కాక రూపకప్రయోగము "త్రిస్థాయికము" అనఁబడియెను.

రూపకకవి, చిత్రలేఖకుఁడు, నటుఁడు ప్రయోగ ప్రకృతికి సృష్టిస్థితిలయకారకులగు త్రిమూర్తులు. కవి సృష్టించువాఁడు. చిత్రకారుఁడు స్థితికర్త. నటుఁడు స్థాయిత్రయమును లయింపఁజేయువాఁడు. తల్లయభావనాస్వరూపము రసము.

ప్రయోగస్థాయులు మూఁడు విధములు. అవి రూపకము, రంగము, అభినయము ననువానికిఁ జెందునవి. (వాని వివరములకు చూ. సూ. 12.) అభినయ మీ మూఁడు స్థాయులను సమన్వయపఱచునది. తత్సమన్వయస్వరూపానుభవమే రసము.

శ్రవ్యాంశము గాథాప్రధానమైనది. కవికల్పనములు, వర్ణనములు కథాబీజమును జాలవఱకు విస్తరించు



నవియు, శ్రవణోత్సవము నించునవియు నగు. అంగాంగి రసములు శ్రవ్యములందు సర్వసాధారణముగ వాగాశ్రయములై యుండునవి. శ్రవ్యరసభావము లాకారణమున వాఙ్మాత్ర శ్రవణమునను, వస్తువ్యాజమునను స్ఫురింపఁదగియుండును. రూపకవిషయమున వస్త్వంశమే రసాంశ మనఁదగునది. ఇఁక వర్ణనాది రచనలన్నియుఁ బాత్రల భావానుభవములకు మాత్రమె చెందునవై తన్మూర్తివంతములను బ్రత్యక్షములుగ పొనర్పఁదగునవి. అంకప్రవేశకాదులచే విస్తరింపఁబడు విషయమంతయు రసాంశము నాధారపఱచుకొని సహజభావప్రవృద్ధికిఁ గారణమైనదిగ నుండును.

శ్రవ్యాంశమునకుఁ జెందిన భావములు కవిముఖమున విన్పింపఁబడునవి. రూపకాంశము లట్టివికావు. కవిసృష్టములగు పాత్రములే వచించునవి. అట్టివి దేశకాలపాత్రములను దలఁపించు మూలమునను, రసాంశము విస్తరించు మూలమునను రసోత్పత్తికిఁ గారణములు కాఁదగునవి.

శ్రవ్యసమయము మితములేనిది. గాథాంతరసమయనిర్దేశము, యథాయోగ్యప్రవృత్తము నప్రధానమునగు. రూపకసమయము భావకారణమైనది. రసాంశమగు వస్త్వారంభప్రభృతినిశ్చితఫలార్థప్రకృతిపర్యంతమైన సమయము రూపకమున విధిగ నిర్దేశింపఁదగునది. భావాంకురము ఫలవంతము కాఁదగిన సమయసర్వస్వము రూపకాద్యంతమైనది. అంకాదులు దైనందిన భావానుభవభాజనములు. రసము

భావమూలము. భావము సమయసిద్ధము. రూపకసమయ
భావసమ్మేళనస్వరూపము రసము.

శ్రవ్యభావము లేకభాషామయములు. అవి కావ్య
ధర్మానుగుణ్యములై కవినుండి వెడలునవి. కథావిస్తరణము
వాని ప్రథమలక్ష్యము. వానిభావముల ననుభవించు లేక
యాభావములకుఁ జెందునట్టి పాత్రరూపముల నేర్పఱచు పని
వానికి లేదు. అవి ముఖ్యముగఁ గవితాచమత్కారమును
బురస్కరించుకొని శ్రవణానంద మొడఁగూర్చునవి. రూపక
ప్రసంగములు, పద్యములు, గీతికలు, కవిచేఁ బాత్రలనోటఁ
బలికింపఁబడునవి. తద్భావములును గవిచే నారోపింపఁబడు
నవి. రూపకవాగ్భావములు పాత్రల బహిరంతరప్రకృతు
లను నిర్ణయించుమూలమున రసోత్పత్తినిఁ గలిగించునవి. అవి
సమయము, పాత్రము, భావము లనఁబడు మూఁడింటిచేఁ
గలుగు నవియు, ముఖ్యముగ రసము నుత్పాదించునవియు ననఁ
దగునవి.

కథాప్రధానములగు శ్రవ్యములకు వస్తునియమము
కవియొక్క యిచ్ఛామాత్ర మనఁదగునది. ఉత్తమ, మధ్య
మాధమ భేదములకుఁ జెందిన నాయికానాయకులు, తద్భిన్ను
లగు ననేకులు ప్రధానులు కాఁదగియుందురు. సాంఘిక
నైతికచారిత్రకాద్యనేకధర్మముల నుత్పాదించునవి వాని
యంశములు. రసములు కేవల కవితామూలములు. అవి
నీత్యాత్మకములు, కాలికానంద దాయకములు నగు. నాటక



రూపకము తద్భిన్నమైనది. పవిత్రమైన యానందము నది
యొసంగునది. అందఱు నాకర్షించునది. ఎంద ఱనుభవించి
నను దఱుగనిది. విశ్వమంతయును జెందునది. మఱియు
నంతములేనిది. కావుననే సాంఘికాది సమస్యలు, ధర్మము
లు, నీతులు, తెలుపునట్టి గాథలు నాటకరూపకాంశములు
కాకపోయినవి. సత్యము, శౌచము, గుణము, శీలము, ధర్మ
ము మున్నగు నుదాత్తలక్షణములచే నొప్పెడు నుదాత్త
నాయికానాయకులు, లేక వీరప్రతివీరులు నాటకాధికారులనఁ
బఱఁగిరి. కాలికములగు గాథావిశేషములు రూపకాంశ
ములును గాకపోయెను. రసాంశమగు బీజము, తద్విస్తరణము
నకుఁ గారణమగు బిందువు, ఫలవంతమగు నుపసంహృతము
రూపకలక్షణము లనఁబడినవి. లక్ష్యలక్షణోపేతమగు తదను
భవరూపమే రసమనియుఁ బరిగణింపఁబడెను.

శ్రవ్యకవితలు కథారంజనములు. కవిత్వభావములు,
రచనలు దక్క కవిసృష్టము లన్యము లుండవు. కావుననే
శ్రవ్యములు వాగ్భావమాత్రస్ఫురణమున నేకస్థాయికములై
శ్రోతలఁ దనియించుచున్నవి. రూపకమంతయుఁ గవిసృష్టము.
అయిన నతఁడు లోకములోనివాఁడు. మానవమాతృఁడగు
టచే భావితాంశమును మాత్రమె రూపవంతముగ నొనర్చును.
తదర్థారోపణమున నాలంబనవిభావములు, ఉద్దీపనవిభావము
లేర్పఱచును. పాత్రల గుణచేష్టాదికములను భావబోధ
కానుభావమయములుగ నొనర్చును. సాత్త్వికసంచారులు

తదర్థము నభివృద్ధిపఱచి స్థాయిత్వమందించును. సమయము, భావము, కాలము, పాత్రము, వాక్కు మున్నగునవన్నియు రూపకస్థాయిత్వమంది కవినిర్మాణచాతుర్యమునకుఁ దార్కాణములై యొసఁగును. తన్మనోజ్ఞరూపకభావానుభవజనితానందమే రసమనఁబడును.

రంగము పాత్రలతోఁబాటుగ రూపకార్థమున కాలంబన మనఁదగునది. ప్రాసాదాదికములగు నెన్నిదృశ్యములిందుఁ బ్రదర్శింపఁబడినను దీని సమిష్టిరూపము రూపకరసోచితవర్ణాలంకృతము కాఁదగునది. శృంగారమున శ్యామలము, హాస్యమునఁ బీతము, కరుణయందుఁ గపోతము, రౌద్రమున రక్తము, వీరమందు గౌరము, భయానకమునఁ గృష్ణము, బీభత్సమున నీలము, అద్భుతమునఁ బీతము రసములను స్ఫురింపఁదగిన వర్ణములు. ఇట్టి రంజనాంశము రూపకస్థాయి యనఁబడునది. భిన్నరూప ప్రసిద్ధములగు గిరులు, వనములు, నదులు మున్నగునవి యథాయోగ్యములగుట, రూపకసమయములను సాక్షాత్కరించుట మొదలగు ప్రధానధర్మములచేఁ బోషింపఁబడఁదగునవి. ఏతాదృశరూపక రంగ మనోజ్ఞసమయసమ్మేళనము రసోత్పత్తికి మిక్కిలి తోడ్పడఁగలదు.

నటుని కార్యము ప్రయోగము. కావ్యానుభవసారమీతని స్థాయి. దాని ననుసరించు నటుని యాహార్యము పాత్రసామ్యమును బడయఁదగునది లేక పాత్రస్వరూప



మును స్ఫురింపఁజేయునది. మధ్యమాధమపాత్రతత్త్వములు, భావములు తత్తదుచితజాతీయవాగాలాపనములచేఁ దెలియఁదగునవి. సాత్త్వికాంగికములు చాలవఱకు సహజములు, గొంతవఱ కనుకరణములు నగునవి. నటునికార్య మీనాల్గభినయ మార్గములలో నొక్కొక్కక్రమమునకుఁ గట్టుపడి సహాయపాత్రలచే నయింపఁబడిన వివిధార్థభావములను దనతోడను, దాను రూపకముతోడను, రూపకమురంగముతోడను లయింపఁదగునది. ఆరూపమున రూపకరంగాభినయములకుఁ జెందిన త్రయీభావము సభ్యులచే ననుభవింపఁబడి రస మనఁబడుచున్నది.

### 15. రూపకరసము లష్టధాభిన్నములు.

శృంగారము, వీరము, కరుణ, అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము నను నీ యెనిమిదిరసములు రూపకములం దనుభవింపఁదగునవి. శాంతము, వాత్సల్యము, భక్తి మున్నగునవియుఁ గొన్నిట లక్షింపనగు.

### 16. రసము లంగ్యంగములు.

రూపకాద్యంతము పోషింపఁబడుచుఁ బెక్కురసములను దనయందు లయించుకొనుచు నన్నిటఁ బ్రధానముగఁ గన్పడునది అంగిరసము. ఒక రసము ప్రధానమైయుండఁ బ్రాసంగికాంశములై కన్పట్టు నితరము లుపరసము లనఁ

బడును. ప్రధానరసమున కిట్టివి యంగములు కాఁదగినవగు టచే నంగరసము లనఁబడును.

## 17. స్థాయిత్రయీరతిభావము శృంగారము.

పూర్వోక్త రూపక రంగాభినయ స్థాయిత్రయీభావమగు రతి స్ఫురద్రూపయౌవనాద్యలంకృతులగు నటశేఖరులయం దంకురించి, వివిధానుభావములచేఁ దోరఁకరించి, రాంగికాది తటస్థదృశ్యములచేఁ బుష్పించి, స్వతంత్రభావసంచారులచే ఫలించి, సర్వాభినయసౌలభ్యమున మనోజ్ఞరసవాహకమై రసజ్ఞులగు సభ్యులచే నాస్వాదింపఁబడి శృంగారరసము నాఁబరిగణింపఁబడుచున్నది.

## 18. శృంగారము ద్వివిధము.

పరస్పరప్రేమాతిశయములఁ బఱఁగు నాయికానాయకులకు సమావేశ మొదవకుండునట్టియవస్థ విప్రలంభమనియు, పరస్పరానురాగవిలాసవిశిష్టులగు నాయికానాయకులు దర్శనస్పర్శనాదివివిధవిక్రియలచే ననుభవించునట్టి స్థితి సంభోగశృంగారమనియు ద్వివిధములఁ జెప్పఁబడునది.

## 19. విప్రలంభ మైదుకారణములు కలది.

సమావేశము కలుగనప్పటిస్థితి «అయోగము». కలియుట కవకాశముండియుఁ గారణాంతరములచే సమావేశము



కాకుండు నప్పటి స్థితి విరహవిప్రలంభము. ప్రణయభావాంతరములచేఁ బరస్పరదర్శనస్పర్శనాదులను నిరోధించియుండు నప్పటిస్థితిమానవిప్రలంభము. పరస్పరప్రేమాన్వితులగు నాయికానాయకులు దేశాంతరులై యుండునప్పటిస్థితి ప్రవాసవిప్రలంభము. సమీపమున లేక దూరముననుండి పరస్పరదర్శనస్పర్శనాదులను విధిగఁ బాసిన నాయికానాయకుల స్థితి శాపవిప్రలంభము.

## 20. మానవిప్రలంభము ద్వివిధము.

పరస్పరాజ్ఞోల్లంఘనమున నాయికానాయకులకు జనించునట్టి స్థితి ప్రణయమానమనియు, అన్యస్త్రీ సంబంధి చిహ్నములను జూచుటచే నాయికకు నాయకునెడ జనించునట్టి స్థితి యీర్ష్యామానమనియు ద్వివిధములఁ జెప్పఁబడును.

## 21. త్రిస్థాయికోత్సాహము వీరము.

నాయకప్రతినాయకులను లేక వీరప్రతివీరులకుఁ గారణానేకములచే జనించుఁ బరస్పరవిజయాకాంక్ష యనఁబడు రూపకోత్సాహస్థాయి ప్రతాపాదిభావితప్రసన్నముఖాంగాద్యలంకృతులగు నటవతంసులయం దంకురించి, యుక్తగుణచేష్టాలంకారాద్యనుభావములచేఁ దోరఁకరించి, ఉచితగారవర్ణాలంకృతరాంగికదృశ్యోద్దీపనములచేఁ బుష్పించి, అభిముఖసంచారిభావానేకములచే ఫలించి, చతుర్విధాభినయలావణ్యమున రసవాహకమై రసజ్ఞులగు సభ్యుల కానం

దము నించునట్టి యా యుత్సాహభావమే వీరరస మనఁ బడుచున్నది.

**22.** త్రిస్థాయికశోకభావము కరుణ.

మనఃక్లేశకారణము, రూపకాంశము నగు నీ శోకభావము దీనభావారోపితములగు పాత్రాలంబనములం దంకురించి, క్రమ క్రమముగ సాత్త్వికానుభావసంచారులచేఁ బోషింపఁబడి, తద్రసోచితకపోతవర్ణాలంకృతరంగదృశ్యాదిక తటస్థములచే నుద్దీపింపఁబడి, సరసాభినయమున రసస్వరూపము నొంది సద స్యులచే నాస్వాదింపఁబడి కరుణరస మనఁబడుచున్నది.

**23.** త్రిస్థాయికవిస్మయభావ మద్భుతము.

అపూర్వార్థావలోకన శ్రవణజనితము, రూపకాంశము నగు నీ విస్మయభావము పూర్వోక్తక్రమంబున విభావాను భావసాత్త్వికవ్యభిచారులచేతను, నటాభినయముచేతను, రసస్వరూపమునొంది ప్రేక్షకులచే ననుభవింపఁబడి యద్భుత రస మనఁబడుచున్నది.

**24.** త్రిస్థాయికహాసభావము హాస్యము.

గుణాలంకార చేష్టాదిక విపర్యయస్థితినిఁ జూచుట చేతను, వినుటచేతను జనించు నీ భావమే పూర్వోక్తాభినయ



క్రమమున సభ్యులచే నాస్వాదింపఁబడి హాస్యరస మనఁబడు చున్నది.

**25.** స్థాయిత్రయీభయభావము భయానకము.

భయంకర వస్తుసందర్శనమునను,శ్రవణముననుజనించు నీ స్థాయిభావమే భయానకరస మనఁబడుచున్నది.

**26.** జుగుప్సాస్థాయియే బీభత్సము.

అసహ్యావస్త్వవలోకనమునను, అశ్లీలాది శ్రవణము నను దోఁచు జుగుప్సాస్థాయిభావమే బీభత్సరస మనఁ బడుచున్నది.

**27.** స్థాయిత్రయీక్రోధభావము రౌద్రము.

అభిముఖాక్షేపాదిజనితము, రూపకాంశము నగు నీ క్రోధభావము పరిస్ఫుటాననాలోకనములచే భాసిల్లు నటాలం బనములం దంకురించి, తత్తదుచిత వ్యాపారానుభావములచేఁ దొలఁకరించి, రక్తవర్ణాలంకృతరంగాది తటస్థోద్దీపనములచేఁ బుష్పించి,సహజసాత్త్వికసంచారులచేఁ బోషింపఁబడి,స్వతంత్ర భావాభినయవిధానములచే రసారోప్యమై సదస్యాస్వాద్యమై యది రౌద్రరస మనఁబడుచున్నది.

శాంతి, భక్తి, వాత్సల్యము మున్నగునవి యథా

యోగ్య ప్రవర్తనాదికముల నటులచే జ్ఞాపింపఁబడి రసికసదస్యులచే నాస్వాదింపఁబడునవి.

## 28. ఆనందమే రసము.

సుఖదుఃఖభాజనములగు సన్నివిషయములు కవి యొక్క భావనావిశేషమున రసవంతములై యానంద మీయఁదగునవి. సదస్యాస్వాదితానందమే రసము.







ఆంధ్రసభ, చెన్నపురి



# ఆంధ్ర నట ప్రకాశిక.

పంచమ ప్రకరణము.



## రూపకము—నాటకము.

### 1. నటప్రవర్తితము నాటకము.

తౌర్యత్రికభవము నృత్తము. నృత్తత్రయములో నిది నాట్యము. నాట్యమన నటనము. వాచికాంగికసాత్త్వికాహార్యము లనఁబడు నాలుగువిధములయిన యభినయ మార్గములలోఁ బాత్రావస్థలను ననుకరించు మూలమున రసప్రవృత్తి నొదవించు వ్యాపారముఁగలవాఁడు నటుఁడు. ఇట్టి నటులచేఁ బ్రయోగింపఁబడునది నాటకము.

### 2. నాటకము రూపకములలోనిది.

శ్రవ్యములు, దృశ్యములు నన: గావ్యములు రెండు విధముల నుండును. శ్రవ్యములు వినఁదగునవి. అవి

ప్రబంధచరిత్రాదులు. దృశ్యములు ముఖ్యముగాఁ జూడఁదగునవి. జంగమస్థావరవిశిష్టమగు ప్రకృతి చూడఁబడు నట్టిది కనుక రూపమనఁబడును. నాటకమునకుఁ జెందిన ప్రపంచరూపము, అందలి పాత్రలకుఁజెందిన సాత్త్వికరూపము, రసరూపము మున్నగు పెక్కురూపము లారోపింపఁబడి యెల్లరచేఁ జూడఁదగియుండుటచే నీ దృశ్యకావ్యము లన్నియుఁ జేరి రూపకము లనఁబడుచున్నవి. అట్టి రూపకము లలో రసాశ్రయమగునది నాటకము. అది కొన్ని ప్రత్యేక లక్షణములను గలిగియుండునది.

### 3. రూపకములు పదివిధములు.

నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీధి, అంకము, ఈహామృగము అను నీ పదియును రూపక ప్రధాన భేదములు.

నాటకము :—

పూర్వరంగము, నాంది, ప్రస్తావము, ప్రఖ్యాతవృత్తము, ఉదాత్తనాయకుఁడు, సంధ్యాదివిభజనము, అంకవిభాగము, అంగాంగిరసపోషణము, దృశ్యసూచ్యవిచారము, మున్నగు కొన్ని ప్రధానలక్షణములను గలిగి ప్రయోగయోగ్యమగునది, రసప్రధానమైనది నాటక మనఁబడును.



### 4. పూర్వరంగప్రవర్తకుఁడు సూత్రధారుఁడు.

నాట్యప్రయోగమునకు నిర్దేశింపఁబడిన స్థానము నాట్యరంగము. ప్రయోగమునకుఁ బూర్వమారంగము పూర్వరంగ మనఁబడును. శాస్త్రసిద్ధముగ భావరాగతాళములను సమ్మేళనపఱచు సూత్రములను ధరించువాఁడు సూత్రధారుఁడనఁదగును. వస్తువు, నాట్యము, రంగము ననువాని సమన్వయసూత్రముల నెఱిఁగినవాఁడును సూత్రధారుఁడనఁబడును. మఱియు నాటకము కళ. కళ వ్యక్తినిర్వృత్తము. బహునటాలంబనగతమగు ప్రయోగము కళాసిద్ధినిఁ బడయనేరదు. అది యొక్కని శాస్త్రానుభవసూత్రములలో సరసవిహారవైదగ్ధ్యమున విస్తరింపఁబడవలసియుండును. నాట్యానుష్ఠాన సూత్రములను దెలిసియు, నాట్యప్రదర్శనమున కట్టి కళాసౌందర్యమును బెంచియు దాని నొక్కసూత్రమున ననుసంధించు ధర్మమును గలవాఁడు సూత్రధారుఁడనియుఁ జెప్పఁదగు.

ప్రదర్శనారంభమునందుఁ బ్రయోగకార్యసాఫల్యము కొఱకై సూత్రధారుఁడొనర్చు నాట్యదేవతాపూజనాదికములు పూర్వరంగప్రవర్తనము లనఁబడునవి.

### 5. తదన్యసూత్రధారుఁడు నటుఁడు, స్థాపకుఁడు ననఁబడును.

ప్రయోగారంభమున రంగము నలంకరించి నాంది

మొదలుకొని ప్రస్తావమువఱకును గలుగుకార్యమును నెఱపు వాఁడును సూత్రధారుఁడనఁబడును. పూర్వోక్త సూత్రధారున కితఁడు తుల్యుఁడు. ఇతఁడు నటుఁడనియు స్థాపకుఁడనియుఁ జెప్పఁబడును.

### 6. నాందీపఠనము సూత్రధారుని ప్రథమధర్మము.

కావ్యార్థసూచన, దేవతాస్తుతి, ఆశీస్సు ననువానితోఁ గూడిన పద్యము లేక శ్లోకము, మఱియు గేయము నాంది యనఁబడునది. అభినయపారీణుఁడు, కావ్యప్రసన్నుఁడు నగు సూత్రధారుఁడు ప్రప్రథమమున నీ నాందీవాదమును జరుప వలసియుండును.

### 7. ప్రస్తావము ద్వితీయధర్మము.

నాంద్యనంతరవస్త్వాదిసూచనాపర్యంతప్రసంగము ప్రస్తావ మనఁబడును. వస్తువు, పాత్ర, బీజము, ముఖము ననఁబడునవి వస్త్వాదులు.

వస్తువు :—

వస్తువన కథ లేక యితివృత్తము. తత్సంబంధిసూచన వస్తుసూచన.

పాత్ర :—

నాటకనాయకాదులు పాత్రలు. తత్సంబంధిసూచన పాత్రసూచన.



బీజము :—

కావ్యఫలప్రాప్తికి లేక కావ్యరసవిస్తరణమునకు హేతువగునట్టిది. తత్సంబంధిసూచన బీజసూచన.

ముఖము :—

కావ్యసారాంశము లేక ఫలముతో సామ్యము గలిగి యుండునది కథాముఖము. తత్సబంధిసూచన ముఖసూచన.

### 8. ప్రస్తావము ఆముఖమనియు స్థాపనమనియుఁ జెప్పఁబడును.

కథాముఖసూచనార్థమును గలిగి యాముఖమనియు, కథాంశమును స్థాపించునదగుటచే స్థాపనమనియుఁ బ్రస్తావము వ్యవహరింపఁబడుచుండును. దానిని ద్వితీయధర్మముగాఁగల యీ సూత్రధారుఁడు స్థాపకుఁడనియు,నటుఁడనియుఁ జెప్పఁబడును.

### 9. ప్రస్తావము సూత్రధారనటీమారిషాది నిర్వృత్తము.

నటీసూత్రధారులచేతను లేక నటీపారిపార్శ్వకులచేతను జరుపఁబడు ప్రసంగము ప్రస్తావమని తెలియఁదగునది.

10. ప్రస్తావము భారతీవృత్తి సంకలితము.

పైని దెలుపఁబడిన ప్రసంగములు సరళములు, సరసములునై కావ్యాసక్తిని బెంచు లక్షణమున నుండఁదగునవి. అదియే భారతీవృత్తి యనఁబడునది.

11. ప్రస్తావము మూఁడులక్షణములు గలది.

కథోద్ఘాతము, ప్రవృత్తకము, ప్రయోగాతిశయము అను నీ మూఁడును ప్రస్తావనాంగములు.

కథోద్ఘాతము :—

సూత్రధారుని వాక్యమును గథావిషయికముగ భ్రమించి తత్సంబంధి భావాలాపములతో నన్యపాత్ర ప్రవేశించుట కథోద్ఘాత మనఁబడును.

ప్రవృత్తకము :—

సూత్రధారుఁ డిచ్ఛావృత్తిని జేయు ఋతువర్ణనానుగుణ్యములగు భావాలంకృతులతో నన్యపాత్ర ప్రవేశించుట ప్రవృత్తక మనఁబడును.

ప్రయోగాతిశయము :.

సూత్రధారునిచే నిర్దేశింపఁబడిన పాత్రమాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయ మనఁబడును.



ఈ మూఁడిట నేదేని యొకట్టిమాత్రమె ప్రస్థావమునం దుండఁదగునది.

12. ఆముఖాంగములు పదుమూఁడు విధములు.

ఉద్ఘాత్యము, అవలగితము, ప్రపంచము, త్రిగతము, ఛలనము, వాక్కేళి, అధిబలము, గండము, అవస్యందితము, నాళిక, అసత్ప్రలాపము, వ్యాహారము, మృదవము అను నీ పదుమూఁడును ఆముఖాంగములు.

ఉద్ఘాత్యము :—

యుక్తిప్రత్యుక్తులతోఁగూడిన ప్రశ్నోత్తరమాల ఉద్ఘాత్య మనఁబడును.

అవలగితము :—

ఊహించినదానిని నుపాయాంతరమున నిర్వహించు నర్థము, భాషణము లేక క్రియ కలది అవలగిత మనఁబడును.

ప్రపంచము :—

గ్రామ్యాశ్లీలకలితంబగు పరస్పరస్తుత్యాదిక ప్రసంగము ప్రపంచ మనఁబడును.

త్రిగతము :—

వినఁబడిన వాక్యసరణిని నాధారముగాఁ గొని యనేకములను భావించునట్టిది త్రిగత మనఁబడును.

ఛలనము :—

స్ఫుటార్థమునఁ బొగడునట్లుండి ధ్వన్యర్థమున నిందా ప్రధానమై పఱఁగు భాషణము ఛలన మనఁబడును.

వాక్కేళి :—

ఏదోయొకభావమునఁ గొంతదూరము చెప్పఁబడిన వెనుకఁ బూర్వోక్తవిషయము నుపేక్షించియు, అభిప్రాయ మును మార్చియుఁ బలుకఁబడునట్టిది వాక్కేళి యనఁ బడును.

అధిబలము :—

స్వాభిమానపురస్కృతులై యొకనిమించి యొకఁడు పొగడుకొను గర్వాలాపములను గలది యధిబల మనఁ బడును.

గండము :—

ఒకానొకయభిప్రాయమున భాషించువాని సమయ మునకు సంబంధించియు, అన్యార్థము నుద్దేశించునదై యన్యులనుండి వినవచ్చెడు వాక్యము గండ మనఁబడును.

అవస్యందితము :—

సరసార్థమును గలిగి పలుకఁబడినదాని కన్యార్థమును గల్పించి మనోజ్ఞత్వమును జెందించునట్టిది అవస్యందిత మనఁ బడును.





ఆంధ్ర నాటక పరిషత్తు, గుంటూరు, ౧౯౨౭



నాళిక :—

గభీరగూఢార్థములతోనిండిన నవ్వుటాలమాటలుకలది నాళిక యనఁబడును.

అసత్ప్రలాపము :—

ఒకవిషయమునకుఁ జెందక, యొక క్రమము ననుసరింపక, యొకధర్మమును బాటింపక, పలుకఁబడునది యసత్ప్రలాప మనఁబడును.

వ్యాహారము :—

వినుట కాసక్తినిఁ బెంచునదియు, హాస్యాత్మకమైనదియు, విశేషించిన మఱియొక ప్రయోజనము కలుగుటకుఁ గారణమైనదియు నగు సరసాలాపము వ్యాహార మనఁబడును.

మృదవము :—

అల్పమును ఘనముగను, ఘనమైనదాని నల్పముగను వర్ణించుటనుగలది మృదవ మనఁబడును.

ఇందలి కొన్ని యాముఖాంగములు అన్యసమయము లందును రసస్ఫూర్తికొఱకు వినియోగపడఁదగియుండును.

## 13. ఋతుగానమైచ్ఛికము.

ప్రస్తావనావసరమున నిటీవలి కొన్ని నాటకములందు

ఋతువర్ణన మొండు కనవచ్చుచుండెను. అయ్యది ప్రాచీన సాంప్రదాయములం దంతగఁ గానరాని కారణమున నట్టిది నటుని యిచ్ఛాప్రయోజనమును గలిగియుండును. రంగ రంజనమును గోరి యిట్టి ఋతుగానము చేయఁబడినఁ జేయఁ బడవచ్చును. ప్రస్తావమునకు దాని యావశ్యకత మృగ్యము.

**14.** ప్రస్తావనానంతరారంభమునుగలది ప్రయోగము.

పూర్వోక్తవిధమున నాందీవాదము, వస్త్వాదిసూచనముఁగల ప్రస్తావము ముగిసి, సూత్రధారుఁడు మున్నగువారు నిష్క్రమించినవెనుకఁ గథోద్ఘాతాదికధర్మానుగుణ్యముగఁ బ్రవేశించు నాయకుని మూలమున లేక తత్తుల్యుఁడగు మఱియొకని రూపమున నాటకప్రయోగము ప్రారంభము కాఁదగునది.

**15.** నాటకనాయకులు రాజర్షిదివ్యులు.

నాయకలక్షణములు, వాని వివరములు తృతీయప్రకరణమునఁ జెప్పఁబడియున్నవి. ఉదాత్తలక్షణములను సమగ్రముగాఁ గలిగినరాజు లేక రాజర్షి లేక దివ్యుఁడు నాటకనాయకుఁడు కాఁదగువాఁడు.

**16.** నాటకేతివృత్తము ప్రఖ్యాతము, ఆధికారికమునగు.

నాటకబద్ధమైనది నాటకవస్తువు. వస్తువన కథ. ఇది



యితివృత్తమనియు ననఁబడును. ఇతివృత్తము ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నని మూఁడువిధముల నుండును.

ప్రఖ్యాతము :—

పురాణాదిప్రసిద్ధులగు నాయికానాయకులకు లేక నాయకప్రతినాయకులకు సంబంధించిన గాథనుగలది ప్రఖ్యాతమనఁబడును.

ఉత్పాద్యము :—

పురాణప్రసిద్ధమైనదికాక కేవల కాల్పనికార్థమును గలది ఉత్పాద్య మనఁబడును.

మిశ్రము :—

పురాణార్థము, కల్పితార్థము నను నీరెండర్థములను గలుగునది మిశ్ర మనఁబడును.

నాటకేతివృత్తము ప్రఖ్యాతమైనదగుట మొదటి లక్షణము. ఇతివృత్త మాధికారికము, ప్రాసంగికము నన రెండువిధములుగ నుండును. ఆధికారికము కావ్యప్రధానమైనది. ప్రాసంగిక మంగభూతమైనది. మఱియు నాయకాద్యంతసంబంధివిషయ మాధికారికము, ఫలానంతరాదృశ్యవిషయము ప్రాసంగికము ననఁబడునది.

17. ప్రాసంగికము ద్వివిధము.

కథాసంబంధమునఁ జాలవఱకుఁ బ్రవర్తింపఁబడునట్టిది పతాకయనియు, తాత్కాలిక ప్రయోజనము కలది ప్రకరి యనియు ననఁబడు నొకరెండు విధములలోఁ బ్రాసంగికేతివృత్త ముండును. నాటకేతివృత్తమాధికారికమగుట రెండవ లక్షణము.

18. ఇతివృత్తము పురుషార్థప్రదము.

నాటకకథాఫలము నీతిని బోధించునది కాదు. సాంఘికాది సమస్యలను బరిష్కరించునదియుఁ గాదు. చారిత్రక కథన మంతకంటెను గాదు. దాని రుచి యమృతతుల్యము. దాని యనుభవము సుఖానుభవము. అది ధర్మార్థకామములను మఱియు మోక్షమును బ్రసాదించునట్టిది.

19. వస్తునాయకరసవిరుద్ధాంశములు త్యాజ్యములు.

వస్తువనఁగఁ గథ. నాయకుఁడు ఫలాధికారి. విభావానుభావసాత్త్వికవ్యభిచార్యాదిభావసమన్వయమున స్వాదుత్వమంది రసికానుభవసిద్ధమై నెగడు నటస్థాయిరసము. వీనికిఁజెందిన శాస్త్రానుభవ విరుద్ధములగు సకలకల్పనలు లేక ధర్మములు మున్నగు నంశములు త్యజింపఁదగునవి.

20. సంధ్యాదివిభజనము కర్తవ్యము.

నాటకేతివృత్తము బీజము, బిందువు, పతాక,



ప్రకరి, కార్యము ననఁబడు నైదువిధములైన యర్థప్రకృతులను గలిగియుండును.

బీజము :—

కావ్యార్థోత్పత్తికిఁ గారణమైన ప్రధానసమయము లేక విషయము లేక హేతువు బీజమనఁబడును.

బిందువు :—

కావ్యార్థవ్యాప్తి కవిచ్ఛిన్నమగు మార్గ మేర్పఱచెడు నన్యసమయసంబంధము లేక హేతువు బిందువనఁబడును.

పతాక :— (చూ. 17 సూ.)

ప్రకరి :— (చూ. 17 సూ.)

కార్యము :—

నాటకావధి కార్యమనఁబడును.

21. వస్త్వవస్థ లయిదువిధములు.

ఆరంభము, ప్రయత్నము, ప్రాప్తిసంభవము, నియతప్రాప్తి, ఫలయోగము, అను నీ యైదును నితివృత్తావస్థ లనఁబడునవి.

ఆరంభము :—

సంకల్పించుకొనిన కార్యమును జేయఁబూనుకొనునది యారంభ మనఁబడును.

ప్రయత్నము :—

తలఁచినది తలఁచినటులు నెఱవేఱకుండినయపుడు చేయఁబడు యోజనాదిక వ్యాపారమును గలది ప్రయత్న మనఁబడును.

ప్రాప్తిసంభవము :—

నిశ్చయింపఁబడిన యుపాయమున కన్యోపాయమున నపాయమగునేమోయని శంకింపఁబడు ఫలమునుగలది ప్రాప్తి సంభవము.

నియతప్రాప్తి :—

అపాయములేకయె లభ్యపడఁదగిన నిశ్చితఫలలాభ మును గలది నియతప్రాప్తి యనఁబడును.

ఫలయోగము :—

సమగ్రకావ్యఫలసిద్ధినిఁగలది ఫలయోగ మనఁబడును.

### 22. వస్త్వంతరసంబంధము సంధి.

వస్త్వంతరము లర్థప్రకృతులు, అవస్థలు. వీనికిఁ బరస్పరము కలుగు సంబంధము సంధి యనఁబడును. మఱియు నొక ప్రధానార్థమును గలిగిన కథాంశమునకు వేఱొకకథాంశముతోడి సంబంధమును సంధి యనఁబడును.

### 23. సంధు లయిదువిధములు.

ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శము, ఉప



సంహృతము లేక నిర్వహణము ననఁబడు నీ యైదునునాటక సంధులు.

ముఖము :—

బీజమనఁబడు నర్థప్రకృతితో నవస్థయను నారంభము నకుఁ గలుగు సంబంధము ముఖసంధి యనఁబడును.

ప్రతిముఖము :—

బిందువనఁబడు నర్థప్రకృతితోఁ బ్రయత్నమను నవ స్థకుఁ గలుగు సంబంధము ప్రతిముఖసంధి యనఁబడును.

గర్భము :—

పతాకార్థప్రకృతి నియమగహితమైనది. ఆకారణ మున ప్రాప్తిసంభవావస్థను గలది గర్భసంధి యనఁబడును. కావ్యార్థహేతువగు బీజార్థము మొదట నభావము, పిదపఁ బ్రాప్తము, మరలనభావము, తిరిగి యుపాయాంతరముల నిశ్చితము కాఁబడుట దీనిలక్షణమై యుండును.

అవమర్శము :—

అర్థప్రకృతియగు ప్రకరియుఁ బతాకవోలె నియమ రహితమైనది. ఆకారణమున నిరపాయమగు ఫలలాభమును గూర్చిన యోజననుగల నియతప్రాప్త్యవస్థనుగలది అవమర్శ సంధి యనఁబడును.

ఉపసంహృతము :—

కార్యమనఁబడు సర్వప్రకృతితో ఫలయోగమను నవస్థకుఁ గలుగు సంబంధము ఉపసంహృతసంధి యనఁబడును. కథానుపూర్వికసంధిప్రయోజనములను సమన్వయించుచు ఫలమును నిర్వహించునది కనుక నిది నిర్వహణసంధియనియు ననఁబడును.

## 24. ముఖసంధ్యంగములు పండ్రెండువిధములు.

ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, భేదము, కరణము, అను నీపండ్రెండును ముఖసంధ్యంగములు. సంధ్యంగ మనఁగఁ బ్రధానమైన సంధిభేదమునకవయవమువంటిదని భావము.

ఉపక్షేపము :—

కార్యహేతువగు పూర్వోక్తబీజార్థమును బ్రతిష్ఠించునట్టి వ్యాపారమునుగలది ఉపక్షేప మనఁబడును.

పరికరము :—

కార్యహేతువనఁబడు బీజార్థమును విస్తరించుధర్మమును గలభాషణము పరికర మనఁబడును.

పరిన్యాసము :—

కావ్యార్థమును సాధించుటకుఁదగిన కారణమైయుండు భాషణము పరిన్యాస మనఁబడును.



విలోభనము :—

కావ్యఫలార్థమునం దాసక్తినిఁ బెంచు స్వభావమును గల పాత్రభాషణము విలోభన మనఁబడును.

యుక్తి :—

కావ్యార్థము సిద్ధించుకొనుటకుఁ దగిన యుపాయములను వెదకునట్టి పనిఁగలిగిన పలుకులుతోఁగూడునది యుక్తి యనఁబడును.

ప్రాప్తి :—

కావ్యహేతుభూతమైన ఫలముయొక్క సుఖావాప్తి ప్రాప్తి యనఁబడును.

సమాధానము :—

నాయికానాయకులను జేరునట్టి కావ్యార్థమును గలది సమాధాన మనఁబడును.

విధానము :—

కావ్యార్థసంపాదకులగు నాయికానాయకులకు సుఖదుఃఖములను గలిగించునట్టిది విధాన మనఁబడును.

పరిభావన :—

బీజభూతార్థమున కన్యప్రసక్తిచేఁ గలుగు నద్భుతరసావేశము పరిభావన యనఁబడును.

ఉద్భేదము :—

కావ్యార్థప్రధానుల రాగక్రోధాదికబహుళభావప్రకటనమును గలది ఉద్భేద మనఁబడును.

భేదము :—

బీజభూతార్థకప్రోత్సాహమును గలది భేద మనఁబడును.

కరణము :—

కావ్యార్థఫలితమును గోరి నిశ్చితవిధమునఁ బని నారంభించుటను గలది కరణ మనఁబడును. ముఖసంధ్యంగములందలి యుపక్షేపపరికరపరిన్యాసయుక్త్యుద్భేదసమాధానములనునవి ముఖ్యముగ ననుసంధింపఁబడునవి. ఇతరములైచ్ఛికములు.

25. ప్రతిముఖాంగములు పదుమూఁడువిధములు.

విలాసము, పరిసర్పము, విధుతము, శమము, నర్మము, నర్మద్యుతి, ప్రగమనము, విరోధము, పర్యుపాసనము, వజ్రము, పుష్పము, ఉపన్యాసము, వర్ణసంహారము అను నీ పదుమూఁడును బ్రతిముఖాంగము లనఁబడును.

విలాసము :—

నాయికానాయకులయొక్క సమాగమవిషయిక మగు



ప్రేమానురాగరూపకమైన రతియనఁబడుదానికిఁ జెందిన కోరికను దెలుపునట్టిది విలాసమనఁబడును.

పరిసర్పము :—

లభించునటులు, లభింపనటులు, కనఁబడునటులు, కనఁబడనియటులు సంధిగ్ధావస్థలయందుండు కావ్యఫలార్థము కొఱకు ననుసరించునట్టి పనిఁగలిగినది పరిసర్ప మనఁబడును.

విధుతము :—

కోరినది లభింపనప్పుడును, అనిష్టము శంకింపఁబడునప్పుడును గలుగునట్టి చీకాకును గలది విధుత మనఁబడును.

శమము :—

ఉపాయాంతరముననో, దైవికముగనో తనకోరిక నెఱవేఱనున్నప్పుడు కలుగు మనశ్శాంతి శమ మనఁబడును.

నర్మము :—

నవ్వించు స్వభావమునుగల సరళాలాపము నర్మ మనఁబడును.

నర్మద్యుతి :—

నవ్వించునట్టి వాగ్రచనలచేఁ గావ్యఫలావాప్తియెడ ధైర్యమును బుట్టించునట్టిది నర్మద్యుతి యనఁబడును.

ప్రగమనము :—

నాయికానాయకులు తమతమ పరస్పరానురాగములు

తెలిసికొనుకొఱకు దూతికావిదూషకాదులతోఁ జేయు నుత్తర
ప్రత్యుత్తరములను గలది ప్రగమన మనఁబడును.

విరోధము :—

ఒకనికోరిక నెఱవేఱునున్నపుడు మఱియొకఁడు దానికి
విఘ్నమును గలిగించుటను గలుగునది విరోధ మనఁబడును.

అనునయపర్యుపాసనములు :—

శాంత్యాలాప మనునయ మనఁబడునది. అనునయా
లాపముల బ్రతిమాలుకొనునట్టిది పర్యుపాసన మనఁబడును.

వజ్రము :—

ప్రియాదిక సమక్షమునఁ బరుషములాడుటనుగలది
వజ్రమనఁబడును.

పుష్పము :—

నాయికానాయకుల యనురాగప్రకటనమును గలిగిన
లలితాలాపము పుష్ప మనఁబడును.

ఉపన్యాసము :—

అనురాగపోషకములు, ఉపాయకలితములునగు దీర్ఘా
లాపములనుగలది ఉపన్యాస మనఁబడును.

వర్ణసంహారము :—

బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములకుఁజెందిన
నాలుగువిధములవారిని వర్ణించునట్టిది వర్ణసంహార మనఁబడును.



26. గర్భసంధ్యంగములు పండ్రెండువిధములు.

అభూతాహరణము, మార్గము, రూపము, ఉదాహర
ణము, క్రమము, సంగ్రహము, అనుమానము, తోటకము,
అధిబలము, ఉద్వేగము, సంభ్రమము, ఆక్షేపము అను నీ
పండ్రెండును గర్భసంధ్యంగము లనఁబడును.

అభూతాహరణము :—

తనకోరిక నీడేర్చుకొనుకొఱకుఁ దాఁజేయునట్టి కపట
వ్యాపారమునుగలది అభూతాహరణ మనఁబడును.

మార్గము :—

సంకల్పార్థమును యథాస్థితి నెఱిఁగించునట్టిది మార్గ
మనఁబడును.

రూపము :—

కావ్యార్థమును లేక సంకల్పార్థమునుగూర్చిన వితర్క
మును గలిగిన వాక్యము రూపమనఁ బడును.

ఉదాహరణము :—

విషయము నున్నదానికంటె నెక్కుడుగ వర్ణించి చెప్పు
నట్టిది ఉదాహరణ మనఁబడును.

క్రమము :—

తలఁచుచున్నట్టిది నెఱవేర్పఁబడుటను గలది క్రమమనఁ
బడును.

సంగ్రహము :—

సామదానభేదోపాయములచేత నితరులను వశపఱచు కొనునట్టి నేర్పునుగలది సంగ్రహ మనఁబడును.

అనుమానము :—

కార్యఫలమునుగూర్చిన సంశయమునుగలది అను మాన మనఁబడును.

తోటకము :—

ఆగ్రహావేశమును గలుగునట్టిది తోటక మనఁబడును.

అధిబలము :—

కార్యమునకై కపటోపాయమును బ్రదర్శించినవాఁడు తత్ఫలము సిద్ధించినపుడు, సిద్ధింపనున్నపుడు తనకుఁదానులేక యితరులతోఁ బొగడుకొనునట్టి భావముకలది అధిబల మనఁ బడును.

ఉద్వేగము :—

అరిజనమువలనఁజేయఁబడిన భీతినిఁగలుగునట్టిదిఉద్వేగ మనఁబడును.

సంభ్రమము :

శంకయు, భయమును జతపడుటచేఁ గలుగు తత్తర పాటు లేక తొట్రుపాటునుగలది సంభ్రమ మనఁబడును.



ఆక్షేపము :—

కార్యసాధనకుఁ గారణమైన బీజార్థమును బ్రకటించు నట్టిది ఆక్షేప మనఁబడును. అభూతాహరణము, మార్గము, తోటకము, అధిబలము, ఆక్షేపము ప్రధానములు. అన్య ములు యథాయోగ్యప్రవేశమును గలవి.

## 27. అవమర్శసంధ్యంగములు పదుమూఁడు విధములు.

అపవాదము, సంఫేటము, విద్రవము, ద్రవము, శక్తి, ద్యుతి, ప్రసంగము, ఛలనము, వ్యవసాయము, విరోధనము, ప్రరోచనము, విచలనము, ఆదానము అను నీ పదుమూఁడును అవమర్శసంధ్యంగము లనఁబడును.

అపవాదము :—

అన్యులందలి లోపములను వ్యాప్తిపఱచునట్టిది అప వాద మనఁబడును.

సంఫేటము :—

రోషముతోఁగూడిన భాషణము సంఫేట మనఁ బడును.

విద్రవము :—

చంపుట, నఱకుట, ఆటంకపఱచుట, అదుపులో నుం చుట మున్నగునవి కలది విద్రవ మనఁబడును.

ద్రవము :—

పెద్దలు, గురుజనులు, విద్యావిశారదులు, మున్నగు పూజ్యులను నిందించునట్టిది ద్రవమనఁబడును.

శక్తి :—

విరోధభావము నశించుటనుగూర్చినది శక్తి యనఁ బడును.

ద్యుతి :—

అదలించుట, భయపెట్టుట, పరాక్రమించుటను గలది ద్యుతి యనఁబడును.

ప్రసంగము :—

వృద్ధులు, గౌరవార్హులు నగువారిని స్తుతించు వచనములను గలది ప్రసంగ మనఁబడును.

ఛలనము :—

వంచించుట, తిరస్కరించుట, అవమానించుట, మోసపుచ్చుట మున్నగు భావములనుగలది ఛలన మనఁ బడును.

వ్యవసాయము :—

తన సామర్థ్యమునుగూర్చి చెప్పుకొనునట్టి పలుకులను గలది వ్యవసాయ మనఁబడును.



విరోధనము :—

కోపాటోపమునఁ బలుకఁబడునట్టిది విరోధన మనఁ బడును.

ప్రరోచనము :—

భావిఫలమునుగూర్చి ప్రశంసించుకొనునట్టి పలుకు లనుగలది ప్రరోచన మనఁబడును.

విచలనము :—

తన గుణములను దాను వెల్లడించుకొనునట్టిది విచలన మనఁబడును.

ఆదానము :—

తలఁచినకార్యమును గ్రహించి పలుకునట్టిది ఆదాన మనఁబడును. అపవాద, శక్తి, వ్యవసాయ ప్రరోచనాదాన ములు ముఖ్యములు. శేషము లైచ్ఛికములు.

### 28. నిర్వహణసంధ్యంగములు పదునాలుగు విధములు.

సంధి, విబోధము, గ్రథనము, నిర్ణయము. పరిభాష ణము, ప్రసాదము, ఆనందము, సమయము, కృతి, భాష ణము, ఉపగూహనము, పూర్వభావము, కావ్యసంహారము, ప్రశస్తి అను నీ పదునాలుగును నిర్వహణసంధ్యంగము లనఁ బడును.

సంధి :—

కావ్యహేతువగు బీజార్థము కావ్యఫలావాప్తికిం గారణమై పఱఁగినవిషయమునకుం జెందినక్రమాభివర్ణనమునుగలది సంధి యనంబడును.

విబోధము :—

కావ్యకార్యమును వెదకుటనుగలది విబోధ మనంబడును.

గ్రథనము :—

కావ్యకార్యమును స్థిరపఱచుటనుగలది గ్రథన మనంబడును.

నిర్ణయము :—

కార్యసాధనకొఱకుం దానుబడిన కష్టనిష్ఠుర విషయములను దెలుపునట్టిది నిర్ణయ మనంబడును.

పరిభాషణము :—

ఇద్దఱుచేరి యొకదానినిఁగూర్చి యాలోచించు మాటలను గలది పరిభాషణ మనంబడును.

ప్రసాదము :—

కార్యసిద్ధినిం దెలిసి సంతసించుం బలుకులనుగలది ప్రసాద మనంబడును.



ఆనందము :—

తానుగోరినది నెఱవేఱుటచేఁ గలుగునట్టిది ఆనంద మనంబడును.

సమయము :—

దుఃఖమును బాసియుండునట్టిది సమయ మనంబడును.

కృతి :—

ప్రాప్తార్థమును స్థిరపఱచుకొనునట్టిది కృతి యనంబడును.

భాషణము :—

అభిమతార్థ మీడేరిన యనంతరమునం గలుగు నుత్సాహసంతోషములతోఁ గూడిన శాంత్యాలాపములను గలది భాషణ మనంబడును.

ఉపగూహనము :—

ఆశ్చర్యప్రదమైన కావ్యార్థమును బడయునట్టిది ఉపగూహన మనంబడును.

పూర్వభావము :—

కావ్యకార్యమును సాభిప్రాయమునం జూచునట్టిది పూర్వభాషణ మనంబడును.

కావ్యసంహారము :—

కోరినవరము లిచ్చునట్టిది కావ్యసంహార మనఁబడును.

ప్రశస్తి :—

కావ్యాంతమున శుభప్రశంసనుగలది ప్రశస్తి యనఁబడును. ఇట్టిది రూపకాంతముల భరతవాక్యమను పేరునఁ జేయఁదగియుండును.

29. సంధ్యంగములు షట్ప్రయోజనములను గలవి.

ప్రధానాంశమును బ్రకటించుట, తలఁచినదానినిఁ జెప్పుట, గుప్తార్థమును దాఁచుట, సంతోషాసక్తులను గలిగించుట, కథకుఁ జమత్కారమును బెంచుట, కథను సరసముగ విస్తరింపఁజేయుట మున్నగు కార్యములు, ఫలములు సంధ్యంగ సౌలభ్యమున రూపకములకుఁ జెందింపఁబడునవి.

30. నాటకోపక్రమ మంకవిష్కంభపురస్కృతము.

నాటకాదిని అంకము లేక విష్కంభము నుండఁదగునది. రసవంతమైన కథావకాశమును గల నాటకమంక పురస్కృతమై ప్రారంభింపఁదగునది. కొంత నిస్సారమైన దగునేని యట్టిది విష్కంభరూపమున నాటకాదియందు సూచింపఁదగి యుండును.



అంకము :—

వస్తువు నాయికానాయకులకు లేక నాయకప్రతినాయకులకుఁ జెందియుండుట, అది యొకదినమున జరుగఁదగునదిగ నుండుట, మూఁడు లేక నాలుగుపాత్రములతోఁ గూడి యుండుట మున్నగునవి అంకలక్షణములుగ నెగడునవి.

31. విష్కంభము లైదువిధములు.

విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకాస్యము, అంకావతారము అను నీ యైదును నిస్సారములగు కథాంశములను సూచించునట్టి ప్రయోజనమును గలవి.

విష్కంభము :—

భూతభవిష్యద్వస్తువివరములను మధ్యమపాత్రలచేఁ జెప్పించునట్టిది. ఇది రెండువిధములు. ఒకరిద్దఱు మధ్యమపాత్రములతోఁ గూడునది శుద్ధ విష్కంభమనియు, అంతకంటె నెక్కుడు పాత్రములనుగలది, మధ్యమాధమ పాత్రములతోఁ గూడునది సంకీర్ణవిష్కంభమనియుఁ జెప్పఁబడును.

ప్రవేశకము :—

నీచపాత్రములతో మాత్రము చెప్పింపఁబడు సూచ్యాంశములను గలది ప్రవేశక మనఁబడును.

చూళిక :—

రంగాంతరమునుండి లేక నేపథ్యాంతరమునుండి సూ

చింపఁబడు కథాంశమునుగలది చూళిక యనఁబడును.

అంకాస్యము :—

అంకము ముగియునవసరమున నొకపాత్ర ప్రవేశించి యుత్తరాంక కథాంశమును సూచించుటను గలది అంకాస్య మనఁబడును.

అంకావతారము :—

విష్కంభప్రవేశకాదులు లేకయే అంకాంతపాత్ర ప్రసంగము లుత్తరాంకార్థమును సూచించుటనుగలది అంకావతార మనఁబడును.

### 32. శృంగారవీరములు నాటకయోగ్యములు.

శృంగారవీరకరుణాద్భుతాద్యష్టరసములలోనెల్ల శృంగారవీరము లనఁబడు నొకరెండురసములే నాటకమునకుఁ బ్రధానములుగా నుండఁదగునవి. ఇట్టివే యంగిరసము లనఁబడునవి. శేషించునవి సహాయభూతములగు నుపరసము లనఁదగునవి. ఇవి యంగరసములనియుఁ జెప్పఁబడునవి. ఆయా ప్రధానరసములు సభ్యాస్వాదమును బడయుటకు వలయు నుపక్రమోపసంహారములు నాటకములందంతట సలక్షణలక్షితములై యుండఁదగునవి. కవినటుల శాస్త్రలోకానుభవములచే నాయా ప్రధానరసములు సమన్వయింపఁబడినాటకములు, వాని ప్రయోగములు రసవంతము లనఁబడుచున్నవి.



### 33. వస్తునాయకరసవైరుధ్యములు త్యాజ్యములు.

రసాంశమునకుఁ జెందని యప్రస్తుత విషయాభివర్ణనములతోఁ గూడిన కథారచనలు వస్తువైరుధ్యములు. ఉదాత్త శృంగారనాయికానాయకులయందు లేక వీరరసప్రధానులగు నాయకప్రతినాయకులయందుఁ దత్తద్రసేతరములగు గుణముల నారోపించునట్టి రచనలు నాయకవైరుధ్యములు. మిత్రామిత్ర రసతత్త్వముల నెఱుంగక కల్పింపఁబడిన యంగాంగిరససంబంధములు రసవైరుధ్యములు. ఇట్టివి నాటకములం దుండఁ దగవు.

మిత్రరసములు.

శృంగారము — హాస్యము.
రౌద్రము — కరుణ.
వీరము — అద్భుతము.
బీభత్సము — భయానకము.

విరోధిరసములు.

శృంగారము — బీభత్సము.
వీరము — భయానకము.
రౌద్రము — అద్భుతము.
హాస్యము — కరుణ.

## రససంచారులు.

**శృంగారము :—**

ఇందన్ని సంచారిభావములును యథాయోగ్యప్రయోగమును గలిగియుండునవి. వీనిలక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

**వీరము :—**

అమర్షము, విబోధము, వితర్కము, మతి, ధృతి, క్రోధము, అసూయ, సమ్మోహము, ఆవేగము, హర్షము గర్వము, మదము, ఉగ్రత్వము నను నీ పదునొకండుసంచారభావములు యోగ్యములు. వీనిలక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

దైన్యము, చింత, గ్లాని, నిర్వేదము, జాడ్యము, స్మృతి, వ్యాధి యోగ్యములు. వీనిలక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

**అద్భుతము :—**

ఆవేగము, జాడ్యము, మోహము, హర్షము, విస్మయము, స్మృతి యోగ్యములు. వీనిలక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

**హాస్యము :—**

శ్రమము, చాపల్యము, నిద్ర, స్వప్నము, గ్లాని, శంక,



3. రతిస్థాయి (చూ. పు. 61)



2. ఉత్సాహము (చూ. పు. 61)



1. శోకము (చూ. పు. 61)



1. దక్షిణనాయకుడు (చూ. పు. 179) 2. శఠనాయకుడు (చూ. పు. 179)
3. ధృష్టనాయకుడు (చూ. పు. 179) 4. అనుకూలుడు (చూ. పు. 178)



అసూయ, అవహిత్థ యోగ్యములు. వీని లక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

భయానకము :—

సంత్రాసము, మరణము, దైన్యము, గ్లాని యోగ్యములు. వీని లక్షణములు (చూ. ప్ర. 105. సూ.)

బీభత్సము :—

అపస్మారము, విషాదము, భయము, రోగము, స్మృతి, మదము, ఉత్సాహము యోగ్యములు. వీని లక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

రౌద్రము :—

హర్షము, అసూయ, గర్వము, ఉత్సాహము, మదము చాపల్యము, ఉగ్రత్వము యోగ్యములు. వీని లక్షణములు (చూ. ప్ర. 105 సూ.)

ఇట్టి క్రమమును బడయక యుండునవన్నియు రసవైరుధ్యములు. నాటకమున కట్టివి త్యాజ్యములు.

**34. అంగిరసపోషణము సర్వత్రయోగ్యము.**

ఉపరసాత్మక ప్రధానరస మంగిరసము. నాటకాంగిరసములు శృంగారవీరములు. కవి తనదు భాషాస్వాతంత్ర్య

మును ననుసరించి వానిని బోషించును. నటుఁడు కవి హృదయము ననుభవించి చతుర్విధాభినయములలో వానిని నయించును. ఇప్పట్టునఁ గవికంటె నటుఁ డింకను బ్రతిభా విశేషమును బ్రకటించు మూలమున సంగిరసపోషణ మొన ర్పఁదగి యుండును. కవి నటు లిరువురకును నీ విధి దాఁటఁ దగునది కాదు.

### 35. నిర్వహణసిద్ధ మద్భుతము.

నాటకము ముఖ్యముగ ముఖప్రతిముఖావమర్శ నిర్వహణము లనఁబడు నాల్గు సంధిభేదములను గలిగియుండు నది. అందలి నాటకాంతప్రసిద్ధమగు నిర్వహణసంధియం దద్భుతరసము ప్రధానముగ నుండఁదగునది. ఇటులే యాయా రసభేదములనుబట్టి కైశికి, సాత్వతి యనఁబడు వృత్తులును (మూ. త్ర. 10. 11. సూ.) జతపఱచఁదగునవి.

### 36. యుద్ధాదులు సూచ్యములు.

యుద్ధము, దూరయానము, వధము, రాజ్యదేశాది విప్లవము, బలవంతము, భోజనము, స్నానము, సురతము, స్నానానులేపనము, వస్త్రాపహరణము మున్నగునవి ప్రవేశక విష్కంభాదులచే సూచింపఁదగునవి.

### 37. నాయకవధాదులు సర్వథాగర్హ్యములు.

నాయకవధము, నాయకపరాభవము మున్నగు దృశ్య



ములు నాటకమున నుండఁదగవు. అట్టివి త్యాజ్యములు, గర్హ్యములు నగు.

### 38. ప్రధానాంశము లపరిత్యాజ్యములు.

లక్షణవిరుద్ధవిషయమైనను నయ్యది కథాప్రాధాన్య మును గలిగినపట్టున విడువఁదగదు. రసోచితమగు శబ్దము విలక్షణమైనదైనను బ్రయోగార్హతను నెటులు పడయఁ దగి యుండునో యటులే సూచ్యములగు యుద్ధాదులును నాటకాదులందు వాని ప్రాధాన్యమునుబట్టి ప్రయోగార్హ ములగును. అయిన నట్టివి రాంగికమర్యాదల నతిక్రమింపఁ దగవు.

### 39. పాత్రైకనిర్గమ మంకాంతము.

సకలపాత్రములకును జెప్పఁబడిన నిష్క్రమమును గలది యంకమున కంత మనఁబడునది. పతాకాస్థానకము తదం గము. అంకాంతములగు పాత్రల ప్రసంగములు, కార్య ములు, మున్నగునవి రాఁబోవు నంకమును లేక ప్రధానవిషయ మును స్ఫురించునట్టివిగ నుండుట యంకాంతమునకుఁ బ్రధాన ధర్మము లేక యవయవమునై యుండఁదగునది.

### 40. ప్రవేశకాదు లంకపూర్వస్థములు.

సూచ్యములగు ప్రవేశక విష్కంభాదు లంకములకు మొదట నుండఁదగునవి. అంకమధ్యస్థములు కాఁబడవు.

### 41. ఆపంచదశాంకము నాటకము.

ఐదు మొదలుకొని పది యంకములవఱకును వ్యాప్తి కలుగునట్టిది నాటక మనఁబడును. ఐదుకుఁ దగ్గియు, పదికి హెచ్చియు నుండునంకములు కలది నాటకము కాదు.

### 42. ప్రకరణము నీత్యాత్మకము.

లోకోపకారకములగు పెక్కునీతులు, ధర్మములు, న్యాయములు, మున్నగు సన్నివిధములైన యంశములను బోధించుపనినిఁ బ్రధానముగను, రసము నుపాంగముగను గలిగి రెండవ నాటకముగఁ దనరునట్టిది ప్రకరణ మనఁబడును.

### 43. ఇతివృత్తముత్పాద్యము.

ప్రకరణబద్ధమగు కథ ప్రఖ్యాతమైనది కానక్కఱలేదు. లోకోత్తరాంశ మొకదాని నాధారముగఁగొని చెప్పఁదలఁచిన ధర్మము లేక నీతి సమగ్రముగఁ బ్రకటింపఁబడుభంగిఁ గవిచే సృష్టింపఁబడిన కథఁగల దీ ప్రకరణము.

### 44. ప్రకరణనాయకుఁడు ధీరశాంతుఁడు.

సర్వసామాన్య నయదయా సత్యశౌచాదిక సుగుణ సంపన్నుఁడు, ప్రశాంతచిత్తుఁడునై విప్రవణిజామాత్యులకుఁ జెందిన ధీరశాంతనాయకుఁడు ప్రకరణములచే ముఖ్యముగ



నభివర్ణింపఁబడువాఁడు. ఈతని భావములు, ప్రవర్తనములు లోకమునకు శ్రేయమును సంపాదించునవగుటనుజేసి యేతన్నాయకాధికృతమగు ప్రకరణప్రచారము ప్రస్తుతకాలమునకు మిక్కిలి కాఁదగునది. మఱియు నది నైతికముగనె కాక సాంఘికరాజకీయాద్యశేష ధర్మప్రబోధకమునను గూడ నుపకరించునది.

### 45. త్రివిధనాయికలు ప్రకరణపరిగ్రాహ్యలు.

పాణిగృహీతయగు కులజ ప్రకరణనాయిక కాఁదగునది. ఆ పిమ్మట సామాన్యయగు గణికయుఁదగు. అటులు కాక కులస్త్రీ, గణిక యను వీ రిర్వురును, నాయికలు కాఁదగియుందురు. కాని యిప్పట్టున లోకధర్మానుగుణ్యముగఁ గులజకు నాయకగృహావలంబనము, వేశ్యకు నన్యగృహావలంబనము కాఁదగునది. తద్ధర్మాతిరేక కథాకల్పన మనర్థదాయకము. అట్టిది త్యాజ్యము.

### 46. ప్రకరణము త్రివిధము.

వస్తునాయకరసాది ధర్మములచే నీ ప్రకరణ మనునది సంకీర్ణము, ధూర్తము, సంకులము నన నొక మూఁడువిధముల నుండునది.

సంకీర్ణము :—

చౌర్యద్యూతాదిక వ్యాపారనిబద్ధము, ఉభయా

నాయికాప్రాధాన్యము, నీతి, శృంగారము, కైశికీవృత్తి మున్నగునవి కలది సంకీర్ణ మనఁబడును.

ధూర్తము :—

కపటవ్యాపారభరితము వేశ్యాది సామాన్యనాయికా విశిష్టము నగునది ధూర్త మనఁబడును.

సంకులము:—

కులజానిబద్ధము, కైశికీసంకలితము, లోకప్రసిద్ధము, శృంగారప్రదము, నీతిబోధకము నగునది శుద్ధము లేక సంకులము ననఁబడునది.

ప్రస్తావనాదులు నాటకతుల్యములు.

ప్రస్తావనాంకప్రవేశకాదులు, రసములు, వృత్తులు, నిర్వహణము మున్నగు సన్నిధర్మములు నాటకమునందువలెఁ ప్రకరణమందును నుండఁదగునవి.

47. భాణ మేకాంకము.

విష్కంభాది సూచ్యవస్తు పురస్కృతము లేక కేవలాంకము నగు నొక్క యంకమును మాత్రము కలది భాణ మనఁబడును.



48. ఇతివృత్తము కల్పితము, ప్రవృద్ధమునగు.

భాణసంబంధికథ పురాణప్రసిద్ధమైనది కాదు. అది కవిచే భారతీవృత్తిలో వర్ణింపఁబడునది.

49. నాయకుఁడు ధూర్తుఁడు.

స్వీయానుభవమును ప్రకటించునట్టిదో లేక యన్యానుభవ మభినయింపఁదగునట్టిదో యగు భాణనామక కావ్యదృశ్యమునకు ఫలస్వామి లేక యధికారి యగువాఁడు ధూర్తుఁడుగ నుండును.

50. అది విటప్రవర్తితము.

ధూర్తుఁడు నాయకానర్హుఁడు. భాణ మేకపాత్రైక బద్ధము. ఇట్లగుటచే వస్త్వధికారియు, ప్రయోగదక్షుఁడును సర్వసమర్థుఁడును నగు తన్నటుఁడు విటుఁడు కాఁదగి యుండును.

51. ఆకాశభాషణములు వస్తువిస్తరములగు.

నాటకాదులవలె నీ భాణము సమగ్ర సంధ్యంగాది సౌలభ్యమునుగలది కాదు. అర్థప్రకృతులు తత్సదృశావస్థలు భాణమున మృగ్యములగుటచే నేపథ్యము నుద్దేశించియు, ఆకాశపార్శ్వాదికములను లక్షించియు నవసరమునుబట్టి రసపోషకములు, భావవిస్తరణ ప్రధానములునగు కొన్ని సంబో

ధనలు యుక్త్యాలాపములు కల్పింపఁబడఁదగియుండును. అట్టివి యభినయావకాశములను గలిగించియు, అనుభావ సంచారిభావములను బెంచియు రసనిష్పత్తినిఁ బ్రసాదింపఁ గలవు. ఇట్టివి సర్వథా భాణకథాలంబనములుగ నెగడునవి.

## 52. ముఖనిర్వహణములు ముఖ్యములు.

ముఖనిర్వహణములు సంధిభేదములు. వాని లక్షణములు (చూ. పం. 23 సూ.) వివరింపఁబడినవి. సాంగములగు నీ రెండు సంధులును భాణమున ముఖ్యముగ ననుసంధింపఁదగి యుండునవి. గద్యపద్య గీతాత్మకములగు నన్నివిధములైన పాఠ్యభేదములు, లాస్యతాండవాది నృత్తభేదములు, శ్రవ్యభేదములు మున్నగునవియు జతపఱచఁ దగునవి.

## 53. భాణప్రసంగము లుభయరసాత్మకములు.

శౌర్యభావాభివర్ణనమున వీర స్ఫురణము, ప్రేమానులాపలాలిత్యమున శృంగారస్ఫురణము నను నీ రెండువిధములైన రసస్ఫురణములలో భాణప్రసంగములు ప్రవర్తింపఁబడఁదగునవి.

## 54. ప్రహసనము త్రివిధము.

శుద్ధము, వికృతము, సంకీర్ణమునన నీ ప్రహసనము మూఁడు విధములుగ నుండునది.



శ్రీ రంగవడివేలు మొదలియారుగారు, బి. ఏ., బి. యల్



(ఊర్వశి) శ్రీ రంగవడివేలు మొదలియారుగారు
సుగుణవిలాససభ, మదరాసు



## 55. ఇతివృత్త ముత్పాద్యము.

భాణమునకువలెనె కవికల్పితవస్తువు ప్రహసనమునకును మాత్రకగ నుండఁదగునది. ఏకాంకము, ముఖనిర్వహణ సంధులు, తదంగములు, గీతనృత్తాదికములు, పద్యగద్య గేయములుకూడ భాణప్రాయ్యముగ నుండఁదగునవి. ఇది సాంఘికాది మాధ్యములయొక్క విపరీతభావవికారములను పాత్రల హాస్యప్రసంగములలో లలితముగను మనోహరముగను డెల్లముఁజేయునట్టి ప్రయోజనమును గలది.

శుద్ధము :—

పాషండులు, విద్యాదిసంస్కార విహీనులు, బ్రాహ్మణ నామధారులు నగు నల్పజనుల వ్యావహారికాంశములందలి ముగ్ధభావాదులను ముద్దుగ విశదీకరించునట్టిదియు, విటచేటు లకుఁ జెందిన నాయకునిఁ గలదియు, హాస్యరసాత్మకమైనదియు నగు ప్రహసనము శుద్ధ మనఁబడును.

వికృతము :—

విపరీతధర్మాలంబనము, హాస్యాత్మకము నగునది వికృత మనఁబడును.

సంకీర్ణము :—

ముఖనిర్వహణసంధులు, వీధ్యంగములు, ప్రస్తావనోచి

తములగు సంగలక్షణములు, పద్యగద్యగేయములు, నృత్త గీతవాద్యములు, ధూర్తవ్యాపారములు కలిగి కలగూరగంపవలె నుండుటనుజేసి సంకీర్ణ మనఁబడునది. ఇదియు హాస్యరసా త్మకమే యగునది.

56. డిమము బహునాయకసంకలితము.

దానవాదులగు పదునలుగు రుద్ధతనాయకులతోఁ గూడియు, డిమసంఘాతసదృశవ్యాపారమునుగలిగియు నిది డిమ మనఁబడుచున్నది.

57. వస్తువు ప్రఖ్యాతము.

డిమనామకరూపకమునకుఁ జెందిన కథ పురాణేతిహా సములకుఁ జెందినదై యుండునది.

58. డిమము చతుస్సంధిసంభరితము.

అవమర్శసంధిదక్క శేషించిన ముఖప్రతిముఖగర్భ నిర్వహణములను నాలుగు సంధులను గలిగియుండునది.

59. రసము రౌద్రము.

రౌద్రరసమిం దభివర్ణింపఁదగునది. మఱియు నది కైశికికాక సాత్వతి, ఆరభటి, భారతి యనఁబడు మూఁడు వృత్తులలో, నాలుగంకములలో విస్తరింపఁ బడఁదగునది.



60. ఆముఖాదులు నాటకతుల్యములు.

నాంది, ప్రస్తావము, తదంగములు, పాత్రప్రవేశములు మున్నగునవన్నియు నాటకమునకువలె డిమమునకును నుండు నవి.

61. వ్యాయోగము బహునాయకనిబద్ధము.

పలువురు నాయకుల కూడికనుగలది వ్యాయోగ మనఁ బడునది.

62. ఇతివృత్తము ఖ్యాతము.

వ్యాయోగరూపక కథాంశము కల్పితముకాక పురా ణేతిహాసాదులకుఁ జెందినదై యుండునది.

63. నాయకు లుద్ధతులు.

ఉద్ధతనాయకలక్షణములు కల (చూ. తృ. 2 సూ.) యనేకు లిందు నాయకులుగ నుండురు.

64. వ్యాయోగము ససంధిత్రయము

ముఖము, ప్రతిముఖము, నిర్వహణము ననెడు మూఁడు సంధులను గలది వ్యాయోగము.

ముఖము :—
ప్రతిముఖము :— } (చూ. 23 సూ.)
నిర్వహణము :—

### 65. యుద్ధమస్త్రీనిమిత్తము.

వ్యాయోగయుద్ధకారణము స్త్రీజనమునకుఁ జెందునదిగ నుండఁదగదు.

### 66. హాస్యశృంగారేతరములు రసములు.

హాస్యశృంగారములుకాక శేషించిన వీరాది షడ్రసములు ప్రయోగార్హములగు.

కైశికీవృత్తికాక కడమ సాత్వతి, ఆరభటి, భారతి వృత్తులు మూఁడును వ్యాయోగము కలిగియుండునది.

### 67. ఏకాంకచరితము వ్యాయోగము.

ఒక్కదినమున జరుగఁదగిన కథాంశము, ఒక్కయంకమున నభివర్ణింపఁబడుట వ్యాయోగమునకుఁ బ్రధానలక్షణముగ నుండఁదగునది.

### 68. ప్రస్తావము నాటకసామ్యమునుగలది.

నాందీవాదము, మనోజ్ఞగీతాలాపము, వస్తూపక్షేపము, స్థాపన మున్నగు లక్షణములు నాటకమందువలె నుండఁదగునవి.

### 69. బహుళప్రయోజనములనుగలది సమవాకారము.

పెక్కు నాయకులచే నుద్యమింపఁబడునది, పెక్కు



ప్రయోజనములనుగలది యగుటచే నిది సమవాకార మనఁబడుచున్నది.

### 70. ఇతివృత్తము ప్రసిద్ధమైనది.

పురాణేతిహాసాదులకుఁ జెంది లోకప్రసిద్ధిఁ బడసినట్టి దిందలి కథ.

### 71. ద్వాదశనాయకులనుగలది.

ఇందు దేవదానవాదులకుఁ జెందిన యొక పండ్రెండుగురు ఫలస్వాములు, అధికారులునై యుండుటచే సమవాకారము ద్వాదశనాయక మనఁబఱఁగుచున్నది.

### 72. సమవాకారమున కంగి వీరము

ఇందెన్ని యుపరసాంగములు సంధింపఁబడియుండినను నాద్యంతము వీరరసము ప్రధానముగఁ గన్పట్టును.

### 73. సమవాకారము సంధిచతుర్థము.

అవమర్శసంధి విడిచి శేషించిన ముఖము, ప్రతిముఖము, గర్భము, నిర్వహణము ననునీ నాలుగుసంధులను గలిగి యుండునది.

### 74. సమవాకారము త్ర్యంకము.

కపటశ్శృంగారోపద్రవాత్మకములగుమూఁడంకములను గలిగియుండునది.

కపటము :—

స్వభావముచేనైనది లేక శత్రువశముననో దైవవశముననో తటస్థించిన కార్యాదికవిఘ్నములను గలది కపట మనఁబడును.

శృంగారము :—

పురుషార్థప్రదము నాయికానాయకోభయాత్మకము నగు కథాభివర్ణనమునుగలది శృంగార మనఁబడును.

ఉపద్రవము :—

అగ్ని, వాయువు, యుద్ధము, అవరోధము మున్నగు వానిచే జనించు విద్రవ ముపద్రవ మనఁబడును.

### 75. బింద్వాదు లప్రయుక్తములు.

బిందువు, ప్రవేశకము, ఇందనుసంధింపఁబడవు.

### 76. ప్రస్తావన నాటకతుల్యము.

ప్రస్తావన, తదంగములు, వీథ్యంగములు నాటకము నకువలె నుండఁదగునవి.



### 77. అష్టాదశనాడీనిబద్ధము సమవాకారము.

నాడియన రెండు గడియలకాలము. ప్రథమాంకము పండ్రెండునాడులు, ద్వితీయము నాలుగునాడులు, తృతీయము రెండునాడులు గలిగియుండునది.

### 78. వీథి భాణతుల్యము.

ఇందలి ఇతివృత్తము కవికల్పితమై యుండును. ఒకటి రెండు పాత్రములకు మాత్రమే చెందియుండుట, ఒక్కటే యంకమును గలిగియుండుట, సాంగములగు ముఖనిర్వహణ సంధు లనుసంధింపఁబడుట, శృంగారరసప్రాధాన్యమగుట, కైశికీవృత్తి పరిగణింపఁబడుట దీని ప్రధానలక్షణములై యుండును. శృంగారేతరములగు రసము లుపరసములుగా నుండును. వీథ్యంగములు, గీతపాఠ్యాదికములగు లాస్యాంగములు యథాయోగ్యప్రయోగమును గలిగియుండునవి.

### 79. అంకేతివృత్తము ద్వివిధము.

అంకము లేక ఉత్సృష్టికాంకము ననఁబడు నీ రూపకమునకుఁ జెందిన కథ పురాణప్రసిద్ధముకాని లేక కల్పితమైనది కాని కాఁదగును.

### 80. అంకము ప్రాకృతనాయకప్రసిద్ధము కరుణరస ప్రధానమునగు.

అంకమనఁబడు నీ రూపకమునకుఁ జెందిన నాయకులు

ప్రకృతిప్రసిద్ధులై యుందురు. పాత్రపోషణాది కార్యములు తత్తదుచితానుభవపురస్సరమ్ములగుట మిక్కిలి సమంజసము. కరుణరస మిందుఁ బ్రధానముగ నుండఁదగునది. ఏరాదు లుపరసములుగ నుండఁదగునవి.

## 81. యుద్ధాదులు వాఙ్మాత్రసూచ్యములు.

యుద్ధము, తత్సంబంధి జయాపజయములు, ఇందు వాక్కులచేతనే సూచింపఁబడునవి. ప్రత్యక్షమునఁ బ్రదర్శింపఁ బడునవి కావు. స్త్రీసంబంధి శోకస్థాయి సర్వసామాన్య ముగ నంకమునఁ గన్పడఁదగునది.

## 82. సంధివృత్త్యంగములు భాణతుల్యములు.

సంధులు, వృత్తులు భాణమునకువోలె అంకమునకును నుండఁదగునవి. ముఖనిర్వహణములు ముఖ్యములు. భారతీ వృత్తి, కైశికీసాత్వతులు యోగ్యములు.

## 83. ఈహామృగేతివృత్తము త్రివిధము, చతురంకము నగు.

మృగిఁబోలిన మృగమువలె నాయికనుగూర్చి వెన్నాడు నట్టి నాయకునిఁ గలిగినదగుటచే నీరూపక మీహామృగ మనఁ బడుచున్నది. దీని కథ పురాణప్రసిద్ధమైనదియు, కవిచేఁ గల్పింపఁబడినదియు లేక ప్రఖ్యాతకల్పితము లనఁబడు నీరెండు



విధములైన వస్తువులను గలిగి మిశ్రమమైనదియునై నాలు గంకములలో నుండును.

## 84. గర్భావమర్శములు త్యాజ్యములు.

ముఖ ప్రతిముఖ నిర్వహణము లనఁబడు నీ మూఁడు సంధులు మాత్రమె యిందు జతపఱచఁదగునవి. శేషించిన గర్భావమర్శములు విడువఁదగునవి.

## 85. నరదివ్యులు నాయకప్రతినాయకులు.

ధీరోద్ధతలక్షణము లొందవిన నరదివ్యు లనఁబడు నీయిరు వురిలో నెవఁడో యొకఁడు నాయకుఁడు, వేఱొకఁడు ప్రతి నాయకుఁడు కాఁదగియుండును.

## 86. ఈహామృగము నాలుగంకములు, మూఁడు సంధులుగలది.

అనురాగవిహీనయగు నాయికను బలాత్కరించుట, బెదరించుట, హింసించుట మున్నగు రసాభాసములుగలకథాంశములచే నిండినవగు నాలుగంకములును, ముఖప్రతిముఖనిర్వహణము లనఁబడు మూఁడు సంధులును గలిగియుండునది ఈహామృగ మనఁబడును. స్త్రీనిమిత్త జనితమగు నాయక ప్రతినాయకుల వైరమును సంరంభసూచ్యములందుఁగాక యుద్ధాదుల మూలమునఁ బ్రదర్శింపరాదు. దుర్వ్యవసాయో ద్యోగసంరంభుఁడగు ప్రతినాయకప్రమత్తుఁడు నాయకునిచే

జిక్కినను జంపఁబడకుండుట ధర్మము. అటులే మహాత్ముల నేవిధముననను బాధించుట హింసించుట వధించుట మున్నగు పను లీరూపకనాయకుఁడు వీడుటయు ధర్మము.

### 87. సంకీర్ణరూపకప్రధానమైనది నాటిక.

సంకీర్ణరూపకము లనేకములు. అందీనాటిక ప్రధాన రూపకము నాఁబడు.

### 88. వస్తువుత్పాద్యము.

ఇందలి కథ కల్పితమైనదిగ నుండును. అది స్త్రీప్రాధాన్యమును గలదియు నగును. లక్షణగ్రంథస్థమగు నిశ్చిత కథాక్రమము నాటికాప్రతిబంధకముగఁ గన్పట్టును. జ్యేష్ఠ కనిష్ఠ అను నిరువురు నాయికలుండుట, నాయకుని కనిష్ఠానురాగము, జ్యేష్ఠాప్రసాదానుగత కనిష్ఠనాయికాశృంగార ఫలానుభవము మున్నగు నంశములెల్ల నాటికలకనుల్లంఘ్యము లగుట లక్ష్యనాటికాభావకారణములై కన్పట్టెడు. దానం జేసి యిట్టి క్రమము కవి సమయబద్ధముగ నుండఁదగును.

### 89. నాటికాశృంగార ముదాత్తవస్తుసంజనితము.

ఉదాత్తలక్షణ లక్షితుఁడగు నృపకుల సంజాతుఁ డిందు నాయకుఁడు. జ్యేష్ఠాకనిష్ఠలు రాజకులసంజాతలునగు పగల్భకన్యక లిందు నాయికలు. తత్సంబంధి ప్రేమాను



రాగములు పవిత్రములైనవి. రాగపరిణామమగు నీ శృంగార మూ కారణమున సుదాత్తము, ఆస్వాద్యమునగు.

### 90. నాయకుఁడు లలితుఁడు.

రాజ్యభారము నన్యపరముఁజేసిన విలాసలాలసుఁడగు నృపుఁడు నాటికానాయకుఁడు. ఈతఁడే ధీరలలితుఁ డనఁబడు వాఁడు.

### 91. నాటికాచరితము చతురంకకలితము.

ప్రవేశకాది పురస్కృతములగు నాలుగంకములను గలది నాటిక. సంధ్యాదులు ప్రకరణతుల్యములు.

### 92. నాట్యరాసకత్రోటకము లుపరూపకములు.

నాట్యరాసకము, త్రోటకము నను నీ రెండును నుప రూపకములలో నెల్లఁ బ్రధానములైనవి.

నాట్యరాసకము :—

ఇందలికథ పురాణసిద్ధమైనదికాక కవియొక్క ప్రతిభను బట్టి కల్పింపఁబడునదై యుండును. ఒక్క యంక మునుమాత్రమే కలిగియుండును. ఉదాత్తపురుషుఁ డిందు నాయకుఁడు. నాయిక వాసకసజ్జిక. కార్యపేశలుఁడగు పీఠ మర్దుఁ డిందలి నాయకసహాయుఁడు. శృంగారరసము ప్రధా

నముగ నుండును. హాస్యరస మంగము. భారతీవృత్తి, ముఖ నిర్వహణసంధులు, లాస్యాంగములు, శృంగారవీరాభివర్ణన ములు, ప్రస్తావన మున్నగునవి భాణమునకువలె నీ నాట్య రాసకోపరూపకమునకును ననుసంధింపఁ బడఁదగునవి.

త్రోటకము :—

నాటకలక్షణాదుల కిది సమగ్రముగఁ జెందకున్నను, ఈ షడ్భేదమున నాటకతుల్యమై యుండును. ఇది పంచాం కము లేక షష్ఠ, సప్తమ, అష్టమ, నవమాంకములలో నేది యైనను గావచ్చును. ప్రత్యంకము విదూషకవిరాజితమై యుండఁదగునది. ఈ రెండు లక్షణముల ననుసరించియే యిది నాటకమునకు వేఱైన త్రోటకమై పఱఁగుచున్నది. ఈ విదూషకుఁ డేదేని యొక యంకమున లేకున్నను దోషము కాదు. శృంగారరసము ప్రధానమును, శేషించునవి యుపాంగ రసములును గాఁదగు. ప్రస్తావన, సంధ్యంగములు, వృత్తులు నాటకతుల్యములే యగు.





# ఆంధ్రనటప్రకాశిక.

షష్ఠ ప్రకరణము.



## రూపకము—ప్రయోగము.

మనోహరదృశ్యము రూపము. తదారోపణమును గలది రూపకము. వస్తురూపమును సభ్యాభిముఖమున యథాయోగ్యముగఁ బ్రవర్తింపఁజేయునట్టిది ప్రయోగము.

### 1. ప్రయోగము ద్వివిధము.

ఒక్కని మానసిక రసావస్థను వ్యక్తీకరించునట్టిదియు ఒక్క నటునిచేతనే ప్రకాశింపఁబడునదియు నగు ప్రయో గము ఖండ మనఁబడునది. కారణానేకములచేఁ గ్రమప్రవృ ద్ధినిఁ బడసి విశ్వజనీనమగు తన్మయానందమును ఘటించు నట్టిదియు, బహునటులచే నయింపఁబడునదియు నగు ప్రయో గము సంపూర్ణ మనఁబడునది.

## 2. ద్విధాన్యము లౌకికము.

ఖండ సంపూర్ణేతర ప్రయోగ మన్యము. అది సాంఘికనైతికాది ధర్మానేకములను బోధించునట్టిది. నీతి బోధకమగు నీ ప్రయోగము రసప్రాధాన్యమును గలదికాదు. ఒకానొక సంఘమునకు లేక కారణమునకుఁ జెందునట్టి వివిధాచార సంస్కరణములను బొనర్చుచు నిది కాలోచిత ప్రయోజన మొడఁగూర్చున దగుటచేఁ గాలికమనియు, ధర్మార్థకామములను బ్రసాదించునదగుటచే లౌకికమనియుఁ జెప్పఁబడునది.

## 3. ద్విధాభిన్నము సమాజము.

నాటకకళ నుపాసించుమూలమున రసానందము ననుభవించుచు, దేశికోపదిష్టక్రమమ్మున నిరాడంబరప్రయోగమును నిర్వర్తించు పలువురు నటులను గలది ఔత్సాహికము. నాటకప్రయోగవ్యాజమున జీవనమును గడపునట్టి పెక్కు నటులను గలది వ్యావహారికము.

## 4. ఖండసంపూర్ణాధీతమౌత్సాహికము.

అలౌకికానందానుభవముకొఱకు నాటకకళను యోగముగ నుపాసించునట్టిది ఔత్సాహికము. ఇందలినటు లన్ని విధములఁ దపస్వాధ్యాయులతోఁ బోల్పఁదగువారు. మఱియు విద్యాది వివిధసంస్కారములను బడసినవారు. నిరాడంబర



జీవనము, ఋజుమార్గానుగమనము, పవిత్రహృదయముఁ గలిగి గురు శుశ్రూషలయం దేమరకుండునట్టిది వీరి ప్రధాన లక్షణము. రూపకరసభావభావనామూలమున నాత్మసాక్షాత్కారమును బడయునట్టిది వీరి ముఖ్యాశయము.

ఖండసంపూర్ణ ప్రయోగములు కేవల రసప్రతిపాద్యములు. అనభిజ్ఞులు తత్ప్రయోగాధికారులు కానేరరు. ఒకప్పుడు ప్రయత్నించినను సంస్కారశూన్యులు, హృదయరహితులు నగు వీరి వేషభాషలయొక్కయు, నిరర్థకదీర్ఘరాగాలాపనములయొక్కయు నాడంబరాట్టహాసములలో రసాంశములు విచ్ఛిన్నములు కాకమానవు.

ఔత్సాహికులు శిక్షాభ్యాసములను బడసి ఖండ సంపూర్ణములయొక్క వస్తుతత్త్వముల ననుభవించువారు. మఱియు రసానభిజ్ఞుల దూషణభూషణములను బాటించునట్టి పనిలేనివారు. అన్యాభిరుచుల ననుసరించి వీరెన్నఁడును రూపకనిర్ణయమును గావించుకొనరు. తత్ప్రయోగమును సహితము ద్రవ్యార్జనముకొఱకుఁ గాఁదగునదిగ భావింపరు. రసానందమును దా మనుభవించుట, అనుభవించినదాని నితరులకుఁ బంచిపెట్టుట వీరిదైనందిన కృత్యములుగ నుండునవి. రసికగ్రాహ్యములు, రసప్రధానములునగు ఖండ సంపూర్ణ ప్రయోగము లిట్టి నటులతోఁగూడిన ఔత్సాహిక సమాజముచేతనే కావింపఁ బడఁదగునవి.

ప్రస్తుతకాలమునఁ గొన్ని యౌత్సాహికము లనఁబడు సమాజములలోఁ (Amateurs) పెక్కులు వ్యావహారిక సమాజములతో భేదించు నట్టి విలక్షణమును గలవికావు. ఇట్టి సమాజములవలని ప్రయోజనము మృగ్యము.

### 5. ఔత్సాహిక ముత్పాద్యము.

ఔత్సాహికసమాజము లోకవిధమున భరతాశ్రమము లనఁదగి యుండునవి. ఇవి కొన్ని ప్రధానలక్షణములచే లక్షింపఁబడుచుఁ బ్రేక్షకులకు రసానుభవములనుబంచునట్టివి. కేవల కళాభిమానమునఁ బఱఁగు నిట్టి సమాజములు దేశ మంతట బయలు వెడలవలసి యున్నది. వీని వ్యాప్తి ననుసరించి రసాత్మక నాటకములు, వాని ప్రయోగములు నభివృద్ధి కాఁదగునవి.

### 6. ఔత్సాహికవిధానములు వివిధములు.

ఔత్సాహికసమాజములు బహుభంగుల వ్యావహారికములనుండి భేదించునట్టివి. కళోపాసనమే వాని ముఖ్య ధర్మము. తత్సమాజము కొన్ని పద్ధతులలో నేర్పడి రసవన్నాటకప్రయోగమూలమున ధన్యతను జెందునట్టిది. వీనిని నెలకొల్ప నెంచువారల కీ క్రింది విధానములు లక్షింపఁ బడఁ దగునవి.

భరతాదిశాస్త్రముల సభ్యసించియు, నాటకకళ నుపాసించియుఁ దరింపనెంచు నొకఁడుకాని పెక్కుఱుకాని వీలున్నం



తలో నొక ప్రత్యేకావాసము ను సంపాదించుట, ఏతదాశయామోదకులగువారిని సభ్యులుగఁ జేర్చుకొనుట.

వివిధవిద్యావిశారదుఁడగు నొక దేశికవతంసుని సేవించుచు లక్ష్యలక్షణాత్మక విజ్ఞానము నార్జించుట, అందు ముఖ్యముగ నభినయమవస్థావబోధకముగను, సంగీతము భావప్రబోధకముగను నుపయోగించు నైపుణ్యము నలవఱచుకొనుట, మఱియు నొకప్పుడు వివిధకళానిధుల నాహ్వానించుచు వారి యమూల్యోపదేశముల ననుభవించుట.

దేశికకృతమో, తదన్యకృతమో యగు నాటకమును గ్రమశిక్షణమున సిద్ధపఱచి స్వీయాశ్రమముననె దానినిఁ బ్రదర్శించుట, పాత్రరూపానుకరణ ప్రయత్నమును వీడి పాత్రల రసావస్థలను మాత్రమె చిత్రించుట, ఏతత్ప్రయోగావసరమున శాస్త్రప్రసిద్ధములు, స్వజాతీయములు నగు వీణియ, చితారు, తంబుర, వాయులీనము, మృదంగము, ఘటము, కంజీర, ఘంటావాద్యము ననునీ వాద్యోపాంగములను మాత్రమె యుపయోగించుట.

నిరర్థకములగు యవనికాద్యలంకారములతో రాంగిక స్థాయిభావమును జెదరఁగొట్టక యాయా నాటకమునకుఁ దగి యుండునదియుఁ బూర్వోక్త విధమున (చూ. చ. 14. సూ.) రసమునకుఁ దగియుండునదియు నగు శ్యామలాది వర్ణములతో నొకదానినిఁ బడసిన యొకటిరెండు యవనికలు, ఉపరిపలవ

ములు, పార్శ్వాంచలములును దమ రంగమున నలంకరింపఁ
బడు నటులు చేయుట, కాని-వో రూపానుకరణ ప్రయత్న
మునువలె నీ యత్నమును సహితము విసర్జించి యొకటి
రెండు కేవల ధవళాంబరములతోడనె తమ రంగము నలంక
రించుట.

వివిధవిద్యావిజ్ఞానములతోఁ బాటుగ నిరాడంబర జీవ
నము, దైవభక్తి, గురుభక్తి, సర్వసౌభ్రాతృత్వము, తృప్తి,
శాంతి మున్నగు సంపదలను సహితము పడయుట.

ఆత్మీయ కళాపరిశ్రమము, అనుభవము మున్నగు
నన్నివిషయములను సమగ్రముగఁ దెలుపునట్టి పత్రికలనో,
గ్రంథములనో లోకోపకృతికొఱకు వీలువెంబడనీఁ బ్రచు
రించుట.

అవకాశమునుబట్టి రసవన్నాటక ప్రయోగమూలమునఁ
గలుగు బ్రహ్మానందమును బ్రజాబాహుళ్యమున కుచితముగఁ
బంచిపెట్టుట.

నిరర్థక నాటకసందర్శన వ్యామోహమున నొదవెడు
నిద్రాభంగము, ధనవ్యయము మున్నగునవి తొలఁగునటులు
తమ ప్రయోగము లుదయముననో, సాయంతనముననో
రెండు మూఁడు గంటల కాలములో ముగియునటు లేర్పఱ
చుట.



### 7. లౌకికప్రయోగము వ్యావహారికము.

వస్తు సాక్షాత్కారమునను, సహజభావ ప్రసరణము
నను బ్రేక్షక హృదయముల నాకర్షించుటయె కాక తదర్థ
ములు చిరకాలము దిదృక్షుల స్మృతిపథమ్మలంపఁ బాదు
కొని యుండునటులు చేయుటయందును రూపకములు మిక్కిలి
సమర్థములై యుండునవి. ఆకారణమున శ్రవ్యకావ్యానేక
ములకంటె నీ దృశ్యకావ్యములు నీతిబోధకములు, ధర్మోప
దేశకములు, సాంఘిక రాజకీయాద్యశేష సమస్యాపరిష్కార
కారకములుకూడఁ గాఁదగునవి. తత్ప్రయోగములు రస
ప్రాధాన్యమును గలవి కానందున నొకింత సులభసాధ్యములై
సర్వజన గ్రాహ్యములగు వివిధవిలాసములలో, వేషములలోఁ
బద్యగద్యగేయములలోఁ గావ్యార్థములను స్ఫురింపఁ జేయఁ
గలవు. ఇట్టి తరగతికిఁ జెందిన సాంఘిక చారిత్రిక నైతి
కాది వివిధరూపకములు వ్యావహారిక సమాజములచేఁ బ్ర
యోగింపఁ బడఁదగునవి. ఈ మాత్రపుఁ బ్రయోజనము
నేని కలిగింపకుండు నెట్టి ప్రదర్శనమునుగాని చూచుటయందుఁ
గలుగు ఫలము మృగ్యము.

### 8. విద్వత్సమాజమాత్రాస్వాహికతుల్యము.

ద్రవ్యార్జనముకొఱకు నాటకకళా ప్రదర్శనమును
బొనర్చు సమాజము వ్యావహారిక మనఁబడునది. తత్ప్ర
యోగము సర్వథా ప్రజల యభిరుచులను ననుసరించునట్టిది.

రసవంతములు, పండితాదరపాత్రములు నగు నాటకము లిట్టి సమాజములచేఁ బ్రదర్శింపఁబడుట కంతగ నవకాశముండదు. ఉండినను నా ప్రదర్శనములు స్థాయిత్రయీభావసమ్మేళన మును బడయక "తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం" అన్నటు లుండును.

రూపకఖేలనమున ద్రవ్యార్జనమును జేయునదైనను దన యుదారాశయములను బాయకయుఁ గళాసాంకర్యము నకుఁ దావీయకయుఁ గ్రమపద్ధతులలో భరతవిద్యా పరిశ్రమ మును బొనర్చునట్టిది, విద్వన్నటులను గలది, విద్వత్సమాజ మనఁబడునది. ఔత్సాహికసమాజమువలె నిదియు ఖండ సంపూర్ణ ప్రయోగములను, రసవన్నాటకములను బ్రదర్శించు మూలమునఁ బ్రేక్షకుల నానందపరవశులుగఁ జేయఁగలదు. మఱియుఁ గాలోచితములగు సాంఘికాది రూపకములనుగూడ బ్రదర్శించుచుఁ దన్మూలమున దేశాభ్యుదయమునకును దో డ్పడఁగలదు. విద్వన్నటులను గలిగి విద్వత్సాంప్రదాయ ములలోఁ బరిశ్రమించుచు విద్వదాదర పాత్రమగు నిట్టి సమా జము, ఔత్సాహిక సమాజములతోఁ బాటుగ గౌరవింపఁ బడఁదగునది.

## 9. అధ్యక్షుఁడు తదధికారి.

విద్వత్సామాజిక ధర్మమును సర్వవిధముల సంరక్షించు వాఁ డధ్యక్షుఁడు. కార్యక్రమ మంతయు నీయన యను



మతిని జరుగఁదగునది. నటులను జేర్చికొనుట, తీసివైచుట, అభ్యాసవిధులను నిర్ణయించుట, ఆర్థికనైతికాది సకలసంపద లను సంపాదించుట, సామాజిక సర్వస్వమునకు బాధ్యతను వహించుట మున్నగున వన్నియు నధ్యక్షుని ప్రధానకార్యము లుగఁ బరిగణింపఁ బడఁదగునవి.

## 10. దేశికుఁడు ప్రయోగాధికారి.

చతుర్విధాభినయములలో నటులచేఁ బ్రవర్తింపఁబడు నది ప్రయోగము. తత్సిద్ధికిఁ గావ్య మాధారము, రంగ మాధేయము నగు. అభినయాధారాధేయముల సమ్మేళనమే ప్రయోగసిద్ధస్వరూపము. ఈ రూప మొక్కనిచేతనే చిత్రింపఁ బడఁదగునది. ఏతదభినయ చిత్రీకరణకార్యమే కావ్య మనఁబడునది. దేశికుఁడు తత్కార్యకర్త. ఆ కారణమున నా దేశికుఁడె ప్రయోగాధికారి కాఁదగువాఁడు.

## 11. దేశికుఁడు సూత్రధారుఁడునునగు

భరతశాస్త్రపారంగతుఁడు, లలితకళాకోవిదుఁడు, శిక్షకుఁడు, పండితుఁడు నగువాఁడు దేశికుఁడు. నాట్యనాటక సమన్వయ సూత్రములను ధరించి రూపకప్రయోగమును నటులచే యథాయోగ్యముగఁ బ్రవర్తింపఁజేయువాఁ డగు టచే నితఁడు సూత్రధారుఁడనియుఁ జెప్పఁబడును.

### 12. సూత్రధారుఁడు ద్విధాభిన్నుఁడు.

కార్యప్రవర్తకుఁడు, వస్తుపరివర్తకుఁడు నన సూత్రధారుఁడు రెండువిధములఁ నుండువాఁడు. వీరిలోఁ బూర్వరంగ ప్రవర్తకుఁడు కార్యప్రవర్తకుఁడనియు,తద్భిన్నుఁడు వస్తుప్రవర్తకుఁడనియుఁ జెప్పఁబడును.

### 13. వస్తుప్రవర్తకుఁడు పాత్రధారుఁడునునగు.

కావ్యఫలాశ్రయుఁడు రూపకనాయకుఁడు. ఇతని సహధర్మిణి నాయిక యనఁబడునది. వీరి రూపములు నటులచే ధరింపఁబడునవి కనుక నాట్యావసరమున నవియు, నితరములుచేరి పాత్రము లనఁబడుచున్నవి. వీనిలో నాయికానాయకులకుఁ జెందునవి ప్రధానపాత్రము లనఁబడునవి. వస్తుప్రవర్తకుఁ డిట్టి ప్రధానపాత్రమునుగాని మఱియొంక దేనినికాని ధరించియుఁ బ్రయోగసమన్వయమును జేయఁదగువాఁడు. అభినయకావ్య విమర్శనమునకుఁ బాత్రుఁడగు నీ వస్తుప్రవర్తకుఁడను సూత్రధారుఁడె సర్వసాధారణముగ ప్రధానపాత్రధారుఁడై నెగడువాఁడు. మఱియు నితఁడె పూర్వోక్త నటలక్షణానేకములచే లక్షింపఁదగువాఁడు. తద్భిన్నులు విమర్శింపఁ బడఁదగువారు కారు.

### 14. నటు లనుయాయులు.

నాటకము భావప్రపంచమునకుఁ జెందునది. తన్మూర్తివంతములు పాత్రములు. నటులు వానిని ధరించువారు.



వీరిచే నభినయింపఁబడునది దేశికోపదిష్టమగు వస్తుతత్త్వము. ఆకారణమున నటు లస్వతంత్రులు, దేశికసహాయులు, కాఁదగువారు.

నాటకేతరరూపకములు దృశ్యప్రపంచమునకుఁ జెందునవి. తన్మయపాత్రములు లోకాదర్శకములుగ నుండఁదగునవి. వయోగుణ చేష్టాలంకారములచే వానినిఁ దలపించు సర్వాంగ సుందరనటులు తత్పాత్రలను ధరించువారు. అభినయింపఁబడునది రూపక నీత్యర్థము. దేశికుఁడు తద్బోధకుఁడు. నటులు కేవల సహాయులు. ఇప్పుడును నభినయకావ్యచిత్రీకరణ దక్షుఁడగు దేశికుఁడుకాక సహాయులగు నటులు విమర్శింపఁ బడఁదగి యుండరు.

### 15. నటేతరులు సహాయులు.

రంగాధిపతి, ఆహార్యాధిపతి, కోశాధిపతి, కార్యదర్శి, కవి, చిత్రలేఖకుఁడు మున్నగువారు నటేతరులు. వీరు కావ్యప్రవర్తకుఁడగు సూత్రధారునకు సహాయులై ప్రయోగకార్యభారమును వహించువారు. వీరి కార్యధర్మములు ప్రసిద్ధములు.

#### రంగాధిపతి.

ఈతఁడు వస్తుప్రవర్తకునితోఁ గించిదూనముగ తుల్యుఁడగువాఁడు. తత్ప్రవర్తకోపదిష్టములే యీతని కార్య

ములు. అందు రూపకోచితసాంగిక నిర్మాణము లేక సంపాదనము రంగాధిపతికిఁ బ్రధానకార్యముగ నుండునది.

రంగాధిపతి వివిధకళాపారీణుఁడు. మఱియు సభ్యుని కార్యములను సహితము నిర్వహింపఁజాలు ప్రగల్భుఁడు, పాత్రార్థభావములను బ్రతిఫలించి నటుల చతుర్విధాభినయముల నొక్కసూత్రమున రాజిల్లఁజేయుటకును సమర్థుఁడు. అభినయము కావ్యరూపమును బడసి సూత్రధారుని మూలమున నది రంగమునఁ బ్రయోగింపఁబడునంతవఱకును దదర్థము నితఁడొక్క క్రమమ్మున సంరక్షించు పనిఁగలవాఁడు. రూపకోచితరంగ పరికరములు, ఆహార్యములు నితనివలన సేకరింపఁబడునవి. ప్రయోగావసరమున యవనికల యవరోహణావరోహణములు, నటుల ప్రవేశ నిష్క్రమములు క్రమానుబద్ధములుగఁ బ్రవర్తిల్లుట కితఁడు బాధ్యుఁడు కాఁదగువాఁడు.

ఆహార్యాధిపతి.

ప్రయోగావశ్యకములగు వస్త్ర భూషణ మాల్యలేపనవర్ణాది నటాహార్యములను నాయత్తపఱచు పనిఁగలవాఁడు. రంగాధిపతికి నితఁడు ముఖ్య సహాయుఁడు కాఁదగువాఁడు.

కోశాధిపతి.

ఇతఁడు సామాజికాదాయమును సంరక్షించువాఁడు. సంఘావశ్యకములగు నన్ని పరికరములకుఁ గార్యములకు





దుష్టబుద్ధి-విషయ (చంద్రహాస)

శ్రీ నెల్లూరి నాగరాజరావుగారు     శ్రీ కె. శ్రీనివాసాచారిగారు

వలయు ద్రవ్యమును సభ్యుని యనుమతినిఁబట్టి కార్యదర్శికి నొసంగువాఁడు.

### కార్యదర్శి.

ఇతఁడు సాంఘిక కార్యానేకములను నెఱవేర్చువాఁడు. నాటకఖేలనమునకుఁ దగియుండు ప్రదేశమును నిర్ణయించుట, పరిచరణపత్రములు మున్నగువానినిముద్రింపించుట, ఆదాయ వ్యయములను సాంఘికచర్చలను గార్యములను గ్రంథస్థములు గఁజేయుట, రంగాధిపతికి వలయు నన్ని పరికరములను నందఁ జేయుట మున్నగునవి కార్యదర్శికిఁ బ్రధానకార్యములుగ నుండునవి.

కరపత్రపరిచారకులు, ప్రవేశపత్ర విక్రేతలు, తత్పరిశోధకులు, వార్తావహులు, ద్వారరక్షకులు మున్నగు ననేకు లీయన యాజ్ఞలను నిర్వర్తించువారు.

### కవి.

ఇతఁడు రూపకకావ్యకర్త. కాలముయొక్క గమనము నెఱిఁగినవాఁడు. మృదుమధుర వాగుపకరణములచే వివిధరూపములను బ్రసన్నపఱచువాఁడు. రసవన్నాటకములు, సాంఘిక నైతికాది వివిధప్రకృతిరూపకములు, ఈతని సృష్టి ప్రపంచమునకుఁ జెందునవి. సమాజమున కీతఁడు జీవప్రాయుఁడు. ప్రయోగయోగ్యరూపకములు సర్వథా

దేశికకృతములో లేక తద్దేశికోపదిష్ట కవికృతములో కాఁదగునవి. తదన్యరూపకములు ప్రయోగయోగ్యము లగుట దుస్తరవిషయము.

### చిత్రలేఖకుఁడు.

ఇతఁడు రంగప్రపంచమును వెలయించువాఁడు. రక్త పీత శ్యామలాదివర్ణము లితని యుపకరణములు. అవి రస భావ సమయ సమ్మేళనమును గలిగి రంగమునఁ బ్రసన్నములు కాఁదగునవి. రంగరచనయు నాకారణమున దేశికకృతమో లేక తదుపదిష్టచిత్రలేఖకకృతమో కాఁదగునది. నటాహార్యములు సహిత మిటులె యీతనివలన నిర్ధరింపఁబడఁదగునవి. అన్యరచనలు రూపక రస భావ సమయములకుఁ జెందక నిరర్థక వర్ణాడంబర భాజనము లగునవి. ఇతని యునికియు సమాజమునకుఁ గాఁదగునది.

## 16. రూపకము ప్రయోగయోగ్యము.

ప్రయోగార్హతనుగలది రూపకము. కేవల రంగాంక విభాగములు, పాత్రప్రవేశ నిష్క్రమములు, గద్యపద్య గేయములు జతపఱచఁబడునంతమాత్రమున రూపక మెద్దియు నట్టి యర్హతను బడయనేరదు. కవిమాత్రుఁడు దానినిఁ గలిగింపనేరఁడు. స్థాయిత్రయీభావ పరిజ్ఞాన మొదవిన దేశికుఁడట్టి యోగ్యరూపక నిర్మాణమునకు దక్షుఁడు. ఇంకొక పక్షమున తదుపదిష్టుఁడు సామాజికుఁడు నగు సరసకవియు



దానిని నిర్మింపఁదగువాఁడు. అన్యకృతులు బహుభంగులఁ బ్రయోగయోగ్యతను బడయకుండునవి.

## 17. యోగ్యరూపకము కాలికము.

నాటకాదిరూపకములు, వాని లక్షణములు పంచమ ప్రకరణమునఁ జెప్పఁబడినవి. అవి రూపకములందు లక్షణజ్ఞులచేఁ గనిపెట్టఁబడి భావిరచనలకు మార్గదర్శకములుగ నెంచఁదగునవి కాని సూత్రప్రాయమునఁ బ్రతిరూపకమునందును ననుసంధింపఁ బడఁదగునవి కావు. మఱియు నవి యొక కాలమునకుఁ జెందిన ధర్మప్రాగల్భ్యమునుబట్టి యేర్పడునవి. ఎల్లకాల మవియె సుస్థిరములుగ నుండునవి కావు. కాలమునుబట్టి రూపకము ముఖ్యముగఁ బ్రయోగింపఁ బడఁదగునది.

## 18. వస్తువు సంగ్రహము, సృష్టమునగు.

ఖ్యాతేతివృత్తము నాటకవస్తువు. అది యుదాత్త విషయికము, రసాత్మకమునగు. తద్భిన్నవిషయికము రూపక వస్తువు. తన్మయపాత్రములు, భాషణములు, దృశ్యములు మున్నగునవి ప్రకృతి ప్రసిద్ధములు, సహేతుకములు కాఁదగునవి.

రూపకవస్తువు రసేతరవిషయికము, కవితాచమత్కార భాజనము నగునది. విశేషించి దేశకాలపాత్రములకుఁ జెందిన వివిధచారిత్రక విషయములను, తదితరధర్మములను

ప్రతిపాదించు రూపమునఁ బ్రేక్షకుల నాకర్షించునట్టిది. ఉదాత్త నాయికానాయకులు మాత్రమే యిం దభివర్ణింపఁ బడనక్కఱలేదు. పౌరాణికోదంతములె నేకరువుఁ బెట్టఁ బడుటయు నుండదు.

## 19. పాత్రలు సంకీర్ణములు.

నాటకమున ధీరోదాత్తుఁడు, ప్రకరణమున ధీరశాంతుఁడు, తదన్యమున ధీరలలితుఁడు నాయకుఁ డగుటయు ధీరోద్ధతుఁడు ప్రతినాయకుఁ డగుటయు నిర్వివాదవిషయము. నాయికారచనయు నట్టిదె యగు. అయిన నీక్రమము నాటకాది లక్షణము లెఱుఁగని కొందఱు కవినామధారులచే రచియింపఁబడుచుండిన రూపకానేకములందు విపరీత సరణిని బొడగట్టు టొక వింతకాదు. విద్వత్కవికృతి రూపకములట్టి లోప భూయిష్ఠములు కానేరవు.

కావ్యనాయకుఁ డుదాత్తుఁ డగుటచే నుదాత్త గుణగణము లన్నియు శ్రవ్యకావ్యములందువలెనె దృశ్యకావ్యములందును నేకరువుఁ బెట్టుచు వ్రాయుట మన కవులలోఁ బలువుర కాచారమై యుండినది. ఆకారణమున నే ప్రబంధమును మఱి యే నాటకమును జదివినను లేక చూచినను నాయా కావ్యనాయకులం దంతట నామభేదమేకాని మఱి యెట్టి తత్త్వభేదమును గనఁబడకుండెను. ఇప్పట్టునఁ గర్తవ్య మెద్ది?



కరచరణాద్యవయవములచే నలరారువారు మానవులు. అంతమాత్రమున నందఱొక్క రూపునఁ గనఁబడరు. కారణ మేమి? అదియే సృష్టికర్తయొక్క జగన్నిర్మాణ చాతుర్య మనఁదగునది.

కవి సృష్టికర్త. పాత్రములు తత్సృష్టములు. పాత్రతత్త్వానుభవ విదగ్ధుఁడగు కవిబ్రహ్మచే రూపొందఁబడిన నాయకు లుదాత్తగుణ సమృద్ధులైనను వారివారి మానసిక వ్యాపారములనుబట్టియుఁ దదర్థ ప్రకృతులనుబట్టియు భిన్నరూపములలోఁ దప్పక కనిపింపవలసియుండును. ఇట్టి కవినిర్మాణ చాతుర్యమే కావ్యప్రపంచమున సహితము ప్రసన్న పడఁదగునది. ఇట్టి లక్షణ మొదవిన రూపకమే ప్రయోగయోగ్యమగునది. కావుననె నాటకము కష్టసాధ్యమనియుఁ దత్ప్రయోగము యోగసదృశమనియు మఱియు నది ధర్మార్థ కామములనె కాక మోక్షమునేని ప్రసాదింపఁదగునదనియుఁ జెప్పఁబడినది.

నాటకేతరరూపకములు కేవల ముదాత్తనాయకాలంకృతములు కావు. రసప్రధానములును గావు. ఇందలి పాత్రములు దృశ్యప్రపంచమునకుఁ జెందునవి. మహాపురుషుల జీవితాంశములు, సాంఘికాది సమస్యలు మున్నగునవి రూపక పరిగ్రాహ్యములగు నంశములు.

పురాణగాథలు కావ్యానేకములలోఁ జదువఁబడినవి తత్సారములు చాలవఱకు గ్రహింపఁబడినవి. తత్సంబంధి

రచనలు, ధర్మములు లోకమున కందరానివిగ నుండునవి. ఆధునిక విద్వత్ప్రపంచము క్రొత్తరుచులను గోరుచున్నది. క్రొత్త భావముల నపేక్షించుచున్నది. వేయేల! ఆవేదనతోఁ గూడిన నిజమైన కవినుండి వాగ్రూపమున వెలువడి, ఒక యపూర్వ సృష్టివైచిత్ర్యమును బ్రదర్శించునట్టి కావ్యఫలము కొఱకుఁగాక మఱి దేనికొఱకును లోక మెదురుచూచుట లేదనవచ్చును.

### 20. రూపకరచన సలక్షణమైనది.

దృశ్యశ్రావ్యాంశములను నిర్ణయించుకొనుటయందే దాని చమత్కృతియంతయు నాధారపడియుండును. పాత్రప్రవేశములు వాని నిష్క్రమములు సహేతుకములై కన్పట్టవలసి యుండును. భాషణము లానుషంగికములు, స్వభావసిద్ధములు కాఁదగునవి. పద్యములు భావసౌకుమార్యమును జెందునవై యాయా యవసరములందు మితముగ జతపఱచఁబడునవి. క్లిష్టము, గూఢము, సందిగ్ధము, విరుద్ధమున్నగు విలక్షణము లేమాత్రము రూపకములం దుండఁదగవు. కార్యకారణములు, వాని విస్తరణములు, ఫలసమన్వయము, బీజబిందు నిర్వహణము లనఁబడు నర్థప్రకృతులతోడను దత్తదుచిత సంధ్యంతరములతోడను వృత్తులతోడను విరాజిల్లవలసి యుండును. దృశ్యార్థ సర్వస్వము స్థల సమయ సామరస్యమును గలిగి నెగడవలసి యుండును. కావ్యధర్మము లేక ఫలము లోకమునకుఁ బ్రాపింపఁదగునదిగ నుండుట ముఖ్యము.



### 21. యోగ్యరూపక మభినయావకాశమును గలది.

రూపక మభినయప్రధానమైనది. గద్యపద్యగేయములు, పాత్రల ప్రవేశనిష్క్రమములు మున్నగున వాద్యంతమిట్టి లక్షణమున నుండఁదగునవి. ఏ నటుఁడుకాని రంగమున నూరక నిలిచియుండు నటులు చేయఁదగదు. దీర్ఘప్రసంగములును, ఎందో యొకచోటఁగాక యెల్లయెడల నుండఁదగవు. ఒక్కఁడు భాషించుపట్టునను బలువురు సమావేశమగునప్పుడును నిష్క్రమించునపుడును రూపక మట్టి యభినయావకాశములను ముఖ్యముగఁ గల్పింపవలసి యుండును. రసాత్మక నాటకరచనావసరమున నిట్టివి సంచారిభావ ప్రబోధకములై యుండఁదగునవి. తదితరరూపకములందవి కావ్యఫలసంపాదన పటిష్ఠములు కాఁదగునవి. భావజ్ఞుఁడగు కవి సంచారిభావభాజనములగు స్థిరభావములలోఁ బాత్రతత్త్వములను జిత్రించుమూలముననె యట్టి యభినయావకాశములను గల్పించి రూపకమును మనోహరదృశ్యముగఁ జేయును. ఇట్టి కవితాచాతుర్యమొదవిన రూపకమే ప్రయోగయోగ్యమైనదిగఁ బరిగణింపఁబడునది.

### 22. రూపకార్థము పరిమితము.

రూపకరచనకుఁ గారణమగునది, రూపకాద్యంతము స్ఫురించునది, ఒకఁడు లేక పెక్కురు నటులచే నయింపఁబడునది, రూపకమునకుఁ బ్రధానాంశముగ నెగడునది రూపకార్థమనఁబడునది. అది నాటకమున రసవ్యాజమునను దదితర-

మున నిత్యాదిరూపమునను బ్రసన్నమై ద్రష్టలచే ననుభవింపఁబడునది. పాత్రలు, రంగాంకవిభజనములు, ప్రవేశక విష్కంభములు, గద్యపద్య గేయములు, సమయము, కాలము, దేశము మున్నగునవన్నియుఁ దదర్థమునె యాశ్రయించియుండునవి. బీజ బింద్వాది వివిధలక్షణ పురస్కృతమగు రూపకరచన ముఖ్యముగఁ గావ్యార్థ విస్తరణమునకుఁ గారణమగునదే కాని తదన్యప్రయోజనమునకుఁ గారణమగునది కాదు. యోగ్యరూపక మాకారణమునఁ గాలపరిమితినిఁ గలిగియుండునది.

రసోత్పత్తికిఁ గారణమగు కథాంశము బీజ మనఁబడునది. తదంశ విస్తరణమున కాశ్రయమగు నన్య కల్పనము బిందువనఁ బడునది. కథాసంవిధానమునకు బీజ బిందువులనఁ బడు నీ రెండుపరికృతులును రూపకమునకుఁ జెలియలి కట్టలై దాని నొకపరిమితిని నిలుపఁదగునవి.

ప్రస్తుతరూపకానేకములు కేవల కథాప్రధానములైన వగుటచే దీర్ఘప్రసంగముల తోడను, పాత్రానేకముల తోడను రంగములతోడను నిండి ప్రయోగ కాలమును బెంచుచున్నవి. అభినయించు నటులకును విసుగునించుచున్నవి.

రూపకము ముఖ్యముగఁ బ్రయోగమున కేర్పడునట్టిది. నాటకమునకువలెనె నీతిబోధక రూపకమునకును గారణాంశమగు బీజము, తదర్థవిస్తరణాంశమగు బిందువు, చమత్కారభాజనమగు సంధిసమ్మేళనము జతపఱుచఁదగునవి. తత్ర్క–



ప్రసన్న యౌవన (చూ. పు. 166)



ద్వితీయ యౌవన (చూ. పు. 166)



మాయబద్ధరూపకపాత్రములు, ప్రసంగములు, అంకములు, సర్వథా కాలపరిమితినిఁ గలిగి నెగడునవి.

## 22. రూపకము వాస్తవికము.

నాటకము రసాశ్రియమైనది. భావప్రపంచము దాని యునికిపట్టు. పాత్రములు వస్తుసంస్ఫురణమును మాత్రము కావించునవి. నైతికసాంఘికాదిరూపకము లట్టివికావు. ఇవి దేశము, కాలము, పాత్రము, జాతి, సంస్కారము మున్నగు ననేక వస్తుతత్త్వములను బ్రతిపాదించునవి. ఇందలి యంశము లనుభవసిద్ధములు. పాత్రలతత్త్వములును, ధర్మములును నెల్లరకుఁ బ్రాపింపఁదగి యుండునవి. మఱియు దృశ్యమాన ప్రకృతిప్రసిద్ధము లగునవి. స్వర్గాదిలోకములు, తన్మయ దృశ్యములు, ఇందుఁ బ్రదర్శింపఁబడవు. కావ్యవస్తువు, తత్ఫలము వాస్తవప్రపంచమున కిటులు చెందియుండుటను జేసి యీ రూపకములు వాస్తవికము లనఁబడుచున్నవి.

నాటకేతరరూపకములు దేశకాల పాత్రాచార సాంప్రదాయములకుఁ జెందిన వివిధసంస్కరణములను, ధర్మములను, న్యాయ్యములను బోధింపఁదగునవి. మఱియు బహుళభంగుల దేశాభ్యుదయమునకుఁ గాఁదగునవి. ఏతత్కావ్యప్రధాను లగు నాయికానాయకులు పూర్వోక్త లక్షణానేకములచే లక్షింపఁబడఁదగువారేకాని సకలలక్షణ సముగ్రులు మాత్రము

కారు. అటులుండుట దుస్తరవిషయము. తదితరరూపక లక్షణములైనను నొకదానివెంట నొకటిగ రూపక మనఁబడు దానియం దంతట లక్షింపఁబడవలయు ననఁదగదు. లక్ష్యముల నాశ్రయములుగఁ గొని వెలువడునవి లక్షణములు. అవి విషయవిస్తరవిధానములను బోధించునవి. తదనుభవ మొదవిన కవినుండి వెలువడు కావ్యాలాపములలో నట్టివి వస్తు నాయక రసాంశములకుఁ దగునంతవఱ కేర్పడునవి. అటులు కాక, కావ్యార్థప్రపణముకొఱకు లేక రసోత్పత్తికొఱకు సూత్రప్రాయమున లక్షణము లనుసంధింపఁబడునపు డెట్టిరూపకమైనను లేక నాటకమైనను రసాభాసము కాకమానదు.

### 23. పాత్రోచితభాష పరిగ్రాహ్యము.

నాటకము భావదృశ్య మనఁదగునది: ఉదాత్త నాయికానాయకులందుఁ బ్రధానులు. వారిభావములు, గుణములు, క్రియలు మున్నగునవెల్ల గభీరములు, ఉదారములు, లలితములునై యుండునవి. ఇట్టి వీరి భావాదులు భాషణములచే నేర్పడఁదగునవి. ఏతద్భాషాభావ సామరశ్యముననే పాత్రముల స్వరూపములు, కావ్యస్థరసములు దిదృక్షులకు స్ఫురింపఁదగునవి. ఉదాత్తనాయకుల వాక్కులు సర్వసాధారణముగ గ్రాంథికములు, ప్రౌఢములునై యుండునవి.

రూపక మనుభవదృశ్యము. తదర్థప్రధానులగు



నాయికానాయకులు, తత్సహాయులు, మఱియు వారి బంధుమిత్రాదులు మొదలగువారు ప్రకృతిప్రసిద్ధులుగఁ జిత్రింపఁబడఁదగువారు. నాటకములందువలె నిట్టి రూపకములందలి నాయికానాయకు లుదాత్తగుణసాంప్రదాయములచేతనే యభివర్ణింపఁబడవలసిన యావశ్యకత లేదు. రసప్రధానములు కాకుండు నిట్టి రూపకములందు నాయికానాయకులకు లేక తదితరులకుఁ గ్రొత్తగుణములను దెచ్చిపెట్టవలసిన పనియు లేదు. యథార్థప్రకృతికిఁ జెందిన మూర్తివంతము లిందలి పాత్రములు. సర్వమానవ ప్రసిద్ధములగునవి వారి భావములు. కావ్యఫలోద్యోగతత్పరములు వీరి గుణములు. తత్తదుచిత ధర్మానుబద్ధములై నెగడునవి క్రియలు. పైనిఁ దెలుపఁబడిన కావ్యపరికరములచే సహజరూపమును బడయఁదగునది రూపకార్థము. అదియే నీతి లేక ధర్మము లేక సంస్కరణము ననఁబడునది. ఏతద్ధర్మోపదేశక దృశ్యములే సాంఘికనైతికాదిరూపకములు. ఇట్టి రూపకములకుఁ జెందిన పాత్రముల భాషణములు దేశ కాల పాత్ర కులాచార మతాద్యశేష సాంప్రదాయములను బ్రకటించునవై యుండఁదగునవి.

చారిత్రికరూపకము లొక్క దేశమునకుఁ జెందునవి కావు. అవి సర్వథా విశ్వమయములు. చారిత్రకపాత్రములాకారణమున ననేక జాతులకు, మతములకు, ఆచారములకుఁ జెందియుండునవి. ఏతన్నాయికానాయకులు సహితము ఉత్తమ మధ్య మాధమాంతరములలోఁ గన్పట్టఁదగియుందురు.

అన్యజాతివారైనను గావ్యప్రధానులగు నీ నాయకులు విలక్షణములగు కృత్రిమాలాపములను గావించుట దిదృక్షులకు సహింపరాక యుండును. విలక్షణ భాషాభాజనములు, ఔచితీభంజకములు నగు నిట్టి ప్రసంగములు ముఖ్యముగఁ గావ్యమర్యాదను భంజించునవి.

ఉదాత్తపాత్రము లేదేశమునకుఁ జెందినవైనను వాని భాషణములు గాంభీర్యమును గలిగియుండఁదగునవి. భావగాంభీర్యమును బట్టి భాష గ్రాంథికముగ నుండక తప్పదు. మ్లేచ్ఛరాజులు, చక్రవర్తులు, వారి పట్టపురాణులు, అమాత్యులు భాషించునపుడు శతవిధముల వారి దేశభాషయే యుపయోగింపఁబడుట లెస్స. కానిచో నాటకమునందువలె సలక్షణాంధ్రభాషయే యుపయోగింపఁబడఁదగునది. సేవకాది నీచపాత్రములు తత్తదుచిత గ్రామ్య ప్రసంగములు పొనర్చుట రసవంతమే కాఁగలదు.

మ్లేచ్ఛేతరజాతులకుఁ జెందిన పాత్రములు వారివారి దేశభాషలలో భాషించునటులు చేయుట మిక్కిలి దుస్తరవిషయము. ఒకవేళఁ జేసినను నట్టివి సులభగ్రాహ్యములు కానేరవు. మఱియు నా కావ్యములే యాంధ్రత్వమును బాయఁ గలవు. రూపకము కావ్యమగుటచేతను, రూపకార్థము పరమార్థ మగుటచేతను నిట్టి సమయములందుఁ జారిత్రికరూపకములందేని పాత్రముల హృదయార్థభావములె తత్తదౌచితీ



సంభరితములై సలక్షణాంధ్రభాషాసాహచర్యమునఁ బ్రసన్నములు కాఁదగునవి. నీచుల కొకప్పుడు గ్రామ్యము మఱి యొకప్పుడు సంకీర్ణమునగు భాషయే వాడఁదగునది.

ఆభీరులు, కిరాతులు, బోయలు, రజకులు, క్షురకులు మున్నగు కించిజ్ఞులు విద్వత్ప్రసిద్ధములగు గభీరభావములలో, దీర్ఘసమాసములలో, అలంకారములలో భాషించునపుడు మిక్కిలి ప్రకృతివిరుద్ధముగఁ గన్పట్టును. ఇట్టి యవసరములందు వారివారి జాతీయప్రసంగములలో వారివారి భావమాధ్యములను యథాయోగ్యములుగఁ జిత్రించుటయే మిక్కిలి కాఁదగునది. అట్టిదే రూపకకావ్య సృష్టివైచిత్ర్యమును స్పష్టీకరించునట్టిది.

## 24. కేవల కథాత్మకములు త్యాజ్యములు.

రసమును బ్రధానముగఁ గల నాటకములు మిక్కిలి కాఁదగునవి. ఆ పిమ్మట సాంఘిక నైతిక చారిత్రకాది రూపకము లోకవిధమున జనసామాన్యమునకు వివిధవిజ్ఞానములను బ్రసాదించునవి. ఈ రెండు తెగలకును జెందక, ఒక రచనను ననుకరించునవియు, పాత్రతత్త్వములను నేర్పఱచఁజాలనివియు, దేశకాలపాత్రముల ననుసరింపనివియు, నిరర్థక పద్యగద్యగేయములతో నింపి కేవలము కథాక్రమమును మాత్రమె నేకరువుఁ బెట్టునవియు నగు రూపకములను జదువుటయందును, తత్ప్ర

యోగములను జూచుటయందును గలుగు లాభ మావంతయు లేదు.

## 25. దేశికనిర్ణీతపాత్రములు నటులచే ధరింపఁబడునవి.

రూపకవస్తువు పాత్రలమూలమున నేర్పడునది. ఆ పాత్రములను ధరించువారు నటులు. దేశికుఁడు నటులయొక్క వయస్సు, రూపము, వాక్కు, ప్రతిభ మున్నగు నొక కొన్ని ముఖ్యలక్షణములను విచారించి తత్తదుచితములగు పాత్రములను వారికిఁ బంచిపెట్టును.

ప్రస్తుతసమాజములు పెక్కులు దేశికపురస్కృతములు కావు. ఒకవేళఁ గొన్నిట నట్టి యాచార్యధర్మమును నెఱపువా రుండినను, వారు పాత్రాది ప్రధాననిర్ణయములపట్టున నటులను గ్రమబద్ధులుగఁ జేయునట్టి శక్తివంతులు కాకున్నారు. అదికాక దేశికప్రాముఖ్యమును బాసి సామాన్యనటుల స్వాభిమాన ప్రాబల్యమునఁ బడి జీవించు నేటి సమాజము లొకకొన్ని దేశికునికంటె నటులనె ముఖ్యులుగ భావించుచుండుట నిర్వివాదాంశము.

నాటకములు పవిత్రానందదాయకములు, తదితర రూపకములు నీతిబోధకములు నని లోకమున కిప్పుడిప్పుడె తేట



పడుచున్నది. నాటకకళాభివృద్ధికి ప్రాజ్ఞు లనేకులు పాటుపడుచున్నారు. అధునాతన కళాసాంప్రదాయములు, తత్సమ్మేళనపద్ధతులు వ్యవహారప్రసిద్ధము లగుచున్నవి. కళాధికారులగు విద్వన్నటులు సహజనటులు గౌరవింపఁబడుచున్నారు. ఇట్టివారు దేశికోపదిష్ట క్రమమున్నన దేశజులకు లౌకికాలౌకిక విజ్ఞానానందములను బ్రసాదించుచున్నారు. అనధికారి నటులతో నిండిన సమాజముల కీదినములలో నిలువనీడ చిక్కకున్నది.

నటుల యాగ్రహానుగ్రహములకు లోబడియుండు సమాజములందుఁ బాత్రల నిర్ణయము పట్టునవే పెక్కు వివాదములు తటస్థపడుచున్నవి. ప్రతినటుఁడును నాయకపాత్రమునో, నాయికాపాత్రమునో, ధరింపఁ దలఁచుచున్నాఁడు. మఱియు నా రెండుపాత్రములె ముఖ్యములనియు శేషించునవి యంత ప్రధానములుకావనియుఁ దలఁచి యాపాత్రములను సిద్ధపఱచు నవసరమున లక్ష్యమును బాయుచున్నారు. ఇట్టి నటనామధారులు పాఠ్యబాహుళ్యమునుబట్టి నాటకనాయకత్వమును స్థిరపఱచుకొనుదురనిన మన మాశ్చర్యపడ నక్కఱయుండదు. మఱియు దీర్ఘరాగాలాపనములు, అభినయ పటాటోపములు వీరియందు మిక్కిలి కన్పట్టునవి. నిరంకుశులు, సర్వస్వతంత్రులు నగు వీరు దేశికప్రాముఖ్యమును గ్రహింపరు. గ్రహించినను దదనుగుణ్యముగ వర్తింపరు. ఆకా

రణముననె వీరిచ్చు ప్రదర్శనములు కావ్యార్థసమన్వయమును బడయకున్నవి.

రూపకకావ్యార్థము దేశికునిచే నటులకు బోధింపఁబడు నది. అభినయాంశములు సహిత నటులె నిర్ధరింపఁబడునవి. దేశికనిర్దిష్టములగు నాయాప్రధానసూత్రములననుసరించి నటులు ప్రయోగకార్యమును నెఱవేర్చువారు. ఇటులున్నను బ్రతిభావంతుఁడు కానివాఁడు తత్ఖేలనమును మనోహరముగను రసవంతముగను నొనర్పఁజాలఁడు. కారణమేమన, అభినయము కావ్యమువంటిది. రసోత్పాదనము దాని ప్రధానధర్మము. కావ్యాదిలక్షణములు గుదిగూర్పఁబడునంతమాత్రమున నది యట్టి రసానందమును బ్రసాదింపదు. భావస్వతంత్రుఁడగు కవియొక్క రచనావైదగ్ధ్యమే యట్టిఫల మొడఁగూర్చునది. అభినయావసరమునఁగూడ దేశికోపదేశములు కావ్యార్థ ప్రతిపాదనమునకుఁ జెందిన లక్షణమార్గములుగ భావింపఁబడునవి. నటుఁ డాయా మార్గములలో స్వీయానుభవమును బురస్కరించుకొనియుఁ గార్య కారణాదులను లక్షించుకొనియుఁ దదర్థమును నభినయించవలసి యుండును. అట్టి యభినయమే ప్రౌఢాభినయ మనఁబడునది. తత్ప్రదర్శకుఁడె విద్వన్నటుఁ డనఁదగువాఁడు. దేశికుఁ డిట్టినటునకు రూపక ప్రధానపాత్రము నొసంగును. శేషించు పాత్రములను దత్తదుచిత లక్షణవంతులకు నొసంగును. దాననె ప్రయోగము రసదాయకమై దిదృక్షులఁ దనియించును.



## 26. ప్రయోగ మభ్యాసపూర్వకము.

ప్రయోగమున కభ్యాసము మిక్కిలి కాఁదగునది. అది నటులకుఁగల యవకాశములనుబట్టి చేయఁదగునది. కావ్యార్థానుభవము, సాత్త్వికరూప చిత్రీకరణము, వివిధాభినయసమ్మేళనము సరసగతిని జతపడునంతవఱకు నీ యభ్యాసము లావశ్యకములై యుండునవి.

నటుల యోగ్యతలనుబట్టియు, వారి సంఖ్యనుబట్టియు దేశికుఁడు రూపకనిర్ధరణమును బొనర్చును. తదర్థము హృదయస్థ మగునంతవఱకు దానినిఁ బఠించును. వస్తువు, రసము, పాత్రము, కాలము ననువాని సమన్వయసార్థక్యమునుబట్టి ప్రయోగయోగ్యమైనదిగ రూపకమును నిర్ధరించుకొనినపిదప నవసరమునుబట్టి కొన్ని భాగములను దగ్గించుట, పెంచుట మున్నగు మార్పులను జేసికొనును. అథమ మొక యైద భ్యాసములు జరిగినపిదపఁ దత్ప్రయోగము బహిరంగ పఱచఁబడును.

## 27. ప్రథమాభ్యాసము వస్తుపరిచితినిఁ గలిగించునది.

రూపకగ్రహణము, పాత్రనిర్ణయము జరిగినవెనుక నాయా పాత్రముల పాఠ్యములు నటులకుఁ బంచిపెట్టఁబడును. నటు లెల్లరను ముందిడుకొని దేశికుఁ డొకటి రెండు పర్యాయ

ములు రూపకమును పఠించును. తదర్థము, భావము మున్నగు వానిని నటులకు బోధించును. ఈ యభ్యాసమున నటులకు రూపకస్వభావ సర్వస్వము కరతలామలక మగును.

## 28. ద్వితీయాభ్యాసము వాచికాదిప్రయత్నము లను గలది.

ఈ రెండవయభ్యాసమున ముఖ్యముగ వాచిక క్రమములు నటులచే నలవఱచుకొనఁబడునవి. దేశికుఁడు నటులచే వారివారి పాఠ్యములను జదివించుచుఁ బ్రతిపదార్థమును విన్పించును. చిత్రలేఖకుఁడు, రంగాధిపతి, ఆహార్యాధిపతి, ఘంటావాద్యకులు, దృశ్యార్థప్రదర్శకులు కూడఁ జేరియుందురు. దేశికుఁ డొక్కొక్క యంకమునకు లేక రంగమునకుఁ జెందిన దృశ్యార్థములను, పాత్రల ప్రవేశనిష్క్రమములను, అభినయ విధానములను, శ్రుతులను విన్పించుచుఁ దనదు గ్రంథమునఁ గ్రమముఁ దప్పక వ్రాసియుంచును. ఇటులె నటులు, తదితరులుగూడఁ దమకుఁ జెందిన ప్రయోగాంశములను గ్రంథస్థములుగఁ జేసికొందురు. దేశికనిర్ణీతములగు వాచికస్వరభేదములు, దృశ్యశ్రవ్యాంశములు, పాత్రస్వరూపములు, స్థిరసంచార్యాది భావానేకములు, శిరోభేదములు, దృష్టిభేదములు, భ్రూభేదములు, వ్యక్తుల ప్రవేశములు, తదితరసమావేశములు, నిష్క్రమములు, శ్రుతులు, యవనికారోహణావరోహణములు నటులచేతను దత్సహాయులచేతను విధిగ లక్షింపఁబడునవి.



## 29. తృతీయాభ్యాస మభినయపురస్కృతము.

నటులకుఁ బాఠ్యాంశము లన్నియుఁ గంఠస్థము లైన వెనుక నీ యభ్యాసము జరుగఁదగునది. నిర్ణీతక్రమమున వాచి కాంగిక సాత్త్వికము లనఁబడు నీ యభినయపద్ధతులు మూఁడును గావ్యార్థమున మేళగించునటులు నటులెల్ల రీ సమయమున వర్తింపఁ దగియుందురు. అభినయపురస్సరమగు నీ యభ్యాసము ముఖ్యముగ బహిరంగప్రదర్శనమున కుద్దేశింపఁబడునట్టి రంగమునందే జరుగఁదగునది. అభినయావసరములందు నటు లుపయోగింపనగు భద్రాసనములు, రాజదండములు, ఆయుధములు, విల్లునమ్ములు, పుష్పమాలలుమున్నగు నెల్లపరికరములు పాఠ్యాంశములకుఁ దగునటులు సేకరింపఁబడి ప్రదర్శింపఁదగునవి. యవనికలు, దీపములు మాత్ర మింకొక యభ్యాసమునఁ జూపఁబడునవి.

అభ్యాసము ప్రయోగయోగ్యములగు సన్నిధానములతోడను, పరికరములతోడను గూడియుండునది. మఱియు నిర్ణీతసమయమున జరుగఁదగునది. ఇట్టి యభ్యాసము రంగేతరస్థలములందుఁ గావింపఁబడునేని బహిరంగప్రయోగములందు రంగ మెక్కినపు డభినయనిర్దిష్టాంశము లనేకములు విచ్ఛిన్నములు కాకమానవు. నటుల యభినయము లొక్క సూత్రమునఁ గట్టుఁబడనేరవు. ఆ మూలమున నభినయము కావ్యాత్మతను గోల్పోయి కేవల వక్తృత్వాడంబరభాజనమై కన్పట్టును. కావుననె నాటకసమాజములకు నాట్యభవన

ములు సహితము విధిగ నుండఁదగునవని పలువు రభిప్రాయ పడుచున్నారు.

నాట్యభవన మొకటి దక్కఁగడమ సహాయ సంపద లన్నియుఁగల సమాజ మీ యభ్యాసమును మఱియొకచోఁ జేసికొనఁగలదు. అట్టి ప్రత్యేకస్థాన మన్నివిధముల బహిరంగరంగమును బోలియుండునది. రాంగికవైశాల్యము, దైర్ఘ్యము, ఇట్టి స్థానమున నభేదమునఁ గన్పట్టునట్టిది. యవనికాదు లీ యభ్యాసమున కనావశ్యకము లగుటచే సమర్పఁబడవు. ఉపాంగవాద్యములు నటుల గీతికాలాపముల ననుగమించునవి. ఘంటావాద్యకులు నటుల ప్రవేశాదిసమయము లందు వాద్య ప్రేరేపణములను గావించుచుందురు. యవనికాది దృశ్యములను, తదితర నవ్యాంశములను రంగాధిపతి హృదయస్థములుగఁ జేసికొనుచుండును. దేశికుఁ డన్నిపనులను నెల్లరు క్రమముఁదప్పక నిర్వర్తించుచుండుదానినిఁ బరిలక్షించుచుండును. తప్పులను సవరించుచుండును.

### 30. చతుర్థాభ్యాసము సర్వలక్షణలక్షితము.

ఈ యభ్యాసమున వేషధారణము, యవనికాది ప్రదర్శనముఁగూడఁ జేరియుండును. దీపములు సహిత ముపయోగింపఁబడుచుండును. ఉపాంగవాద్యములు నటుల ననుగమించుచుండును. సమయమునఁ బ్రయోగము నారంభించుట, అంకాంతరములం దాలస్యము లేకయుండుట, నిర్ణీత



కాలమునకుఁ బ్రదర్శనము ముగియుట యీ యభ్యాసమువలన నలవఱచుకొనఁదగునవి.

వేషములు పాత్రసదృశములుగ నుండునటులు చేయుట సులభమైన విషయము కాదు. రక్తపీత శ్యామలాదివర్ణములు, వాని సమ్మేళనవిధానములు బాల్యప్రభృతి నటులచే లక్షింపఁబడఁదగునవి. రూపచిత్రీకరణము కావ్యకరణము వంటిది. శాస్త్ర పరిచితి, లోకానుభవముఁగలుగు చిత్రకళావిశారదుని యొద్దఁ గొంతకాలము శుశ్రూషఁ జేసినఁగాని యందలి రహస్యములు తెలియఁబడవు.

దేశికుఁడు పాత్రల స్వరూపములను గావ్యాలాప దర్పణములలోఁ జూచును. తత్తదుచితాహార్యములను చరిత్రముల చేతను, లోకాచారములచేతను స్థిరపఱచును. పాత్రల సత్త్వములను బ్రకటింపనగు తన్ముఖాంగిక వికారములను మూర్తీభవింపఁజేయు పట్టున నొకప్పుడు చిత్రకళాప్రవీణుఁడగు మఱియొక కళాభిజ్ఞుని సాహాయ్యమును సహితము గ్రహింపక మానఁడు. ఇటు లెన్నియో ప్రయత్నములచే నిర్ధరింపఁబడిన పాత్రల స్వరూపములను, సత్త్వములను నటులకు దేశికుఁ డుపదేశించును. దానినిఁ బురస్కరించుకొని నటు లెల్ల రీ యభ్యాసమునఁ బాత్రస్వరూప చిత్రీకరణముకొఱకు వలయునంతగఁ బరిశ్రమింతురు.

జుట్టు, బొట్టు, కట్టు ఈ మూఁడును బాత్రల స్వరూపములను బ్రకటించు ముఖ్యలక్షణములు. అందు జుట్టుపాత్ర

లకుఁ జెందిన దేశకాలధర్మములను నెఱిఁగించునట్టివి. బొట్టు పాత్రలయొక్క మతమును, గులమును దలఁపించునట్టిది. కట్టు (అనఁగఁ బంచెకట్టు మున్నగువానివిధము) పై విషయములను బలపఱచునట్టిది. ముఖమునందలి వళులు, దృష్టుల స్వభావములు, కపోలముల సౌకుమార్య కార్కశ్యములు, దంతముల దౌర్బల్యపటుత్వములు, వాక్కుల సారళ్యపారుష్యములు, పాత్రల వయోభేదములను, సాత్త్వికతత్త్వములను బ్రకటించునట్టివి. కిరీటములు, శిరోవేష్టనములు, ఆభరణములు మున్నగునవి పాత్రల వృత్తులను బోధించునట్టివి. వస్త్రముల వర్ణములు రసావస్థల నెఱిఁగించునట్టివి. పైనిఁ దెల్పఁబడిన యాహార్యములతోఁ గూడిన స్వరూప రచన, పాత్రల ఉత్తమ మధ్యమాధమ భేదములను బట్టి కావింపఁ బడఁదగునది.

యవనికలు, ఇతరదృశ్యములు రూపకస్థల సమయములను బ్రతిపాదించునట్టివి. దేశికోపదిష్టుఁడగు లేఖకుఁడు వాని నెప్పటికప్పుడు సిద్ధపఱచును. ప్రయోగావసరమున రంగాధిపతి వాని నుపయోగించును. ఈ యభ్యాసమున తద్ధర్మము పరిలక్షింపఁ బడఁదగునది.

ఉపాంగవాద్యములు, వానిధర్మములు ద్వితీయప్రకరణమునఁ జెప్పఁబడినవి. ఆ లక్షణముల ననుసరించి యవి యీ యభ్యాసమున నుపయోగింపఁబడఁదగునవి. ఈ సందర్భమున నొక్క విషయము ముఖ్యముగ సవరింపఁబడఁదగునది కలదు. పద్యమున కొక శ్రుతి, గీతిక కొకశ్రుతి, మనిషి కొకశ్రుతిగ



మార్చుట యెంతమాత్రము తగదు. రూపకసత్త్వ ప్రబోధకమగునది శ్రుతి. ప్రయోగాద్యంతమది స్థిరముగ నుండఁదగునది. అయిన నవస్థాంతరములనుబట్టి యొకప్పు డాశ్రుతి మాఱిన మాఱవచ్చును. అట్టిది సర్వథా రంగాంకములందు మాత్రమె కాఁదగునది. అటులుకాక వ్యక్తిసౌలభ్యము కొఱకె ననుక్షణము శ్రుతియనునది మాఱుచుండునేని రూపక స్థిరభావము చెడి ప్రయోగము రసాభాసకారణము కాక మానదు.

## 31. పంచమాభ్యాసము బహిరంగప్రయోగ తుల్యము.

రూపకగ్రహణము, పాత్రనిర్ణయము, ప్రయోగాభ్యాసము, తదావశ్యకనిఖిలవస్తుసంపాదనము మున్నగుపనులుముగిసి, ప్రయోగము స్థాయిత్రయీ సమ్మేళనమును బడసినయటులు దేశికునిచేతను, అధ్యక్షునిచేతను భావింపఁబడిన యనంతరమున నీ పంచమాభ్యాసము జరుగఁదగునది. ఇది ముఖ్యముగ బహిరంగప్రదర్శనమున కుద్దేశింపఁబడునట్టి రంగముననే కాఁదగునది. తద్భిన్నప్రదేశమున కావింపఁబడిన యభ్యాసము రంగమెక్కునప్పటికి బహుభంగుల విచ్ఛిన్నము కాకమానదు. నటుల ముఖవర్ణము లతిశయించిన దీపకాంతులందుఁ బేలవములగును. దేశికనిర్దిష్ట ప్రవర్తనములు సర్వము మాఱిపోవును. సంకుచితప్రదేశములందు స్థిరపఱచుకొనఁబడిన వాచికస్థాయులు విశాలరంగములందు భావోద్దీపనములు కాకపోవును. ఇటులె

యుపాంగవాద్యములు, నటుల గీతికాదివాచికములు పరస్పరము మేళగింపక రసభావభంజకము లగును.

పంచమాభ్యాస మొకవిధముగ బహిరంగప్రయోగ మనఁదగియుండునది. రంగమును బరిశుభ్రముగ నుంచుట, యవనికాదులను గ్రమపద్ధతిని సమర్చుట, నటాహార్యములకుఁ జెందిన వస్త్రభూషనాదులను యోగ్యస్థితి నుంచుట మున్నగు పనులన్నియుఁ బ్రయోగసమయమునకు ముందుగనే కాఁదగునవి. సాంఘికకార్యనిర్వాహకులు వారివారి కార్యములం దప్రమత్తులై యుండఁ బూర్వరంగప్రవర్తనము, నాందీవాదము, స్థాపన మున్నగు లక్షణములను గలిగి ప్రయోగకార్యము గడియారమువలె జరుగఁదగునది.





# ఆంధ్రనటప్రకాశిక.

సప్తమ ప్రకరణము.



## రూపకము—రంగము.

సంస్కృతనాటకాలూ, వాని ప్రయోగాలూ మఱుగుపడినతరువాత, వ్యాప్తిలోనున్నవి యక్షగానాలూ, భామకలాపాలూ, తోలుబొమ్మలమాత్రమే. ఇవన్నీ రెండు కాగడాలతో, ఒక కలంకారీ తెరగుడ్డతో, పచారీ అర్ధఘంతో, ఒక మద్దెలతో, ఒక తిత్తివాద్యంతో, నలుగురుముగ్గురు హంగుపాటకులతో, ఒకరిద్దఱు తాళ్లగాళ్లతో, ఒక హాస్యగానితో, చులాగ్గా పని జరిపేస్తూ ఉండేవి. అయితే, ఆదరువులూ, ఆభరతాలూ, ఆహస్తాలూ కష్టపడి నేర్చుకున్నవారికే ప్రదర్శించడానికి సాధ్యంగా ఉండేవి. భరతరహస్యాలు బాగా తెలిసినవారెవరో ఒకరు, ఇవన్నీ తమ మేళంలోనివారికి నేర్పేవారు. అధమం రెండుమూడేండ్లైనా గడిస్తేనేకాని, అలా

నేర్చుకున్నవారైనప్పటికీ వేషధారణానికి తగిపోయేవారు కారు. ఏదో ఒక కట్టుబాటుకు లోబడి, ఒకలక్షణాన్ని అనుసరించి ఆడబడే పైవీధినాటకాలన్నీ, పండితపామరులకు ఒకవిధంగా హృదయరంజకంగా ఉండేవి. కోట కేమలాకాంతంగారి మేళం, తాడేపల్లి విస్సయ్యగారిమేళం, నెల్లటూరివారిమేళం, గాజుల కోటయ్యగారిమేళం దేశదేశాల్లోను సంచారం చేసి బందరుకు ఎక్కడలేని ప్రతిష్ఠను గలిగించేవి. బందరు పరిసరస్థులైన వెంపటి వెంకటనారాయణంగారు భామవేషంలో చూపించే అసమాన నాట్యవైదుష్యం ఇప్పటికీ జేగీయమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

ప్రస్తుతం మనంచూచే నాటకాలు పై రకాల్లో చేరేవి కావు. ధార్వాడవారు మనజిల్లాల్లో సంచారంచేసి వెళ్ళిన తరువాత వీనిప్రచారం క్రమక్రమంగా విస్తరించింది. అప్పటినుంచే కాగడాలూ, అర్ధళాలూ, బాడిదచెక్కనగలూ అదృశ్యమయినాయి. గాజుదీపాలూ, నాజూకువర్ణాలూ, హారాలూ, చెమికీలూ ప్రసన్నమయినాయి. ఇంకా ప్రక్కతెరలూ, పై తెరలూ, ఎక్కతెరలూ, దిగేతెరలూ, ఆరంభమయినాయి.

ధార్వాడవారి నాటకాలు హిందీభాషలో ఉండేవి. సూత్రధారి నటీసంభాషణాలూ, విదూషకుని హాస్యాలూ, గజానన సరస్వతీ సందర్శనాలూ, మధ్యమధ్య కథాప్రకటనాలూ, వారి నాటకాల్లో ముఖ్యంగా ఉండేవి. ఇలా ఆడబడేవి కంపెనీ డ్రామాలని అనిపించుకునేవి. ఒక డప్పు



వాద్యంతో నాటకాన్ని చాటించడం, ఒకటిరెండు అణాలకు టిక్కెట్లు అమ్మడం, మొదలైన ఆచారాలుకూడా వాటితో కలిసిఉండేవి. ఇంకా ధార్వాడనటుల్లో మంచిశిక్ష, కట్టుబాటు, ప్రౌఢమయిన అభినయం, దానికితగిన వేషం, వేషాన్నిబోలిన రూపం, చక్కనిపాట, మంచిమాట, మొదలైన సుగుణాలెన్నో కనిపించేవి. అవి మనవారిని బాగా ఆకర్షించాయి. ఆకర్షించడమే కాకుండా ఎందఱెందర్నో హిందీ భాషాభిమానులుగా కూడా చేసేశాయి.

హిందీనాటకా లాడాలనే ఉద్దేశంతో బందరులోనూ, మఱికొన్ని పట్టణాల్లోనూ, ఆవెంటనే చాలా సమాజాలు వెలశాయి. అలాయేర్పడి, ఇంతవఱకూ నిలిచియున్న సమాజాల్లో కనిపించే నాట్యసంబంధమైన భక్త్యనురాగాలూ, గురుశిష్యన్యాయాలూ, అభ్యాసాలూ, ఆచారాలూకూడా ధార్వాడవారినుండి సంక్రమించినవిగానే బోధపడతాయి. ముఖ్యంగా అభ్యాససమయంలోకాక, ఇతరసమయాల్లో నటులైనా రంగంలో కాలుపెట్టనియ్యకపోవడం, నాట్యాధిదేవతను ప్రతిష్ఠించుకోవడం, ప్రతిరోజూ దాన్ని పూజించడం, సంస్కారినటులను మాత్రమే సేకరించడం, వారినందర్నీ చక్కని కట్టుబెట్టాల్లో ఉంచడం, నటులందఱూ భయభక్తులతో పాఠ్యాంశాల్ని చెప్పుకోవడం, చెప్పుకున్నట్టు పరిశ్రమించడం, నాటకంనాడు శ్రద్ధగా పనిచెయ్యడం, ఇంకా పదిమందివలన తమదోషాల్ని తాము తెలుసుకుంటూ ఉండడం,

క్రమంగా ఆదోషాలన్నింటిని సవరించుకొంటూ ఉండడం, సమ్మశకాన్ని చెడగొట్టుకోకుండా ఉండడం, నాట్యసమయంలో క్షురకాదికర్మలూ, చుట్టా బీడీ సిగిరెట్లూ, తేలికప్రసంగాలూ, చేయకుండా ఉండడం, ఎంతవచ్చినా ఇతరసంఘాల్లోకి పోకుండా ఉండడం, మున్నైనవెన్నో మూర్తీభవిస్తూ ఉంటాయి. మన నవనాగరిక నాటకప్రపంచంలో, ఈ లక్షణా లెంతవఱకు ఉంటాయో పాఠకు లాలోచించవలసి ఉంటుంది.

## బందరురంగాలు.

1880–82 సం॥లో 'జూబినియల్ హిందూథియేటర్' అనే పేరుతో మ॥ రా॥ రా॥ దేవరసు వెంకటశివరావు, బాలకృష్ణయ్యగార్ల ప్రోత్సాహమున ప్రస్తుతం "నేషనల్ థియేటర్" అనబడేది స్థాపింపబడింది. అది మొదటలో, ఒకటిరెండు చిన్నిచిన్ని తెలుగునాటకాల నాడింది. 1884 నుంచి మొగలిగిద్దల రామానుజరావుగారి సాహాయ్యసంపత్తులను సంపాదించింది. అప్పటినుంచి హిందీనాటకాలాడడం ప్రారంభించింది. ఆసమయంలో బ్ర॥శ్రీ॥నాదెళ్ళ పురుషోత్తమకవిగారు దీనికి ఆచార్యులుగా ఉండేవారు. హిందీనాటకాల్లో మొగలిగిద్దల రామానుజరావు, ఈవని లక్ష్మణస్వామి, జోశ్యుల వెంకటశేషయ్యగార్లు అసామాన్యమయిన నాట్యవైదుష్యాన్ని ప్రకటిస్తూ ఒకప్పుడుపునహారంపెనీవార్ని కూడా మెప్పించారు. ముఖ్యంగా



కప్పగంతు లక్ష్మణస్వామిగారి, శివాజీపాత్రాభినయం, బి. పిన్. చంద్రపాలుగారి పొగడ్తనుకూడా పొందింది. అప్పటికీ, ఇప్పటికీ, ఇంకెప్పటికీకూడా ఇట్టి నటుణ్ణి మనం చూడబోము. నాట్యవిషయంలో ఒక్క బందరుకేకాక ఆంధ్రదేశానికంతా వీరు వెలలేని గౌరవాన్ని సంపాదించారు.

1884 సం॥లో తెలుగునాటకాలాడే అభిప్రాయంతో హిందూథియేటరు స్థాపింపబడింది. మ॥ రా॥ రా॥ దేవరసు సుబ్బారావు, తురగా పురుషోత్తం, రామిని బ్రహ్మయ్యనాయడు, చివుకుల కృష్ణయ్యపంతులు మున్నగువారు దీని యుత్పత్తికి ముఖ్యకారకులు. ఈసమాజం ప్రాచీననాట్యలక్షణాల నన్నిటినీ శ్రద్ధతో లక్షిస్తూ ఉండేది. విద్యాధికులనేకులు, దీన్ని, పరిపాలిస్తూ ఉండడమే కాకుండా వేషాల్నికూడా ధరిస్తూ ఉండేవారు. అలాధరించేవారిలో పేరెన్నికగన్న మ॥ రా॥ రా॥ ఇవటూరి నాగభూషణం, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, గండికోట నరసింగరావుగార్లు ముఖ్యులు. ఇంకా శ్రీమాన్ రంగాచార్యులుగారు, మ॥ రా॥ రా॥ చల్లా రామనాథశాస్త్రిల్లుగారు, భేతప్రూడి ప్రకాశం, లక్ష్మీకాంతం, మాదిరెడ్డి గంగారావునాయుడు మున్నగువారు గ్రంథకర్తలుగను, దేశికులుగను ఉండేవారు. ఆనాడు వీరాడిననాటకాలను చూచినవారికి, ఇప్పటి నాటకాల్లో ఉండే విశేషంపదీ అంతగా కనిపించదు.

ఛత్రపూర్ జగన్మోహన్ థియేటర్ అనబడే సమా

జం పైసంఘాలు పుట్టినతరువాతతలయెత్తింది. మ॥రా॥రా॥వడ్లమన్నాటి నాగభూషణంగారు దీని ముఖ్యకారకులుగ తెలుస్తుంది. మ॥రా॥రా॥ వేమవరపు రామదాసుపంతులు, భట్రాజు వెంకటాద్రియ్యు, భాగవతుల సుబ్రహ్మణ్యంగార్లు దీన్నిచాలా కాలంపరిపాలిస్తూ ఉండేవారు. ఈసమాజంవారు తెలుగు నాటకాలాడడంలో హిందూథియేటర్‌వారికి ఏవిషయంలోనూ వెనకపడేవారుకారని ప్రతీతి. మ॥రా॥రా॥మాగంటి సుబ్బారావు, లింగమూర్తి, దామరాజు వీరేశలింగం, మాగంటి రామయ్య, మల్లెల శేషయ్య, కారుపర్తి నాగలింగం మొదలైనవారి నాట్యవిజ్ఞానాలుకూడా పలువురి పొగడ్తలను సంపాదించాయి. ముఖ్యంగా మాగంటి సుబ్బారావుగారిహరిశ్చంద్రవేషాన్ని చూచినవారికి ఇంకొకవేషం ఇప్పటికినీ ఏవిషయంలోనూ నచ్చదు.

పై సమాజాలవలె చాలావఱకు మంచిలక్షణాల్లోపుట్టి నశించిపోయినవి పోగా, ఇప్పటికినీ, అప్పుడప్పుడు తల చూపుతూ ఉండేవి కొన్ని ఉన్నాయి. అయితే ఇతరదేశాల్లో నాటకకళావిజృంభణానికి కారకులై ఉండే నటశేఖరులందఱూ వీనికి చెందినవారే అవటంచేతకూడా, ఈ సమాజాలమన్యాన ఇంకా వృద్ధిపొందుతూ ఉండక విధిలేదు. ఈ సందర్భంలో రామమోహన్‌థియేటరు, బాలభరతసంఘం, రాయల్ థియేటరు, ముఖ్యంగా చెప్పవలసి ఉంటుంది.



## గుంటూరురంగాలు.

1882,—84 సం॥ ప్రాంతములందే గుంటూరునందు ‘షస్టుకంపెనీ’ అనుపేరుతో మ॥రా॥రా॥ పోలూరి హనుమంతరావుగారి యాజమాన్యాన ఒక సమాజం మహా వైభవంగా నాటకాలాడుతూ ఉండేది. పద్యాలతోగూడిన బళ్ళారివారి తెలుగునాటకాలేమి, కందుకూరివారి ఆంధ్రీకృత సంస్కృత మహానాటకాలేమి, బహు సమర్థంగా ఆడుతూ, ఆంధ్రదేశానికి ఈసమాజం దారి చూపిందని చెప్పవచ్చు. ఇందులో ప్రధానపాత్రధారులైన బ్ర॥ శ్రీ॥ హరిప్రసాదరావుగారు అద్వితీయమయిన నాట్యవైదుష్యాన్ని ప్రకటించి నటపితామహులన బొగడొందినారు. ఇప్పటికీ, విద్యావివేకులైనవారు, వీరికి సహజంగా ఒదవిన ఆగొప్పతనాన్ని చూచి గౌరవిస్తూ ఉంటారు. హిందీనాటకాల్లో లక్ష్మణస్వామిగారు సంపాదించిన గౌరవము ఎలాంటిదో, ఆంధ్రనాటకాల్లో వీరు సంపాదించిన గౌరవము అలాంటిదే. ఇప్పటికైనా వీరు నాట్యరంగాన్ని అలంకరిస్తే, ఆగొప్పతనము ఎక్కడో ఒకచోట ప్రసన్నం కాకమానదు. లక్ష్మణస్వామిగారిని పడసిన బందరుదే భాగ్యం. ప్రసాదరావుగారిని పడసిన గుంటూరుదే భాగ్యం. ఇంకా మ॥రా॥రా॥ బొడ్డుమల్లి శాస్త్రిల్లు, పత్రి గోపాలరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతంకవి, వియ్యన్న, కోపల్లి హనుమంతరావుగార్లు కూడా వీరితరువాత చెప్పతగిన ప్రయోగనైపుణ్యాన్ని ప్రదర్శించేవారు.

షేక్ కనకరత్నంగారి ప్రాపణంతో సెకండుకంపెనీ వారి నాటకాలు విచిత్రదృశ్యాల్ని చూపిస్తూ మహావైభవంగా వెలుగుతూ ఉండేవి. మ॥ రా॥ రా॥ మల్లాది గోవింద శాస్త్రిగారు ఈ సమాజానికి మకుటప్రాయంగా ఉండేవారు. తెరలూ,తీగెపనులూ,దుస్తులూ, మహాఘనంగాచూపించేవారు పాండవవిజయ ప్రదర్శనంతో వీరి కీర్తి దశదిశలకీ ప్రాకింది. గోవిందశాస్త్రిగారి కృష్ణవేషం, బందరు రాయల్ థియేటరులోని మ॥ రా॥ రా॥ ముంజులూరి కృష్ణారావుగారి కృష్ణవేషం వలె చాలాకీర్తిని సంపాదించింది. నటపితామహులగు హరిప్రసాదరావుగారు సారంగధరుడుగా ఒకప్రక్క ప్రకాశిస్తూఉన్న ప్పుడుకూడా, ఈ గోవిందశాస్త్రిగారి సారంగధరునివేషం మరుపు రాకుండాఉండేది.

కొంతకాలానికి మన ఎడవల్లి బాలచంద్రుని నాట్యోదయంకూడా ప్రారంభమయిం దీ గుంటూరులోనే. అవతల ప్రసాదరావుగారూ, ఇవతల గోవిందశాస్త్రిగారూ, జమాజెట్లవలె, ఇరుప్రక్కల విజృంభిస్తూ ఉండగా, మధ్యనున్న ఈ ఎడవల్లి సూర్యనారాయణంగారు బయటపడడానికి బ్రహ్మప్రళయంగా ఉండేది. కాని, వీరిభావాలూ, ప్రసంగాలూ, మున్నైన లక్షణాల్నిపట్టి వీరు రంగమెక్కినప్పటినుంచీ నాట్యలోకంలో వీరికముం దాక్రమించనున్న మహోన్నతస్థితిని మాత్రము ఊహించడానికి వీలుగా ఉండేది. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందికదా !



(దుష్యంతుడు) శ్రీ యడవల్లి సూర్యనారాయణంగారు



(కీచకుడు) శ్రీ పర్వతనేని రామచంద్రావుగారు



శ్రీ యడవల్లి సూర్యనారాయణరావు గారు

### నర్సారావుపేటరంగం.

1900 సం॥లో ఇది స్థాపింపబడింది. దీనిపేరే "విక్టోరియా మెమోరియల్ థియాట్రికల్ కంపెనీ". ఇటీవల రిజిష్టరు అయింది ఇది. బందరు నేషనల్ థియేటరుకు చెందిన కీ॥ శే॥ వంగల ఆంజనేయులుగారు ఈసమాజంలో ప్రధానపాత్రాల్ని ధరించేవారు. వీరు మంచి స్ఫురద్రూపులు. కొద్దిగానూ, చెవుల కింపుగానూ, తమ సన్నని గాత్రంతో బహు సుకుమారంగా పాడేవారు. బొబ్బిల్లో వెంగళరావు పాత్రానికి వీరు చాలా ప్రసిద్ధగన్నారు.

మ॥ రా॥ రా॥ బెల్లంకొండ సుబ్బారావు బి. ఏ. గారు కూడా ఈ సమాజానికి చెందిన ప్రసిద్ధనటులే. కృష్ణరాయబారంలో వీరు కృష్ణుడు వేస్తారంటే విరగపడతారుజనమంతా. వేసకువేగొస్తుంది కలెక్షన్. పాపం! బహు నీరసంగాకనిపిస్తారు మనిషి. వందలకొలది పద్యాలన్నీ తెల్లవార్లూ ఎలాపాడుతారో ఎలా అభినయిస్తారో అది వారికే తెలియాలి. వాచికం బహు నిర్దుష్టంగా ఉంటుంది. పాట చక్కగా శ్రుతిలో మేళగిస్తుంది. ఒలిచి చేతులోపెట్టినట్లుంటాయి ఆ పద్య పదార్థాలన్నీని.

### విశాఖపట్నంరంగాలు.

ధార్వాడవారినిచూచే విశాఖపట్నంలోకూడా 1885

సం॥నందే శ్రీ 'జగన్మిత్రసమాజం' అనేదాన్ని కీ॥ శే॥ శ్రీ రాజా అంకితం జగ్గారావుగారు, మ॥ రా॥ రా॥ మోసలికంటి వేంకటసూర్యనారాయణరావుగారు స్థాపించారు. ఈసమాజం వారు మహాకవి కాళిదాసుని నాటకాలూ, షేక్స్పియర్ నాటకాలూ ఆడుతూ ఉండేవారు. తెరలూ, దుస్తులూ, ఆయా నాటకాలకు తగినట్లు వ్రాయించుకునేవారు. అయితే నాటకాలన్నీ డబ్బుకోసంమాత్రం ఆడేవారుకారు. రసజ్ఞులగు మిత్రులకుమాత్రమే గౌరవాహ్వానాలు పంపబడేవి. ఇతరులకు కవాటంబంద్.

1889—90 సం॥ ఆప్రాంతాల్లో ఇంకా పెద్దపెద్దవిద్యాధికులూ, ఉద్యోగస్తులూ సభ్యులుగా చేరారు. అప్పటినుంచీ బహిరంగంగా తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ, హిందీలోనూ నాటకాలాడడం సాగించారు. అయితే ఆద్రవ్యాన్ని మాత్రం ధర్మకార్యాలకోసం ఉపయోగించేవారుకాని ఎంతమాత్రం స్వంతానికి అనుభవించేవారుకారు. ఈకాలంలో శ్రీరాజా విక్రమదేవవర్మగారు దీన్ని పరిపాలిస్తూ ఉండేవారు. మ॥ రా॥ రా॥ మంతా సూర్యనారాయణపంతులుగారు కార్యదర్శులుగా ఉన్నకాలంలో సుప్రసిద్ధులగు శ్రీ తాతా ఉమామహేశంగారు, నండూరి కృష్ణమూర్తి ఆచార్యులుగారు మొదలైనవా రెందఱో సభ్యులుగా జేరి దీనికీర్తిని మిక్కిలి పెంపుచేశారు. వీరి నాటకాల్లో ముఖ్యంగా సత్సాంప్రదాయాలెన్నో కనిపిస్తూ ఉండేవి. హాస్యం, నృత్యం, కత్తి



సాములు, మొదలైన వానిలో కూడా ప్రత్యేక ప్రశంసలకు పాత్రులు కాదగినవా రెందఱో ఉండేవారు. ఆయావిద్యలన్నిటిలో క్రమమయిన శిక్ష బడయనిదే ఏనటుడును రంగమెక్కుటకు అధికారముండేదికాదు.

1901—1904 సం॥ ఆప్రాంతాల్లో మ॥రా॥రా॥ సెట్టి లక్ష్మీనరశింహంగారు మిక్కిలి ప్రధానులుగా ఈసమాజంలో పరిగణింపబడుతూ ఉండేవారు. వీరు నటునకు ఆవశ్యకమయిన అన్ని లక్షణాలను గలిగి సంఘానికి ఒక అపూర్వమయిన శోభను సంపాదించినారనుటలో ఆశ్చర్యములేదు. కాలానికి తగిననాటకాలా, వీరు వ్రాయగలరు. ఏ రసంలో పడితే ఆరసంలో అసమానంగా అభినయించగలరు. నటులందర్నీ ఒక్క క్రమంలో నడిపించగలరు. అన్నివిధాలైన ఆంగికసౌలభ్యాలూ, చాకచక్యాలూ కలిగినవారు. 1910—12 సం॥ ఆప్రాంతాల్లో వీరీసమాజానికి కార్యదర్శులుగా కూడా ఉండి ఎంతో అభివృద్ధిని చూపించారు.

మ॥ రా॥ రా॥ మ. రామచంద్రశాస్త్రిగారు దేశికులైనదాది జగన్మిత్రసమాజము మఱియు వన్నెకెక్కసాగింది. పాదుకా పట్టాభిషేకం వీరి శిక్షలో తరిబీదు కాబడిందే. అందులో సెట్టిమాస్టరుగారు శ్రీరాముని పాత్రాన్ని ధరించి చూపిన అభినయకౌశల్యం, పద్యపఠనాభిజ్ఞత, ఎందఱో పండితులచే అమోఘంగా కొనియాడబడింది.

1916 సం॥లో ఈ సమాజం మ॥ రా॥ రా॥ విక్రమదేవవర్మగారి ఆధ్వర్యాన, ఇంకా యెక్కువగా కీర్తిని గడిస్తూ ఉండేది. ప్రస్తుతం ఈ జీతాలహడావుడిలో సభ్యులు చెదిరిపోవడంచేత కాబోలు ఎక్కడా పలకడంలేదు. పాపమా సెట్టిమాస్టరుగారైనా దీన్నిగూర్చి తలచడంలేదు. చాలా విచారకరమైన సంగతిది.

1885–90 సం॥లో పుట్టిన "కళాభిలాషక నాటకసమాజాన్ని" కూడా ఈ సందర్భంలో కొంచెం చెప్పవలసే ఉంటుంది. ఇది మ॥ రా॥రా మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిచేత స్థాపించబడింది. మూడు భాషలలో వీరికి పాండిత్యం కుదిరింది. స్వయంగా నాటకాలు వ్రాస్తారు మంచివి. అప్పటికే వీరు జాతీయాల్ని వాడడం మొదలుపెట్టారు నాటకాల్లో. నాయకపాత్రాలనుకూడా ధరిస్తూ వుండేవారు. ఆ కాలంలో వాడుగ్గా నాటకాల్లో కత్తిసామును చూపించేవారు. అందులో కూడా ఈయనకు చాలా ప్రఖ్యాతి ఉండేది. ఒకప్పుడు అర్జున వేషాన్ని బహుబాగా నటించారు. నటుల్ని తరిఫీదు చేయడంలో వీరంతవారులేరని చాలా వాడుక. సెట్టిమాస్టరుగారు కూడా కొంతకాలం దీనిలో పనిచేశారు. ఆ కెళ్ల సత్యనారాయణంగారి నాటకాల్ని కూడా వీ రాడేవారు. తెరలూ, ఇంకా యితర దృశ్యాలూ ఎప్పటి కప్పుడు సిద్ధం చెయ్యడానికి చిత్రకళాప్రవీణులైన యమ్. రత్నంగారుండేవారు. ఆవిషయంలో కూడా వీరు పార్షీనాటకాల్ని మరి



పించేవారట. నారాయణస్వామి నాయడుగారనేవారు ప్రధాన స్త్రీవేషాల్ని ధరించి మహా గొప్పగా నటించేవారు. వీరికూడా రామచంద్రశాస్త్రిగారి శిక్షవలననే ఆలాటి చాకచక్యం కలిగిందని చెప్పుకుంటారు. వీరు ప్రదర్శించే నాటకాలన్నీ వీరి సమాజానికి చెందిన దేశికులచేత వ్రాయబడినవే. వీరి సమాజం తరఫున వాటి నన్నిటినీ ప్రకటించేవారుకూడాను. తరువాత ఇది జగన్మిత్ర సమాజంలో కలిసిపోయింది.

"ప్రియసల్లాప నాటక కంపెనీ" అనేపేరుతో ఇంకోటి కూడా ఈ విశాఖపట్నంలో ఉండేది. అయితే ఇది హిందీ నాటకాల్ని విశేషంగా ఆడుతూ ఉండేది. ఇందులో గోవిందరావు, శంకరం, మొదలైనవారు కొందరు ప్రధానపాత్రలను ధరించి కీర్తి గడిస్తూ ఉండేవారు. చుట్టుప్రక్కలగ్రామాల్లో కూడా ఆడుతూ ఉండేవారట.

" ఆంధ్రాఎమెచూర్సు " అనేసమాజంకూడా చెప్పవలసిందే. మ॥ రా॥ రా॥ పార్షీ రామారావుపంతులుగారు దీన్ని స్థాపించారు. అయితే స్వంతానికి హాలులేదు. నటులుకూడా జీతాల్కి ఆశించి పనిచేసేవారుకారు. రామారావుగారి మాటప్రకారం అందరూ అన్నివిషయాల్లోనూ నడుచుకునేవారు. హరిశ్చంద్ర, చిత్రనళీయం నాటకాలాడడంలో చాలా పేరుపొందారు. సంగీతంలో ఈ సమాజప

కొంచెం మార్పుగూడా చూపించేది. సుప్రసిద్ధులైన ముప్పిడి జగ్గరాజుగారు తరుచుగా స్త్రీవేషాన్ని, రామారావుగారే పురుషవేషాన్ని వేస్తూ ఉండేవారు. తరువాత బి. వెంకటస్వామి నాయుడుగారు స్త్రీ పురుషవేషాల్ని సమర్థంగా అభినయిస్తూ చాలా జనాదరణాన్ని సంపాదించారు.

## విజయనగరరంగాలు.

అదృష్టమంటే విజయనగరాందే చెప్పాల్సి ఉంటుంది. పదిమంది సామాన్యులు కలిస్తేనే ఎంతపనైనా చెయ్యడానికి సాధ్యమవుతుంది. అలాటి ప్రజల్ని ఎందఱినో ఒక్కమాట మీద నడిపించే ప్రభువు తలచుకుంటే ఇంక కాదగందేముంటుంది! ఎవరి నాదరించినా, దేన్ని పోషించినా ఇట్టిప్రభువులే చెయ్యాలి. మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీ శ్రీ ఆనందగజపతి మహారాజావారంటే నిజంగా విద్యావాచస్పతులై అవతరించిన మహాపురుషులుగాని సామాన్యప్రభువులా! కళలకా నిధులు! సుగుణములకా సముద్రులు! రసికతకా కేవలం భోజులే! ఏమి ఆ అదృష్టం!

1890 సం॥లో మహారాజావారికి సకలకళాసంభరితంబైన నాటకకళను సర్వతోముఖంగా సంరక్షించే సంకల్పం కలిగింది. అందులో అస లన్నివిద్యలకూ, కళలకూ ఆశ్రయమై ఉండే సంస్కృతభాషా, సంస్కృతనాటకాలూ, వాని



ప్రయోగాలూ, పునరుద్ధారణం చెయ్యాల్నని తలచుకున్నారు. గాంధర్వపాఠశాలలు, గీర్వాణపాఠశాలలు, వేదపాఠశాలలు మున్నగు సంస్థలతో పాటుగా సంస్కృతనాటక సమాజాన్ని కూడా స్థాపించారు. మహారాజావారు సర్వసంపత్సమృద్ధులు గనుక అట్టి మహత్తర సంకల్పాన్ని క్షణమాత్రకాలంలో నెఱవేర్చుకున్నారు కాని మఱొకరి కేలా సాధ్యం కాబడుతుంది. ఎందరు పండితులుకావాలి, ఎందఱు దేశికులుకావాలి, ఎన్ని పరికరాలు కావాలి, ఎంత కష్టించాలి, ఎంత పోషించాలి!

నామకహా ఎవరో ఒకరు మేనేజరుగా ఉండేవారు కాని సర్వము శ్రీరాజావారే చూచుకునేవారు. యోగ్య రూపకాన్ని స్వయంగా నిర్ణయించేవారు. పాత్రాలన్నీ తగినవారికి స్వయంగా పంచిపెట్టేవారు. స్వయంగా నేర్పేవారు. తెరలను వ్రాయించేవారు. కోటలో ఆడించేవారు. ఇంకేం కొఱత ఉంటుందో ఆలోచించండి.

మ॥ రా॥ రా॥ గంటి బుచ్చిశాస్త్రిల్లుగారు అలా మహారాజావారిచేత తయారుకాబడినవారే. అయితే సహజంగా వీరు శాస్త్రీయ సంగీతాన్ని, భరతాన్నికూడా అభ్యసించారు. భాషాప్రవేశం లేకపోతే సంస్కృతనాటకాల్లో నాయకపాత్రాల్ని ధరించడానికి అవకాశము ఉండదుగదా! అంగసౌష్ఠవం, దానికితగినగాత్రం కూడా ఉండేది. అవి వీరి

పూర్వపుణ్యాం. ఇట్టి మహానటుడు దుష్యంతుడు, పురూరవుడు మొదలగు పెద్ద పాయాపాత్రాల్ని ధరిస్తూఉంటేమాచేవాటికి ఇంకెన్ని నేత్రాలుండాలో ఆలోచించండి. ఇంకా మ॥ రా॥ రా॥ చొప్పల్లి నరసింహముగారి 'శకుంతల' వేషం కూడా బహు పొంకంగానూ, సుకుమారంగానూ ఉండేది. శ్రీ శ్రీశ్రీ మహారాజావారినే వీరివేషము భ్రమింపజేసింది ఒకపర్యాయ మూమద్రాసులోనని చెప్పుతుంటారు ఇప్పటికీన్నీ.

మ॥ రా॥ శ్రీ పప్పు వెంకన్నగారి గాత్రాన్ని గూర్చి ఎంతని చెప్పమంటారు! విరామసమయంలో నేపథ్యమందుండి రాగాలాపాన్ని వీరు ఆరంభించేసరికి పట్టణమంతా తన్మయత్వాన్ని చెందేది. వీరి గాత్రం మూడుస్థాయులలోనూ సునాయాసంగా స్వైరవిహారాన్ని చేసేది అమోఘంగా. వీరు మంచి వైణికులుకూడాను.

కట్టా వేరయ్యశాస్త్రిల్లుగారు పాపం కాలంచేశారు. వీరు ఎంత విద్యావినయసంపన్నులని చెప్పం! ఎంత చక్కని గాత్రం! వీరా సంస్కృతనాటకాల్లో విదూషకుని పాత్రను వేస్తూఉంటే నిజంగా ఆభరతముని చెప్పిన లక్షణాలన్నీ ఉట్టిపడుతూఉండేవని చెప్పుకునేవారు. శాకుంతలంలో కణ్వుని వేషమో! ఆహా! "యాస్యత్యద్య శకుంతలేతి హృదయం" అనే శ్లోకాన్ని చదువుతూ కరుణరసాన్ని క్రుమ్మరిస్తూఉంటే సభాసదుల నేత్రాలన్నీ అట్టే ఆనందభాష్పాల్ని కురిపిస్తూ



శ్రీ స్థానం నరసింహారావు గారు



వారి స్త్రీపాత్రము



వారి స్త్రీపాత్రము



శ్రీ అవధాని పురుషోత్తముగారు



ప్రాచీన సుందరి



మధ్యకాల సుందరి



ఈనాటి సుందరి

ఉండేవంటారు. ఇంక సమయస్ఫూర్తో! ఒకప్పుడు మహా
రాజావారు చెన్నపురంలో వీరిచేత విక్రమోర్వశీయాన్ని
ఆడిస్తూ ఉంటే పొరపాటున ఆడవారి ముఖాలకు మొగ
వర్ణాలు, మొగవారి ముఖాలకు ఆడవర్ణాలు వేయడం
తటస్థపడింది. ఇంతలో తెర లేచింది. ఆదీపాల కాంతుల్లో
ఒకరి ముఖాల్ని ఒకరు చూచుకుని దిగ్భ్రమ మందుతున్నారు.
ఒకమూల మహారాజావారు తప్పు సవరించుకోండని సంజ్ఞ
చేస్తూఉన్నారు. శ్రీ గవర్నరుగారు వారిప్రక్కనే కూర్చు
న్నారు. ఇంతలో తెర వాలింది. ఇంతలో మన పేరయ్య
శాస్త్రిగా రది గ్రహించి రంగానికి వచ్చారు. ఒక చంద్రో
దయ వర్ణనశ్లోకాన్ని శంకరాభరణంలో సాగిస్తూ "గవర్నరు
గారనే చంద్రుడు రావడంచేత వారి నటవర్గమనే సంద్రము
యొక్క ముఖం వెల్లబాఱింది" అని హిందీభాషలో వ్యా
ఖ్యానంచేసి సభాసదులందర్నీ సంతోషసాగరంలో ముంచే
శారు. ఇక ఆలోపలి వర్ణాలకుంభకోణం ఏమయిపోయిందో
అందఱూ ఈ వ్యాఖ్యానంలో పడ్డారు. ఇలాటి వెన్నో
ఉన్నాయి వీరి ప్రతిభావిశేషాలు.

కట్టా పాపయ్యశాస్త్రిల్లుగారో! వీరిప్పటికీ వృద్ధులై
యున్నారు. వీరిపాండిత్యం, స్ఫురద్రూపం, కంచువంటి
గాత్రం, ఇప్పటికీ చెక్కు చెదరలేదు. డెబ్బదిఏండ్లకు
తక్కువ ఉండవు. ఆనాటి సంస్కృతనాటకాల్లో వీరు
ముఖ్యంగా సూత్రధారులై యావత్తుపని జరిపించేవారు.

మొదట దైవప్రార్థన, నాందీప్రస్తావనలు జరిపించేవారు. తరువాత ప్రతి అంకానికీ మధ్యలో ప్రవేశించి ఆయా అంకాల్లో వచ్చే కథనుగురించీ, పాత్రాల్నిగురించీ స్వతంత్రంగానూ సరసంగానూ చెప్పేవారు. ఇలాటివా రెందఱో ఇంకా ఉన్నారు మహానుభావులు.

ఈ సమాజాన్నిచూచి నేర్చుకోవలసిన సంగతులు చాలా ఉన్నాయి. సభ్యులందఱు మంచి పండితులు. ఆడబడేవన్నీ రసవత్తరమైన సంస్కృతనాటకాలు. సకలకళానిధులగు శ్రీ శ్రీ శ్రీ మహారాజావారు ముఖ్యదేశికులు. పాత్రధారులందఱు ఆయా పాత్రలకు తగిన వయోరూపగుణశీలాది తాద్రూప్యాలనుపట్టి ఎన్నుకోనబడేవారు. రాంగిక దృశ్యాలన్నీ సమయానికీ, రసానికీ, స్థలానికీ తగినట్లు ఎప్పటికప్పుడు వ్రాయబడేవి. శాస్త్రీయమైన సంగీతాభినయాలే ఉపయోగింపబడేవి. తంబురాలు, ఫిడేళ్లు, చితార్లు, వీణలు, మృదంగాలు, ఘంటావాద్యాలు మొదలైనవే ఉపయోగింపబడేవి. హార్మోనియం ఎక్కడుండేదో! వీరి ప్రదర్శనాలు టిక్కెట్టుమీద ఎవరుపడితేవారు చూడడానికీ, ఎవరుపడితేవారు చూచి చిత్తంవచ్చినట్లు విమర్శించడానికీ ఆక్షేపించడానికీ, అర్థంలేకుండా "భేష్ భేష్" అనడానికీ అవకాశం ఇచ్చేవికావు. ప్రజ్ఞలోకానికిమాత్రం గౌరవాహ్వానాలు పంపబడేవి. రసజ్ఞులుమాత్రమే కోటలోకి రాగలిగేవారు. అయితేఏం! ప్రభువుగారి నిర్యాణంతో దీనిప్రభ కూడాఅంతరించిపోయింది. ఇది మన దురదృష్టం.



ప్రస్తుతం అమలులోఉన్నవానిలో "శ్రీ విజయరాయ డ్రమాటిక్ ఏకాడమీ" ముందుగా చెప్పదగింది. ఇది ఇప్పటి మహారాజావారి పోషణంలోనేఉంది. సుప్రసిద్ధపండితులు నటులు అయిన శ్రీ తాతా ఉమామహేశంగారు దీని ఆచార్యత్వమును వహిస్తూఉన్నారు. అందఱూ అన్నిచోట్లా ఆడుతూఉండే తెలుగునాటకాలే వీరున్నూ ఆడుతూఉంటారు. అయితే పూర్వపు సంస్కృతసమాజంలో ఉండే కఠినమయిన కట్టుబాట్లు క్రమశిక్ష ఇందులో అంతగా ఉన్నట్లు కనిపించదు. ఉన్న యువనటుల్లో శ్రీరామాయణం సర్వేశ్వర శాస్త్రిగారొక్కరే కొంత చెప్పతగిన లక్షణాన్ని కలిగి కనిపిస్తారు.

'వాణీవిలాససభ'ను ఆతరువాత చెప్పవలసి వస్తుంది. ఇందులో చాలామంది చదువుకున్నవారే పాత్రలను ధరిస్తూ ఉంటారు. మా॥ రా॥ రా॥ అనాసపురపు గోపాలరావు బి.ఏ. గారు కీ॥ శే॥ చట్టి సత్యనారాయణ బి. ఏ. ఎల్. టి. గారు చేరి దీన్ని స్థాపించారు. ఇందులో ప్రధానపాత్రాల్ని గోపాలరావుగారు ధరిస్తూ ఉంటారు. మంచివిగ్రహం విశాలమయిన నేత్రాలు కలిగి వీరరసప్రధానమయిన పాత్రల్ని చక్కగా అభినయిస్తూ ఉంటారు. దుస్తులు, ఇతరదృశ్య పరికరాలు వీరే దూరదృష్టితో యోచించి సమకూరుస్తూ ఉంటారు. వీరితరువాత నందగిరి శ్రీనివాసరావుగా రనే వారు మంచి నేర్పుగలిగి చిల్లరవేషాల్లో పనిచేస్తూ ఉంటా

రని తెలుస్తుంది. వీరు ఇంగ్లీషునాటకాల్లోకూడా మంచి ప్రయోగనైపుణ్యాన్ని ప్రకటిస్తూ ఉంటారట.

బళ్లారిరంగాలు.

తెలుగులో నాటకాల విజృంభణానికి చాలా ధైర్యంగానూ, సాహసంగానూ నిలువబడినవారు బళ్లారివారే. **1882-85** సం॥ఆప్రాంతాల్లో బందరులోవలె ఇక్కడకూడా నాటకసమాజాలు వెలశాయి. ఆలా వెలసిన సభలన్నిటిలో కే॥ శే॥ ధర్మవరం కృష్ణమాచార్యులుగారి సరసవినోదినీ సభ ముఖ్యంగా చెప్పతగింది.

కృష్ణమాచార్యులుగారు విద్యాధికులు. అనేక భాషలలో స్వాతంత్ర్యాన్ని పడసినవారు. అనేక ఉదారభావాలలో ఎంతో సరళంగానూ, ఘనంగానూ సంచరిస్తూ అశేషప్రజలచే గౌరవింపబడుతూ ఉండేవారు. ఇట్టి వీరికి కలిగిన నాటకకళాభిమానం, అభినివేశం, ప్రయోగవైదుష్యం, కవితావిశేషం, వృధాగా ఎలాపోతుంది. మంచో చెడ్డో తమకు కలిగిన నవ్యభావాన్ని, విజ్ఞానాన్ని ప్రచారంలోకి తేవడమే కదా మహాపురుషులకుండే గొప్ప లక్షణం!

కర్ణాటక నాటకసాంప్రదాయాలూ, పాశ్చాత్యపార్శీత్యాది వివిధదేశీయ ప్రయోగవైదుష్యాలూ అనుభవించడంచేత తమలోపుట్టిన భావస్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని



తెగించి తెలుగులో మొట్టమొదట నాటకమంటూ ఒకదాన్ని వ్రాశారు. ఆకారణంచేతే నాటకపితామహులనికూడా అనిపించుకున్నారు. అలా వ్రాయబడిందే చిత్రనళీయనాటకం. ఈనాటకం బయలుదేరినప్పటినుంచే అంకాలు, రంగాలు, పాటలు, పద్యాలు గల నాటకాలెన్నో బయలువెడలనారంభించాయి. ఆరంభిస్తేనేం! మిగతావారు తమ నాటకాలాడించుకోవడానికి సంఘాలను బయలుదేరతీసుకోలేదు. ఆడుతూఉండగా చూడడం అంటూ తటస్థపడితేనే కాని ఆ నాటకాలకు బేరసారాలు ప్రబలంగా రావడమనేది ఉండదు. కృష్ణమాచార్యులుగారాలోపము చేయలేదు. స్వయంగా ఒక సభను స్థాపించారు. తమ నాటకాలన్నీ తామే నేర్పి ఆడించేవారు. అంతేకాకుండా స్వయంగా నాయకపాత్రాన్నికూడా ధరించేవారు. భాషావిశారదులై, కవులై, సంఘదేశికులై, తుదకు నటులై, తాము వ్రాసిన నాటకంలో, తామునేర్పిన సంఘంలో, తామువ్రాయించిన రాంగికదృశ్యాల్లో, పాటల్లో, పద్యాల్లో, హాస్యసితబలాల్లో, వారభినయించే ప్రధానపాత్రయొక్క తత్త్వాలూ, వాని స్వరూపాలూ ఎంత మనోహరంగానైనా ఉండక తప్పదు. ఆరూపంగా వీరూ, వీరి నాటకాలూ, చివరకు వీరి సంఘం గడించిన కీర్తి ఇప్పటికిన్నీ నిలిచిఉండడంచేతనే దాని గొప్పతనము అనిర్వాచ్యమయినదని చెప్పవలసి వస్తుంది.

కీ॥ శే॥ కోలాచలం శ్రీనివాసరావుగారుకూడా అసా

మాన్యమయిన నాట్యవైదుష్యాన్ని కలవారు. అనేకనాటకాల్ని వ్రాశారు. వీరిచేతకూడా ఒక సభ నడిపించబడుతూఉండేది. వీరి నాటకాలన్నీ ఆసభవారు ప్రదర్శిస్తూకూడా ఉండేవారు. ఇప్పు డిక్కడి సభ లేవీ పని చేస్తూఉన్నట్టు కనిపించదు.

రాజమహేంద్రవరరంగాలు.

మొత్తానికి ఎక్కడచూచినా ధార్వాడవారు వేసిన నాట్యవిత్తనాలు బాగా నాటుకున్నాయి. వీరు వెళ్ళిన ప్రదేశాల్లోఅల్లా నాటకసంఘాలు వెలిశాయన్నమాటే. అయితే కొన్నిచోట్ల హిందీనాటకాలూ మరికొన్నిచోట్ల తెలుగునాటకాలూ ఆడబడుతూ ఉండేవి. ఆయా స్థలాల్లో ఉండే అవకాశాల్ని బట్టి రుచుల్ని బట్టి నాటకా లాడబడుతూ అదరింపబడుతూ ఉండేవి.

1885—90 సం॥ ఆప్రాంతాల్లో మ॥ రా॥ రా॥ ఇమ్మానేని హనుమంతరావు నాయుడు, ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, వడ్డాది సుబ్బరాయకవిగార్ల మూలమున "హిందూ నాటకసమాజం" అనేది మొలకెత్తింది. కొన్ని తెలుగునాటకాలు చక్కని కట్టుబాట్లల్లోనే ఆడింది. పెద్ద పెద్ద లందరూ వేషాలు వేశేవారు. తెరలు వగైరాలకంటే అభినయానికే ఎక్కువ ప్రాధాన్యం వీ రిస్తూ ఉండేవారు. ఇందులో చాలామంది పండితులే పాల్గొనడంచేత నిర్ణయించుకునే నాటకాలూ,



ఆడే ఆటలూ, పాడే పాటలూ చాలవరకు నిర్దుష్టంగానూ సలక్షణంగానూ ఉండేవి. మ॥రా॥రా. వడ్డాది సుబ్బరాయకవి గారంతటివారు రంగంమీదకు వచ్చి తాము తెలిగించిన వేణీసంహారనాటకంలో, అశ్వత్థామపాత్రను చిత్రిస్తూ ఉండేవారంటే, ఆసంఘానికీ, ఆనాటకానికీ, కూడా ఎంతగౌరవమైనా రాక ఎట్లాపోతుంది! ఇంకా 'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశంగారుకూడా తమకు తగిన వేషాల్ని వేస్తూనే ఉండేవారట. కాబట్టే రాజమహేంద్రవర నాట్యరంగానికి ఇప్పటికీ ఎంతో మర్యాద ఉంటూఉంది.

ఇక మన యస్. గున్నేశ్వరరావు, కృత్తివెంటి నాగేశ్వరరావుగార్ల యాజమాన్యాన బయలుదేరదీయబడింది మరి యొక పెద్దపాయాసమాజం. ఏమిచెప్పమన్నారు! దీనితో కొంప లంటుకున్నాయి ఒకవిధంగా! అక్కడక్కడ సమాజాల్లో ఏదోవిధంగా అక్కడకు వచ్చేవారూ అభిమానంతో పని, చేస్తూఉండేవారూ, అందమైనవారూ, పాడగలవారూ, అభినయచాకచక్యంకలవారూ, ఈ సమాజంవల్ల కళ్లు తెరచారు. నాటకోద్యోగం తమ జీవనానికి సాధనంగా ఉపయోగపడే దారిని కనిపెట్టారు. ఇంకేముంది! పక్షులల్లే పదిదేశాల్నుంచీ వచ్చిపడ్డారు ఆ గోదావరీతీరంలో! అలా పడ్డవారిలోకూడా చాలామంది మా బందరునటులే అని తెలుస్తుంది. ఇక్కడ సమాజా లారూపంగా కొంచెం తాత్కాలికంగా మౌనం వహిస్తే వహించాయికాని ఈసందర్భంలోకూడా బందరు

నటులకు కలిగిన ప్రాముఖ్యతనుబట్టి తృప్తిపొందేవి.

ఆంధ్రదేశం మొత్తంమీద నాటకసమాజానికి వర్తక మర్యాదను తెచ్చిపెట్టినవారు మన గున్నేశ్వరరావు నాగేశ్వరరావుగార్లే. ఎక్కువగా ద్రవ్యాన్ని ఆవిషయంలో ఖర్చుపెట్టినవారుకూడా ఒకవిధంగా వీరే. వందలకు వందలు నటులకు అడ్వాన్సులుగా ఇవ్వడం, పదిమొదలు వందరూపాయలవరకూ జీతాలేర్పఱచడం, కార్ఖానాలోని పనివాండ్రవలె ప్రొద్దుటినుంచి సాయంతనంవఱకూ నటులంతా నాట్యవిషయంలో యజమానులు చెప్పినట్లుగా కష్టిస్తూ ఉండడం ఈ మొదలైన ఆచారాలన్నీ వీరి సమాజంతోనే ప్రారంభమయినాయి. ఇక ఇక్కడినుంచీ ఆంధ్రనాటక ప్రపంచానికి ఒక క్రొత్తరూపం తటస్థించింది. క్రొత్తపద్ధతులు బయలుదేరాయి.

తెలిసినంతవఱకు, విన్నంతవఱకు, చూచినంతవఱకు వీరాడే నాటకాలు బజారు పలుకుబడినిపట్టి నిర్ణయించుకోబడుతూ ఉండేవి. ఒకప్పుడు ముద్రితనాటకాలూ ఆడేవారు. మఱొకప్పుడు తమసెట్టుకు తగినట్లు వ్రాయించుకునేవారు కూడాను. అలా వ్రాయించుకొన్న నాటకాల్లో, పాడగలవారికి పద్యాలూ, పాడలేనివారికి గద్యాలూ, ఆటా పాటా రెండూవచ్చినవారికి పార్శీదేశపు పసందుపాటలూ ముఖ్యంగా కనిపిస్తూఉండేవి. నాలుగు గంటలకాలంలో ఆట ముగియడానికి వీలుగాకూడా ఉండేవి.



పాటలు వ్రాయడానికి కీ॥ శే॥ పాపట్ల కాంతయ్యగారు ఉండేవారు. ప్రత్యేకంగా ఒక్కొక్క నాటకానికి పార్శీపద్ధతి కీర్తనలువ్రాసి, ఆవ్రాసినవాన్ని నటులందఱకూ నేర్పి, వందో వందాయాభైయ్యో జీతంపుచ్చుకునేవారు వీరు. అవసరం అయినప్పుడు హార్మోనీనికూడా వాయిస్తూ ఉండేవారు. వీరు సంగీత విద్వాంసులు. హైదరాబాదు దేశంలో ఎక్కువకాలం ఉన్నవారు. అచ్చటివారి గీతికాసాంప్రదాయాల్ని అనుభవించినవారు. భాష రాకపోయినా స్వరసహాయంతో ఆ ఫణితులను జ్ఞాపకముంచుకోగలవారు. ఇంకా యవనాంధ్ర సంగీతలక్షణాలు రెండింటినీ జోడించి, ఒకక్రొత్త నడకలో, ఒకక్రొత్త రూపంలో, ఒకక్రొత్త రుచిలో, ఎన్నివందల కీర్తనలైనా సృష్టించగలవారు. ఆకాలంలో ఇట్టి ప్రజ్ఞగలవారు మఱియొకరు లేరు. ముందు నాటకం ఎట్లాయున్నా వీరి కీర్తనలుమాత్రం నాట్యపట్టాభిషేకాన్ని చేసుకునేవి. మూడువంతులు నాటకాదాయానికి ఈ కీర్తనలు కారణంగా ఉండేవి. అదొకశకంగా వెలిగిపోయింది. ఆ కారణంచేత „ నాటకవాగ్గేయకారకు”లంటాను నే నీపాపట్ల కాంతయ్యగారిని.

ఇంకోవిశేషం ఏమిటంటే ఈసమాజంలో చిత్రవిచిత్రమయిన సీన్లూ, దుస్తులూ, అమర్చడానికి కూడా ఒక తగిన ఉద్యోగి ఉండేవాడు. ఈయన పార్శీదేశస్థుడు. ఈయన పేరు ,,ఎ. యస్. రామ్,, రెండుమూడు వందలు జీతం

పుచ్చుకునేవాడు. కుంచె చేత పుచ్చుకుంటే ఏడేడు పథ్నా
ల్గులు లోకాలూ రంగంలో మొలిచేటట్లు చేసేవాడు ఈయన.
ఈయనచేతికి కుదిరిన పాకం ఎంత విశేషమయిందో చెప్పలేం
కాని ఆ దృశ్యాలకిచ్చే రంగుల్లో జీవకళలన్నీ ఉట్టిపడుతూ
ఉండేవి. కావలసినంత ఖర్చుపెట్టి సమాజంవారు ఈయన
చేత ఎప్పటికప్పుడు ఆయా నాటకాలకు తగిన యవనికాది
దృశ్యాలను అన్నిటినీ వ్రాయించేవారు. దుస్తులుకూడా
వీరి సలహాను బట్టి బొంబాయి, కలకత్తాలనుండి దిగుమతీ
చేసుకునేవారు. పాటల్లోపార్శీ, దుస్తుల్లోపార్శీ, దృశ్యాల్లో
పార్శీ, ఇన్ని విధాలైన పార్శీల్లోపడి, ఇక మాటలమాత్రంలో
ఉన్న ఆ యాంధ్రం కాస్తా అణగారిపోయేది. ‚‚ఏదెట్లా
పోతేనేమి! అమోఘంగా డబ్బువచ్చేది. అందరూ సంతో
షించేవారు. ఇంకేంకావాలి ఇంతకంటే!

తెలుగు నాటకాల్లో ‚‚డ్యాన్సులు,, అనేవికూడా ఈ
సమాజంవల్లనే ప్రవేశమయినాయి. కొంచెం మించుమించుగా
అందరూ ఒక్కవయస్సులో ఉండేబాలురు బాలవేషాల్లోనూ,
బాలికావేషాల్లోనూ, అధమం ఒక ఇరవైముప్పైమందైనా,
ఏదర్బారు సీనులోనో ప్రత్యక్షమయ్యేవారు మనోహరంగా.
లక్కబొమ్మలల్లే ఉండే ఆలేతముఖాలూ, ఆచూపులూ, ఆ
పాటలూ, ఆగంతులూ అంతా ఒక అపూర్వమయిన
అందాన్నీ, ఆనందాన్నీ ఇచ్చేవి. ఆటలో ఇంకాయేమైనా
అస్తోకులుంటే అవన్నీ ఈడ్యాన్సుల్లో అంతర్ధానమయిపోయేవి.



ఇంకా మధ్యమధ్య ‚‚రామ్,,గారు తమ అనుపమాన హాస్య
వైదుష్యాన్ని కూడా ప్రదర్శిస్తూ జనులను అమోఘంగా
సంతోష పెట్టేవారు.

ఆ యాటలోకూడా మంచి ఆరిందాతనం కనిపించేది.
టైమ్‌ప్రకారం నడిచేది వ్యవహారమంతాను. ఎంతపెద్దసీనైనా
తెప్పపాటులో ప్రసన్నమో, అంతర్ధానమో కావలిసిందే.
పాత్రలకు తడుముకోవడంగాని, అసందర్భ ప్రదర్శనాలుకాని,
అల్లర్లూ, ఆకతాయి తనాలూకాని, ఏమాత్రమూ కని
పించేవి కావు. ఎంత అల్లరిలోనైనా గున్నేశ్వరరావు గారు
హాలులోకి వచ్చారంటే అంతా గుప్ చుప్.

కీ॥ శే॥ యస్. గున్నేశ్వరరావు గారు శ్రీయుత నాగే
శ్వరరావు గారితో విడిబడి స్వంతంగా సాగించిన దినాల్లో,
ఇది ‚‚చింతామణీ నాటకసమాజంగా,, మారింది. ఈ
కాలంలోకూడా మామూలుపద్ధతిని నాటకాలాడుతూ ఉండే
వారు. ఇందులోనుంచి చీలతీసుకున్న నటులతో, నాగే
శ్వరరావుగారు సాగిస్తూవచ్చిన సమాజం ఏలూరులో చాలా
నష్టపడింది. హాలు కాలిపోవడంచేత పాపం! ఒకలక్షరూపా
యలు ఖరీదుచేసే దుస్తులు మొదలైనవన్నీ బూడిదపాలయి
పోయినాయి. ఇకతరువాత చెప్పాల్సిన విషయాలు ఏమీ
లేకపోయాయి.

మ॥ రా॥ రా॥ ధరణిప్రగడ సూరయ్య గారు ‚‚మానే
పల్లికంపెనీ,, అనేవాడుక కలిగిన ‚‚నేషనల్ థియేటర్,, అన

బడేదాన్ని స్థాపించారు. ఒక హాలుకూడాకట్టారు. కీ॥ శే॥ అంబడపూడి కోటయ్యగారనేవా రిందులో నాయకపాత్రాన్ని ధరిస్తూ ఉండేవారు. ఈయంది కంచువంటిగాత్రం. రూపం మన బలిజేపల్లికవిగారిదివలే ఉంటుంది. పాటా ఆటా అంతా అదే అచ్చు. మ॥ రా॥ రా॥ ముప్పిడి జగ్గరాజుగారు ఈయన ప్రక్క నాయికపాత్రాన్ని ధరిస్తూ ఉండేవారు. ఆ దినాల్లో ఈయనవేషానికీ జగ్గరాజుగారి అభినయానికీ వంకపెట్టేవారు కనిపించేవారుకారు. క్రొత్తగ్రామాల్లో ఈయన అభినయిస్తూ ఉంటే ఆడదా మగవాడా అని అడగడం నే నెఱుగున్నాను. ఇప్పటికైనా ఆయొద్దికలు, ఆమాటసున్నితం, ఆపాటపొందిక, ఆ చీరకట్టుసొగసు, ఆ ముఖలావణ్యం, ఆ గాంభీర్యౌచిత్యాలు విధాయకంగా కనిపిస్తూనే ఉంటాయి. అంబడిపూడాయన పాటతోనూ, ఈయన ఆటతోనూ చూచేవారు గుమ్మయి పోతూఉండేవారు. ఈ కంపెనీ విశేషం ఇంతే.

ఆ తరువాత "ఎమెచూర్సు" కంపెనీ చెప్పాల్సి ఉంటుంది. దీన్ని మ॥రా॥రా॥ శ్రీపాద కామేశ్వరరావు యమ్, ఏ. గారు లేవతీశారు. వీరిస్వంతనాటకాలేకాకుండా ఇతరనాటకాలను కూడా ఈసమాజంచేత ఆడిస్తూ ఉండే వారు. నాట్యశిక్ష అంతా వీరిదే. ఈ శిక్షలో తయారై బందరు చిత్రనళీయం కాంపిటీషన్‌లో నలుని మెడలు ఎవరికిపోయినా, పేరుమాత్రం ప్రతిష్ఠించుకొన్నవారు కీ॥ శే॥ అంకరాజు రామారావుగారే. ఈయన వేషంలోనూ, అభి



నయంలోనూ మహా గాంభీర్యాన్ని ప్రదర్శిస్తారుగాని పాపం ఈయనకు దైవికంగా కలిగిన దంతావికారం ఒకటిమాత్రం వాచికభావాన్ని విపరీత పరిస్థితుల్లో పెడుతూఉండేది. భగవంతు డేదో ఒక వంకపెడతాడు ఎలాటివారికైనా!- ఏలూరుపాటి వెంకటరత్నంగారు నాయికపాత్రాన్ని వీరితో వేస్తూ ఉండేవారు. ఈయన్ని చూడడం కలుగలేదు. మిగతా నటులైనా వారి లోపంలేకుండా ప్రదర్శనాల్లో పనిచేస్తూ ఉండేవారు.

పెద్దాపురంలోని 'విద్యావినోదినీసభ' విద్యాధికులను ఎందఱినో కలిగి కొన్ని నాటకాలాడేది ఆమధ్య. ప్రతాపరుద్రీయం మహాచక్కగా ఉండేదని వాడుక. అందులో మ॥ రా॥రా॥ కల్లూరి సుందరరామయ్యపంతులు బి. యే. యల్. టి గారు యుగంధర పాత్రాన్ని మహా చక్కగాఅభినయించే వారట. వీర్ని చూద్దామనుకొని ఒకసారి రమ్మంటే కాకినాడకు వెళ్లాను. నాటకం ఆగిపోవడంచేత ఖర్చులు దండుగ పెట్టుకున్నాను గాని వారి ప్రయోగ వైదుష్యాన్ని మాత్రం అనుభవించలేదు.

## కాకినాడరంగాలు

కాకినాడలో నాటకకళా విజృంభణానికి పట్టుదలతో ప్రారంభించినవారు మ॥ రా॥ రా॥ సింగితం అబ్బాయిగారనే వెంకటాప్రుగారే. ఇంతకుముందు పూర్వపు జగన్నాథ

పురంలో పులవర్తి వెంకయ్య ప్రభృతులు కొన్ని ప్రయత్నాలు సాగించారుకాని బుద్బుదాలవలె అప్పటికప్పుడే అణగారిపోయినందున చెప్పడానికేమీ లేకపోయింది. ఈ సింగితం అబ్బాయిగారు అసామాన్య ప్రజ్ఞావంతులు. పట్టుమంటే పదివేలు పెట్టడానికీ, పదిమందిని సమకూర్చడానికీ, పట్టువలగా పని సాగించడానికీ కావలసిన వీలుసాళ్ళన్నీ ఉన్నాయి ఈయనకు. మ॥ రా॥ రా॥ వెదురుమూడి శేషగిరిరావు, జయంతి భావనారాయణకవి, ఉప్పు చిదానందరావు, పండ్రవాడ కేశవరావు, తుర్లపాటి సుబ్బయ్య, మాచిరాజు రెడ్డిపంతులు, దినవహి కృష్ణమూర్తి, పత్రి రామచంద్రరావు, ముష్టినాగన్న, మంగిపూడి పేరయ్యశాస్త్రి, దేవరకొండ కృష్ణమూర్తి, బారు వెంకటరమణయ్య, పత్రి శేషగిరిరావు, మొసలికంటి బాయన్నపంతులు, జీమగంటి కృష్ణారావు, కుందూరి మూర్తిరాజు చీమలకొండ సోమేశ్వరరావు, కొటికలపూడి వెంకటాద్రియ్య, నందూరి మూర్తిరాజు, వల్లూరు జగన్నాథరావు, ముప్పిడి జగ్గరాజు మొదలైన వారెందరో ఉండేవారు ప్రసిద్ధనటులు. వీరందరూ కూడా బాగాచదువుకున్నవారు. పెద్దపెద్ద ఊహాలు కలవారు. రంగానికి రావడం తటస్థపడితే ఒక్కొక్కరూ ఒక్కొక్క విషయంలో సమర్థంగా సభ్యుల నాకర్షింపగలవారు. ప్రత్యేకంగా అందర్నిగురించీ వ్రాస్తే చాలా అవుతుంది భారతం. వీరందఱిలో ఇప్పటికీ ప్రత్యేక ప్రతిభావిశేషాన్ని ప్రకటిస్తూ, నటలోకం చేత పూజింప బడుతూ స్వతంత్ర వాచికాభినయ విజ్ఞానాన్ని అధికంగా కనుపరస్తూ,



విరాజిల్లుతూ ఉండే ఒక్క మ॥ రా॥ రా॥ వెదురుమూడి శేషగిరి రావుగార్ని గూర్చిచెప్పితేచాలు.

శేషగిరిరావుగారు మధ్వబ్రాహ్మణులు. ఇప్పటికి అఱవై ఏండ్లు దాటిఉంటాయి. కవులుకూడాను. సుభద్రా పరిణయం, కన్యకావిజయం, సుయోధన ఘోషయాత్ర, మొదలైన తెలుగునాటకాల్ని, శివాజీచరిత్ర, పీష్వా నారాయణరావువధ మున్నగు హిందీ నాటకాల్ని కూడావ్రాశారు ఆదినాళ్లలోనే. వీటిఅన్నిటిలో వీరు ప్రధానపాత్రలను ధరించి నిరుపమానంగా అభినయిస్తూ ఉండేవారు. ఇవిగాక ఇంకా కాళ్లకూరివారి బొబ్బిలి, కందుకూరివారి శకుంతల, రత్నావళి, మాళవికాగ్నిమిత్రం, ప్రబోధచంద్రోదయాల్ని, వడ్డాదివారి వేణీసంహార విక్రమోర్వశీయాల్ని. అనంతరావుగారి పాండవాజ్ఞాతవాసాన్ని, వీరేశలింగంగారి హరిశ్చంద్రాన్ని ఆడిస్తూ, తాముకూడా ప్రధానపాత్రల్ని, ధరిస్తూ ఉండేవారు.

పిఠాపురంలో శ్రీ శ్రీ శ్రీ రాజావారి తల్లిగారునూ, శ్రీ శ్రీ శ్రీ రాజారావు సూర్యారావు బహద్దరువారి సతీమణులునూ, కోలంకవగైరా ఎస్టేటు జమీందారిణులునూ అయిన శ్రీ శ్రీ శ్రీ రాజారావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి పోషణంలోనూ- శ్రీ శ్రీ శ్రీ చెలికాని వేంకట సూర్యారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, ఆకుండి వేంకటరత్నం మొదలైన పెద్దల పరిపాలనలోనూ ఒక సమాజం

ఉంటూఉండేది. ఇందులో మన శేషగిరిరావుగారుప్రధాన
పాత్రలను ధరిస్తూ పైనిచెప్పిన నాటకాల్నన్నీ తెలుగు
దేశాల్లో చాలావఱకు వ్యాప్తిలోనికి తెచ్చారు. మండ
పేట, రాజమహేంద్రవరం, తణుకు, ఏలూరు, బెజవాడ, గుం
టూరు, బందరు, జగ్గయ్యపేట, కంభంమెట్టు, ఒరంగల్లు,
పెద్దాపురం, ద్రాక్షారామం, వేళంగి, మున్నగు స్థలాలన్నీ
1900—1906 సం॥ వఱకు వీరి అభినయవైదుష్యాన్ని అనుభ
వించినవే.

హిందీనాటకాలవిషయంలో ధార్వాడవా రెలాదారిచూ
పారో తెలుగునాటకాలకి మన శేషగిరిరావు ప్రభృతులే అలా
పలుకుబడి తెచ్చారు. ఇంకొక విశేషం ఏమిటంటే బందరులో
లక్ష్మణస్వామిగారంతటివారుకూడా శేషగిరిరావుగారి హైదరు
జంగ్ పాత్రాభినయాన్ని చూచే తాముకూడా ఆపాత్రన్ని
వెయ్యడం మొదలుపెట్టారనే సత్యం ఇక్కడి పెద్దలెంతో
చెప్తూ ఉంటారు. అదిగాక లక్ష్మణస్వామిగారొక్క
హిందీలోనే తమ అభినయ నైపుణ్యాన్ని చూపిస్తూ ఉండే
వారు. గుంటూరు హరిప్రసాదరావుగారు ఒక్క తెలుగులోనే
ఆడుతూఉండేవారు. పైగా వారుభయులకూ కవితాధోరణి
అలవడలేదు. ఆదినాల్లో వీరు కవులై, ఆంధ్రంలోనూ,
హిందీలోనూ కూడా నిరుపమానంగా తమ నాట్యప్రాగ
ల్భ్యాన్ని ప్రకటిస్తూ ఉండేవారు.

శేషగిరిరావుగారియందు ఇంకొక విశేషాన్ని మన

మంగళం గౌరవించాల్సి ఉంటుంది. అదేమిటంటే, నాటక
గ్రంథాన్ని దేన్నైనా సరే, ఒకటిరెండు పర్యాయాలు చదివి,
అందలి వస్తుతత్త్వాన్నే కాకుండా పాత్రలయొక్క పరస్పర
వాచిక సంబంధాల్నన్నిటినీ హృద్గతం చేసుకొని, తమ
పాఠ్యాన్ని పాఠం చేయకుండానే తమకు సంబంధించిన ఇతర
పాత్రల పాఠ్యసంబంధాలు పోకుండానూ, వస్తువు చెడకుం
డానూ, గ్రంథంయొక్క భాషాశైలిని కాపాడుకొంటూ,
ఇంకా పాత్రతత్త్వాన్ని అధికంగా పోషించుకొంటూ, ఆశు
వుగా, అన్నివిధాలైన వాచికాల్నీ వినిపిస్తూ అప్రయత్నం
గానూ, మనోహరంగానూ, అభినయకార్యాన్ని నిర్వర్తిస్తారు.
ఈ విషయంలో ఇప్పటికీ వీర్నిమించినవారు లేరు. గ్రంథం
చాలా ఉందిగనుక ఇంతటితో ఇక వీరివిషయం చెప్పడం విర
మిస్తాను.

1916 సం॥లో ‘యంగ్ మెన్సు హేపీక్లబ్’ అనేది
బయలుదేరింది. ఇందులో పామర్తి బుచ్చిరాజు నాయక
పాత్రాల్నీ, దేవినేని జగన్నాయకులూ, ఏలూరుపాటి వెంకట
రత్నం నాయికాపాత్రల్ని ధరిస్తూ ఉంటారు. జగన్నాయ
కులు చింతామణి వేషం వేయడంలో బాగా వెల్లడి అయి
నాడు. బోగండాని టక్కుటమారి విద్యల్ని ఈయన బాగా
చూపిస్తాడు.

1919 సం॥లో “ఆంధ్రసేవాసంఘం” ఒకటి బయలు
దేరింది. ఇందులోనూ చాలామంది పిల్లకాయలు పని చేస్తూ

ఉంటారు. మ॥ రా॥ రా॥ జోశ్యుల కృష్ణమూర్తిగారు వీరికి నాట్యశిక్షను ఇస్తూ ఉంటారు. ఈ సమాజంలో అవసరాల సూర్యనారాయణం అనే అబ్బాయి అంత చిన్నవయస్సులో ఆ జహ్వారీవేషాన్ని వేసి ఆమాత్రంగా గురువుచెప్పినదాన్ని తప్పకుండా ప్రకటించడంఅనేది ఆశ్చర్యమే ! కస్తూరి శివరావు అనే అబ్బాయి దావూదువేషంలోనూ, గుఱ్ఱం వీరాస్వామి రజాక్ వేషంలోనూ మహా స్వతంత్రంగానూ తమాషాగానూ అభినయిస్తారు. ఇదీ ఆశ్చర్యమే !

1921 సం॥లో 'శ్రీకృష్ణవిలాససభ' ఒకటి బయలుదేరింది. వీరు స్వంతానికి ఒక హాలునుకూడా కట్టుకున్నారు. మ॥ రా॥ రా॥ నందికోళ్ళ గోపాలరావుగారు దీని జననానికీ అభివృద్ధికీ ముఖ్యకారకులు. లోగడ చెప్పకోబడిన నటుల్లో కొందఱు దీనిలో వేషాలువేస్తూ ఉండేవారు. ఇప్పుడు ఇది నాటకాలాడుతూ ఉన్నట్టు కనిపించదు.

### నెల్లూరురంగాలు.

1890—95 సం॥ ప్రాంతాల్లో నెల్లూరులో బయలుదేరింది ఈ నాటకోద్యోగం. మ॥ రా॥ రా॥ మహామహోపాధ్యాయ, వ్యాఖ్యాతృ చక్రవర్తి, కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారు, పూండ్ల రామకృష్ణయ్యగారు సంకల్పించారు ఒక సమాజాన్ని స్థాపించడానికి. ఆంధ్ర భాషాభిమాని సమాజం అలా వీరిచే నెలకొల్పబడిందే. అయితే



ఇదివఱకు మనం తెలుసుకున్న సమాజాల్లోకంటే ఈ సమాజంలో చాలామంది బి. ఏలు, యమ్. ఏలు, ఇంకా ఎక్కువగా వేషాలువేయడం మొదలుపెట్టారు. నాట్యశిక్ష అంతా శాస్త్రిల్లవారిదే. నాటకాలుకూడా శాస్త్రిల్లుగారు వ్రాసినవే ముఖ్యంగా ఆడేవారు. ఇతరనాటకాల్ని ఏమాత్రం కన్నెత్తి చూడకపోవడమే ఈ సమాజానికి ప్రధానలక్షణంగా ఉండేది. ఒకమూల బళ్ళారివారి స్వతంత్రనాటకాలూ, మఱొకమూల గోదావరీజిల్లావారి ఆంధ్రీకృత సంస్కృత నాటకాలూ, ప్రచారంలో ఉండే సమయంలో శాస్త్రిల్లవారి ప్రభావంవల్ల నెల్లూరువారికే సంస్కృతనాటకాల నిజ స్వరూపాలూ, జాతీయప్రసంగాల భావమాధుర్యాలూ, ఇంకా ప్రాచ్యాభినయపద్ధతులూ, అనాదినుండీ అనుభవించడమనేది కలిగింది. కీ॥ శే॥ కందాడై శ్రీనివాసంగారు, మ॥ రా॥ రా॥ యరగుడిపాటి గోపాలకృష్ణయ్యగారు, నందగిరి హనుమంతరావుగారు, బంగారయ్యగారు, సరస్వతి రంగస్వామి అయ్యంగారు, డాక్టరు కె. గోపాలస్వామి అయ్యంగారు ఇందలి ముఖ్యనటులు. వీరాడే నాటకాలన్నిటిలో ప్రతాపరుద్రీయము, శాకుంతలం అనేవి చాలా ప్రఖ్యాతిని పొందాయి. శ్రీనివాసంగారి దుష్యంతుడు, ప్రతాపుడు, నందగిరి హనుమంతరావుగారి శకుంతల, సరస్వతి రంగస్వామి అయ్యంగారి శకుంతల, యుగంధరుడు, బంగారయ్యగారి కణ్వుడు, గోపాలకృష్ణయ్యగారి శార్ఙ్గరవుడు, విద్యానాథుడు, శివకామయ్యగారి మాతలి, కె. గోపాలస్వామిఅయ్యంగారి వలీఖాన్ అన్నీ వారి

వారికి తగిపోయి ఉండేవి. ఇప్పటికీ ఇంకోసమాజం ఆ
నెల్లూరులో శాకుంతలాన్ని ఆడడం అంటే సింహంతో చెల
లాటలు ఆడడంగా ఉంటుంది. మొత్తానికి ఆ ప్రాంతాల్లో
శాస్త్రిల్లుగారిచేత నడపబడుతూ, విద్యాధికులచేత సలక్ష
ణంగా ఆడబడుతూ ఉండే ఈ భాషాభిమాని నాటక సమాజ
మే నాటక కళయొక్క పవిత్రత్వమును దశదిశల చాటిం
దనడానికి సందేహంలేదు.

ఇంతటి మహాసంస్థ పుట్టిన ఈ నెల్లూరులోకూడా ఏ
వేవో అంటూ ఇంకా సమాజాలు బయలుదేరకపోలేదు. ఆంధ్ర
సభ, సుగుణ విలాససభ, వాటల్లో చెప్పతగిన సమాజాలు.
ఇందులోని ఆంధ్రసభను మ॥ రా॥ రా॥ తూములూరి శివరామయ్య
గారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ఘనంగా నడుపుతున్నారు.
కొంతకాలం కీ॥ శే॥ మా ముత్తరాజు సుబ్బారావు పంతులు
యమ్. ఏ. గారు కూడా దీనికి వైస్ ప్రెసిడెంటుగా
ఉండేవారు. ఈ సమాజం మాత్రం మంచివిగా చూచుకొని
అందటి నాటకాల్ని ఆడుతుందిగాని అసహ్యించుకోదు.
ఇందులో మ॥ రా॥ రా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు,
నేలనూతుల రామకృష్ణయ్యగారు, కె. శ్రీనివాసాచారిగారు
నెల్లూరు నాగరాజరావుగారు, జి. రాధాకృష్ణయ్య, జీ. రామ
చంద్రరావు, చెంచు సుబ్రహ్మణ్యంగార్లు చెప్పదగిన ప్రధాన
నటులై ఉండేవారు. మంచిశిక్ష, మంచిపద్ధతులు, మంచి
ఆశయాలు కలిగి నాటకాల్ని ఆడడమేకాకుండా ఒక ధర్మపత



నాలయాన్ని కూడా పోషిస్తూ ఉంటుంది ఈ సమాజం. ప్రస్తు
తం ఇదికూడా ప్రధాననటుల్లో కలిగిన భిన్నభావాల్ని పట్టి
కొంచెం మందంగా నడుస్తూఉన్నట్టు తెలుస్తుంది.

సుగుణవిలాససభ కీ॥ శే॥ కందాళై శ్రీనివాసంగారు
భాషాభిమానిలోనుంచివిడబడిస్వంతంగాపెట్టుకున్నట్టిది. వీరితో
పాటు ఆంధ్రసభలోనుంచి వచ్చిన జి. రాధాకృష్ణయ్య, జి. రామ
చంద్రయ్య, చెంచు సుబ్రహ్మణ్యం గార్లుకూడా పనిచేస్తూ
ఉండేవారు. రాధాకృష్ణయ్యగారు కబీరువేషంలోనూ, చెంచు
సుబ్రహ్మణ్యంగారు అన్నిరకాలైన చిల్లరవేషాల్లోనూ, చాలా
సమర్థంగా పనిచేస్తారు. శ్రీనివాసక్, నాగరాజరావుగార్ల
ప్రయోగవైదుష్యాల్ని తరువాత చెప్తాను.

నెల్లూరుకు పదిపదేనుమైళ్లదూరంలో ఉండే అల్లూరు
కృష్ణవిలాససభను కూడా ఈసందర్భంలో చెప్పక తప్పదు. దీన్ని
మ॥ రా॥ రా॥ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు స్థాపించారు.
మ॥ రా॥ రా॥ కై. వేంకటరమణారెడ్డిగారు దీనికి కార్యదర్శు
లుగా పనిచేస్తూ ఉంటారు. వీరాడే రామదాసునాటకం
ముఖ్యంగా చూడాల్సి ఉంటుంది. అందులో శ్రీ రామ
చంద్రారెడ్డిగారే కబీరుపాత్రను ధరిస్తారు. ఆ పాత్రకు తగిన
అంగసౌష్ఠవం, ఆధ్యాత్మిక వాఙ్మాధుర్యం, హిందీభాషా
సౌలభ్యం, సంగీతప్రవేశం, ఉచితాభినయం, వీరియందు
మూర్తీభవించాయి. శ్రీయుత లచ్చారెడ్డిగారి చిల్లర
హాస్యాలూ, ప్రసంగాలూ మహాముద్దుగాఉంటాయి. ఇంతెం

దుకు రామదాసునాటకంలో వేషాలన్నీ మాబాగాకుదిరాయి. ప్రదర్శనం అంతా బలే కట్టుగా నడుస్తుంది. ఇది వీరి సొమ్ము. ఇంకా ఆడుతారు సుమండీ అనేక నాటకాలు! వాన్ని నే చూడలేదు.

## మదరాసురంగాలు.

సుగుణవిలాససభ ఇక్కడ చాలాకాలంక్రిందట బయలుదేరిన సమాజం. అయితే ఇది కేవలం నాటకసమాజం మాత్రం కాదు. ఆటలశాఖా, పాటలశాఖా, భజనలశాఖా, పురాణాలశాఖా, లెక్చర్లశాఖా మొదలైన శాఖలెన్నో ఉన్నాయి ఇందులో. అందులో ఒక నాటకశాఖకుచెందింది ఈ నాటకోద్యోగం. ఆ నాటకాలుకూడా ఒక్క తెలుగులోనేకాక ఇంగ్లీషులోనూ, అఱవంలోనూ, కన్నడంలోనూ, ఒకప్పుడు సంస్కృతంలోనూకూడా ఆడబడుతూ ఉంటాయి. ఆ యవకాశాలన్నీ షేక్స్పియర్ ఉత్సవాలదినాల్లోనో, గణపతి నవరాత్రుల్లోనో, క్రిస్టమస్ సెలవుల్లోనో, కలుగుతూ ఉంటాయి. వానికయ్యే ఖర్చులు సభ్యుల్లో ఎవ్వరోఒకరు భరించుకుంటూ ఉంటారు. అలాఅని ఆయా నాటకాలు కాని, మఱి యేవికాని ఆట్టే తేలిగ్గా ఆడడం చెయ్యడమనేది ఉండదు. ప్రచారంలో ఉన్న పద్ధతులకంటె ఎక్కువపద్ధతులనూ, క్రమాలనూ అవలంబించి తయారుచేస్తా రానాటకాలు మొదలైనవాటి 'నన్నిటినీకూడాను. పనిపట్టినప్పుడు పిన్నా పెద్దాలనే భేదాల్ని పెట్టుకోకుండా సభ్యులందఱూకలిసి



అన్ని కార్యాల్నీ నెఱవేరుస్తూ ఉంటారు. ఆ కలయిక, ఆయైకమత్యం మనం ఇంకో చోట చూడలేం.

నాటకాలాడడంలో ద్రవ్యాన్ని రాబట్టాలనే అపేక్షకానీ, జనాభిరుచులనుబట్టి ఏ చిల్లరమల్లర నాటకాలైనా సరే ఆడాల్నే పిచ్చిఆవేశంగానీ ఈ సమాజానికి ఏమాత్రం లేదు. తమ సభ్యుల భావాల్నే ప్రధానంగా తీసుకొని అన్నివిషయాలూ నిర్ణయించుకుంటారు. సభ్యులందఱూ మేటి విద్యాధికులూ, రసజ్ఞులూకాని సామాన్యులు కారు. వారిలో ముఖ్యంగా మ॥ రా॥ రా॥ సంబంధం మొదలియారు, భవానందంపిళ్ళె మొదలైన ప్రముఖులు వేయికన్నులతో సభాగౌరవాన్ని అన్నివిధాలా సంరక్షిస్తూ ఉంటారు. వీరు చూపించే సీన్లూ, వేసేవేషాలూ, ధరించేదుస్తులూ, పాడేపాటా, ఆడేఆటా అన్నీకలిసి చాలవఱకు రూపకవస్తుతత్త్వంతో మేళవిస్తూ రసవాహకంగా ఉంటాయి.

ప్రత్యేకంగా ఆంధ్రనాటకకళాభివృద్ధిని కోరి ఏర్పడిందిమాత్రం ఆంధ్రసభే. మ॥ రా॥ రా॥ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఈ సభను స్థాపించబట్టే మహామహా నటులకూ, గాయకులకూ, చిత్రలేఖకులకూ ఇంకా అనేక విద్వాంసులకూకూడలిస్థానంగాఉండే ఆమహాపట్నంలో కూడా మన ఆంధ్రనటులకూ, గాయకులు మొదలైనవారికీ కొంత సహాయసంపత్తీ, ఆపైని పరపతీ ఘనంగా కలగడానికి ఆరంభమయింది. కేవలం ఆంధ్రుల పురోభివృద్ధికొఱకు

ఏర్పఱచబడిన ఈ సమాజంలోనైనా ఉట్టిపొట్టి తగాదాలు లేకుండా మన నటశిఖామణులందఱూ నిలిచి పనిచేస్తే ఇంకా ఎంత శోభస్కరంగానైనా ఉండేది. అందుకు నటలోకం నోచుకోలేదు. ఇందుకుపాపం మనపంతులుగారేంచేస్తారు! కావలసిన ద్రవ్యంఅంతా వెనకాముందూ చూడకుండా వేనవేలు పోసేస్తారు. కావాల్నంటే కొండమీదికోతినైనా దించించి ఎన్నిపరదాలైనా వ్రాయిస్తారు. అలంకారాలన్నీ అందిస్తారు. అడ్డానికి నిజాయితీగలిగి ఒకచోటనిలిచి పనిచేసే ప్రాజ్ఞనటుల్ని ఎక్కడినుంచి తెస్తారు! మననటులు చాలమంది ఈ చింపిరి సెరల్లో, ఆచింపిరిసెరల్లో, ఈపాలెంలో, ఆపాలెంలో, వీరి వెంటబడీ, వారివెంటబడీ అయిపై ఆయువేషాలు వెయ్యకపోతే ఈ మదరాసేపోయి పడిఉంటే ఈపాటికి "ఆంధ్రస్టేజనే" కట్టించకపోయారా ఆ దేశోద్ధారకులు!

## చిత్తూరురంగాలు.

ఇక్కడ ఎన్నికలో ఉన్నదే ఒక్కసమాజం. అదే చిత్తూరు రామవిలాససభ, అనబడేది. మ॥ రా॥ రా॥ రావుబహద్దూరు టి.వి. రంగాచార్యులు బి. ఏ. బి .ఎల్ గారు దీని అధ్యక్షులు. మ॥ రా॥ రా॥ కే. వరదాచారి, బి. వి. శేషాద్రి అయ్యరుగార్లు కార్యదర్శులుగా ఉండి దీనిపనిఅంతా చూస్తూ ఉంటారు. ఇది తద్వత్తూ మదరాసు సుగుణవిలాససభా సూత్రాల్ని అనుసరించి ఏర్పడినదిగా కనిపిస్తుంది. ఇందులోనూ అనేకశాఖలు ఉన్నాయి. పాటకచ్చేరీలూ, భజనలూ,




(వెట్టివాడు) డాక్టరు జి. వి. సుబ్బారావుగారు (యుగంధరుడు)




(యుగంధరుడు) శ్రీ సింగరాజు నాగభూషణరావుగారు, బాపట్ల (పిచ్చివాడు)



శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు



శ్రీపాద రంగయ్యగారు

పురాణాలూ, లెక్చర్లూ, నాటకాలూ మొదలైనవన్నీ ఉత్సవాల దినాల్లోనూ, సెలవులదినాల్లోనూ జరిపిస్తూ ఉంటారు వీలునుబట్టి. స్వంతానికి ఒకభవనం, వలయునన్నీ పరికరాలూ, గ్రంథాలూ మొదలైన అవకాశాలన్నీ ఉన్నాయి. నెల్లూరు ఆంధ్రసభకు చెందిన మ॥రా॥రా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యం గారు ఈ సమాజానికి నాట్యశిక్షను ఇస్తూఉంటారు. ఈయనే ప్రధాన పాత్రల్ని ధరిస్తూఉంటారు. ఇంకా ఉన్నంతలో కె. రాఘవేంద్రరావు, పి. నాగేశ్వరయ్య, పి. నరశింహయ్య చెప్పతగిన నాట్యలావణ్యాన్ని కనపఱుస్తూఉంటారు.

## తెనాలిరంగాలు.

'శ్రీకృష్ణ హిందూథియేట'రనే పేరుతో మ॥రా॥రా చల్లా ఆంజనేయులుగారు ఒక సమాజాన్ని లేవతీశారు మొట్టమొదట. హాలుకూడా నిర్మించారు. గుంటూరు శెకంషు కంపెనీ ప్రధాన నటులైన మ॥రా॥రా॥ మల్లాది గోవింద శాస్త్రిగారు ఈ సమాజంలో ముఖ్యపాత్రల్ని వేస్తూ ఉంటారు. నాటకాల్లో వివిధదృశ్యాల్ని విరళంగా చూపించడమందు వీరికి యిప్పటికీ మిక్కిలి కోరిక. మ॥రా॥రా॥ శ్రీపాది రంగయ్యగారు నాయికపాత్రల్ని వేస్తూఉంటారు. వేషం ఒక విధంగా బాగానే ఉంటుంది. పాటా, మాటా కొంచెం పట్టిస్తుంది. ఆడందాలు కొన్ని కనపడతాయి. వీరు 'సతీతులసి' నాటకాన్ని మఱికొన్ని ఆలాంటి నాటకాల్ని బాగా ఆడుతూ ఉంటారు.

రామావిలాస సభదే తెనాలి నాటకరాజ్యం అంతాను. ఇది1921సం॥లో స్థాపించబడింది. ఒకానొక యూనివర్సిటీనాటి పూర్వవిద్యార్థి సంఘ ప్రదర్శనం చూడడంచేత పలువురు పెద్దలకు కలిగిన నాటకోత్సాహస్వరూపమే ఈ రామావిలాస సభరూపంగా ఏర్పడ్డట్లు తెలుస్తుంది. మ॥ రా॥ రా॥ భాగవతుల రాజగోపాలంగారు దీనియుత్పత్తికీ, అభివృద్ధికీ బాధ్యత కలిగి ఉండేవారు. నాట్యశిక్షకూడా చాల వఱకు వీరే ఇస్తూ ఉండేవారు. వీరికి తోడు మ॥రా॥రా॥ త్రిపురారిభొట్ల వీరరాఘవ స్వామిగారు కూడా ఆవిషయంలో చాలా శ్రద్ధ పుచ్చుకునేవారు. ఈ సభకు చెందిన ప్రసిద్ధనటులు పలువురులో కనిపించే నవ్యాశయాలూ, రూపాలూ, భావాలూ, పద్ధతులూ, చాలవఱకు శ్రీ స్వామిగారి విజ్ఞానప్రపంచంలో నుంచి సంక్రమించినవిగా తేటపడుతుంది.

ఆ శిక్షావిధానం ఏలాటిదోకాని పుట్టిన మఱునాటి నుంచీ ఎన్నికలోకి వచ్చింది ఈసభ. క్రమశిక్ష అనేదాన్ని పొందడంవల్ల సమాజాలు ఎంత త్వరలో కీర్తిని గడించగలవో నిదర్శనంగా చూపించింది ఈసభ. పదార్థ భిన్నమయిన భావాభినయప్రాముఖ్యాన్నీ, పాత్రతత్త్వచిత్రీకరణవిధానాన్నీ ప్రధానంగా అభినయించాల్సి ఉంటుందనే అభిప్రాయాన్ని ఋజువు చేసిందిఈసభ.

మ॥ రా॥ రా॥ పెద్దిభొట్ల చలపతిరావు. బి. ఏ. బి. యల్., డాక్టరు గోవిందరాజు సుబ్బారావు. యల్.



యమ్. యస్. మాధవపెద్ది వేంకట్రామయ్య, పిల్లలమర్రి సుందరరామయ్య, పులిపాక వేంకటేశ్వర్లు, తంగిరాల ఆంజనేయులు, ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి, లక్కరాజు విజయగోపాలరావు, పాతూరు సూర్యనారాయణ, దాపులూరి బుచ్చిరాజేశ్వరరావు, రావూరి రంగారావు మొదలైనవారు పురుషవేషాల్ని ప్రసిద్ధంగా వేస్తూ ఉండేవారు. ఒక్కొక్క నాటకంలో ఒక్కొక్కరు సూత్రధారులుగా ఉండడానికి తగిన అర్హతలను సంపాదించిన వీరందఱూ ఈ సభలో, ఒక్క నాటకంలో కలిసి, ఒక్క క్రమానికి కట్టుపడి, ఒక్క శిక్షకు చెందిన భరతవిద్యా ప్రాగల్భ్యాన్ని ప్రకటిస్తూఉంటే ఎంత మనోహరంగా ఉండేదో అది ముఖ్యంగా అనుభవించాల్సిందే.

స్త్రీవేషాల్ని వేసేవారిలో మాత్రం ఎవ్వరైనా సామాన్యులు దొరికారా ఈ సభకు! అనేక సంవత్సరాల్నుంచి అనేక విధాలుగా అద్దాలు పెట్టుకుని అభినయాన్ని ప్రాక్టీసు చేస్తూ ఉంటారు అనేకమంది మహానుభావులు! ఇంకా గ్రామఫోన్లు పెట్టుకొని రాగాలు వల్లిస్తూ ఉంటారు మఱికొందఱు ప్రబుద్ధులు! కేట్లాగులు చూచి దిగుమతీ చేసుకుంటూ ఉంటారు అలంకారాల్ని ఎన్నిటినో బొంబాయి కలకత్తాల్నుంచి ఇంకోకొందఱు నవ్యనటశిఖామణులు! ఏమి చేస్తేనేమి. ఇలాటివారిలో ఎందఱు తేలారో చెప్పండి నిర్దుష్టంగానూ, మనోహరంగానూ రంగాన్ని అలంకరించడానికి? ‘ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా’ అన్నారు పెద్ద

లు. కళాప్రాగల్భ్యం అలా జన్మంతో పుట్టిరావాలి కాని మన స్థానం నరశింహారావుగారు ఏం ప్రయత్నాలు చేశారని అంటాం! పోనీ ఎన్నాళ్లు చేశారని అనుకుందాం! వరసారం పాతికపళ్లైనా నిండాలేవే, వీరప్పుడే ఏ భరతనాట్య శాస్త్రాల్ని ఏ కావ్యాలంకారాన్ని చూచి గ్రహించారనుకుందాం ఈ ప్రయోగ సూత్రాన్ని!

రామావిలాసభ నాటకాన్ని ప్రారంభించింది లగాయితూ పేరుప్రతిష్ఠల్ని సంపాదించింది. స్థానం నరశింహారావుగారు వేషం వేసినప్పటినుంచీ అనుపమానమయిన ప్రజామోదాన్ని గడించడం ప్రారంభించారు. పెద్దలయందు వారికి ఉండే గౌరవభావం, లోకవ్యవహారాలందు వారికి ఉండే విషయపరిశీలనశక్తి, అమోఘమైన రసభావన, భావనకు తగిన అనుకరణం, ఇవన్నీ చేరి వారిని అంతగా రాణింప చేశాయి అనుకుంటాను. ఇంకా వారి అమ్మకమపు చలవ అలాంటిది అనుకుంటాను. చాలాఉంది వీర్నిగురించి చెప్పాల్సింది. ఇంకో ప్రకరణానికి రిజర్వుచేస్తూ ప్రస్తుతం ఆపేస్తాను నా ఆవేశాన్ని. ఇట్టిలక్షణాలొదవిన మసనరశింహారావుగారు ఈసభలో నాయికపాత్రల్ని ధరిస్తూ ప్రదర్శనమంతా ఒకయెత్తూ, వీరి ప్రవేశమే ఒకయెత్తూగా చేసి వెళ్లేవారు. ఇంకాఉన్నారుఆడవేషధార్లు ఇందులో. వీరిలో చెప్పగల నృత్య విశేష మొదవినవారు మయినేపల్లి బసవలింగంగారు. మిగిలినవన్నీ దివిటీలకింది దీపాలు. వ్రాయలేను.



శ్రీ రామవిలాస సభ నాటకాలన్నీ సర్వజనరంజకంగా ఉండేవిఆసెట్టంతా కలిసిఉన్నప్పుడు. వానిలో ముఖ్యంగాప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం, బొబ్బిలి; రోషనార, బాగా పేరుపడ్డాయి. పేరుపడడమేకాదు. స్థానం నరసింహారావుగారి రోషనారాప్రదర్శనవిజ్ఞానం, మ్లేచ్ఛలోక స్థైర్యాన్నంతా చెదరకొట్టేసింది. ఆకారణాగా వచ్చినఫలితమే ఈనాటి రోషనారాది నాటకాలకు కలిగిన ప్రయోగ బందిఖానా.

వేషాలు వేసుకోవడంలోకూడా ఈసభవారు ఇంకో మెట్టు ఎక్కారని చెప్పవచ్చు. అంతకుముందక్కడక్కడ ఈ గ్రీస్‌పెయింట్లు వాడబడుతూఉన్నా వాని సమ్మేళనసౌష్ఠవాన్నిమాత్రం ఈ సభవారు మనోహరంగా చూపించేవారు. వేషాలకు తగిన దుస్తుల్నిఅమర్చడం ఆభరణాలు తొడగడంలోకూడా. వీరు కొంత బెంగాలీఆర్టును చూపించేవారు. ఇందుగ్గావీరు ఆయాఆర్టుతత్త్వాల్ని తెలియడమేకాకుండా అనేక భావచిత్రాల్నికూడా వ్రాసే అలవాటు కలిగిన సుప్రసిద్ధ చిత్రలేఖకులగు శ్రీయుత వజ్ఝ బాబూరావుగారిని సంపాదించారు. చాలా సమాజాలు చిత్రలేఖకుని ఆవశ్యకాన్ని గ్రహించక పోవడంచేత కొంతలోపాన్ని ప్రదర్శనాల్లో కనపడుస్తూ ఉంటాయి. తెరలూ, ఇతరదృశ్యాలూకూడా చాలవరకు పొందికగానే సమకూర్చేవారు. అయితే వాటికిమాత్రం ఇంత గౌరవం ఇవ్వలేను.

దుగ్గిరాల కంపెనివారు ఈ తెనాల్లో సౌందర్య భవనం

అంటూ ఒకదాన్ని నిర్మించుకున్నారు. మన ఎడవల్లాయనతో కలిసి కొన్ని నాటకాలాడాలని చూచారు కాని పాపం పొసగ లేదు ఆ వ్యవహారం. ఆ ప్రయత్నం అంతటితోటే నిలిచి పోయింది. ప్రస్తుతం భవనాన్ని మాత్రం అద్దెలకు ఇచ్చు కుంటూ ఉంటారు.

## బెజవాడ రంగాలు.

ఇక్కడపుట్టిన చిట్టి పొట్టి సమాజాల్లో అల్లా హిందూ థియేటరు కొంచెం నిలవడానికి నీడను సంపాదించుకుంది. మ॥ రా॥ రా॥ కాశీనాథుని వీరమల్లయ్య, సుబ్బయ్యనాయ్డు, కారుపర్తి నాగలింగం మొదలైనవారు అప్పటికి అమల్లో ఉండే హరిశ్చంద్ర, బొబ్బిలి, తారాశశాంకవిజయం, మొదలైన నాటకాల్ని ఆడుతూ ఉండేవారు. చాలవఱకు వీరి సభ్యులైన వీరమల్లయ్యగారు వ్రాసే నాటకాల్ని కొంచెం అభిమానంగా ఆడుతూ ఉండేవారు. సుబ్బయ్యనాయ్డుగారికి హరిశ్చంద్ర వేషంలో కొంచెం పరపతి ఉండేది. నాగలింగం గారి రంగారావు వేషానికికూడా కొంచెం గిరాకీ ఉండేది. శృంగారానికి చెందిన వేషాల్ని వీరమల్లయ్యగారు వేయడానికి చాలాఉత్సాహం కనపఱుస్తూ ఉండేవారు. ఇంతకంటే వేఱే విశేషం ఏమీకనిపించదు వీర్నిగురించి చెప్పడానికి.

మైలవరం 'బాలభారతీ సమాజం' బెజవాడకు రవాణా అయిన తరువాత ఇక్కడి చిల్లర మల్లర సమాజాలన్నీ అం



తర్ధానమయిపోయినాయి. ఇతర కంపెనీలైనా ఇక్కడకు వచ్చి ఆడడానికి సాహసించేవికావు. స్వయంగా జమీందారులైన మ॥రా॥రా॥ సూరానేని వేంకటపాపయ్యారావు బహద్దరువారి పోషణంలో, బాలభారతీ సమాజం పౌర్ణమినాటి చంద్రుడువలె పదహారు కళలతోటీ ప్రకాశిస్తూఉండేది. గోదావరి జిల్లాలో యస్. గున్నేశ్వరరావు, నాగేశ్వరరావుగార్ల వ్యవహార పద్ధతులన్నీ జమీందారువారు ఈ బెజవాడలో కూడా ప్రత్యక్షం చేసి, కృష్ణాజిల్లాను నవ్య నాటక వ్యామోహంలో ముంచేశారు. ఒక కృష్ణాజిల్లా అన్నమాటేమిటి! ఆ దినాల్లో వీరు వేసిన ఆ బ్రహ్మాండమయిన హాలూ, అందులో అమర్చ బడిన ఆ ఫోకసింగు ఎలక్ట్రిక్ దీపాలూ, ఆ పరిపరి విధాలైన పార్సీ దుస్తులూ, ఆ తెరలూ, ఆ పద్యాలూ, ఆ పాటలూ, ఆ పాపట్ల కాంతయ్యగారి హార్మనీ, బగ్గన్నగారి తబలా, ఆ యన్నిటిలో చేరి తొలకరించే మన ఎడవల్లి సూర్యనారాయణ, ఉప్పలూరి సంజీవరావుగార్ల చిత్ర విచిత్రమైన పోజుపాలు పులూ, ఆ సావిత్రిలోని "పోవుచున్నాడే", చూపులూ, తూపులూ", ఎన్నెన్ని జిల్లాలవారినో ఆకర్షిస్తూ ఉండేవి. టిలిగ్రాంలుమీద జరుగుతూ ఉండేది సీట్లు రిజర్వుచేసే పని అంతాను.

బాలభారతీ కంపెనీకి ఒకవిధంగా జనఘోష కొట్టింది అంటాను నేను. నరుడు కంటికి నల్లఱాయి బ్రద్దలౌతుంది అంటారు. ఒకమూల రాజమండ్రీ కంపెనీచేతనే చాలా

జిల్లాలలోని కంపెనీల పని స్థంభించి పోయింది. ఇక ఈ బాల భారతీ సమాజంవల్ల ఆ మిగిలిన కంపెనీల పని అంతా స్థంభించి పోయింది. కీ॥ శే॥ గూడపాటి నరశింహారావు నాయుడుగారికి ఇందులో ఉద్యోగం కుదరడంతోటే రామమోహన్ కంపెనీకి చెక్కలు విరిగి పోయాయి. సంజీవరావు గారి సంబంధం బాలభారతికి ఏకుణాన కలిగిందో ఆక్షణాన్నే పామర్రుకంపెనీకి ప్రాణాలు పోయాయి. ఎడవల్లాయన దీనికి ఎంపరర్ కాగానే గుంటూరు ఎమెచూర్సు కూలబడిపోయింది. పారుపల్లి సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి ప్రభృతులకు ఇందులో పట్టాభిషేకం అవడంతోటే బందరు బాలభారతసంఘానికి ప్రారబ్ధం చుట్టుకుంది. ఇలా ఇంకా ఎన్నైనా చెప్పవచ్చు. ఇన్ని కంపెనీలు గోలపెడుతూఉండగా ఇందరితో కూడిన వీరి నాటకాలు ఎంతకాలం సాగుతూఉండగలవో ఆలోచించండి!

నటుల బేరాలు బలవత్తర మయిపోయినాయి. పది రూపాయలతో పోయే నాటకఖర్చులూ, హాలుఅద్దెలూ వీరి హయాంలో పెరిగిపోయాయి వందలకొద్దీని. నటులా అన్ని వైపులనుంచీ వచ్చి ఇందులో చేరారు. పార్సీ పాటలసృష్టికా పాపట్ల కాంతయ్యగారు ఈ సమాజంలో బ్రహ్మదేవుడుగా పరిణమించారు. బగ్గన్న గారి తబలాకు అప్పీలే లేదుకదా! లేస్తేపాటా, నిలిస్తేపాటాగా ఉంది ఆ పద్ధతి నాటకాలపని. అవేసేదుస్తులా కళ్లు త్రిప్పేస్తున్నాయి. ఇక తెరలమాట చెప్పాల్సిందేమి ఉంటుంది! మిషినల్లే ఆడుస్తూఉండేవి పనులన్నీని.



శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి గారు



నాటి హరిశ్చంద్రుడు



(కృష్ణుడు) శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారు



శ్రీ వేమూరి రామారావుగారు, భవానీ శంకరుఁడు బందరు

ఇన్ని అనుకూల్యాలు సామాన్యులకు ఏలాదొరుకుతాయి! తూగలేనివారికంతా వీరినాటకాల్ని చూస్తే ఎలా కళ్లు కుట్టకుండాఉంటారో ఆలోచించండీ!

ఒక్కటే లోపం జరిగింది. అదే దీని పతనానికి కారణమయిందని తలుస్తాను. ఎన్నివేలు ఖర్చుపెట్టినా, ఎంతమందిని చేర్చినా, ఎన్ని నాటకాలాడినా, ఈ పనిఅంతా కలిసి మొత్తంమీద ఒకదానికి అనుకరణమే అయిపోయిందిగాని, ఏ విషయంలోనూ సృష్టిలేకపోయింది. సూర్యనారాయణగారు ఎంత „పోయనయ్యో„ అన్నా, సంజీవరావుగారుఎంత„పోవుచున్నాడో„ అని గోలపెట్టినా, ఆ పోయేప్రాణం ఎట్లా నిలుస్తుందో చెప్పండి ఒకేమాదిరి నాటకాల్ని ఆడుతూ, పాడుతూ ఉంటే. కాలం గడిచినకొద్దీ, అలా పాడేవారూ, ఆడేవారూ యిప్పుడు అతిశయించి పోయారు. ఆ చూపే తళుకు బెళుకులకు ఇంకా ఎన్నో చిలవలకు పలవలుగా బయలుదేరాయి. ఉహూరా కాంతయ్యగార్లు వెలిశారు. పక్షాంతరాలు ప్రబలమయిపోయాయి. బగ్గన్నలకు పరిమితేలేదు. ఆ సూత్రాన్ని కాస్త్ర ప్రతి పల్లెటూర్లోకూడా చే చిక్కించుకున్నారు. ఏంచేస్తుంది బాలభారతి! అయిపోయింది దాని దర్జా!

## సికింద్రాబాదురంగాలు.

ఇక్కడ ఏవో క్లబ్బులనీ, సభలనీ, సమాజాలనీ, లేక

పోలేదు. ఉన్నాయి అక్కడక్కడ. వాటల్లో ఆడవాళ్ళతో ఆడబడే సురభివారి ఆటలన్నా, పాటలన్నా ఎంతో పలుకుబడి ఉంటుంది. అలా కాకుండా మొగవాళ్ళతోనే నాటకాలు ఆడుతూ ఏదో కొంచెం డబ్బూ, కొంచెం పేరుప్రతిష్ఠలూ, సంపాయిస్తూ, ధర్మాలనీ, దానాలనీ చేస్తూఉండే మన తెలుగు సమాజంకూడా ఒకటిఉంది అక్కడ రెజిమెంటల్ బజార్లో. 1920 సం॥లో ఇది జనించింది. మ॥ రా॥ రా॥ మీసాల నాగయ్యనాయుడుగారు దీనికి అధ్యక్షులై ఉన్నారు. ఇందులో ఉన్న సభ్యులంతా చాలమంది మాబందరుకు చెందినవారే. ఇక్కడ ఉద్యోగాలు చేసుకుంటూ తీరికసమయాల్లో నాటకకళను పరిశ్రమిస్తూ దానివల్లవచ్చే ఆదాయంఅంతా భాషాభివృద్ధికీ దేశాభివృద్ధికీ వినియోగం చేస్తూఉన్నారు. ఇందుకు ప్రతిఆంధ్రుడూ సంతోషించాల్సి ఉంటుంది.

ఇదిపుట్టిన కొద్దికాలంలోనే నరకాసురవధ, హరిశ్చంద్ర, చింతామణి, గోపీచందు, కనక్తార, కుశలవ, అనే నాటకాల్ని చదివింది. మొట్టమొదట వీరిచింతామణి ప్రదర్శనానికి పన్నెండువందల రూపాయలవఱకూ వచ్చింది. ఖర్చులు పోగా మిగిలిన వెయ్యిరూపాయిల్ని అక్కడ "గాసుమండీలో" ఉండే అనాధశరణాలయానికి ఇచ్చేశారు. రెండో నాటకాదాయంలోనుంచి అలాగే మూడువందలయాభై రూపాయిల్ని అక్కడి వీరాంజనేయ ఆలయానికి ఇచ్చేశారు. మూడో నాటకంలోనుంచి అయిదువందలరూపాయల్ని బందరులోని



కీ॥ శే॥ కోపల్లి హనుమంతరావుగారియొక్క నిధికి సమర్పించారు. మళ్లీ నాలుగోనాటకాదాయంలోనుంచి రెండువందల యాభై రూపాయలవఱకూ ఎవరికో దానం చేసేశారు. అయిదోనాటకంలోనుంచి రెండువందల రూపాయలు ఇంకొకరి వివాహకార్యంకోసం ఇచ్చేశారు. ఇంకో రెండునాటకాల్లోనుంచి మూడువందలరూపాయల్ని అలాగే ఇంకొరికి ఇచ్చేశారు. ఇంకోనాటకంతాలూకు అయిదువందల రూపాయల్ని తుంగభద్ర స్టేషనువద్దఉండే చిత్రకళాశాలకు ఇచ్చేశారు. తిరిగి రెండునాటకాల ఆదాయాల్ని తాము పెట్టిన పుస్తకభాండాగారానికి భవనాన్ని ఏర్పఱచడానికని అలాగే ఉంచేశారు. మళ్ళీవేసే నాటకంలోనుంచి ఒరంగల్లులోని ఆంధ్రలైబ్రరీ సహాయార్థంగా ఆఱువందల రూపాయల్ని దానంచేశారు. ఇంతకొద్దికాలంలో ఇంత ద్రవ్యాన్ని ఇంతగా దానంచేసిన సమాజం ముఖ్యంగా ఎంత గౌరవానికైనా తగిఉంటుందికదా!

నాటకాలకేంతెండి. దానికి అంతేక్కడ. శక్తిలోపం లేకుండా భయభక్తులతో పరిశ్రమించి ఆడతారుగనుక మేలవంగా ఉండవు వీరి నాటకాలైనాను. ఇందులో కనకసేనుడువేసే రాజయ్య అనేఅబ్బాయీ, తారవేషంవేసే అంజయ్య అనే అబ్బాయీ చాలా తెలివిగా పనిచేస్తారు. పిల్లలు పదిపదకొండేండ్లవాళ్ళైనా వీరిఅభినయంమహాగడుసుగాఉంటుంది కంచువంటి గాత్రాలూ, విశాలమయిన నేత్రాలూ కల ఈ

బాలురు ఆడుతూఉన్నా పాడుతూఉన్నా మహా సుఖంగానూ, సౌంకంగానూ ఉంటుంది నిశ్చయంగా.

## నర్సాపురంరంగాలు.

1902 సం॥లో ప్రారంభమయింది ఇక్కడ నాటక విజృంభణం. 'సాంగ్లీ హిందూనాటకసమాజం' అంటూ ఒకటి పునహానుండివచ్చి ఈ నరసాపురంలో హిందీనాటకాలాడింది. దీని ప్రయోగలక్ష్యాన్ని చూచి మ॥రా॥రా॥బుద్ధిరాజు బ్రహ్మానందం, బొమ్మకంటి కృష్ణమూర్తి, మామిళ్ళపల్లి కేశవాచార్యులుగార్లు 'ఆర్యానంద హిందూనాటక సమాజం' అనే పేరుతో హిందీనాటకాల్ని ఆడారు ఆ పునహావారి పందిరిలోనే. బందరు నేషనల్ థియేటరుకు చెందిన సుప్రసిద్ధ యోగీశ్వరులూ, నటులూ అయిన కీ॥ శే॥ మొగిలిగిద్దల రామానుజరావుగారే వీరికి నాట్యశిక్షను ఇచ్చేవారు. వీరితో పాటు జానకిరామయ్యాపంతులుగారనేవారుకూడా మిక్కిలి పాటుపడుతూ ఉండేవారు. మ॥ రా॥ రా॥ బొమ్మకంటి కృష్ణమూర్తిగారు అప్పటికీ ఇప్పటికీ ఈ సమాజంలో ప్రధాన పాత్రధారులుగా ఉంటారు. కందుకూరివారి అభిజ్ఞానశాకుంతలం, హరిశ్చంద్ర, వడ్డాదివారి వేణీసంహారం, అనంతరావుగారి అజ్ఞాతవాసం ముఖ్యంగా ప్రదర్శించేవారు.

1905 సం॥లో మ॥రా॥రా॥ బొమ్మకంటి కృష్ణమూర్తిగారు తణుకుసమాజంలో చేరారు కొన్ని కారణాల్నిపట్టి. తరు



వాత పిఠాపురం సమాజంలో మన వెమురుమూడి శేషగిరిరావుగారితో కలిసి పనిచేశారు. శాకుంతలంలో దుష్యంతుడు, పారిజాతాపహరణంలో కృష్ణుడు, బొబ్బిలిలో రంగారావు చాలా నేర్పుగానూ, మనోహరంగానూ అభినయించేవారు.

1907 సం॥లో పిఠాపురసమాజం స్వస్థానం చేరింది. నర్సాపురంలో మ॥ రా॥ రా॥ జమ్మలమడక సూర్యనారాయణ, అళహరితి తిరుమల వెంకటాచార్యులుగార్లు 'వై. యన్. కే. వీ.' సమాజాన్ని ప్రతిష్ఠించారు. ఈ సమయంలో మ॥రా॥రా॥ బొమ్మకంటి కృష్ణమూర్తిగారు అధ్యక్షులుగానూ, సుదురుపాటి శేషయ్యగారు కార్యదర్శులుగానూ, కాకినేటితమ్మయ్యగారు రంగాధిపతిగానూ, బుద్ధిరాజు బ్రహ్మానందం ప్రభృతులు కార్య. నిర్వాహకులుగానూ, చక్రవధాన్ల మాణిక్యశర్మగారు ఆస్థాన విద్వాంసులుగానూ ఏర్పడ్డారు. ఈకాలంలో వీరుచేసిన నాటకాలు అన్నివిధాలైన సహాయసంపదలను కలిగి ప్రజల ఆమోదాన్ని గడిస్తూ ఉండేవి. 1923 సం॥ ఆ ప్రాంతాల్లో స్వంతానికి భవనాన్నికూడా నిర్మించుకుంది. వీరిలో హనుమంతరావు అనేబాలుని అభినయం చాలాచూడతగి ఉంటుంది.

## ఏలూరురంగాలు.

వామను భట్టుకోషీగారు ఈయేలూరులో హిందీనా

టకాల్ని నేర్పి 1885–90సం॥ ఆప్రాంతాల్లో ఆడించారు. ఆతరువాత కొన్ని తెలుగుసమాజాలు అక్కడక్కడ బయలు దేరాయి. బుద్ధిరాజువారు హాలువేసాక కొంత నాటకప్రాబల్యం కనబడుతూ ఉండేది. కాని ఇదంతాచేరి ఒక భావి రంగ ప్రస్తావనకు మార్గంగా చేసుకోడానికి మాత్రమే పనికి వస్తుంది. అన్నివిధాలా అధికారులైన వారెవరూ ఆదినాళ్లో అంతగా నాటక కళను గురించి పనిచేసినవారు లేకపోయారు. అటు గోదావరీ ఇటు కృష్ణాలమధ్య ఈ ఏలూరు ఏదో విధంగా దాగుడుమూతలాడుతూ ఉండేది. నాటక ప్రపంచంలో ఈ యేలూరు ఎక్కడవుందో ఎవరికి తెలిసేదికాదు. దేనికైనా సమయంరావాలి.

మ॥ రా॥ రా॥ శ్రీరాజా మోతేనారాయణరావు జమీందారువారు బాల్యావస్థ నెంతయు విద్యాభ్యాసము తోనూ, తదితర వివిధ విజ్ఞానాల్ని ఆర్జించడంతోనూ గడిపారు. నవ్యభావాలెన్నో ఉదయింప సాగాయి వీరిలో, మహానాయక లక్షణాలెన్నో మూర్తీభవింపసాగాయి వీరిలో. దైవం ప్రసాదించిన సిరిసంపదలతో పాటు వీరి కలవడిన సత్యము, శాంతము, స్థైర్యము, దానము, మృదులభాషణము, అనాథసంరక్షణము, గురుభక్తి, సత్కార్యాసక్తి, దేశసేవానురక్తి మున్నగు సుగుణాలన్నీ క్రమ క్రమంగా వృద్ధి పొందాయి. పాశ్చాత్య దేశాల్లో ఉండే మంచిచెడ్డలుకూడా స్వానుభవం చేసుకోవలసిన అవసరాన్ని కనిపెట్టారు. కష్టనిష్ఠు



రాలకోర్చి ఆయాదేశాలన్నిటి యందో సంచారంచేశారు. ఒక్క ధనమున్నవారే లోకంలో ఎన్నో విధాల కొనియాడబడుతూ ఉంటారు. అలాటిధనాన్ని మించిన ఎన్నో విద్యలూ, విజ్ఞానాలూ, భావాలూ, కలిగి దేశంవిషయంలో వేయి విధాల పాటుపడే ఇట్టి ఉదార మహాపురుషులు, జమీందారులు అయిన మన ‘‘నాటక కళాపోషకు’’లగు శ్రీ శ్రీ శ్రీ నారాయణరావు జమీందారువార్ని గురించి ఎంత వ్రాస్తే తనివితీరుతుంది!

శ్రీ శ్రీనారాయణరావు జమీందారువారు పాశ్చాత్య దేశాల్లో నాటకకళయందు చూపబడే అభిమానాన్నీ, గౌరవాన్నీ గ్రహించారు. నాటకప్రదర్శనాలవల్ల దేశాన్ని ఎన్నివిధాల అభివృద్ధికి తేవడానికి అవకాశం ఉంటుందో అవగాహన చేసుకున్నారు. అక్కడినుంచి ఆంధ్రదేశానికి వచ్చిన వెంటనే తమ స్వస్థానమయిన ఏలూరులో శ్రీసీతారామాంజనేయ నాటకసమాజాన్ని స్థాపించారు. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవేంఉంటుంది !

ఆంధ్రనాటక ప్రపంచంలో పెద్ద పేరుప్రతిష్ఠలు కలిగిన నటవతంసుల సందర్శి చాలవఱకు సమకూర్చారు. అప్పటి ఆచారాలప్రకారం వారివారి సమర్థతలకు తగినటులు అడ్వాన్సులు ఇచ్చారు. పదిమొదలు వందరూపాయలవఱకు జీతాలు ఏర్పఱచారు. ఏలూరులోనూ బెజవాడలోనూనాటక భవనాల్ని నిర్మించారు. దేశికులూ, కార్యనిర్వాహకులూ

కవులూ, చిత్రలేఖకులూ, సహాయులూ మున్నగువా రెంద
రికో జీవనాలు కల్పించారు. చక్కనికట్టుబొట్లలో నాట్య
శిక్షను ఇప్పించారు. ఆంధ్రీకృత సంస్కృత నాటకాలూ,
స్వతంత్రనాటకాలూ, సాంఘిక నైతికాది వివిధరూపకాలూ,
మొదలైన వెన్నో చదివింపించారు. కొంచె మించుమించు
గా తెలుగుజిల్లా లన్నిటిలోనూ ప్రజలకు వివిధనాటకాభి
రుచులను చవి చూపించారు. వెళ్ళినప్రదేశాలం దంతటా
ఉండే పండితులయొక్కయూ, ప్రభువులయొక్కయూ, అధి
కారులయొక్కయూ సన్మానాల్ని చూరగొన్నారు.

మ॥ రా॥ రా॥ ఎడవల్లి సూర్యనారాయణ, ఉప్పలూరి
సంజీవరావు, కడియాల రత్తయ్య, ఆరణి సత్యనారాయణ,
ఆలమూరి పట్టాభిరామయ్య, కొచ్చెర్లకోట రంగారావు,
విద్వాన్ బాలకవి పంచాంగంవేంకటరామానుజాచార్యులు,
కపిలవాయి రామనాథశాస్త్రి, అద్దంకి శ్రీరాంమూర్తి, బుద్ధిరా
జు లక్ష్మణరావు, ముంజులూరి కృష్ణారావు, జాగర్లమూడి నర
సింహారావు, జొన్నవిత్తుల శేషగిరిరావు మొదలైన ప్రసిద్ధ
నటు లెందఱో శ్రీ జమీందారువారి ఆశ్రయమందు పని
చేశారు. ఈ పైవారిలో కొందఱూ మహోన్నతస్థితిని నిలు
పుకో లేకపోయినా ఇప్పటికీ పలువురు శ్రీ జమీందారు
వారి సన్మానానికి పాత్రులయి విశ్వాసంతో పనిచేస్తూ
ఉన్నారు. ఆ మానిన వారైనా శ్రీ జమీందారు
వారి ప్రాపణం తమతమ కాలకర్మ వశంగా దూరమైనందుకు



చింతిల్లుతూ, తమయెడల శ్రీవారు లోగడ చూపిన ఔదా
ర్యాన్ని అప్పుడప్పుడు కొనియాడుతూనే ఉంటారు. శ్రీ
వారి సౌజన్యాన్ని గ్రహించడానికి ఇదికూడా ఒకగొప్ప కార
ణంగా ఉంటుంది.

రాజమండ్రీ బెజవాడలు సమాజాల్ని ఇలాగే జీతా
లతో నడిపినప్పటికీ వాని ఆదాయాలు ప్రొప్రయిటర్ల స్వంత
జమాఖర్చుల్లో దాఖలవుతూ ఉండేవి. లాభకారిగా ఉన్నంత
కాలం అవిచ్ఛిన్నంగా నడుస్తూ ఉండేవి. ప్రధానంగా
ఉండే లాభనష్టాల్ని పట్టి వారితాలూకు నటులు ఎక్కడా ఏ
సమాజంలోనూ వేషాలు వెయ్యకుండా ఉండడం విధిగానూ
శాసనంగానూ ఉండేది. ఇతరసమాజాల్లో ఉండే పెద్దనటు
లందర్నీ తమలోనే పెట్టుకొని, ఇంకేసమాజాల్లోనూ వేషాలు
వెయ్యకుండా చేసి, తాముమాత్రమే తమ ప్రదేశాల్లో ఈ
నటు లందఱిచేతా నాటకాలాడించడంచేత చూడదలచుకొన్న
ఇతరదేశాలవారు వీరిగ్రామాలకు రైలుఖర్చులుకూడా పెట్టు
కొని వెళ్లుతూ ఉండేవారు. శ్రీవారు కాలాన్నిబట్టి వ్యావ
హారికంగా సమాజాన్ని నడిపినప్పటికీ సత్కార్యసహాయంగా
తమనటుల్ని ఎక్కడికిపడితే అక్కడికి యథేచ్ఛగా పంపించే
వారు. ఇంకా కావాల్సిఉంటే దుస్తులూ, తెరలూ, మొద
లైనవానినికూడా పంపేవారు. ఈ కారణాల్ని పట్టికూడా
శ్రీ జమీందారువారు తమకంపెనీని కేవలం వర్తకమర్యా
దలోనే నడిపిస్తున్నారనడానికి అవకాశం కనిపించదు.

శ్రీ శ్రీ నారాయణరావు జమీందారువారు కేవలం ద్రవ్యాన్ని వినియోగించి కంపెనీని ఒక కార్ఖానాగా చేసేవారు కారు. వీరు మంచి దేశికులుగా ఉండడానికి తగిన అర్హతల నన్నిటినీ సంపాదించారు. యోగ్యరూపకాన్ని కాలానికి తగినట్లు స్వయంగా నిర్ణయించుకొంటారు. సమర్థులైన కవులు దొరికినప్పుడు ఇంకా తమ ఉదాత్త ఆశయాల్నీ భావాల్నీ చెప్పి తమసంఘానికి తగినట్లుగానూ దేశానికి ఉపకరించేటట్టుగానూ వ్రాయిస్తూఉంటారుకూడాను మంచి మంచి నాటకాల్ని. అవసరాన్నిపట్టి ఆయా నాటకాల్లోకావాల్సిన మార్పులనుకూడా చేసుకొంటారు. అవకాశాన్ని కలిగించుకొని నటులందఱికీ స్వయంగా వస్తుతత్త్వాన్ని వినిపించి అభినయాంశాల్ని నిర్ధరిస్తూ ఉంటారు. అలాగే దృశ్యపరికరాల్నికూడా ఎంతద్రవ్యాన్నైనా ఖర్చుపెట్టి సమకూరుస్తూ ఉంటారు. క్రమంగా ఆరంభించడం, అంకాంతరాల్లో ఆలస్యం లేకుండా ఉండడం, అనుకున్నవేళకు ముగియడం మొదలైన లక్షణాల్ని కలిగి సీతారామాంజనేయ ప్రదర్శనాలన్నీ చాలా మనోహరంగా ఉంటాయి.

శ్రీ శ్రీ జమీందారువారికి సంగీతం, కవిత్వం, అభినయం, చిత్రం, శిల్పం, మొదలైనకళలంటే చాలాఅభిమానం. కొన్నిటిలో మిక్కిలిగా ప్రవేశంకూడా ఉంది. మఱికొన్నిటిలో పండితులని కూడా చెప్పాల్సిఉంటుంది. ఆపైని నవ్యాశయాలకూ, భావాలకూ ఆశ్రయంగాఉంటారు. దేశాన్ని



గుఱించి ఎవ రేసత్కార్యాన్ని తలపెట్టి వీరి సహాయాన్ని ఆసించినా మిక్కిలి దయతోనూ, శ్రద్ధతోనూ చేయగలిగిన సహాయాన్నిఅంతా చేస్తూఉంటారు. పిన్నలనీ, పెద్దలనీ, అల్పజాతులవారనీ, అగ్రజాతులవారనీ భేదాలు లేకుండా అందర్నీ సమానమైన గౌరవంతోనూ, ప్రేమతోనూ చూస్తారు. అందఱితోనూ అభేదంగా వర్తిస్తారు. విద్యాధికులలాలా ఉండగా, ద్రవ్యాధికుల్లో ఇంత సౌహృదయాన్ని కలవార్ని మన మధికంగా చూడబోము.

లాభాల్నే ప్రధానంగాపెట్టుకొని నాటకాలాడే కంపెనీలన్నీ అడుగంటిపోయాయి. కేవలం అభిమానంగానూ, దేశోపయోగంగానూ ఆడదలచుకున్నది కాబట్టి, లాభంవచ్చినా నష్టంవచ్చినా, ఎండఉన్నా, ఎండఉపోయినా ఇప్పటికీ ఒక్కలాగు . జగజ్జేగేయమానంగా పని సాగిస్తూఉంది ఈ ఏలూరు సీతారామాంజనేయ నాటకసమాజం.

శ్రీ జమీందారువారు ఇప్పటికి అధమం ఒకలక్ష రూపాయలైనా ఖర్చుపెట్టి ఉంటారని సమాజానికి ఉన్న తెరలూ, దుస్తులూ, ఇంకా యితర పరికరాలూ మొదలైనవాన్ని పట్టి తెలుస్తుంది. నెలఒకటింటికి పన్నెండువందలరూపాయలకు తక్కువకాకుండా నటులూ, కవులూ మొదలైనవారికి జీతాలు ఇస్తూ ఉంటారు. ప్రతి నెలకూ ఒకటి రెండు నాటకాల చొప్పునైనా అడిగినవారికి లేదనకుండా ధర్మాలు ఇస్తూఉంటారు. ఇంతెందుకు! విజయనగరంలో

సంస్కృతనాటకసమాజాన్ని శ్రీ శ్రీ ఆనంద గజపతిమహారాజావారు ఆదినాల్లో ఎటువంటి ఘనమైన భావాలతో ఎంతసమర్థంగా నడిపించారో, ఏలూరులో శ్రీ శ్రీ మోతే నారాయణరావు జమీందారువారు ఒక్కరే అలాటి భావాలతో అంత సమర్థంగా తెలుగునాటకప్రదర్శనాలను ఇప్పటికీ నడిపిస్తూఉన్నారనడానికి ఏమీ సందేహము లేదు. ఇంకా చాలామంది నటుల్లో ఉండే చంచలభావాలూ, ఆకతాయి స్వభావాలూపోయి శ్రీ శ్రీ జమీందారువారి అనుపాజ్ఞల్లో ఉండడం తటస్థపడితే మదరాసులో మ॥ రా॥ రా॥ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారివలే ఆంధ్ర దేశంలో మన నారాయణరావుజమీందారువారున్నూ ఇంకో 'ఆంధ్రస్టేజిని' కట్టించి తోడిదేశస్థుల కృతజ్ఞతకు ఇప్పటికంటే ఎక్కువగా పాత్రులు కాగలరని నాదృఢమైన నమ్మకం. భగవంతుడు ఇది త్వరలో సమకూర్చుగాక!

## సంచారరంగాలు.

'ఇండియన్ డ్రామెటిక్ కంఫెనీ', అనేది బందరులో పది పదిహేను ఏండ్లక్రిందట మ॥ రా॥ శ్రీ॥ నల్లూరి బ్రహ్మానందంగారి నిరుపమాన కృషిఫలితముగా ఏర్పడింది. కేవలము తమ బుద్ధిచాకచక్యముతో ఇంతకాలమూ చెక్కు చెదరకుండానూ, లోపము లేకుండానూ, కంపెనీని కాపాడుకొంటూ రావడమేకాకుండా, ఏవిషయంలోనూ ఏ ఇతర పెద్ద కంపెనీలకూ తీసిపోకుండా కూడా పరిపాలింపగలిగిన



శ్రీ బ్రహ్మానందముగారి కార్యశీలము ఎంతైనా చెప్పుకోతగి ఉంటుంది.

బ్రహ్మశ్రీ డి. వి. సుబ్బారావుగారు ఈకంపెనీకి ప్రాణతుల్యులై ఉంటారు. వీరు చిన్నప్పటినుంచీ తమజీవితాన్ని ఈ కంపెనీఅభివృద్ధికొఱకు వినియోగిస్తూ ఉన్నారు. బాలవేషాలు, స్త్రీవేషాలు, ప్రధానవేషాలు వయోధర్మానుగుణ్యంగా ఎన్నిటినో వేస్తూవచ్చినవారవడంచేతనూ, అనేక దేశాల్లో తమ నాట్యాన్ని ప్రదర్శించినవారవడం చేతనూ వీరియందు కనిపించే రాంగిక అనుభవం అనేది అంతగా యింకెవరియందును కనిపించదు. ప్రస్తుతం దేశదేశాల్లోనూ నాట్యసంబంధి కీర్తిని గడిస్తూ వెలుగుతూ ఉన్నది ఈ 'ఇండియన్ డ్రామెటిక్ కంపెనీ'యే అనుటకు సందేహంలేదు.

ఇచ్చట ఉండే హిందూ, నేషనల్, ఛత్రపూర్, రాయల్, రామమోహన్, బాలభరత, మున్నగు సమాజాలు ప్రదర్శనోద్యోగాన్ని విరమించాయి. కొందఱు పెద్ద నటులు కీర్తిశేషులయిన కారణంచేత. వర్తకసమాజాలప్రాబల్యానికి లోపడి తమ నటులు కొందఱు దేశాంతరవాసులవడం చేతకూడా వీని వ్యాపారానికి స్తబ్ధత్వం ఏర్పడడానికి కారణమయింది. ఇట్టియవకాశం 'ఇండియన్ డ్రామెటిక్కు సమాజా'నికి మంచి లాభాన్ని ప్రోత్సాహాన్ని కలిగించింది. ఆపైని బందరులో బయలుదేరిన చిత్రనళీయ కాంపిటీషను వ్యాపారం

కూడాముఖ్యంగా తోడ్పడింది. అప్పటినుంచికొంచెముపెద్దపెద్ద నాటకాల్ని చదవడంప్రారంభించింది. యత్కించిత్ భరతప్రవీణులైన బి.టి.రాఘవాచారిగారి పుణ్యమా అంటూ ఆ కాంపిటీషన్‌లో పారితోషికాన్నికూడా పడసింది. అటుపిమ్మట గుంటూరు హరిశ్చంద్ర కాంపిటీషన్‌లో బ్రహ్మశ్రీ డి. వి. సుబ్బారావు గార్కి హరిశ్చంద్రవేషానికని ఒకమెడలు వచ్చింది. ఖ్యాతివిస్తరించింది. అప్పటినుంచి ఇప్పటివఱకూ ఒకేవిధంగా అనేకనాటకాల్ని ఆడుతూ, అనేక దేశాల్ని తిరుగుతూ, బందరులో సంచార రంగం లేదనే మాటనుకూడా రానీయకుండా జనానురాగాన్ని సంపాదిస్తూ ఉంది.

మ॥ రా॥ రా॥ సి. యస్. నటేశంగారి కంపెనీ ఒకటీ, బాలకొండ కంపెనీ ఒకటీ సంచారాలు చేస్తూ నాటకాలాడుతూ ఉంటాయి వివిధదేశాల్లో. ఈ సమాజాల్లో పురుషులతోపాటు స్త్రీలుకూడా వేషాలు వేస్తారు. భరతాన్నీ సంగీతాన్నీ ఈ మెంబర్లు బడి పిల్లల్లే ప్రతిరోజూ తమ గురువులదగ్గిర పఠిస్తూ ఉంటారు. తెరలూ, దుస్తులూ, మొదలైనవానినికూడా లోపంలేకుండా చూపిస్తూ ఉంటారు. వీరాడే నాటకాలుమాత్రం అంత ప్రౌఢంగా ఉండవు. భాషావిషయంలో తప్ప కడమ విషయాల్లో సామాన్యజనాన్ని మెప్పిస్తూ ద్రవ్యార్జనచేస్తూ ఉంటాయి.

మ॥ రా॥ రా॥ ఆంజనేయ సీ. యస్. నటేశంగారు



చాలా దైవభక్తి కలవారు, దానధర్మాలుకూడా చేస్తూ ఉంటారు. వీరి ఆంజనేయవేషం మహా ప్రశస్తంగా ఉంటుంది.

ఒకప్పుడు మైసూరు మహారాజావారి సమక్షంలో లంకాదహనాన్ని ఆడడం తటస్థపడింది. సీతాన్వేషణ కార్యోద్యోగుండౌచు మన సి. యస్. నటేశంగారు 'రామ రామ రామసీతా' అనేకీర్తనను పాడుకొంటూ ఆడుకొంటూ పరమానందనిమగ్నాంతఃకరణులై రంగానికి వస్తూఉంటే భక్తిభావదాయకమైన యీ రామనామస్మరణ మనస ధ్యానాది సారస్యాన్ని అనుసరిస్తూ ఒక ప్రత్యక్షవానరంకూడా ఆంజనేయవేషధారులగు మన నటేశంగారివెంట రావడం తటస్థపడినట్లునూ, మహారాజావారితోపాటుగా ఎల్లసభ్యులును పరమాశ్చర్యమందుచూ నటేశంగారిని ఎక్కువగా సన్మానించినట్లునూ చెప్పుకొంటారు. ఇదిచాలా విచిత్రమయిన విషయము!

## సమాలోచనం.

పైసామాజాల చరిత్రాల్ని పట్టిచూస్తే నాటకకళ చాలామంది పెద్దలచేతనే అనాదినుండీ ఆదరింపబడేదని తెలుస్తుంది. అయితే ఎంతవఱకుజరిగినా జరక్కపోయినా కొంచెం కట్టుదిట్టాలతోనూ క్రమపద్ధతులతోనూ మంచినటులతోనూ ప్రదర్శనాల్ని జరిపించాల్సిఉంటుందనికూడా తెలుస్తుంది. ప్రస్తుతంలో నవనాగరిక నటులూ, వార్ని అనుసరించినవారూ

బహు నిరంకుశంగా నాటకాల్ని సాగిస్తున్నారు. ప్రాచీనుల లక్షణాలూ, పెద్దల ప్రయోగవిధానాలూ, శ్రద్ధతో లక్షిస్తూ, క్రమశిక్షకలిగి కాలానికి తగిఉండే క్రొత్తక్రొత్త భావాలూ, విశేషాలూ కల నాటకాల్ని ఆడితే పెద్దల కింకా అభిమానం కలుగుతుంది. నటులు అహంభావాల్ని వదులుకొని దేశికుని శిక్షకు లోపడడంఅంటూ కలిగితే అన్ని అందాలూ కుదురుతాయి. లేకపోతే ‚‚ఏమిరాకాటా అంటే ఎప్పటి ఆటే’గా ఉంటుంది.






# ఆంధ్రనటప్రకాశిక

అష్టమ ప్రకరణము.



## రూపకము—కావ్యము.

ప్రస్తుతంలో రంగానికి ఎక్కింపబడే ప్రతిరూపకమూ నాటకంగా అశేషజనులచేత వ్యవహరింపబడుతూ ఉంది. ఘంటకొక నాటకంగా వ్రాసేవా రెందఱో బయలుదేరుతూ ఉన్నారు ప్రతిపట్నంలోనూ పల్లెలోనూకూడాను. నాటక సంఘాలుకూడా తత్తుల్యంగానే వెలుస్తూ ఉన్నాయి ప్రతి ఊరాను. పయిగా ఈ నాటకోద్యోగం చాలామందికి జీవనాధారంగాకూడా ఉంటూఉంది. అంటే ఏమన్నమాట! జనులందఱికీ ఆ రూపకాలూ ఆ ప్రదర్శనాలూ సంతోషాన్ని కలిగిస్తూ ఉన్నాయన్నమాట!

ఇంకో విధంగా ఆలోచిద్దాం. ఏ నాలుగు అక్షరా

ముక్కలు వచ్చినవారినైనా ఈవిషయంలో కొంచెం కదిపి చూడండీ! నామట్టుకు నేను ఇందలిసత్యాన్ని కనిపెట్టేఉద్దేశంతో తిరిగిన జిల్లాలన్నిటిలోనూ, పట్నాల్లోనూ, పల్లెల్లోనూకూడా 'ఏమండీ రాత్రి నాటకానికి వచ్చారుకదా ఎలాఉందండీ!' అని అడిగినప్పుడూ "ఈనాటకాన్ని కొంచెం చదవండి," అని ఏపండితుణ్ణైనా కోరినప్పుడూ 'అబ్బ! పోనిత్తురూ! ఏంనాటకాలూ ఏంప్రదర్శనాలు!' అన్నమాటే వినబడుతూవచ్చేది. దీన్ని బట్టి చూస్తే ద్రవ్యంకోసంఅని ఆయా సంఘాలవారు చేసే అభూతప్రకటనాలూ, ప్రచురణాలూ, చూచి భ్రమించి సర్వసాధారణంగా వెళ్లే దిదృక్షులకుగాని, పండితులకుగాని హృదయరంజకంగా ఉండడం లేదనే నిశ్చయమవుతుంది. ఈ రెండువిధాలైన కారణాల్లో దేన్ని ఆదరిద్దాం, దేన్ని మానేద్దాం అనే ప్రశ్న ఒకటి ఉదయిస్తుంది తప్పకుండాను.

ఇంతకుముందు చదివిన ప్రకరణంలో కనిపించిన రంగాలన్నీ ఒకేవిధంగా నాటకాలాడలేదు. అందులో కొన్ని సమాజాలు మహారాజుల చేతను , జమీందారులచేతను, మహామహోపాధ్యాయులచేతను, ఇంకా తత్తుల్యులైన అనేక పండితులచేతను నడిపింపబడుతూ వచ్చాయి. సహజంగా కొంత విద్యావివేకాల్ని కల్గినవారూ, గురువులు చెప్పినదారుల్లో కష్టించినవారూ అయిన ఎందఱో పెద్దలు, ఆయాసంఘాల్లో వేషాలుకూడా వేస్తూ వచ్చారు. ఆలాటి సమాజాల్నికాని విద్వన్నటులనుకాని, వారిచ్చే ప్రదర్శనాల్నికాని అట్టే చులా



గ్గా కాదనగలమా! అయితే ఆలాటిసమాజాలు ఎన్ని ఉన్నాయి! ఎన్ని అంతరించిపోయినాయి! విజయనగర సంస్కృతసమాజం ఏదీ! నెల్లూరు భాషాభిమాని సమాజం ఏదీ! పెద్దాపుర విద్యావినోదినీ ఏదీ! చివరకు బళ్లారివారి సరసవినోదనీయైనా కనిపించదే! అందాకా ఎందుకు! ఏది ఎలాఉన్నా నిన్నమొన్నటివఱకూ ఏదోఒక కట్టుబాటుకు లోనై ఒకశిక్షలో తయారై ఒకవిధమైన సమ్మోహనసౌష్ఠవంతో ఎందఱెందర్నో ఆకర్షిస్తూఉండే మా బెజవాడ బాలభారతి కూడా విచ్ఛిన్నమై పోయిందే! ఎటుచూచినా ఇప్పటికీ ఏలూరులో నిలకడగా పెద్దపాయాలో పనిచేస్తూఉన్నది మహారాజశ్రీ శ్రీ మోతే నారాయణరావు జమీందారువారి సీతారామాంజనేయ నాటకసమాజం ఒక్కటేగా కనిపిస్తూ ఉంది!

'అయితే ఈయాడే నాటకాలన్నీ ఏలూరుసమాజమే ఆడుతూఉందాయేమిటి!' అని కళ్లెఱ్ఱచేస్తారుకాబోలు నావిూద పాఠకులంతాను! కోపగించకండి! ఎన్నెన్నో సమాజాలు ఆడుతూనే ఉన్నాయి. అందులో ఏ ఒకటో రెండో తమకు చెందిన ఒకానొక నాట్యోద్యోగిని పురస్కరించుకొని పొట్ట పోసుకుంటూ ఉన్నాయి. ఇక మిగిలినవన్నీ ఎన్నిపేర్లతో వ్యవహరింపబడుతూ ఉన్నా, ఈ యన్నిటిలోనూకూడా ఒక సారి చూడబడిననటులే తిరిగి తిరిగి చూడబడుతూ ఉంటారని నమ్మాల్సి ఉంటుంది. కారణం ఏమంటే కేవలం విద్యా

విషయికంగా నాట్యకార్యాన్ని భావించి కృషిస్తూవచ్చిన ఔత్సాహికనటు లనేకులు ప్రస్తుత వర్తకవ్యవహారాదులకూ వ్యామోహాలకూ విసిగి విశ్రాంతి తీసుకొన్నారు. ఇక వేషాలువేసే రూపంగా జీవనాలు చేసుకుంటూ ఉండేనటు లెందర్నో సేకరించుకొని, ఎంతో దర్జాగానూ, డంబంగానూ వెలుగుతూవచ్చిన రాజమహేంద్రవర చింతామణిసమాజం బెజవాడ బాలభారతీసమాజం, తెనాలి రామావిలాససభ కాకినాడ కృష్ణవిలాససభ, మొదలయినవెన్నో కాలకర్మ వశంగా ఆరిపోయినాయి. ఆ యా సమాజాలకు చెందిన ఆతి తేరిన ప్రసిద్ధ నటులందఱూ పాపం! నిరాధారులై నాటక ప్రపంచంలో బయటపడ్డారు. వీ రందఱూ వీలునుబట్టి స్వంతంగానో లేక ఇతరంగానో ఏదోఒకవిధంగా వేషాలువేయక తప్పకపోవడంచేత, ఎన్నిగ్రామాల్లో పడిఉన్న సమాజాలో వీరి సహాయంతో తల లెత్తుతున్నాయి. అవిగాక ఇంకా క్రొత్తవి సృష్టింపబడుతూ ఉన్నాయికూడాను. ఆ సమాజాల్నీ ఆ నటుల్నీ అలా ఉంచండి !

ఇక నాటకాలసంగతి ఆలోచిద్దాం. కవిత్వం చెప్పేవారు కవులనబడతారు. ఆలాటికవుల్లో నిజంగా కవులెవరా అని ఆలోచిస్తే ఒక్క కాళిదాసే ఘనంగా పరిగణింపబడుతూ ఉంటాము. దీన్నిబట్టి కవిత్వమనేది ప్రతిభాపూర్వకంగానూ దైవికంగానూ రాతగినదనీ, అలాటికవిత్వాన్ని చెప్పేవారు నిజంగా అసాధారణశేముషీధురంధరులై అవతారపురుషు



లుగా పేర్కొనబడదగినవారై ఉంటారనీ, మనకు నిశ్చయమౌతుంది. కష్టించి చదివినశాస్త్రాలూ, తర్కాలూ కవిత్వాన్ని కలిగించేవి కావని మనకు అర్థం అవుతుందికూడాను. ఇంకా లక్షణజ్ఞుల అభిప్రాయాల్ని పట్టిచూస్తే, నిజమైన కవి నుండి వచ్చే ఒక్కవాక్యమైనా కావ్యమనదగిందిగా కనపడుతుంది. ఇట్లుండగా పద్య గద్య గేయాలతో నిండినవి ఎన్నో కావ్యాలు ఒక్క మన ఆంధ్రంలోనే ఉన్నాయి లెక్కలేకుండాను. ఇంకా ఇలాటి భాషలనెన్నిటినో కలిగిస్తూ లక్షణంగానూ, అనంతంగానూ ఉండే సంస్కృత భాషలో ఎన్నిఉండవచ్చునో ఆలోచించండి! ఈకావ్యాలన్నిటిలో కూడా నాటకమనేది చాలా రమ్యమయినది అని పెద్దలు అన్నారంటే, ఇక దాని విశేషం ఎంత ఉండాల్సిఉంటుందో నేవేఱే చెప్పనక్కఱలేదనుకుంటాను.

ఇప్పటికాలంలో నాటకాలనే పేరుతో దేశాన్నంతా ముంచేస్తూ ఉండే ఆ రూపకాలన్నీ ఎన్నిఉన్నాయో అనికానీ వాటిని వ్రాసేవారంఱూ ఎవరెవరో అనికానీ ఇంకా వాటిగుణాగుణా లెట్టివో అనికానీ తెలుసుకో దలచినవాళ్ని ఒక్క పర్యాయం రైలుప్రయాణం చేయమంటాను నేను. ఏమంటారా! ఎక్కడెక్కడి గ్రంథాల్నీ కట్టలుకట్టుకుని 'కంపెనీడ్రామాలు' 'కంపెనీ డ్రామాలు' అంటూ బయలుదేరుతారు లెక్కలేనంతమంది. ఆ కట్టలు విప్పిచూస్తే 'ఆడషోక్' 'మగషోక్' 'పడుచుపెండ్లాం ముసలిమొగుడు' 'గుంటూరుగుంట' మొద

లైనవానితో కనిపిస్తాయి ఎన్నోరూపకాలు. ఆయా కవులు కూడా చాలవఱకు వానిలో ఫోటోగ్రాఫులు రూపంగా దిగిఉంటారు. సారస్వతం ఇలా అభివృద్ధి అవుతూ ఉంటే పండితులు అలా నిరసిస్తారేమిటి ! దానికి గల కారణాన్ని బహు సులభంగా చెప్పవచ్చును ఇవి నాటకాలు కావనీ, వీని కర్తలు కవులుగారనీ, ఇంకా వాటి ప్రదర్శనాలు అర్థంలేని వ్యర్థపటాటోపాలనీని. వాని ప్రశంశ మన కక్కఱ లేదు.

'జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెంబేలా' అన్నట్లు వెతుక్కో అక్కఱలేకుండా కనిపించే ప్రసిద్ధకవులు ఉన్నారు అనేకులు. అట్టివారిలో కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు మ॥ రా॥ శ్రీ వడ్డాది సుబ్బరాయకవిగారు మ॥ రా॥ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు కీ॥ శే॥ ధర్మవరం కృష్ణమాచార్యులుగారు శ్రీయుత గోపాలాచార్యులుగారు కీ॥ శే॥ కోలాచలం శ్రీనివాసరావుగారు శ్రీయుత కె. సుబ్రహ్మణ్యంగారు మ॥ రా॥ శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు మ॥ రా॥ శ్రీ కాళ్ళకూరి సాంబశివరావుగారు నారాయణరావుగారు గురుజాడ అప్పారావుగారు కీ॥ శే॥ ముత్తరాజు సుబ్బారావుపంతులుగారు బ్రహ్మశ్రీ బలిజేపల్లిలక్ష్మీకాంతకవిగారు మొదలయినవారు వ్రాసినరూపకాలు



అశేషజనుల ఆమోదాన్ని సంపాదించి ఇప్పటికీ ప్రచారంలో ఉంటూఉన్నాయి. శక్తికొలది క్లుప్తంగా ప్రస్తుతం ప్రచారంలో ఉన్న కొన్నికావ్యాల్లోని విశేషాలు ఎంతవఱకు ప్రాచీన సాంప్రదాయాల్ని అనుసరించునదీ, ఎంతవఱకు నవ్యలక్షణాల్ని ప్రకటించునదీ తెలుసుకుందాం.

### కందుకూరివారికావ్యాలు.

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు వ్రాసిన నాటకాల్లో 'అభిజ్ఞాన శాకుంతలం' అనేది కాళిదాసుని సంస్కృతనాటకాన్ని అనుసరించి తర్జుమా చేయబడింది. హరిశ్చంద్రనాటకం కొంచెం స్వతంత్రంగా వ్రాయబడింది. ఈ రెండు నాటకాలూ ఒకప్పుడు బాగా ప్రచారంలో ఉంటూఉండేవే. శాకుంతలానికి చెందిన అన్నివిధాలైన ఔచిత్యాలూ మహాకవి కాళిదాసుని ప్రతిభావిశేషాన్ని పురస్కరించుకొని వచ్చినవే అవడంచేతనూ, కాళిదాసుని శాకుంతలం దేశదేశాల్లోనూ ఈవఱకే అద్వితీయ గౌరవాన్ని ప్రతిష్ఠించుకున్నదగుటచేతనూ దాన్నిగుఱించి క్రొత్తగా చెప్పాల్సింది ఏదీ ఉండదు. ఇక హరిశ్చంద్ర అనేది పంతులుగారి నాటకరచనావైదుష్యాన్ని కొంతవఱకు ప్రకటిస్తూ ఉంటుంది. ప్రస్తుతం దీని ప్రచారం ఏమాత్రం కనిపించదు. కాబట్టి దాన్ని కూడా అలా వదిలేద్దాం.

### వేదంవారికావ్యాలు.

మహా మహోపాధ్యాయులు, వ్యాఖ్యాతృచక్రవర్తులు

కళాపరిపూర్ణులు అయిన బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయ శాస్త్రుల్లవారి అద్వితీయ విజ్ఞానం నిజంగా మహాసముద్రం వంటిది. ఎన్నో ఉద్గ్రంథాల్ని వ్రాశారువీరు. సంస్కృత భాషను నేర్చుకోదలచినవారికీ, అందలి వివిధ సౌందర్యాల్ని అనుభవించ దలచేవారికీ సాధనాలుగా ఉంటాయి వీరు వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథా లెన్నైనాను. ఆలాగే, ఎన్ని సంస్కృత రూపకాల్నో తెలిగించారు సమగ్రంగా. ఈలాటి మహాపురుషుల్ని గురించి సానకాశంగా వ్రాయదలచే విద్వాంసులకు ఎంతవిషయమైనా దొరుకుతుంది.

వస్తు నాయక రసాల్నిపట్టి రూపకస్వరూపం ఇదమిత్థమని నిర్ణయించుకోబడుతుంది సర్వసాధారణంగాను. ఆపైని పద్యగద్యగేయాలూ, కథావిభాగాలూ, ప్రవేశనిష్క్రమాలూ పాత్రౌచిత్యాలూ, ఉపక్రమోపసంహారాలూ మున్నైనవన్నీ సర్వతోముఖమయిన ఔచిత్యాన్ని సంపాదిస్తూ తత్కర్తలకు ఎక్కడలేని గౌరవాన్ని కలిగిస్తూ ఉంటాయి. ఈ వివరణాలన్నీ ఐదోప్రకరణంలో చెప్పబడే ఉన్నాయి. ఆయా లక్షణాలకు మించిన విశేషాంశాలింకా ఎన్నో శాస్త్రుల్లవారి సాహితీసముద్రతరంగాల్లో ఉయ్యాలల ఊగుతూ ఉంటాయి. "నాటకాంతంహి సాహిత్యమ్" అనబడేలక్షణానికి తార్కాణంగాఉండే శాస్త్రుల్లవారి కావ్యాలుగాక, రంగాన్ని ఏ దినాల్లోగాని అలంకరించతగే రూపకాలు ఇంకేవి ఉంటాయనిఅనగలం! ప్రస్తుతం ప్రచారంలో ఉన్న ప్రతాపరుద్రీయాన్ని గురించి కొంచెం చెప్పుకుందాం.



మైత్రేయుడు (మృచ్ఛ.) — శ్రీ ఆలమూరిపట్టాభిరామయ్యగారు

శకారుడు (మృచ్ఛ.) — శ్రీ కొచ్చెర్లకోట రంగారావుగారు



వసంతసేన-శకారుడు (మృచ్ఛకటికము)





ఏ విశేషాంశాలు ఎలాఉన్నా రూపకానికి ఇచ్చిన పేరును బట్టి ప్రతాపరుద్రుడికి చెందిన కథ దీనివస్తువుగా నిశ్చయమౌతుంది. చరిత్రప్రసిద్ధమైన ఆ కథాంశాన్ని మాతృకగా చేసుకొని రూపకానుగుణ్యంగా ఉండే కలుపుకోతలను చేసుకున్నట్లు యథార్థవృత్తంతో భేదిస్తూఉండే యత్కించిత్ భిన్నాంశాలు ఋజువుచేస్తూ ఉంటాయి. కాబట్టి ప్రతాపరుద్రీయానికి చెందిన వస్తువు 'మిశ్రమ' మనబడేదిగా నిలుస్తుంది. ఉత్తమగుణ విశిష్టుడు, ప్రభువు అయిన ప్రతాపుడే దీనినాయకుడనడానికి 'ప్రతాపరుద్రీయం' అనేపేరే ముఖ్యసాధనంగా ఉంటుంది. ఇక రసాన్ని ఇదమిత్థమని నిర్ణయించడంలోఉంది ఏంఉన్నాను! అందాకావస్తే ప్రతాపరుద్రీయాన్ని నాటకేతరమైన మఱొక రూపకంగా చెప్పుకోవలసి ఉంటుంది. అప్పుడు ముద్రారాక్షసంవలె ఇదికూడా ఒకచారిత్రక రూపకంగా ఉండేటట్లు చేశారని దృఢమౌతుంది.

చారిత్రక రూపకానికి నాటకానికి ఉన్నన్ని ప్రతిబంధకాలు ఉండవు. శృంగార వీరాల్నే ప్రధానంగా ఉంచాల్సిన అవసరం ఉండదు. నాయికా నాయకులూ, నాయక ప్రతినాయకులూ యథావిధిగా రూపింపబడకపోయినా మరేం బాధలేదు. ఆమాత్రం సందుచేసుకోకపోతే రూపకకావ్యాభివృద్ధికి ఇక మార్గమేదీ! అయితే అంతమాత్రంతో ఆపని నెఱవేరదు. ఇంకా కథాసంవిధానం, పాత్రపోషణం, కవిత్వం, భాష మొదలైనవెన్నో అతికించినట్లు కాకుండా ఉం

డాలి! మనోహరంగా ఉండాలి! ఇలాటివి ఒక్క మన శాస్త్రిల్లు వారివంటి భావజ్ఞులకు గాక సామాన్యులకు ఎంత తపించినా అలవడజాలవు.

ప్రతాపరుద్రీయంలో నాంది ప్రస్తావనాలు, ముఖ ప్రతిముఖాదిసంధులు, వాని అంగాలు, మొదలైన వెన్నో చక్కగా అనుసంధింప బడ్డాయి. ఇంకా ప్రధానంగా ఉండే పాత్రల స్వభావాలన్నీ బహు నేర్పుగానూ, రమణీయంగానూ, చిత్రింపబడ్డాయి. పద్యాల పాకం నారికేళపాకమే! అయితే ఆ ప్రసంగాలు మాత్రం మహా సమయోచితంగానూ యుక్త్యాత్మకాలుగానూ ముద్దులు మూటగడుతూఉంటాయి. ఆ యాలపాటల్లో ఇప్పటి భావకవులనుకునే జాతీయం ఎంతైనా పొంగి పొర్లుతూ ఉంటుంది. ఒక్కరాత్రిలో ఆడ్డానికి సాధ్య పడదు ఈ గాధఅంతాను.

ప్రతాపరుద్రీయంలో కనిపించే కల్పనా ప్రౌఢత్వం ఎంత వఱకు సహేతుకంగా ఉంటుందా అనే విషయంలో చాలా భిన్నాభిప్రాయాలు ఉంటాయి దీన్ని చారిత్రకరూపకం అనుకున్నాం గనుక. అందులో ప్రధానమైన సందేహం ముద్రారాక్షసంలో ఉభయత్రాఉన్నన్ని సాధనసంపత్తులూ ఎత్తుపైఎత్తులూ, దీనిలో ఉన్నాయాఅని. ఇంకా చాణక్య రాక్షసులతో పోల్చదగిన పరస్పర విజయోత్సాహులు ఈ ప్రతాపరుద్రీయంలో ఉన్నారా అనికూడా తోస్తుంది.



అయితే ఎక్కడికిలెండి! ఉన్నంతలో దీన్ని మించిన సృష్టివైచిత్ర్యాన్ని ప్రకటించే రూపకా లెన్నోలేవుగనుకసంతోషిద్దాం.

## శ్రీపాదవారికావ్యాలు.

కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగార్ని ఎఱుగనివారు లేరు. ఎన్నో కావ్యాలను వ్రాశారు వీరు. అవి అనేక రకాల్లో ఉంటాయి. స్వతంత్ర కావ్యాలు ఉన్నాయి. అనువాదాలు ఉన్నాయి. ప్రహసనాలు ఉన్నాయి. నాటకాలు ఉన్నాయి. పత్రికలు ఉన్నాయి. ఇంకా ఎన్నెన్నో ఉన్నాయి ఇలాగే. ఈ ఉన్నవానిలోఅల్లా ఒకరు వ్రాసినవే తాము తిరిగివ్రాసి ప్రకటించినవి ఎక్కువగా ఉన్నాయేమో అనుకుంటాను. చిట్టచివరకు ఈ ఉద్దేశం, భారతానికి తిరిగి భారతం వ్రాసే అంతవఱకూ వచ్చింది. కవిరాజులు గనుక వారికి సాధ్యమైంది ఆ పని! ఇంకోరికి అంతపట్టుదలా, అంతఓపికా, అంత ఆవేశం ఎలావస్తుంది! వస్తేమాత్రం! సాధన సంపత్తులు ఉండవద్దూ! అవన్నీ ఉన్నాయిమఱి మన కవిరాజుగార్కి! అది వారి 'వజ్రాయుధం' కూడా ఘోషిస్తూ ఉంటుంది. అస్మద్గురుతుల్యులగు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులంతవారికి ఒకప్పుడు గురువులుగా ఉన్న మహనీయులవడంచేతకూడా, విధాయకంగా నమస్కరిస్తాను వారిగొప్పతనానికి.

ప్రస్తుతం మనకు కావాలసినవి వీరి దృశ్యకావ్యాలు.

అవికూడా ఎన్నోఉన్నాయి మఱి! కేట్లాగులు చూడాలి వాని వివరాలు తెలుసుకోడానికి. ఇంతకష్ట మెందుకని, ఎలాగో ఒకలాగు అమలులోకివచ్చిన వీరి బొబ్బిలినాటకాన్ని గుఱించి కొంచెం ముచ్చటిస్తాను. ఇదికూడా ఇంతకు ముందు లేకపోలేదు. మ॥ రా॥ రా॥ కాళ్లకూరి సాంబశివరావుగారు ఈ బొబ్బిలి కథను ‘‘రంగరాయ కదన సమవాకారము’’ అనే పేరుతో వ్రాసేఉన్నారు చాలాకాలముక్రిందట. అది ఒక పృథు పఠనీయ గ్రంథంగాకూడా ఎఫ్. యేకో, బి. య్యేకో వేయబడియున్నట్లు నా జ్ఞాపకం. దాన్ని గూర్చిన వివరాలు వ్రాస్తాను ఇంకోచోట. అది అప్పట్లో చాలా సమాజాల చేత ఆడబడుతూ ఉండేదికూడాను. సుప్రసిద్ధ నటశిఖామణులైన మా యీావని లక్ష్మణస్వామిగారుకూడా దీన్నే ఆడించేవారు తమ సమాజంచేత. వారే అన్నమాటేమిటి! ఎక్కడ చూచినా దీని పలుకుబడి అనంతంగా ఉండేది. ఇంతట్లో మన కవిరాజుగారి బొబ్బిలి బయటపడింది.

కవిరాజుగారు తమ బొబ్బిలినాటకంలోఉండే విశేషాంశాల్ని, ఎలాఎలాగో నటలోకానికి తెలియపఱచుకోకలిగారు. కొన్ని సమాజాలు వెనకఒకదాన్ని చదివిఉన్నా, కవిరాజుగార్ని కాదనలేక చదవడం సాగించాయి దీన్నిమళ్లీని. అంతేకాకుండా అప్పుడే రాజమహేంద్రవరంలో, కాంపిటేషనుకుకూడా పెట్టబడింది ఈ బొబ్బిలి! అందఱికీ తలోమెడలూ వస్తుందనే ఆశకూడా ఆ చదివేసమాజాల్ని తొందరపెట్టింది.



అక్కడితో నాలుగ్గైదు ‘ఎడిషన్లు’ పడింది ఇదీని. ఇంత ప్రచారంలోఉన్న కవిరాజుగారి బొబ్బిల్ని వదిలిపెడితే ఊరకుంటారామఱి! శక్తికొలది పాఱచూద్దాం దాని సారాన్ని.

‘బొబ్బిలి యుద్ధనాటకం’అని పేరుపెట్టారు దీనికి కవిరాజుగారు. ఆప్రకారం కత్తులూ కఠార్లతో కొట్టుకోడం చంపుకోడం, మొదలైన తమాషాల్నన్నీ ప్రదర్శించారు దానిలో. కథ చరిత్రాత్మకమైందే అనుకుందాం. ఇక నాటకానికి కావాల్సిన నాయకు డెవరనుకుందాం! రసమేది అనుకుందాం! ముందు ఇవి తేలితేకదా ఆపైని రచనాచమత్కారాలు తేలడానికి! అసలు ‘యుద్ధం’అనేది నాటకాంశంగా ఉండతగిందేనా అని మొదటి సందేహం. ఏదో కొంత తేజోవంతంగాను, ఉదాత్తంగాను బయల్పడజూచే ఆ బొబ్బిలి రంగారావుని నాయకుడుగా నిర్ణయించుకుందాంఅంటే, నాటకానికి చెందిన నాయకుడే, ఈ బొబ్బిలినాటకంలో నఱకబడ్డాడు వైరులచేత! ఏమి అన్యాయమిది! దీన్ని ఏరసం అంటారో దేన్నిబట్టిచెప్పను! సాధ్యంకావడంలేదు. క్షమించాలి పాఠకులంతాను.

అసలు రంగారాయడు నాయకుడే కాదంటారేమో కొంపతీసి! కవిరాజుగారు నాందిలోనే ఆ సందేహాన్ని తీర్చేస్తున్నారు నాయకసూచన చేస్తూను. అన్నట్టు మఱిచాను. ‘నేడొక్క వీరరస ప్రధానరూపకము బ్రదర్శింపు’ అని సభ్యు

లాజ్ఞాపించినట్లు సూత్రధారిముఖంగా చెప్పించారు. కాబట్టి
మనంకూడా ఇది వీరరసప్రధాన మైందికాబోలు అని అనుకో
వాలి. ఆ వెంటనే నాయకప్రతినాయకు లెవరాఅని ఆలో
చించాలి ఇక. బొబ్బిలిపౌరుషానికి బెదరి ప్రాణా లఱచేత
పట్టుకొని రంగానికి వచ్చే గావశంతోనే:: మ॥ నెలమల్ కో
ల్పుబు తప్పువచ్చెపడి నా పీచంబుఖోగొట్టి బాముల పాల్సే
యుదురోయటంచు ననిశంబున్ దల్లడంబంద గుండెలు ప్రాణా
లఱచేత బట్టుకొనియే డిల్పడ్డ చిత్తంబుతో బొలుపేదగ్ నిల
నైతిగాని సుఖమెప్పుడున్ లేకపోయెన్ గదా"! అనియు:: శా॥
బాబో! బొబ్బిలికోటకొమ్మల.............వేసవేలెప్పుడున్॥"
అనియు, ఆర్తాలాపాలుచేసే విజయరామరాజు, నిజంగా రంగా
రాయుడు అంతవానికి ప్రతినాయకుడుగా ఉండడానికి సాధ్య
మౌతుందా అనిపిస్తుంది. ఇంకోవిధంగాచూస్తే ఏదోకొంత
ధైర్యంతోనో సహజాధికారగర్వంతోనో యుద్ధసగ్గారా ప్రయో
గించిన హైదరుజంగుని ప్రతినాయకుడుగా ఎంచుకోవాల్సి
వస్తుంది. అయితే హైదరు ప్రభువు కాకపోయె! ప్రభు
వైన రంగారావుతో ఇతనికి ఉజ్జీ ఎట్లాకుదురుతుందా అని
సందేహం. ఇంక కవితాది లక్షణాల్నిగురించి యోచిద్దాం

ఏవో ముక్తసరుగా మూడుముక్క లనుకుందాం
అచ్చుకూలి చాలా అవుతుందిగనుక. గ్రంథంలోఉండే ఏ
పద్యగద్యాన్నిపట్టి చూచినా, కవిరాజుగారు ఎన్ని నిమిషాల్లో
దీన్ని పూర్తిచేశారాఅని అనిపిస్తుంది. ఏ పద్యంలో ఎక్కడ



ఏ సాంప్రదాయం నిగూఢమైఉందో అని వెదకివెదకి నాప్రాణం
విసిగిపోయింది. ఇక పాత్రౌచిత్యాల్ని కనిపెట్టడానికి
ఆ విజయరాయని తొలిపలుకులే చాలనుకుంటాను. ఇంకే
మయినా ఉంటే కవిరాజుగారే వినిపిస్తారేమో తనవితీరా
విందా మనుకుంటాను.

## తిరుపతివేంకటేశ్వర కావ్యాలు.

కందుకూరివారూ, గురజాడవారూ, వ్రాసిపెట్టిన కవుల
చిట్టాల్నిబట్టి, భాషాభిమానులందఱికీ, ప్రాచీనకవులంటే,ఎంత
గౌరవమయినా కలుగుతుంది. ఇంకా, భారత భాగవత
రామాయణాద్యుద్గ్రంథాల సారాన్ని గ్రోలగలిగేవారికి నిశ్చ
యంగా ఎంతటి బ్రహ్మానందమయినా కలుగుతుంది. కారణం
ఏమంటే, గురుభక్తికలిగి, వివిధశాస్త్రాల్ని, అలంకా
రాల్ని, ఇంకా అనేకవిధాలైన లక్షణాల్ని తెలుసుకోడానికి
వారుపడే కష్టం, దైవానుగ్రహం సంపాదించుకునేకొఱకు
వారుచేసే తపస్సూ, విధివిహితంగానూ, సహజంగానూ,
మనోహరంగానూ వారుచేసే ప్రసంగాలూ, మొదలైనవన్నీ
పాఠకలోకానికి అలాటి భక్తిభావాల్ని కలిగిస్తాయి.

వేదజ్ఞులు ఉన్నారు. శాస్త్రజ్ఞులు ఉన్నారు. తార్కి
కులు ఉన్నారు. లక్షణజ్ఞులు ఉన్నారు. పౌరాణికులుఉన్నారు.
కవులు ఉన్నారు. గాయకులు ఉన్నారు వేనవేలు. ఆలాటి
వారందఱూ తమతమ అభిమానవిద్యల్లోనూ, కళల్లోనూ,

మిక్కిలి స్వాతంత్ర్యాన్ని కలిగేఉంటారు. అయితే, 'అనంత పారం కిలశబ్దశాస్త్రమ్' అనేధర్మాన్నిబట్టి, ఎవర్నీకూడాభాషా సమగ్రులనికాని కళాపారీణులనికానిచెప్పడానికి వీలుంటుందా! మఱి చెప్పుకోవలసిందేమి ఉంటుందని అంటారేమో! ఎవ రెవరు శాస్త్రలోకానుభవాలనుకలిగి సమయానుగుణ్యంగానూ సరసంగానూ, సకలజనానందదాయకంగానూ కావ్యసంతానాన్ని కలిగింపజాలిఉంటారో, వారివారి ప్రతిభావిశేషాల్ని ఆ జన్మం చెప్పుకుంటూ ఆనందిస్తూ ఉంటాం. ప్రాచీనకవిగాయకులందఱూ అరూపంగా ఆచంద్రార్కం వెలుగుతూ ఉంటారు మన భావప్రపంచంలో.

తిరుపతి వేంకటేశ్వరకవులు కావాల్సిన వివిధశాస్త్రాల్ని గురుముఖంగా గ్రహించినవారు. కష్టించి వాని వాని సారాంశాల్ని జీర్ణించుకున్నవారు. శారదాసాక్షాత్కారాన్ని ముఖ్యంగా బడసినవారు. లోకజ్ఞులుకూడాను. మనస్సులతోపాటు తమ సరళవాక్కును ఎంతచిత్రంగానో పరుగులెత్తించేవారు. కాబట్టే దేశ దేశాల్లోనూ, వారి కావ్యాలు చదవడంచేత, వారి ప్రసంగాలు వినడంచేత, ఎంద ఱోకవులూ, ఎందఱో అవధానులూ బయలుదేరి ఈనాటికి మహా పండితులని అనిపించుకుంటూ ఉన్నారు.

తిరుపతి వేంకటేశ్వర కవులువ్రాసిన ఉద్గ్రంథాలెన్నో ఉన్నాయి. చేసిన చర్చలుకూడా ఉన్నాయి కావ్యరూపాల్లో. అట్టే ఆషామాషీల్లోపోయే చిట్టిపొట్టి అంశాలన్నీ వీరి అనుప



శ్రీ లక్కరాజు విజయగోపాలరావుగారు (సుమతి) స్త్రీ
అనసూయ నాటకము



పఠాన్ ఆషాబీ
(పఠాన్) సింగరాజు నాగభూషణరావుగారు (ఆషాబి) పి. నారాయణగారు



శ్రీ సద్దమన్నాటి కటుంబరావుగారు



శ్రీ వీరబ్రహ్మాచార్యులుగారు

మాస ప్రతిభావిశేషంవల్ల మహోత్తమకావ్యాలుగా మారి పోయాయంటే, ఇంకేం కావాల్సిఉంటుందో చెప్పండి వీరి కవితాసామ్రాజ్య సార్వభౌమత్వాన్ని సమర్థించడానికి ? అప్ర యత్నంగా, వారిపద్యాల్లో అలంకరింపబడిఉండే ఆ రసో చిత స్వతంత్రబహుళపదప్రయోగాలకంటే, ఇంకేం కావాల్సి ఉంటాయో చెప్పండి భాషాకోశాన్ని పెంపుచేయడానికి ? భరతావని వీరపురుషుల గాథలను చవివి, తద్రూపాల్ని దర్శింప తలచుకునేవారికి, ఇంకేవి కావాల్సిఉంటాయో చెప్పండి బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల నాటకాలు కాక పోతేను ?

భారతంఅంటే మహాసముద్రంవంటిది. కేవల నాట కాది లక్షణపరంగానూ, రసపరంగానూ, చూచి ఆనందించ డానికి భట్టనారాయణుని 'వేణీసంహారం' లేకపోలేదు. అయితే అది భారతరహస్యాల్నన్నిటినీ అట్టే తేలిగ్గా బోధపడచలేదు. అట్టి ప్రయత్నంతో ఇంకో భారతనాటకాన్ని తిరుపతి వేంక టేశ్వరకవులు ఎందుకు సృష్టించాలి? కాబట్టే కాలానికి తగి నట్లుగా రూపకాభివృద్ధిని కోరుతూ, మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రిగారివలె, ఒక్కింత సందుచేసుకొని గాథాప్రధానంగానే వ్రాశారంటాను నేను ఆనాటకాల్నన్నిం టినీని. అయితే, మహాకవులుగనుక, విద్వాంసులుగనుక, ఆ సముద్రంవంటి భారతసారాన్ని సునాయాసంగా సంగ్రహించ కలిగారు. వీరి భారతనాటకాల్లో కనిపించే శాస్త్రసిద్ధమైన

ఆపాత్రతత్త్వాలూ, ప్రసంగాలూ, పద్యాలూ, మొదలైనవన్నీ ఋజువుచేస్తూ ఉంటాయి ఆ విషయాన్ని. అంతేకాదు. కొన్ని సందర్భాల్లో భారతంకంటేకూడా సుకుమారభావాల్నీ, కవితా విశేషాల్నీ ప్రదర్శించారు మన తిరుపతి కవీశ్వరులు అనడానికి ఎంతమాత్రమూ సందేహం లేదు. ఆ భారతనాటకాలన్నిటిలో ఉద్యోగవిజయాలనేవి రెండూ ప్రస్తుతం బాగా ప్రచారంలో ఉన్నాయి. శేషించినవికూడా అప్పుడప్పుడు ఆడడమనేది తటస్థపడితే కవీశ్వరుల సంకల్పం సమగ్రంగా నెఱవేరినట్లు అవుతుందని నాట్యలోకాన్ని సవినయంగా హెచ్చరిస్తాను.

## వడ్డాదివారి కావ్యాలు.

సంస్కృతంలో ఉండే నాటకాల్ని తెలుగులో చదవవచ్చేటప్పటికి కొంతభేదం పొడగట్టక మానదు. తమకుతోచిన భావాన్ని తమ సహజభాషాసాంప్రదాయాల్లో మూర్తీభవింపచేయడంవల్ల కావ్యస్వరూపం ఏర్పడుతూ ఉంది. అలాటి కావ్యాన్ని మఱొకభాషలో, ఇంకోకవి ప్రతిబింబింపచేసేటప్పుడు అలా పరివర్తింపబడిన గ్రంథం, అసలు 'కావ్యం' అనిపించుకుంటుందాఅని ఒకసందేహం. ఆ సందేహాన్ని అలాఉంచితే, సంస్కృతభాషాపోషణం సర్వవిధాలా అణగారిపోయిన ఈదినాల్లో, సంస్కృతంలోఉండే నాటకాలనబడే మహాకావ్యాల్ని ఏమాత్రమైనా తెలుగుభాష మాత్రమే నేర్చినవారం దఱూ పరిచయం చేసుకోడానికి మార్గ మేర్పడక పోదని ఆదరించాల్సి ఉంటుంది. ఇంకా సంస్కృత నాటకలక్షణాల్ని ఆన్నిలక్షణాలతోపాటు, అనుసరించాల్సిఉండే తెలుగునాటకాలకు సాధనంగా ఉంటుందనికూడా గౌరవించాల్సి ఉంటుంది ఆ ప్రయత్నాన్ని. కాబట్టే కీ॥ శే॥ రాయబహద్దూరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రుల్లువారు, బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు, మ॥ రా॥ రా॥ చిలకమర్తి లక్ష్మీనరశింహ కవిగారు మ॥ రా॥ రా॥ మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరు జమీందారు వారు, మ॥ రా॥ రా॥ వడ్డాది సుబ్బరాయ కవిగారు మొదలైన విద్వత్కవీంద్రులు, ఎన్నికలో ఉండే సంస్కృత నాటకాల్ని ఎన్నిటినో తెలిగించి ఆంధ్రసారస్వతానికి మహోపకారం చేశారు.

శ్రీయుత వడ్డాది సుబ్బరాయ కవిగారు అసాధారణ మేధాసంపన్నులు. పరమభక్తులు. ఉభయ భాషల్లోనూ పెద్ద ప్రవేశంకలవారు. భక్త్యావేశంతో వీరుపాడిన 'భక్త చింతామణి' ఎంతపూజ్యతనైనా సంపాదించింది కవితాప్రపంచంలో. ఎన్నో కావ్యాలు ప్రకటింపబడ్డాయి వీరిచేతకూడాను. నాటకాలుకూడా కొన్నిఉన్నాయి. ఆ అన్నిటిలో, వీరు తెలిగించిన "వేణీసంహార" నాటకానికి ఆదినుండి ఇప్పటివఱకూ ఉండే ప్రచారం, మర్యాద, నిరుపమానమైంది. అయితే తెలుగు "వేణీసంహారానికి" కూడా ఇంత గౌరవం

ఉన్నదంటే, కేవలం భట్టనారాయణుని ప్రతిభమాత్రం కారణమై ఉంటుందిఅని అనడానికి వీలులేదు. ఆంధ్రీకృత సంస్కృతనాటకాల్లో ఇంతగా సంస్కృతకవి భావాల్ని పోషించుకుంటూ ప్రకటింపబడినవి ముఖ్యంగా మన తిరుపతికవులవీ, ఆపైని మఱొకయిద్దఱు ముగ్గురువీ కలిసి రెండుమూడుకంటే ఎక్కువ ఉండవేమో అనుకుంటాను. శ్రీయుత సుబ్బరాయకవిగారు కేవలం కవులేకాక నటులుకూడా అయిఉండడంచేత వీరి నాటకానికి ఇంత ఆధిక్యత జతపడి ఉండవచ్చునని నానమ్మకం. నాటకోచితవస్తునాయకరసాదివివిధలక్షణసాంప్రదాయాల్ని సమయోచితంగా అనుసరిస్తూ, ఎవరంతటవారే నాయకులుగా ఉండతగిన ఆ భ్రాంతవీరుల్లో సహజోత్సాహ సంపన్నుడైన భీమునకు నాయకత్వాన్నీ దుర్యోధనునకు ప్రతినాయకత్వాన్నీ స్థిరపఱుస్తూ, భానుమతీదేవి ఏకసక్కెములచేత శోకరోషాల్ని వెలిగ్రక్కుతూ, తత్తదుచితంగాపలికే నాయికాలాపాల్ని బీజభూతంగా చేసుకున్నవీరరసోచితవస్తూపక్రమానుగుణ్యంగా ఆరంభిస్తూ, చివరకు వేణీసంహారమూలంగా నిర్వహింపబడిన మహానాటకమనబడే ఆ సంస్కృతవేణీసంహారనాటకసౌందర్యాన్ని యథావిధిగా తెలుగులో ప్రసన్నపఱచగలిగిన మన సుబ్బరాయకవిగారికి నాట్యలోకం అంతా కృతజ్ఞతను చాటగలదని నమ్ముతాను. మన నాటక సమాజాలు ప్రస్తుత పార్సీపాటల పద్ధతినాటకాల్నే కాకుండా ఇలాటి మహానాటకాల్ని ముఖ్యంగా ఆడుతూ ఆ కృతజ్ఞతను చాటుకుంటే ఎంతైనా సమంజసంగా ఉంటుందని



కూడా నమ్ముతాను.

### చిలకమర్తివారికావ్యాలు.

మ॥ రా॥ రా ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఆంధ్రకవితాప్రపంచంలో మిక్కిలి ప్రసిద్ధి కన్నవారిలో ఒకరు. ఎన్నెన్ని కావ్యాలోవ్రాశారు. కొన్ని సంస్కృత నాటకాలను కూడా తెలిగించారు.గద్యాల్లో వీరుచూపించేరచనాసారళ్యం,వర్ణనవైదగ్ధ్యంఎట్టివారినైనా ఆనందసాగరంలో ముంచేస్తాయి.సనల్ని వ్రాయడానికి వీర్ని చెప్పి ఇంకోర్ని చెప్పాల్సిఉంటుంది.నవ్యకవితా సామ్రాజ్యంలో వీరికి సంక్రమించిన మహోన్నతస్థితి మహామహా పండితులకూ,కవులకూకూడా, ఎంతోదుస్సహంగా ఉండేదంటే వీరూ, వీరికావ్యాలూ, ఎంతపరపతిని కలిగిఉండేవో చెప్పనవసరంలేదనుకుంటాను.

వీరువ్రాసిన దృశ్యకావ్యాల్లో ప్రసన్నయాదవం. పారిజాతాపహరణం ఒకప్పుడు బాగా ప్రచారంలో ఉండేవి. గయోపాఖ్యానం అనేది అన్నిటికంటే ఎక్కువ పలుకుబడిని సంపాదించి ఇప్పటికీ ఒక్కటే విధంగా ఆంధ్రనాటక రంగాలన్నిటినీ ఏలుతూఉంది. ఇదే ఒకప్పుడు రాజమహేంద్రవరంలోని పండితు లనేకులయొక్క గాఢవిమర్శనానికి పాత్రమైంది. పరస్పర జయాకాంక్షలతోగూడిన నాటివిమర్శనాలు మన కెందుకులెండి.

గయోపాఖ్యానం ఏవిధంగానూ లోగడ మనం చెప్పకున్న లక్షణాల్నిపట్టి నాటకంగా నిలవడానికి అవకాశంలేదు.

గాథాప్రధానమైందనే చెప్పాల్సి ఉంటుంది. అయితే నాందీ ప్రస్తావనాలూ, వానిధర్మాలూ, బెత్తెడుఎడంగాఉంటూనే ఉంటాయి ప్రాచీనాచారాల్ని తప్పకుండాను. ఇంకా పిచ్చి పిచ్చి రంగాలు ఏమాత్రం ఉండవు. అర్థానికి అనుకూలంగానూ, లక్షణ సాంప్రదాయాలకు సన్నిహితంగానూ, అయిదాఋంకాల్లో అనుసంధింపబడి ఉంటుంది ఆకథ అంతాను. ఏ సంధులు ఎలాఉన్నా నిర్వహణసంధిలో కొంచెం అద్భుతరసం తొలకరిస్తూ ఉంటుంది. ఇందులోఉండే సంవిధాన విధానం ఇంతే.

గయుని నిష్ఠీవనకారణంగా కలిగిన ఆ కృష్ణునికోపం అంత ప్రళయంగా పరిణమించడం స్వభావసిద్ధంగా ఉంటుందా అని అనిపిస్తుంది. అందులో అసలుమనిషి సమక్షంలో లేనప్పుడు కృష్ణుడంతవాడు అంత ఘోరప్రతిజ్ఞను పడుతూ చక్రచంక్రమణాలు చేయడం భావ్యమేనా అని అనిపిస్తుంది. అందులో నరుడైన అర్జునునికి ఉండేపాటి శరణాగతత్రాణాసక్తిమాత్రమయినా కేవలం నారాయణుడైన శ్రీకృష్ణ భగవానునకు ఉండకపోతుందాఅని అనిపిస్తుంది. ఇదంతా ఇలా ఉండగా సృష్టిస్థితి లయాలన్నిటికీ కారణంగాఉండే ఆ మహానుభావుడు సందేహాస్పదుడయిన ఎవడో యొక కేవల లౌకికుని వలె ‘ ఉ॥ ఈవిధిసద్దురాత్ము వధియింపక పోవుదునేని దేవకీదేవికి బుణ్యమూర్తి వసుదేవునకున్ దనయుండగానికిన్’ ॥ మొదలైన ఘోరప్రమాణాల్ని చెయ్యడం భావ్యమేనా అని అని



పిస్తుంది. ఇలాటి సందేహాలెన్నో ఉంటాయిలెండి. వానికేం, వదిలేద్దాం.

ఏది ఎట్లాఉన్నా వీరికావ్యాల్లోని ప్రసంగాలూ, పద్యాలూ అందఱికీ అర్థమయ్యేటట్టు ఉంటాయి. నిరర్థక సమాసాదిసాంకర్యాలు లేకుండా ఉంటాయి. ఇంకా సరళంగానూ, మనోహరంగానూ ఉంటాయి. గయోపాఖ్యానంలో ఆ పంచమాంకమందలి కృష్ణార్జునుల సంవాద సందర్భాలకు చెందిన పద్యగద్యాలన్నీ ఆనక ఏ ఔచిత్యాల్ని ఎలా విడిచిపెట్టినా శ్రోతల హృదయాల్ని మాత్రం గట్టిగా పట్టుకుంటాయి. ఈ అంకానికి ఆశపడే దీన్ని దేశమంతా ఆదరిస్తూ ఉంటుందని నా నమ్మకం.

## ధర్మవరంవారికావ్యాలు.

‘ఇప్పటికీ అమోఘంగా నాటక రాజ్యాన్ని పాలిస్తూ ఉన్నవి ధర్మవరంవారి కావ్యాలే. పద్యాలూ, గద్యాలూ, గేయాలూ, అంకాలూ, రంగాలూ మొదలైనవన్నీ వీరికావ్యాల్లో లెక్కలేకుండా కనిపిస్తూ ఉంటాయి. నాందీప్రస్తావనాలు తప్ప కడమవన్నీ యథేచ్ఛగా అలంకరింపబడి ఉంటాయి. ఇలాటి విలక్షణాలతో బయలువెడలిన వీరి మొదటి కావ్యమైన ‘చిత్రనళీయం’ నాటక పితామహత్వాన్ని నిస్సంశయంగా సంపాదించి పెట్టింది. ఇక ప్రచారం విషయంలో తత్కవిగారి సరసవినోదినీసభ చాలాసాయంచేసింది ఆజిల్లాల్లో

అంతాను. ఇక ఇటు తెలుగుజిల్లాల్లో గుంటూరు షష్టుకంపెనీ దీనికిచాలాప్రచారాన్ని కల్పించింది. ఆకారణంగానే ధర్మవరం వారి కావ్యాలన్నీ గుంటూరువారికి సాధికారంగా ఆమకో డానికి కవిగారిచేత అనుగ్రహింపబడ్డట్టుకూడా తెలుస్తుంది.

చిత్రనళీయంకథ భారతారణ్యపర్వంలో చెప్పబడిఉంది. ఇంకా శృంగారనైషధంఅనే పేరుతో శ్రీనాథునిచేత తెలిగింపబడిందికూడా ఒకటిఉంది విశేషంగాను. ఈ రెండింటిసాహాయ్యంతో పద్యగద్యగేయాలమూలంగానూ, చిత్రవిచిత్రాలైన జాబుల్లోనూ, సాలులిక్వీలలోనూ, మనకృష్ణమాచార్యులవారు యథాకథానుక్రమంగా రంగానికి ఎక్కిస్తూ 'చిత్రనళీయ'మని పేరుపెట్టారు. ఇది అన్నివిధాలా స్వతంత్రంగా బయలువెడలడంచేత దీన్ని ఏలక్షణాల్ని పట్టి పరామర్శిద్దాం! దానికదేలక్షణము అనికూడా అనుకుందాం. ఆధునికనాటకలోకం ఇదివఱకే అనుకుంది ఆమాట. కాదంటారా! ఇప్పుడు వచ్చే ఏనాటకంలో ఆపోకడలు లేకుండాఉన్నాయో చెప్పండిమఱి. దీన్నొక బళ్లారివారి 'పద్ధతినాటకం'అనక తప్పుతుందామఱి!

వీరికావ్యాలు చూడగా చూడగా ముంగుమాటల్లోనూ, ఆపైని పద్యాల్లోనూ, ఆపిమ్మట పాటల్లోనూ దఫాలు వారీగా మూడేసిపర్యాయాలు వ్రాయబడినవిగా కనిపిస్తాయి. అలా కాకపోతే ప్రసంగాల్లో ఉండే అర్థాలే పద్యాల్లోనూ పద్యాల్లో అర్థాలే పాటల్లోనూ పాడిందే పాడినట్లు పరిఢవిల్లుతూ ఉంటాయి చదవండి కొంచెందయచేసి. ఇక కల్పనాది విషయాల్లో, ఏదో ఒకఉత్తరం, రెండుమూడు సాలోలిక్వీలూ రెండుమూడు ద్విపదలూ, రెండుమూడు రగడ్లూ, తర్కవితర్కాలూ ఒకటేపద్ధతిని కనిపిస్తూఉంటాయి విధాయకంగాను. అందులోనే ఉంది ఆ నవ్యనాటక కుంభకోణం అంతాను! అయితే రసవిషగంధకాలు కలియని పరిశుద్ధమైన బైరాగీ చటకాలవలె వీరి నాటకాలు అట్టేతమాషాగా ఉంటూ ఉంటాయి ఆ ఆడేవారికీ చూచేవారికీని.



ధర్మవరంవారి విషాదసారంగధర ఒకటి మన గుంటూరు హిందూ థియేటరువారిపుణ్యానే వ్యాప్తిలోకి వచ్చింది ఎక్కువగాను. దీన్ని కొంచెం లక్షణయుక్తంగా వ్రాద్దామని కాబోలు 'శ్లో॥ పూర్వరంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే ప్రవిశ్య తద్వదపరః॥' అనేదాన్ని అనుసరిస్తూ నాందీప్రస్తావనాలకు ముందుగా హిరణ్య విభావసులనే బ్రాహ్మణులతోగూడినరంగాన్ని ఒకదాన్ని తగిలించారు మన పితామహులు. ఈ లక్షణాన్ని మాత్రం ఏంఅనుకున్నారోగాని ఎవరూ అనుసరించలేదు ఇంతవఱకూను. వీరి కావ్యాల్లో ప్రసంగాలు చాలావఱకు సహజరూపంలో ఉంటాయి. సమయోచితంగాకూడా ఉంటాయి. యుద్ధాత్యాది వీధ్యంగాల్ని బోలిన ప్రసంగ లక్షణాలు ఈ సారంగధరలో చాలావఱకు దృశ్యమాతాయి. ఆపేస్తాను ఇంక అధికంగా పోకుండాను.

శ్రీయుత ధర్మవరం గోపాలాచార్యులు అనేవారు కీ॥ శే॥ కృష్ణమాచార్యులవారి సోదరులు. సరసవినోదినీసభ

అమలులో ఉన్నప్పుడు వీరందులో కొన్నిపాత్రలను ధరిస్తూ ఉండేవారు. హైదరాబాదుదేశంలో కొంతకాలం న్యాయవాదులుగా ఉండేవారు. యవనాంధ్రభాషలలోనూ, కొంతవఱకాంగ్లేయభాషలోనూ ప్రవేశాన్ని కలిగించుకున్నారు. రాంగికానుభవంకూడా చాలవఱకు కలిగింది వీరికి. ఇన్ని విధాలైన పరిజ్ఞానాలు వీరిలో ప్రకాశిస్తూఉండేకారణంగా కలిగిన నాటకనిర్మాణస్వరూపం వీరిచే ప్రకటింపబడిన రామదాసు నాటకంలో కనిపిస్తూఉంటుంది.

ప్రస్తుతం ప్రచారంలో ఉండేనాటకం ఏదయ్యాఅంటే ఈ రామదాసు నాటకాన్నే చెప్పాల్సి ఉంటుంది. ఇందలి గాధ చరిత్రప్రసిద్ధమైన మన భద్రాచల దేశానికి చెందింది. గోపన్నగారి రామభక్తి పరాయణత్వం ఆబాలగోపాలం ఆంధ్రలోకమంతా కీర్తనలరూపంలో అనుభవిస్తూనేఉంది ఇప్పటిదాకాను. ఎందఱు కవులు వ్రాసినా, ఎన్నిసమాజాలు ఆడినా ఏ భారత రామాయణాలకోచెందిన ప్రాచీనగాధలనోగాక, ఇట్టి ఆధునిక వృత్తాల్ని నాటకరూపంలో వ్రాయడంగాని మనసమాజాలు అట్టివాన్ని ఆడడంగాని లేకపోయింది. తినగా తినగా గారెలైనా చేదెక్కుతాయి అంటారు. ఎన్నిపర్యాయాలు చూస్తారు అలాటి ప్రాత వృత్తాల్ని.

మనగోపాలాచార్యులుగారు కంచెర్ల గోపన్నగారి పరమభక్తిస్వరూపాన్ని ఇలా దృశ్యకావ్యంగా చేయతలపెట్టడం



లోనే ఉన్నదంటాను ఎంత విశేషమైనాను. జనులకా బాగా తెలిసినకథ అయిపోయింది. గోపన్నగారా ఆంధ్రలోకానికంతా చిరపరిచితుడైన భక్తాగ్రగణ్యుడైపోయినాడు. పైగా దీన్ని ప్రప్రథమంలో రంగానికి ఎక్కించినవారా సుప్రసిద్ధనటులైన మ॥ రా॥ రా॥ తాడిపర్తి రాఘవాచార్యులుగారు ఎడవల్లి సూర్యనారాయణగారు అయిపోయారు. ఇంకా సుప్రసిద్ధులగు మ॥ రా॥ రా॥ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారితో అలంకరింబడిన అల్లూరుకంపెనీవారు కూడా దీనికిఎంతో మర్యాదను సంపాదిస్తూవచ్చారు. ఇన్ని సహాయసంపత్తులు పడసిన ఈ రామదాసునాటకం కాకపోతే ఇంకో నాటకం ఎలా ఇంతరాజ్యం ఏలగలదో చెప్పండి!

రామదాసు నాటకంకూడా గాధాప్రధానమైందే. అయితే ఆ గాధకు కబీరుసంపర్కం మూలంగానూ, మఱికొన్ని చిట్టిపొట్టి చిల్లరతమాషారంగాల్ని అతికించడం మూలంగానూ కొంతరక్తిని కలిగించారు నిస్సంశయంగాను. శ్రీయుత గోపాలాచార్యులుగారియందుఉండే యవనభాషాస్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని వ్రాయబడిన ఆ మాటలూ, పాటలూ కూడా ఈనాటకం ఆడబడుతూ ఉన్నప్పుడు కొన్నిఅందాల్ని అగపఱుస్తూఉంటాయి. ఈ మొదలైన కల్పనలు నాటకవస్తువిషయికంగా వీరిచే చేయబడిన పోషణంగా ప్రతిబుద్ధిమంతునకూ కనిపిస్తుంది.

ఈ గాధకు రామసాక్షాత్కారం అనేది ముఖ్యఫలంగా

పరిగణింపబడ తగింది. అది మ్లేచ్ఛరాజన్య చూడామణియగు ఒక్క తానీషాకు మాత్రమే కలిగింది. రామదాసు అలాకల గడానికి ఈ గాథలో కారణమాత్రుడుగా కనపడతాడు. కబీరు దానికి ఇంకా సహాయుడుగా ఉంటాడు. ఈ సందర్భాల్ని పట్టి కవిగారు నాయకపరంగా చేసిన నాటకనామకరణానికి విరుద్ధంగా కనిపించినా తానీషాయే నాయకుడుగా చెప్పతగి ఉంటాడు.

నాటకం అనబడేదానికి శృంగారవీరాలైన రెండురసాలే ప్రధానంగా ఉండవలసి ఉంటుంది. ఆ నియమాన్నే పట్టుకుని వ్రేలాడుతూ ఉంటే నాటకోత్పత్తికి అవాంతరంగా ఉండవచ్చు ననే ఇప్పటి పెద్దల అభిప్రాయాలు కూడా పాటింపదగి ఉంటాయి. గోపాలాచార్యులుగారు ఇందులో భక్తిరసాన్ని ప్రధానంగా పోషించకలిగారంటే మనం నిజంగా సంతోషించాల్సే ఉంటుంది. ఇక మిగిలిన లక్షణాలికి ఏం లెండి! సమయవిరుద్ధాలాపాల్నీ, రంగాల్నీ కొన్నింటిని వదిలిపెడితే పాత్రౌచిత్యాలు కూడా కొంచెం సరసంగానే కనిపిస్తూ ఉంటాయి.

ఇక కవిత్వవిషయం. కలగలపు ప్రసంగాలు జాతీయంగా ఉంటాయి చాలావరకు. రామదాసుగారి బంధిఖానాలోని ఆర్తాలాపాలు ముఖ్యంగా శ్రవణానందాన్ని కలిగిస్తాయి. పద్యాల్ని చాలా మితంగానే వాడారు. అవి అంత కవితాప్రాగల్భ్యాల్ని ప్రధానంగా చూపించేవి కావు. మొత్తానికి ఈ నాటకం చదివేటప్పటికంటే ఆడేటప్పుడు చాలా అందంగా ఉండి ఆనందాన్ని ఇస్తుందంటాను నేను.



ఇంకోరు ఉన్నారండోయి ఈ బళ్లారికి చెందినవారు! వారే పండిత. కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనబడతారు. వీరు కవులే కాక వైయాకరణులట కూడాను! కృష్ణలీల లవకుశ, మొదలైన నాటకాల్ని చాలా వ్రాశారు వీరు. ఏమిటో అన్నీ పద్యాలూ, గద్యాలూ, గేయాలూ, ఉంటూ ఉంటాయి ఎన్నైనాను. ఈ నాటకాల్ని గురించి ఏం చెప్పాలో ఇప్పటికి నాకు ఇంకేమీ తట్టలేదు. వదిలేస్తాను ఆ కారణంగాను.

## కోలాచలంవారి కావ్యాలు.

పిచ్చి పిచ్చి పచ్చి శృంగారనాటకాలూ, పౌరాణిక నాటకాలూ వ్రాసేవారికీ చూచేవారికీ విసుగు పుట్టింపగా పుట్టింపగా •చారిత్రికనాటకాలు మొదలైనవాన్ని విరివిగా ప్రకటించే సంకల్పం చాలామంది పండితులకూ, రసజ్ఞులకూ ఉదయింపసాగింది. ఆ కారణం చేతనే మ॥ రా॥ రా॥ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శాస్త్రిగారు భోగరాజు నారాయణమూర్తిగారు మొదలైన కొందఱు తదభివృద్ధినిగోరి కొన్ని నాటకాల్ని ప్రకటించారు. కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారు ప్రహసనరూపంలో ఉండే కన్యాశుల్కం అనే దాన్ని వెలయించి ఇంకొక విధమైన రుచిని కలిగించారు. ఇటులే మ॥ రా॥ రా॥ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు కంఠాభరణం మొదలైనవానిని రచియించారు. కీ॥ శే॥ కోలా

చలం శ్రీనివాసరావుగారు కూడా ఆదారినే అనేక రకాలైన కావ్యాల్ని వ్రాశారు. ఆ అన్నిటిలో సునందనీపరిణయం అనేది కొంతకాలం గుంటూరు హిందూథియేటరువారిచేతనూ బందరు నేషనల్ థియేటరువారిచేతనూ ఆడబడుతూఉండేది. ప్రస్తుతం వీరిచే వ్రాయబడిన రామరాజు చరిత్ర అనబడే నాటకం ఒకటే చాలా ప్రచారాన్ని కలిగిఉంటూఉంది. ఇటీవల దీన్ని ప్రభుత్వంవారు ఆంక్ష పెట్టడంచేత చూడ్డానికి అవకాశం లేకుండాపోయింది రంగాలమీద.

రామరాజు నాటకానికి చెందిన గాథాసంబంధిసత్యాలు ఇటీవల చాలా చర్చలకు లోనైనాయి. అయితే పీఠికలో కవిగారు తాళికోట యుద్ధమునందు రామరాజు శిరము తురకచే నఱకబడిన విషయము మాత్రమే ఈ నాటక రూపమున ముఖ్యముగ తెలుపనెంచితినని వ్రాసియున్నారు. మన కిక మిగిలినది తదితరాంశమే అవడంచేత ఆదారినే కొంత పరామర్శిద్దాం దీని ఔచిత్యాన్నిగుఱించి.

వస్తువు ననుసరించి నాయకుడు, రసము, అను నీ రెండును విచారణార్హములుకావు. ఇంకేం చెప్పమంటారు! అంకాలూ, రంగాలూ ఉంటాయి. ప్రసంగాలూ ఉంటాయి. పద్యాలూ ఉంటాయి. అయితే ఆ పద్య గద్య గేయాల భావాలన్నీ ఆంధ్రత్వాన్ని పురస్కరించుకొని ఉంటాయాఅని అంటారేమో! అలాకాదు, అవికూడా వస్తు నాయక రసాల్ని



అనుసరిస్తూనే ఉంటాయి. ఇంకా మనకు తెల్లియని ఆంగ్లేయనాటకసాంప్రదాయాల్నికూడా అందిపుచ్చుకుంటూ ఉంటాయని అనుకోవాల్సి ఉంటుంది.

పద్యాల్లో గణయతిప్రాసములు కనిపిస్తూ ఉంటాయి తప్పకుండాను. ఇంకా పాడలేనివారు గద్యాలుగా చేసుకోడానికి వీలుగాఉండే గమనాన్ని కలిగిఉంటాయి ఆ పద్యాలన్నిని. ఇది ఈ రామరాజు విశేషం.

## పానుగంటివారికావ్యాలు.

మధ్వశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారంటే పత్రికాపాఠకలోకానికి పరబ్రహ్మస్వరూపంగా కనిపిస్తారు. పండితసంఘానికి పరామర్శింప తగినవారుగా అగపడతారు. భావకవికోటికి సింహాసదృశంగా పరిఢవిస్తారు. వీరికి ఉభయ భాషల్లోనూ చక్కని ప్రవేశం ఉంది. ఆంగ్లేయభాషను కూడా అభ్యసించారు. వివిధశాస్త్రాల్నీ చరిత్రల్నీ అనుభవించారు. ఇప్పటి భాషాప్రపంచంలో వీరివలె ఉన్నత స్థానాన్ని ఆక్రమించినవారు చాలా కొద్దిగాఉంటారు. వీరివలె స్వతంత్రంగానూ, సాహసంగానూ, చమత్కారంగానూ సందర్భోచితంగానూ వ్రాయగలవారూ, మాట్లాడగలవారూ కూడా కొద్దిగా ఉంటారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తిరుపతికవులు

భారతకథనంతా వ్రాసినట్లే రామాయణ కథనంతా నాలుగు నాటకాలుగా వ్రాశారు. కంఠాభరణం, వృద్ధవివాహం హాస్యవల్లరి, అనబడే మూడు ప్రహసనాల్ని ప్రకటించారు. మహోపన్యాసపూర్వకంగా పెక్కు విషయాల్ని బోధించే సాక్షిగ్రంథాల్ని ప్రసాదించారు. ఇంకా నర్మదాపురుకుత్సీయం, కోకిల, సరస్వతి, సారంగధర, వైజయంతీవిలాసం ప్రచండచాణక్యం, పూర్ణిమ మొదలైన నాటకాల్నెన్నిటినో వ్రాశారు. ఇలాగే ఇంకాఎన్నోఉన్నాయి చక్కని కావ్యాలు. ఈఅన్నిటికంటే 'రాధాకృష్ణ'అనబడే నాటకాన్ని ప్రత్యేకంగా చెప్పాల్సిఉంటుంది. అదే ఇప్పుడు అనంతమైన ప్రచారాన్ని కలిగి ఉంటూఉంది.

రాధాకృష్ణనాటకప్రస్తావనాన్నిపట్టీ, పాత్రలపట్టికనుపట్టీ ఈ నాటకానికి రాధాకృష్ణులను నాయికానాయకులుగా కవిగారు ఉంచినట్లు బోధపడుతుంది. ఇంకా భక్తిరసం ప్రధానంగానూ, శృంగారరసం అప్రధానంగానూ మేళగిస్తూ ఉండేటట్లు ఊహించారనికూడా బోధపడుతుంది. అసలీరచనను, రాధకు శ్రీకృష్ణునియందుఉండే నిష్కళంకభక్తి స్వభావాన్ని ప్రదర్శించడమే ముఖ్యఆశయమై ఉన్నట్లుదృఢపడుతుంది. ఇలాటి ఉద్దేశాలూ,ప్రయత్నాలూ నిజంగా ఎంతగౌరవానికైనా పాత్రములైఉంటాయి. అయితే అవి ఎంతవఱకు 'నాటకము'అనబడే ఈ రాధాకృష్ణలో ఫలించినవో కొంచెం విచారిద్దాం.

రాధాకృష్ణులు పురాణప్రసిద్ధులే సందేహములేదు.



పాత్రబాహుళ్యాన్నిపట్టి అలాటి నాయకత్వాలు సంక్రమిస్తాయా, ఇంకేమైనా విశేషాంశాలు తద్ధర్మాన్ని కలిగిస్తాయా అని మొదటి సందేహం. బుద్ధిపోయినంతవఱకు మొదటికారణంగా నాయికానాయకులు ఏర్పడ్డానికి అవకాశంలేదని గట్టిగాచెబుతాను. ఇక రెండోవిధంగా ఆలోచిస్తే ఈనాటక రాధాకృష్ణులయందు ఏవిధమైన విశేషాంశాలూ కనబడవంటాను. ఇంకాఏమంటానంటే దృఢానురాగమాధ్యం చేత తన నాథుడగు శ్రీకృష్ణుని కేవల శృంగారసుందర పురుషునిగా భావించే సత్యభామయొక్క భావస్వరూపం ఈనాటక ద్వితీయాంకమున మొలకెత్తి తృతీయాంకమునుండి రాధాభక్తిస్వభావసందర్శనకారణంగా చిగిరిస్తూ ఆపైని క్రమక్రమంగా భక్తియోగోన్ముఖంగా పుష్పిస్తూ చివరకు నారదోపదేశపూర్వకంగా భక్తిఫలభాజనమైనట్లు కథాఫలితార్థము ఏర్పడుతూఉంది. ఆ రూపంగా ఏర్పడే కావ్యఫలం సత్యాదేవికే సంక్రమిస్తూఉంది. ఈ కారణాల్నిపట్టి కవిగారు ఉద్దేశించినదానికి భిన్నంగా సత్యభామ నాయిక అనబడాల్సివస్తూఉంది. రాధమాత్రం నాయిక అనడానికి వీలులేకుండాఉంది. విశేషించి ఈ నాటకాన్ని సత్యాగర్వభంగం అంటే బాగుంటుందేమో అని తోస్తుంది.

నాటకంలో భక్తిరసాన్ని ప్రధానంగా నిరూపించాలని సంకల్పించారు మన లక్ష్మీనరసింహారావుగారు. అలా ఆలోచించినా ప్రథమాంకంలోనే కృష్ణ సాక్షాత్కారం అయి

పోయింది ఆ రాధాదేవికి. ఆకారణంచేత ఆవలి రాధాప్రలాపకలాపమంతా నిరర్థక ఉన్మాదవాగ్రాశిలో పడుతూఉండే అని అనిపిస్తూఉంది. అయితే భక్తితత్త్వం ఆమూలాగ్రంగా ఈ నాటకంలో వర్ణింపబడలేదంటున్నానని అనుకోకండి ఎంతమాత్రం. ఈ నాటకం భక్తిరసాత్మకం అనడానికి ఈ రచన అనుగుణ్యంగా ఉంటుందా అనే నా సందేహం!

పాత్రచిత్ర్యాలు మన పానుగంటివారి కావ్యాల్లో చాలా తలక్రిందుగా కనిపిస్తాయి ఒకదృష్టితో చూచేవారికి. ఇంకొక విధంగా చూచేవారికి అదొక నవ్యకవితావిశేషంగా అగుపడుతుంది. అలా కాకపోతే శ్రీకృష్ణునంతవానికి ఇల్లాలైన సత్యభామ శారదునితో "వస్త్రాపహరణ సంబంధము చెప్ప మఱచితివేమి" ప్రభృతి తృతీయాంకమున రాధను చూచి "చూచితివా! నా కాంతుడిప్పుడు ఎక్కడఉన్నాడో! ఇక ఈతని నాప్రక్కనుండి ఎన్నడును వేఱుచేయకుసుమా! చేసినయెడల ననుభవింపగలవుసుమా" అని పలుకుపర్యంతము చూపిన సంకుచితభావాలూ, చేసిన అల్లర్లూ, ఆడిన అసంబద్ధప్రలాపాలూ మొదలైనవాటినిబట్టి ఇంత గయ్యాళి, ఇంత రాకాసి ఇంకోరు ఎవరైనా ఉంటారా అనిపిస్తుంది.

ఇంకా శ్రీకృష్ణుణ్ణి వ్రేపల్లెలోని బాలకృష్ణవేషంలో ఉన్నవానికి భిన్నుడైనవానిగా భావించి రాధాదేవి త్యజించినప్పుడు శ్రీకృష్ణుడు శారదునిచేత ఇప్పట్టున రాధామనోభావం



ఏమైఉంటుందని అడగ్గా వేడుక చెలికాడైన శారదుడు "ఏముందీ! ముదురు వంకాయలో ఉన్నరుచి ముదురు వంకాయలో ఉంటుందటయ్యా!" అని అంటాడు. ఈ వాక్యంలోని ఔచిత్యాన్ని చూచి ఏమనుకోవాలిమనం! అనంతంగాఉంటాయి ఇలాటి వాక్యాలు వీరి కావ్యాల్లో సర్వసాధారణంగాను. వాటిని అలాఉంచి తరువాత విషయాల్ని ఆలోచిద్దాం.

సత్యాగర్వభంగాన్ని ప్రధానంగా ప్రకటించే ఈ నాటకంలో రాధాసంబంధం నిజంగా అతికించినట్లు కనిపిస్తూ ఉంది. ఇందుకు సాక్ష్యమేమంటారా! ఆ కడమభాగాన్ని అంతా తీసేసి 'ఒక్క రాధాపాత్రభాగాన్ని విడతీసిచూడండీ! కలిసిఉన్నప్పటికంటె విడబడినప్పుడు ఏమైనా భేదంకనిపిస్తుందేమో! అంటే, రాధపాత్రనూ, ఆ పాత్త్రాన్నీ తీసేసినా ఈ నాటకం సక్రమంగా ఆడ్డానికి వీలుగాఉంటుందని నా ఉద్దేశం. కవిగారు రాధాభక్తిస్వరూపాన్ని ముఖ్యంగా తెలపాలనే ఈ నాటకం వ్రాశారు. అయితే సత్యాగర్వభంగం, భక్తియోగోపదేశం, అప్రయత్నంగా జతపడ్డాయంటాను ఇందులోను. ఇంకా ఇలా ఉన్నాయిలెండి కాగితాలు చాలా కావాలి గనుక కొంచెం కలాన్ని ఆపుతాను.

## కాళ్లకూరివారికావ్యాలు.

మ॥ రా॥ రా॥ కాళ్లకూరి సాంబశివరావుగారు ఒక కొత్త పంథాత్రొక్కారు. ప్రాచీనుల నాటకాది లక్ష

ణాల్ని పూర్తిగా వదిలిపెట్టకుండానూ, సర్వసామాన్యమైన నాటకం అనే పేరు పెట్టకుండానూ, "రంగరాయకదన సమవాకారము" అంటూ ఒక రూపకాన్ని ప్రకటించారు. ఇది చాలాకాలం నాటకరంగాల్ని ఏలింది. పఠనాలయాల్లో కూడా ప్రపత్తిని సంపాదించింది. చదవడానికీ, ఆడ్డానికీ మనోహరంగా ఉండేవని ఈపైవిషయాలు తప్పకుండా చెబుతాయి.

అయినవప్రకరణంలో సమవాకార లక్షణాల్ని పాఠకులు చూడగలరు. ఆ లక్షణాల్ని యథావిధిగా ఈ సమవాకారం అనుసరిస్తూఉందా అని సందేహం. అయితే అలా అనుసరించాల్సిన పనిలేదనికూడా చెప్పారు లక్షణజ్ఞులు. "ఏషామ్ అంగానామ్ సన్నివేశనమ్ నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా" అనే వాక్యం పైఉద్దేశాన్ని బలపరుస్తుంది. ఈవిధంగానే ఈరూపకంలో కనిపించినంతవఱకు లక్షణాల్లుగా ఉండేవన్నీ రసద్యోతకాలుగా ఎన్నుకోబడవలసి ఉంటాయి.

ఇందలి కథ విజయనగర మహారాజులవారికీ, బొబ్బిలి వారికీ సంబంధించింది. చరిత్రసిద్ధమైంది. ఇంకా పరస్పర విజయోత్సాహులైన పలువురు నాయకులకు చెందింది. వీర రసప్రధానమైంది. కావ్యార్థసూచన, వస్తూపక్షేపం, శరదృతువర్ణనం, పాత్రసూచన, మొదలైనవానితో ప్రస్తావన కూడా హృద్యంగా ఉంటుంది. కథాసంవిధానం అంతా ప్రవేశకాది పురస్కృతాలైన 'అంకైస్త్రిభిః' అన్నట్టుగా



చేయబడిఉంది. సాత్వతి, ఆరభటి, వృత్తిభేదాలు స్ఫుటంగానూ, భారతీవృత్తి ప్రచ్ఛన్నంగానూ దృగ్గోచరమౌతూ ఉంటాయి. వైదర్భి, గౌడి, పాంచాలి, లాటి, మొదలైన రీతులుకూడా అనుసంధింపబడ్డాయి ఆ రచన్లో.

వైరానలసంతప్తహృదయంతో బహుదీనంగా ఎన్నడు పగసాధింప గలుగుదునా అని తలపోసే ప్రతినాయకుడైన విజయరామరాజునకు రంగరాయాభివర్ణనాలాపాలుచేసే బ్రాహ్మణులమూలంగా కావ్యబీజస్వరూపమైన ఉత్సాహస్థాయి రసోచితంగా ఏర్పడుతూఉంది. తదర్థప్రకృతిధర్మాలైన కార్యారంభం, ప్రయత్నం, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలయోగం, ఫలసిద్ధి అనబడేవి క్రమక్రమంగా ఏర్పడుతూఉన్నాయి ఈ సమవాకార కల్పనావిధానంలో. ఇంకా జమాబందీ సందర్భమూలంగా పరాసుల హృదయాల్లో మొలకెత్తింపబడిన బొబ్బిలివిద్వేషసందర్భం అనేది కావ్యభావి విస్తీర్ణానికి బిందావశ్రయంగా ఉంటుంది. ముఖ ప్రతిముఖ గర్భోపసంహారములనబడే సంధిభేదాలో కనాలుగు సమవాకార లక్షణానుగుణ్యంగానూ, సమయోచితంగానూ కొద్దికొద్దిగా స్ఫురిస్తూ ఉంటాయి. ఇంతకంటే ఏంకావాలి ఇది లక్షణయుక్తమైన సమవాకారము అనడానికి! కవిత్వంకూడా చాలవఱకు గుంభనగా ఉంటుంది. అలాఉండడమే మఱికొంత రసస్ఫురణానికి మార్గంగా కనిపిస్తుంది. భాషాభేదాల్ని వీరంత పాటించలేదు. అది ఐచ్ఛికంకదా!

దోషాలమాట కేంలెండి! "తప్పులులేనట్టివాడు దైవం బెసుడీ" అన్నారు. వీరూ కత్తులూ కటార్లతో యుద్ధాల్ని ప్రదర్శించారు రంగం మీద. కొందర్ని చంపించారుకూడాను ఆ యుద్ధాల్లో. మ్లేచ్ఛాది సైనికులూ, అధికారులూ స్వేచ్ఛమైన పద్యాల్లోనూ, గద్యాల్లోనూ ప్రసంగిస్తూ ఉంటే ఏమిటో కష్టంగానే ఉంటుంది వినేవారికి. కేవలం అహమహమికాలాపాలతో గూడిన ఆ వీరప్రసంగాల్లోనూ, పద్యాల్లోనూ కొన్నివిధాయకంగా దొర్లుతాయి మఱి వ్యర్థపదాలెన్నైనాను. అయితే ఇవన్నీ మన సాంబశివరావుగారు చూపిన లక్షణానేకాల్లో ఏ నలుసులుగానో ఉంటాయి గనుక వదిలేద్దాం కొంతధారాళంగాను.

శ్రీ॥ శ్రీ॥ కాళ్లకూరి నారాయణరావుగారిచే వ్రాయబడింది "చింతామణి" అనే ప్రకరణం. వీరి కవిత్వం, సర్వసాధారణమైన సరళశబ్దాలతోనూ, అలంకారాలతోనూ, ముద్దుగానూ, సలక్షణంగానూ ఉంటుంది. వీరి కావ్యాలు చాలా ఉన్నాయి. అవన్నీ వ్రాసినదాన్నే వ్రాయడం అనేపద్ధతిలో ఉండవు. సర్వవిధాలా కాలానికి తగిఉంటాయి. సాంఘికనైతికాది వివిధ ధర్మాల్ని బోధిస్తూ దేశాభివృద్ధికి చాలావిధాల సహాయపడుతూ ఉంటాయి. మధుసేవ, వరవిక్రయం అనేరూపకాలు కూడా వ్యాప్తిలోకి వచ్చాయి.

ప్రకరణం నాటకంతర్వాత చెప్పతగిన రూపకంగా



ఉంటుంది. ఎవరో ఒకపాటి చరిత్రప్రసిద్ధులైన అమాత్య విప్ర వణిజకులాలకు చెందినవాళ్ని పురస్కరించుకొని నీతిబోధకమైన విధంగా కథను కల్పించుకోవడం, ఒకకులస్త్రీ లేక వేశ్య లేకఉభయులు నాయికలుగాఉండడం దీనిప్రధాన లక్షణాలుగా ఉంటాయి. సంస్కృతభాషలో మృచ్ఛకటిక అనబడే ప్రకరణం శూద్రకునిచేత ఎన్నడో వ్రాయబడింది. తెలుగులో దాన్ని మన తిరుపతికవులు బహుసమర్థంగానూ, రసవంతంగానూ పరివర్తించారు. ఇంకా మ॥ రా॥ రా॥ చిలకపాటి వేంకటరామానుజశర్మగారు కాళిదాసు ప్రకరణం అంటూ ఒకదాన్ని ఈవఱకే తెలుగులో ప్రకటించారు. మన నారాయణరావుగారి చింతామణీ ప్రకరణం ప్రథమాంధ్ర ప్రకరణంమాత్రం కాదంటాను.

శ్రీకృష్ణకర్ణామృతగ్రంథకారుడగు లీలాశుకయోగీంద్రుని "శ్లో॥ చింతామణిర్జయతు సోమగిరి గురుర్మే శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః॥" అనే శ్లోకాన్ని పురస్కరించుకొని ఇతివృత్తాన్ని బహుసమంజసంగానూ, ప్రయోగయోగ్యంగానూ కల్పించుకున్నారు మన నారాయణరావుకవిగారు. మఱికొన్ని పాత్రలను కూడా సృష్టించారు సందర్భోచితంగాను. 'ఆముఖమ్ నాటకాదివత్' అనేదానికి తగినట్లు నాందీప్రస్తావనాలు కనిపిస్తాయి. శాంతిరసం ప్రధానంగాఉంటుంది. తత్తద్రసోచిత గుణసాంప్రదాయాల్లో చింతామణీబిల్వమంగళులు ప్రకాశిస్తూఉంటారు. 'పంచాంకమ్ ఏతదవరమ్

దశాంకమ్ నాటకమ్ పరమ్' అనడంచేత నాటకతుల్యమైన ఈ ప్రకరణాన్ని పది అంకాల్లో గుదిగూర్చారు. అన్ని పాత్రలూ లౌకికప్రపంచకానికి చెందినవిగా ద్యోతకమౌతాయి. ఇందులో పద్యాలు మూడువందలు ముఖ్యంగా కంఠస్థం చేసుకోతగి ఉంటాయి. వేశ్యావృత్తినిరసనాన్ని కోరి వ్రాయబడిన ఈప్రకరణం సర్వవిధాలా కావ్యాశయాన్ని నెఱవేరుస్తూఉంది అనడానికి సందేహంలేదు.

## ముత్తరాజువారికావ్యాలు.

కీ॥ శే॥ ముత్తరాజు సుబ్బారావుపంతులు యమ్. ఏ. గారు ఆంధ్రంలో చేసినకృషిఫలితంగా వ్రాయబడిన నాటకాలొక అయిదాఱువఱకూ వ్రాతప్రతుల్లో ఉన్నాయి. ప్రపంచచరిత్రాన్ని ఆంగ్లభాషలో తుదముట్టా చదివారువీరు. చారిత్రిక గాథల్ని కొన్నిటిని తీసుకొని దేశోపయోగంగా ఉండేటట్లు రూపకాల్ని ఎన్నిటినైనా సృష్టించడానికి చాలా ఉత్సాహంకొని ఉండేవారు. అందులో హైందవ మహాపురుషుల్ని ప్రసన్నపఱచాలనే సంకల్పం వీరి సహృదయార్ణవంలో నుంచిఉబుకుతూఉండేది ఎప్పుడూను.తదనుగుణ్యంగా రాజ్యశ్రీ మౌర్యాభ్యుదయం, ఖడ్గతిక్కన మొదలైనవానిని వ్రాశారు. రాజ్యశ్రీ అనబడేది తన రచనావైదగ్ధ్యాన్ని ప్రకటించి పండితులచేత పారితోషికాన్నికూడా పడసింది. బందరులో ఒకప్పుడు కొన్ని నాటకాలాడి అంతర్ధానమైన "చిత్రకళాభివర్ధ



నీ సంఘం" చాలాదేశాల్లోకూడా ఆడింది ఆరూపకాన్ని. అప్పుడు అందులో నాట్యోద్యోగాన్ని చేస్తూఉన్నవారందఱు రాజ్యశ్రీప్రదర్శనంలో వేషాలువేశారు ఒక్క మన బ్రహ్మశ్రీ హరినాగభూషణం. బి. ఏ గారుతప్ప. కడమ నాటకాలు ప్రదర్శింపబడేలోపుగ ఆ సమాజమే అంతర్ధానమైపోయింది. ఇంతలో సుబ్బారావుపంతులుగారు కూడా స్వర్గస్థులైనారు. ఆ రూపకాలూ, ఇంకా మఱికొన్ని అలాటి రూపకాలూ వ్రాతప్రతులు గానే ఉండిపోయాయి ముద్రింపబడకుండాను. ప్రస్తుతం ముద్రింపబడి అశేషసమాజాలచేత ఆంధ్రదేశమందంతటా ఆదరింపబడుతూ ఉన్నది ఒక్క "శ్రీకృష్ణతులాభారనాటకం" మాత్రమే.

సత్యభామ నారదునకు శ్రీకృష్ణుణ్ణి దానంచేసి తిరిగి కొనుక్కున్న. విషయం ఒక విధంగా పురాణసిద్ధమైందే. తులాభారం అనే వాక్యంకూడా వ్యవహారంలో ఉన్నదే. బందరులో ఒకప్పుడు ఒక కవిగారిచేత వ్రాయబడిన తులాభారనాటకం ఒకానొక కంపెనీవారిచేత ఆడబడగా మన సుబ్బారావు పంతులుగారికి ఆ కథను తిరిగి వ్రాయాల్ననే సంకల్పం కలిగింది. వెంటనే రెండుమూడు దినాల్లో పద్యాలు మినహాగా గ్రంథాన్ని అంతా పూర్తిచేసి నాకు చదివి వినిపించారుకూడాను. దీన్నిబట్టి వస్తువు, దానికివచ్చిన నాటకత్వం అనేవానికి వీరే ప్రథమంగా కారకులు కారనిమాత్రం చెపుతాను.

కథాసూచన, ఋతువర్ణనం, మొదలైన లక్షణాలతో గూడిన ప్రస్తావన వీరేదీ వ్రాయదలచలేదు. యత్కించిత్ నాయకపరంగానూ, ఆశీర్వాదపురస్సరంగానూ ఉండే ఒక్క నాందీవాదంమాత్రం చేశారు ఒక్క పద్యంలో మొట్టమొదట. సత్యాకృష్ణుల వనవిహారావసరమందలి ప్రణయభాషణాల్లో కొంచెంశృంగారం, వసంతకుని సరసాలాపాల్లో కొంచెం హాస్యం, సత్యావిలాపాల్లో కొంచెం కరుణ, రుక్మిణీ ప్రవేశంతో కొంచెం భక్తి తొలకరిస్తూ ఉంటాయి అక్కడక్కడ. రుక్మిణీ జన్మదినోత్సవం, నారదుడు కృష్ణుని వీధుల్లో అమ్మడం, సత్య పరుగులిడడం, సపత్నులూ, యాదవులూ మొదలైనవారు ఎత్తిపొడుపులు పొడవడం మొదలైన సందర్భాలు మన పంతులుగారిచేత సృష్టింపబడిన ప్రధానాంశాలుగా ఉంటాయి. సత్యా రుక్మిణుల సహజ భావభేదాలు సరసంగా చిత్రింపబడ్డాయి. నారద సంబంధం జీవప్రాయంగా ఉంటుంది. ముద్దుగా మూడంకాల్లో మూర్తీభవిస్తూ ఉంటుంది కథ అంతాను. ఆడేవారికి కూడా అయిదారు వేషాలతో పని వెళ్ళబాటిపోతూ ఉంటుంది చులాగ్గాను.

సంశయాంశాలు చాలా ఉన్నాయి ఇందులోకూడాను. ఎక్కడో ఏ చివరంశంలోనో తప్ప ఆద్యంతం సత్యా దురభిమానం, తదున్మూలన ప్రయత్నంతోగూడిన కథాంశమే స్ఫుటంగా కనిపిస్తూ ఉంటుంది. ఈ కారణంచేతనూ తులాభారంవిషయం నాటకాంశం కాదగిన అర్హత లేనిదగుట



చేతనూ, కావ్యఫలప్రాప్తిచేతనూ సత్యాగర్వభంగాన్ని సూచించే నామకరణం సమంజసంగా ఉంటుందేమోఅని అనిపిస్తుంది. ఏవో అక్కడక్కడ తొలకరించే చిల్లర రసాలు తప్ప ప్రధానంగా ఏరసం కనిపించదేమోఅని అనిపిస్తుంది. ఇందులోఉండే పద్యాలు ముప్పాతికమూడువంతులు బళ్లారివారి కావ్యాల్లోవలె గద్యభావాల్నే పునరుక్తిగా ప్రకటిస్తూ ఉన్నట్లు కనిపిస్తుంది. అన్నిటికంటే పెద్ద సందేహం ఏమిటంటే దక్షిణనాయకుండైన శ్రీకృష్ణుడు ప్రణయమహాఘ్యయగు సత్యాదేవిని ఏ అంతఃపురంబులోనో, ఏ రూపంగానో భక్తి పరతంత్రిణిగా చేయలేకపోయెనాఅని అనిపిస్తుంది. ఇంకా పాపమూ అబలను తానే కాకుండా నారదునికూడా సహాయం చేసుకొని వీధులవెంట త్రిప్పడం, నలుగురిచేతా నాలుగుమాటలు అనిపించడం మొదలైన కష్టాల్లో పెట్టడం అనేది భావ్యమేనా అనిపిస్తుంది. ఏవో ఉంటూఉంటాయి ఇలాగే! ఎన్నిఉన్నా ఈ నాటకం ఆడుతూ ఉంటేమాత్రం చాలా చూడతగిఉంటుంది.

## బలిజేపల్లివారికావ్యాలు

నాటకోద్యోగంవల్ల నటులకు చాలా అనర్థకాలు కలుగుతాయి అని అనుకునేవారు మన బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారికి అలవడిన కవితాసంపత్తిని చూచి తమ అభిప్రాయాల్ని మార్చుకుంటారనుకుంటాను. గుంటూరుహిందూ

థియేటరు'లో వీరు బాలవేషాలు వేసేటప్పుడు ఉండే స్థితికీ ఇప్పటివీరి కవితాస్థితికీని హస్తిమశకాంతరంగా కనిపిస్తుంది భేదం ఎంతైనాను. కవిత్వంలోనేకాదు. సంగీతంలోకూడా మంచి అనుభవాన్ని కలిగి శాస్త్రసన్నిహితంగా పాడేప్రౌఢిని సంపాదించారు. సంగీత సాహిత్యాల్లో ఉండే సమాన స్వాతంత్ర్యాన్నీ, సమ్మేళన సౌష్ఠవాన్నీ ప్రకటించే ధారాసారళ్యమే వీరి కవిత్వానికి కలిగిన పెద్ద పరపతికి కారణంగా ఉంటుంది.

లక్ష్మీకాంతకవిగారు స్వయంగానూ, అన్యంగానూ ఎన్నో విధాల కష్టించి భాషాసౌందర్యాన్ని లక్షింపకలిగారు. సంస్కృత కావ్యాల్నికూడా చాలావఱకు అనుభవించే శక్తి సంపాదించారు. కొంచెం తెలుగువ్యాకరణం, అలాగే కొంచెం ఛందస్సు, అలంకారం, సమాసం, మొదలైన శాస్త్రాంశాల్ని సంపాదించి క్రమ క్రమంగా ఘనీభవించుతున్నారు. వీరిచే సంస్కృతంలోనుంచి తెలుగులోకి పరివర్తింపబడిన శివానందలహరి, ఉత్తరరాఘవం, అనే కావ్యాలు ఆ సత్యాన్ని తెలుపుతూ ఉంటాయి. వీరు ప్రకటించిన బుద్ధిమతీవిలాసం ఒకప్పుడు చాలా సమాజాలచే ఆడబడుతూ ఉండేది. సాత్రాజితీయం అనేదికూడా అందులో సగం ప్రచారాన్ని కలిగిఉండేది. అన్నిటికంటే వీరి హరిశ్చంద్రీయం ఇప్పటికీ ఎడతెగని ప్రచారాన్ని కలిగి ఉంటూఉంది.

హరిశ్చంద్రకథ ప్రాచీన కవివతంసుడైన శంకరకవి



చేత శ్రవ్యకావ్యరూపంలో ఎన్నడో చెప్పబడిఉంది. దాన్ని పురస్కరించుకొని ఎందఱెందఱో వ్రాశారు నాటకాలుగాకూడాను. ఆ అన్నిటిలో కందుకూరివారి హరిశ్చంద్ర అప్పట్లో ఆడబడుతూ ఉండేది. మన లక్ష్మీకాంత కవిగారి హరిశ్చంద్రీయం తల యెత్తినతర్వాత కడమ హరిశ్చంద్రలు కనిపించకుండా పోయాయి. దీనికి కారణం ఉందిలెండి. వీరి పద్యకవిత్వం వినేవినడంలో పిన్నలకూ పెద్దలకూ కూడా చెవ్రులకు మిక్కిలి తీపిని కలిగిస్తుంది. మాఱుమూల పదాలు ఉండవు. వక్రగమనాలు ఉండవు. గభీరభావాలు ఉండవు. అనుకున్న అర్థం అందిపుచ్చుకున్నట్లు ఉంటుంది ఏది ఎట్లా ఉన్నాను. విశేషంగా అందఱికీ అర్థంఔతుంది ఆ కవిత్వం. వల్లించ తలుచుకున్నవాన్ని అట్టే ఆయాసపెట్టవు ఆ గద్యాలైనాను. ఇంకేంకావాలి చెప్పండి రంగరాజ్యాన్ని ఏలడానికి!

మామూలాచారాలకు భిన్నం లేకుండా నాందీప్రసావనాలు ఉంటాయి. అవి ఎంతవఱకు లక్షణయుక్తంగా ఉంటాయి అన్నవిషయం అలా ఉంచండి తదితర నాటకలక్షణాలన్నిటితో పాటుగా. "మఱి పాత్రౌచిత్యాలో" అని అడుగుతారు కాబోలు. ఆ వసిష్ఠ విశ్వామిత్రుల బజారీసికపట్ల ప్రసంగాలూ,* ఆ నక్షత్రకుని పరమానందయ్య శిష్యత్వాలూ, ఆ హరిశ్చంద్రుని కడుపుకోతదుఃఖాలూ ఎన్నిఅని చెప్ప మంటారు! నాతరమా మఱి వాని నన్నిటినీ

వివరించడానికి! ఏ దోక్షను తప్పకుండా ఏకరువు పెడుతుంది ఈ హరిశ్చంద్రీయం. ఇతర హరిశ్చంద్రనాటకాల్ని అన్నిటినీ చూచే అవసరాన్ని తొలగిస్తుంది ఈ హరిశ్చంద్రీయం. పాడగలవారికి ఎన్ని పద్యాల్ని అయినా అందిస్తుంది ఈ హరిశ్చంద్రీయం. అభినయించేవాళ్ని అట్టే ఆయాసపెట్టకుండా అనుసరిస్తూఉంటుంది ఈహరిశ్చంద్రీయం. ఇవన్నీ బాగానే ఉన్నాయికాని ఉదాత్తనాయకుడగు హరిశ్చంద్రుడు 'మగల గూరుకనిచ్చి తెగి అంటుకొండ్రకై తార్చు కులటల తార్పుకత్తె' అనే పద్యపాదాన్ని పఠించేటప్పుడు ఉండే ఔచిత్యాన్నైనా ముఖ్యంగా వివరించాల్సి ఉంటుంది ఈ హరిశ్చంద్రీయం.

## కలగలపుకావ్యాలు.

ఎన్నెన్నో నాటకాలు బయలుదేరుతూ ఉన్నాయి ప్రతిరోజూనూ. వాటి నన్నిటినీ నాతరంకాదుగదా బ్రహ్మదేవుని తరమైనా కాదు వివరించడానికి! ఎవరో ఒక కవిగారు పలుకుబడిలో ఉన్న ఏ నటుణ్ణో ఆశ్రయించడం, ఆరూపంగా అది రంగానికి రావడం నానాపద్ధతుల్లో ముక్కునఉన్న మూడు ఉద్దేశాల్ని వెళ్లగ్రక్కుతూ ఉండే ఆ పద్యాల్ని, ప్రసంగాల్ని, ఇంకా ఆ పార్శీపాటల్ని, పటాటోపాల్ని చూచి మనవారిలో చాలామంది గుమ్మైపోతూ ఉండడం, కవిగారికి కావాల్సినన్ని కావ్యాలు అమ్ముడుపోతూ ఉండడం, మొదలైన లక్షణాలకు పాత్రాలుగాఉండే కావ్యాలు చాలా కని



పిస్తూ ఉంటాయి. ప్రత్యేక శీర్షికల్లో చెప్పడానికి తగినన్ని విశేషాలు ఏవీ ఉండవుగనుక కొద్దిగా కలగలపి చెపుతాను చేతనయినంతవఱకు.

బెజవాడ బాలభారతి నాశ్రయించుకొన్న బ్రహ్మశ్రీ శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రిగారి సావిత్రిని మొట్టమొదటగా చెప్పాల్సిఉంటుంది. రాజాశ్రయంవల్ల ఎన్నెన్ని లాభాలు కలగడానికి అవకాశం ఉంటుందో వాటిని అన్నిటినీ అనుభవించింది ఈ మనశాస్త్రిగారి సావిత్రి. సుప్రసిద్ధ చిత్రకారులైన ఆ చాపలరాజాగారి దివ్యాంబరాద్యశేషాలంకారాల్లో, ఆ పాపట్లవారి పార్శీపాట పలుకుల్లో ఆ రామానుజంగారి రమణీయహార్మొనీ నాదానుకరణంలో ఆ బగ్గన్నగారి తబలా బందోబస్తులో, ఆ నవ్య నాగరిక నటశిఖామణులైన ఎడవల్లి సత్యవంతుని పాణిగ్రహించి, సంజీవిపరంగా సభలో సాక్షాత్కరించే ఆసంపదఅంతా నిజంగా సావిత్రి చేసుకున్న పూర్వపుణ్యంచేత కాకపోతే ఎలా సంభవిస్తుందో చెప్పండి!

భారతారణ్యపర్వంలో మనం చూచే గాథకీ, మన శాస్త్రిగారి కావ్యంలో ఉండే గాథకీ భేదాలు చాలాఉన్నాయి. అయితే ఆభేదాలన్నీ శాస్త్రిగారికి కల కాళిదాసు భవభూతి మొదలైనవారియందు కనిపించే కావ్యపోషక ప్రాగల్భ్యాలవంటివిగా ఉత్ప్రేక్షింప బడ్డాయి. ఆ వివరాలన్నీ శాస్త్రి

గారి సావిత్రి సంపాదించుకొన్న సన్మాన పత్రాల్లో దృగ్గోచర మౌతాయి. మనంకూడా అలాటి గొప్పతనాల్ని ప్రత్యక్షం చేసుకోకపోతే కవితా సారస్వతాన్ని అగౌరవపఱచినట్లుఉంటుం దేమోఅని తలుస్తూ కొంత వ్రాస్తున్నాను.

అసలు భారతంలో మద్రేశ్వరుడైన అశ్వపతి సంతానంకోసం తపస్సు చేయడం, గౌరీదేవి ప్రత్యక్షమై ఒకపుత్రిక ననుగ్రహించి తన్మూలంగా పుత్రశతం కలుగుతుంది అని చెప్పడం, కొంతకాలానికి సావిత్రి కలగడం, సాళ్వపురాధీశ్వరుండైన ద్యుమత్సేనునియొక్క పుత్రుడైన సత్యవంతుని సావిత్రి కోరుకోడం, సత్యవంతుడు పరిణయానంతరం ఒక్క సంవత్సరానికంటే జీవింపడని నారదుడు చెప్పినప్పటికీ కొమరిత నిశ్చయాన్నిబట్టి అశ్వపతి సావిత్రిని అడివిలోఉన్న సత్యవంతునికి ఇచ్చి పెండ్లిచేయడం, సరీగ్గా సంవత్సరం అయ్యేటప్పటికి కట్టెలు కొడుతూఉండే సత్యవంతుడు శిరోవేదన మూలంగా జీవాన్ని వదలడం, పతివ్రతయైన సావిత్రి పతి ననుగమిస్తూ యమునివెంట బడిపోవడం, చివరకు ఆ మహా పతివ్రతత్వానికి విస్మయుడై వరాలివ్వడం, తుదకు సత్యవంతుణ్ణి కూడా ఇచ్చేసెయ్యడం అన్నంతవఱకు కథ కనిపిస్తుంది. కాళిదాసభవభూతులతో తుల్యంగా ప్రశంసింపబడిన మన శాస్త్రిగారు కొన్ని కల్పనాలు చేశారు. ప్రథమాంకంలో సావిత్రీ సత్యవంతుల అరణ్య సమావేశం ఒకటి, తదనంతర విష్కంభాలుకొన్ని, స్వప్నంలో సత్యవంతుని చూచి సావిత్రి మోహంకొనడం ఒకటి, ముందుగా యమునిచేత సంతానవరాన్ని పడసి ఆవెనుక నా సత్యవంతుణ్ణి నాకియ్యకపోతే నాకు సంతానం ఎట్లా కలుగుతుందని పేచీపెట్టడం, అంతటితో యమునికి హడలుపుట్టి ఆ సత్యవంతుణ్ణికాస్తా సావిత్రికి ఒప్పచెప్పి యముడు పరారీఅవడం మొదలైన కల్పనాలు ఉన్నాయి ఎన్నైనాను. వీటి సారస్యాన్నికూడా కొంచెం ఆలోచిద్దామా ఏమిటి స్థాలీపులాక న్యాయంగాను!



ఈ నాటకంలో సావిత్రికి భర్తగాఉండడమే సత్యవంతుని నాయకత్వానికి ముఖ్యకారణంగా ఎంచుకోవాలా ఇంకేమైనా విశేషాంశాలు జతపఱచబడ్డాయా ఆ నాయకునకు! సత్యవంతుడు కొంతసేపు ఆత్మస్తుతి పరనింద చేసుకోవడం మఱికొంతసేపు నా గతి ఇట్లాపట్టిందే అని దుఃఖపడడం, ఇంక కొంత సేపటికి అట్టే పళ్లుకొరుక్కూంటూ, ఎవరినో తలచి కత్తులూ కఠార్లూ దుయ్యడంతో చేసే ఆతొాలిఉపన్యాసాలూ ఏమైనా పరస్పరసంబంధాల్ని కలిగి ఉంటాయా, ఇంకా ఎలాటి ఔచిత్యాలు తెచ్చిపెడతాయి ఆ సత్యవంతునకు? ఆ విషయాలు అలాఉంచండి.

ఒకమూల తలిదండ్రుల దుస్థితికి వగస్తూ ఏవేవో పైనిచెప్పిన విధంగా ప్రసంగాలు చేసిచేసి, అదే క్షణంలో తన దైన్యాన్నిమఱచి, దారిద్ర్యాన్నిమఱచి, చివరకు తాను

కూడా ఎవరో మఱచి, దారివెంట ఎవరో ఒక కన్యక మఱికొం డఱుకన్యకలతో గూడి వృత్తాంతనాలు ఆడుకొంటూ ఉంటే సత్యవంతుడు చాటుగా [illegible] వినడం, వాళ్లని ఎలాగైనా వశ్యం చేసుకోడానికి [illegible]పించడం, ఇంతలో వ్యాఘ్రసంహారాన్ని చేయడం, ఆ శౌర్యాన్ని చూచి సావిత్రి నిశ్చయంగా వచ్చి మోహించడం, పలుకాడడం మొదలైనవన్నీ శృంగార పోషకాంశాలే అనుకోవాలి!

సరే రసానికేంలెండి. ఏవో కొన్ని శృంగారపద్ధతి పద్యాలూ, కొన్ని వీరాలాపాలూ, వినపడతాయి గనుక అనుకుందాం ఇవన్నీ ఇందులో ఉండే ఉపరసాంశాలని. అన్నిటికంటే ప్రధానంగా కరుణరసాన్ని ప్రకటించాల్సిన ఆ కడపటి రంగంకూడా ఆ సావిత్రి చేసిన గయ్యాళిగడుసు ప్రసంగాల్లో కనపడకుండాపోతూ ఉందే, ఇక దేన్నిపట్టి సావిత్రిగొప్పతనాన్ని తెలుసుకోవడం!

రామాయణంలో పిడకల వేట్లాటల్లే మల్లికావిష్ణుశర్మల అసందర్భహాస్యప్రసంగాలేమిటి! ఆ రంగాలేమిటి! సావిత్రియే యుగంనాటిది! ఈ మల్లికావిష్ణుశర్మలు ఏయుగధర్మాన్ని తలపిస్తూ ఉంటారు! ఏమిటి ఆ హాస్యసారస్యం!

ఇక మన శాస్త్రిగారి కవితావిశేషం, అందలి సారస్యం చెప్పమంటారా ఏమిటి కొంపతీసి! క్షమించండి ! ఇంకో కావ్యాన్ని ఎత్తుకుంటాను.



మ॥రా॥రా చంద[illegible]గారు వ్రాసిన „కనకతార” నాటకం ఆ పిమ్మట చ్చెప[illegible]ది. రాజమహేంద్రవరంలో ఒకప్పుడు ప[illegible] కథను ఆడుతూ ఉండగా చూచి అచటి చి[illegible]రాజ ప్రోత్సాహమిట్లు దీన్ని మన కేశవరావుగారి చేత [illegible]యించారని తెలుస్తుంది. కీ॥ శే॥ పాపట్ల కాంతయ్యగారి కీర్తనలతోనూ, కేశవరావుగారి పద్య ప్రసంగాలతోనూ రాజమహేంద్రవరంలోనే మొట్టమొదట రంగానికి ఎక్కింది ఈ నాటకం. ఏం చెప్పమంటారు దీని సారస్యం!

ఎన్నెన్ని రకాల రంగాలూ, పాత్రాలూ, పద్యాలూ ప్రసంగాలూ కావల్సింటే, అన్నన్ని రకాలూ కనిపిస్తాయి ఈ కథాసంవిధానంలో. అసలు కథను చెపుతాను ముక్తసరుగ్గా మూడుముక్కల్లో. అన్నగార్ని తమ్ముడు చంపడం వదినగార్ని బలవంత పెట్టడం, ఆబిడ పాపం! తప్పించుకొని పోవడం, ఆబిడపిల్లలు ఎవరికో దొరకడం, అందులో ఒక పిల్లవాడు ఎక్కడో రాజ్యంచేయడం, తల్లిమీద కేసు, విచారణ కొడుకున్యాయాధిపతి, ప్లీడర్ల వాదప్రతివాదాలూ, సాక్ష్యాలూ మొదలైనవాటితో కూడిఉంటుంది. ఏమిటి ఈ కథలో ఉండే వస్తునాయకరసాంశాలు! కొంచెం చెప్పండి ఎవరైనా బుద్ధిమంతులు!

ఇక కవిత్వాలూ, కల్పనాలూ చెప్పమంటారా ఏమి

క్షమించండి! అన్నిటికీ ... ా ఉండే ఒక్క విషయాన్ని
మాత్రమే చెపుత ... ప్పు ... న్యాయంగాను. మఱది
పెట్టే చెఱపడలేక ... ారు ఎన్నెన్ని కష్టాలో పడి
ఎన్నెన్ని అడవుల ... ో ఒకచోట చివరకు అలసి
పడిపోతే „నీ నక్కజిత్తు ... నఱుఁగనని తలంచితివా, ఇట్లు
చచ్చినదానివలె భూమిపై పడిన నిన్ను విడతుననుకొంటివా?
నీవు నిశ్చయముగా చచ్చినను విడువను" అంటాడు ఆ చెఱ
పట్టదలచిన కౄరసేనమహానుభావుడు. ఇప్పటికి ఈ
నాటకం ఎన్నిఎడిషన్‌లో పడింది. నాటకసారస్వతం ఎలా
అభివృద్ధి అవుతూఉందో చూడండి! తదభిమానులు ఎలాపోషి
స్తున్నారో చూడండి! దాన్ని ప్రదర్శించే నటశిఖామణులందఱూ
బాజాడేసి బిరుదులు పెట్టుకొంటూఉన్నారంటే చూచే
వారందఱికీ అంతచోద్యంగా ఎందుకు ఉండాలి!

మ॥ రా॥ రా॥ కొప్పరపు సుబ్బారావుగారు ప్రకటించిన
„రోషనార" అనబడేదాన్ని తెనాలివారు ఆడుతూ ఉండగా
చూచాను మొట్టమొదట. ఆవెంటనే గ్రంథాన్ని చూచే
వఱకూ నామనస్సు ఎంతైనా తొందరపడింది. ఎలాగో
సంపాదించాను ఆ గ్రంథాన్ని. దాన్ని చదివిన మీదట
ఇదేనా తెనాలివారిచేత ఆడబడిన గ్రంథం! అనిపించింది. చివరకు
స్థానం నరశింహారావుగారి రోషనారను చెపితే ఇదివఱకు చెప్ప
బడిన కలగలపు కావ్యాలవలె చెప్పకుండానూ, పునరుక్తి
దోషాన్ని రాకుండానూ చేసుకోడం అవుతుందని ఊహించాను.



నరశింహారావుగారి రోష ... ాన్ని చెపుతాను దీ
తర్వాతప్రకరణంలోను.

నేనూ వ్రాశాను కొన్ని కావ్యాల్ని. లంకాదహనం, రామ
రావణ సంగ్రామం, సావిత్రి అనబడతాయి అవి. మొదటిరెండు
నాటకాలూ కొందఱిచేత ఆడబడ్డాయికూడాను అనేకదేశా
ల్లోను. సావిత్రి వచ్చేసమయానికి చేతిలో సమాజం లేక
పోయింది. పెట్టిన పెట్టుబడైనా మళ్లకపోయింది!

ఎవరెవరో అందఱూ వ్రాస్తూఉన్నారు నాటకాలం
టూను. అమ్ముడుపోతున్నాయి అన్ని ఊళ్లల్లోను. పోనీ
అమాత్రం. నాలుగు పద్యాలూ, పాటలూ, ప్రసంగాలూ
సంతరించో, స్వయంగానమకూర్చో చేర్చివ్రాయలేకపోతానా
అనుకున్నాను. దాని ధర్మమా అంటూ తేలిగ్గానే జరిగి
పోయింది ఆ సంకల్పం! లంకాదహనం అనేది రెండుఎడిషన్లు
పడింది. సంగ్రామం కొంచెం చవకబేరంలో వెళ్లిపోయింది.
సావిత్రి చట్టుబండల్లే నా నెత్తినిఉంది ఇప్పటికీని. ఎందర్నో
అడిగానుసుమండీ ఆడమని! „ ఇదివఱకు ఒకదాన్ని చదివే
ఉన్నామండీ!"అన్నారు అందఱూను. మఱికొందఱు సావ
కాశమే లేదన్నారు కూడాను. ఏంచేయను! ఊరకున్నాను
ఇక అలాటి నాటకాలంటూ వ్రాయకుండాను.

భరత నా [illegible] ఃయదశరూపకం మొద [illegible] లైన లక్షణగ్రం [illegible] ు నాటకాదిరూపకవివ రాలన్నీని. సంస్కృ [illegible] ్రాసిన రూపకాల్లో చాలా వఱకు వానికి లక్ష్యాలు కూడా కనిపిస్తూ ఉంటాయి. సంస్కృత జన్యమైన ఆంధ్రభాషలో వచ్చే కావ్యాలకు కూడా సంస్కృతలక్షణాలే మన్నింపబడేవిగా ఉండకతప్పదు. కాబట్టి దృశ్యకావ్యాలనబడే మన తెలుగు నాటకాలు సహితం యథోచితంగానూ, రసవిహితంగానూ, అనుసరించక తప్పుతుందా అలాటిధర్మాల్ని!

కాలాన్ని బట్టి రుచులు మాఱుతూఉంటాయి. భావాలు పెఱుగుతూ ఉంటాయి. ఒకప్పుడు గ్రంథాలన్నీ రసవిషయికంగానే ఉండడం గొప్పగా కనిపిస్తుంది. మఱొకప్పుడు రాజకీయంగా ఉండడం మేలనిపిస్తుంది. ఇంకొకప్పుడు సాంఘికంగానూ, నైతికంగానూ ఉండాలని అనిపిస్తుంది. ఆ కారణాల్ని బట్టే ప్రస్తుతకాలంలో జరుగుతూఉండే అన్నివిధాలైన సంస్కరణాలూ, ఇంకా అలాటి ఉద్యమాలూ ఆదరింపబడుతూఉన్నాయి పెద్దలందఱిచేతాను. ఆ కాలప్రవాహాన్ని కట్టడానికి ఎవరికి శక్యం అవుతుంది!

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగంగారు మొదలుకొని బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారివఱకు చెప్పబడిన



వారందఱూ మహామేధా [illegible] లో కొందఱు విద్యానిధులు అనికూడా చెప్ప [illegible] కో కొందఱు కేవల సరస్వతీవిగ్రహాలు అనద [illegible] ుతే వారందఱూ వ్రాసిన కావ్యాల్లోనుంచి [illegible] ంశాల్ని వారు ఎఱుగరని అనుకోడానికి వీలుండదు. [illegible] ఎలం ప్రాచీన లక్షణాల్ని పట్టి నాటకాలు వ్రాయడంఅంటూ తటస్థపడితే సకల లక్షణలక్షితులైన నాయకులే దొరకడం దుర్లభమైపోతుంది. కొంతకాలానికి శ్రవ్యకావ్యాలల్లే ఈ దృశ్యకావ్యాలు కూడా పాడినపాటనే పాడేవిగాఉండడం తటస్థపడుతుంది. ఇంకా ఇలాటి అన్ని నాటకాలూ రసపరంగానే ఉండాలను కొంటే ఆలాటి నాటకాలన్నీ ఏ కొందఱు భావజ్ఞుల్నో రసజ్ఞుల్నో ఆనంద పెడతాయి కాని ఇంకేవిధంగానూ దేశానికి ఉపకరింపనేరవు. ఈ కారణాల్నిబట్టి పైనిపేర్కొనబడ్డ విద్వత్కవులలో చాలమంది కాలోచితంగా కొంచెం సంధుచేసుకొని సహజస్వరూపానికి పోషకంగా ఉండేటంతవఱకు లక్షణసాంప్రదాయాల్ని జతపఱుస్తూ ఆ యా కావ్యాల్ని వ్రాయడం మొదలుపెట్టారని మనం గ్రహించాల్సి ఉంటుంది.

శాస్త్రీలోకానుభవాలు చాలినంత లేనివారూ, ఏవో కొన్ని పద్యాలు మాత్రమే అల్లగలిగేవారూ, నాటకాలు వ్రాయడం చాలా కానిపని అంటాను నేను. వాన్ని ఆడేవాడు

కూడా ముఖ్యంగా [illegible] నాన్నే చూచుకుంటూ
ఉన్నారుకాని రసా[illegible] భివృద్ధినీ, కోరడంలేదం
టాను నేను. ఇ[illegible] పెద్దలు కళాభివృద్ధికై
పాటుపడుతూ ఉన్న[illegible] ఏకసారస్వతానికీ, నాటక
కళకూ, దోహదంగా ఉ[illegible] యాన్ని ఆలోచించి ఆ నిశ్చ
యాన్ని శాసనమూలంగా అమల్లోపెడితే బాగుంటుందేమో
అని సవినయంగా ప్రార్థిస్తాను పండితలోకాన్ని నేను.





# ఆంధ్రనటప్రకాశిక.

నవమ ప్రకరణము.

## రూపకము—నటుడు.

భరతశాస్త్రాదిసమ్మతంగానూ, ప్రస్తుతనాటకలోకా
చార్యవిహితంగానూ, ఆలోచించేవారికి సకలసంపత్సమృద్ధుడు
అనడానికి తగిన భావనటుడు కనిపింపడు. దేశికానుమతం
గానూ, లక్షణబద్ధంగానూ, యోగ్యనాటకాన్ని పరిశ్రమించి
అనుభవించి, తన్మయరసానందాల్ని యథావిధిగా ప్రసాదించే
సమాజంకూడా కనిపింపదు. కాకుంటే కొంచెం పూర్వజన్మ
వాసనచేతనూ, కొంచెం వివిధ నాటకపరిజ్ఞానంచేతనూ
కొంచెం ప్రయోగసౌలభ్యంచేతనూ, కొంచెం లోకానుభవం
చేతనూ, కొంచెం అనుభవంచేతనూ, కొంచెం ఆవేశంచేతనూ
కొంచెం వాక్కుచేతనూ, కొంచెం వర్తనంచేతనూ, కొంచెం
విద్యచేతనూ, కొంచెం విగ్రహంచేతనూ, ఒకవిధంగా విద్వాం

సుల్ని విసిగింపకుండా [illegible] చేవారు కొందఱు ఉన్నారు నటులు. ఇంకా కొ[illegible], డొల్లుతోనూ, హడావుళ్లతోనూ, అసం[illegible]గంతులతోనూ, గందఱగోళాలతోనూ, ఘ[illegible]చమక్కులతోనూ, పాటలతోనూ, పద్యాలతో [illegible]జనుల్ని అట్టే మెస్మరిజం చేస్తూ పొట్టపోసుకొనేవారు ఉన్నారు మఱికొందఱు నటులు. ఇలాగే ఇంకా ఎన్నిరకాలైన నటులైనా ఉన్నారు ఈ ప్రస్తుత నాటకప్రపంచంలో. అలాటి నటులందఱిలోనూ ఎవరిపేరు మీద పదిడబ్బులు వస్తూ ఉంటాయో, ఎవరిపేరు పది పత్రికల్లో మ్రోగుతూ ఉంటుందో వారా నాటకప్రపంచంలో పరబ్రహ్మస్వరూపులుగా ఉంటూ ఉంటారు. ఇంకా విద్యావివేకాలు లేకపోయినా, వినయవిధేయతలు లేకపోయినా, పెద్దపిన్న తారతమ్యాలు లేకపోయినా, మానాభిమానాలు లేకపోయినా తా మాడేదంతా ఆటగానూ, పాడేదంతా పాటగానూ, అన్ని పల్లెల్లోనూ, పట్నాల్లోనూ, క్లబ్బుల్లోనూ, కాఫీహోటల్సులోనూ, ఘనంగా ప్రచురపఱచడానికీ, పత్రికలకు ఎక్కించడానికీ, ఏకొంద అభిమానుల్నో ఊరూరా ఉంచుకోకలిగిన ఉత్పన్నమందబుద్ధులూ, మహోదారతూష్ణీంభావస్వరూపులూ, ఇంకెంతైనా అపరకళానిధులుగా వెలుగుతూ ఉంటారు "బుధజనఇవ గ్రామ్యసదసి" అన్నట్లు. ఇలాటి నటులందర్నీ నెంబరువారీలుగా వ్రాయడం నా ఉద్దేశ్యంకాదు. నేను స్వయంగా చూచినవార్నీ, యథార్థమైన ఏ యత్కించిత్ ప్రతిభావిశేషాన్నో ప్రదర్శిస్తూ ఉండేవార్నీ, బహుజనాద



రాన్ని పడసినవార్నీ, [illegible]కులుగా ఉండతగిన వార్నీ, కొంతమందిని పేర[illegible]ణంలో. ఆయా నటవతంసులందు కనిపిం[illegible] విశేషాల్ని ప్రధానంగా చూపిస్తాను సాధ్యమై[illegible] ఆయా అంశాల్ని గూర్చి భిన్నాభిప్రాయులయ్యేవారందఱూ, అట్టే తొందఱపడి నామీద లేనిపోని ఆరోపణాలు చేయకుండానూ, విశాలదృష్టిని విడువకుండానూ, ఆదరిస్తారని నమ్ముతాను.

## శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులుగారు.

రంగానికి రావడంతోటే సభ్యులందర్నీ ఆకర్షించేదిగా ఉండేది రూపం. అది సహజం, కృత్రిమం అనబడే ఒకరెండు స్వరూపాల్లో చూడబడుతుంది. ఒకప్పుడు సహజసుందరుడైనా రంగానికి రావడంతోటే రాక్షసాకారుడుగా కనిపించవచ్చును. ఇంకొకప్పుడు అనాకారుడైనా అపరమన్మథుడుగా దృగ్గోచరం కావచ్చును. ఇందుకు సాక్ష్యం ఏమిటంటే సర్వసామాన్యంగా మనం నాటకాల్ని చూచేటప్పుడు ఆ రంగంమీదనుండే ఒకానొక నటుణ్ణి ఉద్దేశించి 'చూచావటోయి మనవాడు ఉత్తప్పుడుకంటే ఈ వేషంమీద ఎంతబాగున్నాడో!' అని అంటూఉంటాం. వేఱొకప్పుడు తద్వ్యతిరేకంగా "ఏమిటోయి అంత సుందరంగా ఉండేవాడు ఈ వేషంమీద ఇలా మకమకలాడుతూ ఉన్నాడు!' అంటూఉంటాం. కారణం ఏమంటే రంగంమీద అలంకరింపబడే ఆ వివిధ దీపాలకాం

తుల్లో, నటుల సహజ ... సుకుమార్యాలన్నీ ఆ యా
వెలుగునీడలచేత అ ... లాటి వివిధ విచిత్ర వికా
రాల్ని అగపఱుస్తూ ... ులు శుష్కాది మూర్ణా
ల్లోనూ, ఆర్ద్ర వర్ణ ... ా వెలుగునీడల్ని సరిచేసు
కొనే నేర్పును కలిగిఉ ... ట్టమొదట. ఆ వివరాలన్నీ
ప్రథమ ప్రకరణంలో ఆహార్యాభినయభాగంలో చెప్పబడి
ఉన్నాయి. మన రాఘవాచార్యులువారు సహజంగా సుంద
రులు. ఆపైని వివిధ భావచిత్రీకరణవిధానాల్ని కూడా
కొద్దో గొప్పో తెలిసినవారుకాని కేవలం తెలియనివారుకారు.

సభ్యాకర్షణానికి రెండవకారణంగా కనబడేది వాక్కు.
ఇదికూడా సహజ కృత్రిమము లనబడే రెండువిధాల్లో ఉంటుంది
సర్వసాధారణంగాను. అందులో పూర్వజన్మసుకృత విశే
షంచేత అలవడి, వినేవినడంలోనే, ప్రేక్షకుల హృదయాల్ని
ఝల్లుమనిపించే ధ్వనివిశేషాన్ని త్రిస్థాయుల్లోనూ ప్రదర్శిం
చేది గాత్రంయొక్క సహజ సుకుమారధర్మాన్ని తెలుపుతూ
ఉంటుంది. ప్రయత్నపూర్వకంగా ఉచ్చారణసౌలభ్యాన్ని
అలవఱచుకొన్నది కొంచెం పురుషంగానూ, కొన్ని స్థాయు
ల్లో నీరసంగానూ వినిపిస్తూ ఉంటుంది. మన రాఘవాచారి
గారు కేవలం సహజవాక్సంపత్తినికాని, కేవలం కృత్రిమవాక్సా
రళ్యాన్నికాని ప్రసన్నపఱచేవారుకారు. ఏదో ఖంగుమనే
స్వభావం, ఏదో లలితమైన స్వభావం, ఇంకాఏదో శ్రుత్యైక్యం
అనే స్వభావం వీరి గాత్రంలో సహజంగా ఉంటుంది. ఆపి



మ్మట స్వరరూపంగా గాక ... ాక కొండగుర్తులరూ
పంలోనైనా, కొంత ప ... శారీరంగానే కనిపి
స్తుంది ఒకస్థాయినుండి ... స్తూ, ఒకప్పుడు
సాగుతూ పద్యాల్ని పాడె ... రని చూస్తేను!

భాషోచ్చారణ వివిధ జిల్లాలవారియందు వివిధాలుగా
ఉంటుంది. ఆయా వాగ్వైఖరులకు అలవాటుపడినవారు అం
దలి అపశబ్దాల్నీ, ఇంకా అనేకవిధాలైన అనర్థకాల్నీ, గుర్తించ
లేరు. క్రొత్తవారికి పట్టిస్తూనే ఉంటాయి తప్పకుండాను.
అయితే భావాన్నిమాత్రమే ప్రధానంగా గ్రహించి ఆనం
దించే పండితుల్ని, ఆ భాషాభేదాలు ఏమాత్రం బాధింపవు.
శేషించిన సామాన్యు లందఱికీ ఏదో విరసంగానే ఉంటుంది
వినడానికి. మన రాఘవాచార్యులుగారు బళ్లారి వాస్తవ్యులు.
కృష్ణా గోదావరీ మొదలైన తెలుగు జిల్లాల్లోఉండే వాగ్విధా
నాలతో చాలా భేదిస్తూ ఉంటుంది ఈ బళ్లారీ ప్రసంగవిధానం.
నెల్లూరుజిల్లా సాంప్రదాయానికి ఈ బళ్లారి సాంప్రదాయం
చాలా సన్నిహితంగా ఉంటుంది. ఇలాటి భేదాల్నన్నీ పాటిం
చడం, ఏనటునకూ సులభమైనపనికాదు. ఏజిల్లాలో ఆడుతూ
ఉన్నప్పుడు, ఆ జిల్లావారి భాషామర్యాదల్నిపట్టి ప్రసంగాలు
జరపాల్నంటే సాధ్యపడుతుందా మఱి! ఇక కృష్ణాతీరస్థుడైన
నాకు వారి బళ్లారీప్రసంగం మాత్రం ఎలా పట్టివ్వకుండా
పోతుంది! ఉండుగాక! వారి భావచిత్రీకరణోద్యోగానికి ప్రధా
నకారణంగా ఉండే, ఆ భాషావిధానాన్ని అంతమాత్రంచేత

నిరసించడానికి ఎవరికిన్నీ ఆ గొప్పతనం ఎక్క-
డికి పోతుంది!

అన్నివిధాలైన ప్రదర్శించడానికి భాష
అనేదే ముఖ్యకారణ ది. ఒక్కొక్కనాయకుడు
ఒక్కొక్క వాక్యాన్ని ఉచ్చరించే గాంభీర్య సారళ్యాల్లోనూ
మందదీర్ఘాదికగమనాల్లోనూ, అనేక విధాలైన కాలధర్మాలూ
జాతిధర్మాలూ, మతధర్మాలూ, సాత్త్వికధర్మాలూ, ఇంకా
రసధర్మాలూ ద్యోతకమౌతూ ఉంటాయి. కేవలం అర్థాలు
మాత్రమే చెప్పకున్నవారుకాని, తదర్థబోధకాలైన ముఖాంగి
కాది వివిధాభినయవిధానాల్ని కల్పించి అలవఱచుకొన్న
వారుకాని, కావ్యగర్భిత రసభావాల్నన్నిటినీ సక్రమంగా
రంగంమీద ప్రసన్నపఱచగలిగిఉంటారంటే విశ్వసించతగిన
విషయంగా ఉండదు. చేసిన సాధనలన్నీ అభినయసౌల
భ్యాన్ని మాత్రమే కలిగిస్తాయి. తత్తదుచిత వాచికాంగిక
సాత్త్వికభావాలు నటుని పూర్వపుణ్యంచేతనూ, కావ్యానేక
లలిత గభీర భావానుభవ విజ్ఞానవైశాల్యంచేతనూ, అప్పటి
కప్పుడు ఆశుధారాప్రవాహరూపంగా ప్రసరింపబడాల్సి
ఉంటుంది. మన రాఘవాచారిగారు చేసే ప్రసంగాలూ
పాడే పద్యాలూ చాలావఱకు భావబోధకాలుగా ఉంటా
యంటే, కేవలం సాధనాసాధితాలుగా ఎంచుకోడానికి వీలుం
టుందా! అయితే మఱి అలాటివన్నీ శాస్త్రప్రసిద్ధులైన ధీరో
దాత్తాదివివిధనాయకోచితస్వరూపాల్లో ఉంటాయో లేదో
చెప్పడానికి, వీరు వేయగా చూచిన పఠాణి, కుంభీనసుడు



రామదాసు, పాత్రాలు వ లవు. శృంగార వీర
రసాల్లో దేన్నైనా ప్ర మహానాటకాల్లో
అనగా ఏ శకుంతల్లోనో ో, వీర్ని దుష్యం
తుడుగానో, లేక భీము డంఅంటూ తటస్థ
పడితే చెప్పవచ్చు మఱి స గాను. సుభద్రార్జునీ
యంలో అర్జునుడు వేసారని విన్నాను. మఱి దాన్ని నేను
చూడలేదు.

ప్రసంగాల్లో వాచికాభినయానికి వన్నె తెచ్చే సాధనాలు
చాలా ఉన్నాయి. జాతీయానికి చెందిన పలుకుభేదాల్ని
అలాఉంచినా, వయోధర్మప్రతిపాదకాలైన పద్ధతులు విధా
యకంగా కనిపించాలి ఆ ప్రసంగవిధానంలో. ఇంకా వీర
రసోచితమైన స్ఫుటాలాపాలు, ఎంతగా ఎంతటి సభ్యులనైనా
ఎలా ఆకర్షించగలుగుతాయో, అలాగే దీనంగానూ, లలితం
గానూ, చెప్పబడే ప్రసంగాలుకూడా, మంద్రస్థాయిలో మిణుకు
మిణుకులాడుతూ ఉన్నట్లు ఉంటేనా, అందలి భావాలన్నీ, అంత
స్ఫుటంగానూ, సుకుమారంగానూ, ఎంత దూరాన ఉన్న
దిదృక్షులనైనా ఆకర్షించాలి మఱి! వాక్యాభినయానేకాల్లో ఇది
చాలా కష్టమైందనీ, ఇంకా అగత్యమైందనీ ఎంచుకోవాల్సి
ఉంటుంది. ఇంగ్లీషు నాటకాల్లో పెద్దపెద్ద నటులు పాత్రాన్ని
వినికిరిచేసేటప్పుడు ముఖ్యంగా కనిపిస్తాయి అలాటి విశేషాలు.
మన రాఘవాచారిగారు తెలుగు నాటకాల్లోకంటే ఇంగ్లీషు
నాటకాల్లో చాలా ప్రతిష్ఠను సంపాదించినవారు నిస్సంశయం

గాను. వీరి ,, ఒథె … చూచినప్పుడు నా కలాటి
వాగ్విన్యాసాల్ని … ఋ కొన్ని వీరియందు
కూడాను. అవి … వాచికాభినయవైదగ్ధ్యం
తెలుగు నాటకాల్లోకి … అవసరాలందు విధాయ
కంగా ప్రసన్నపడకపోతుందా! తెలుగులో మాత్రమే అభి
నయించే అలవాటుకల మన నటుల్లో చాలమందికి అలాటి
అభ్యాసమే ఉన్నదన్నమాట తెలిసి ఉండదనుకుంటాను.
సాక్ష్య మేమంటారా! ఏ నాటకంలో, ఏ మన పెద్ద తెలుగు
నటుడు, అభినయిస్తూ ఉంటే ,, లౌడర్ ప్లీజ్ '' అనే హెచ్చ
రికలు రాకుండా ఉంటాయో ఆలోచించండి! మఱి మన రాఘ
వాచారిగారికి అలాటి హెచ్చరికలు నేను చూచిన మూడు
అవసరాల్లోకూడా వచ్చినట్టు కనిపించలేదు. సమ్మౌలి మఱి
నాయందు దయయుంచి పాఠకులంతాను!

ఇంకోవిధంగా చెపుతాను ఆచార్యులువారి వాచికనైపు
ణ్యాన్ని. సామాన్యంగా ఎవరు పఠాణీవేషం వేసినప్పుడైనా
ఆ మొదటి రంగంలో ,, భర్మాంచలోజ్వల '' ఎత్తుకొంటూ
భూనభోంతరాళాల్ని బ్రద్దలుచేసుకొంటూ, కళ్లెఱ్ఱచేసుకొంటూ
పళ్లు కొఱుక్కొంటూ, కత్తులు ఝాడించుకొంటూ, ధూళి
రేగగొట్టుకొంటూ, దుమ్మెత్తి కన్నుల్లో పోయకుండాఉండడం
అంటూ ఉంటుందేమో చూడండి! ఆపైని ఒంటరిగా ఏదో
ఒక విధమైన హృదయారాటాన్ని పడుతూ, ఏ మూడో రంగం
లోనో, నాలుగో రంగంలోనో ఉండే ఆ సాలొలిక్వీన్ని సాగి



స్తూఉంటే ఏ పిట్టలో ఉన … వినిపిస్తాయేమో చూ
డండి! తెచ్చిపెట్టుకో … ందాలకూ ఇలాటి
అనర్థకం తప్పకుండా వ … ం సమ్మౌలిమఱి!
ఇంకా అదరుపాటుతో అ … యడంచేత వీరబీభ
త్సాల్ని, అట్టే నూతులో ప … ప్లాడుతూ ఉండడంచేత
శాంతిశోకాల్ని, ప్రకటించడానికి ఎంతమాత్రం అవకాశం
ఉండదనికూడా అనుకోవాలి. ,, ఇంకేలాగయ్యా మఱి ఆ
భావాల్ని చూపించడం!'' అని అడిగేవారికి మన రాఘవా
చార్యులుగారి వాచికవిధానాన్ని ఒక్కపర్యాయం చూడండనే
చెప్పాల్సి ఉంటుంది నేనంత నటుణ్ణి కానుగనుక.

రాఘవాచార్యులుగారు విద్యాధికులు. నాలుగైదు
భాషల్లో పెద్ద ప్రవేశాన్ని, స్వాతంత్ర్యాన్ని కలిగి అభినయ
కార్యాన్ని అనంతంగా సాగిస్తూ ఉన్నవారు. ఎవరో 'తూ'
అంటే 'తా' రాని సామాన్యనటులయందు కనిపించే చిట్టిపొట్టి
అనన్వయదోషాలూ, అపశబ్దాలూ, అశ్లీలాలూ, అనర్థ
కాలూ, అనౌచిత్యాలూ ఉండడానికి ఎంతమాత్రం వీలు
లేదు. స్వతహాగా పెద్దవంశానికి చెందినవారూ, పెద్ద సాం
ప్రదాయాల్లో పెఱిగినవారూ, పెద్దల్లో ఒకరుగా పరిగణింప
బడేవారూ, పెద్దపెద్ద ఆశయాలుకలవారూ, పెద్ద హృదయంతో
ప్రపంచయాత్ర చేసేవారూ అయిన మన ఆచార్యులవారిని
ఆశ్రయించుకున్న ఎట్టి వాగ్రచనైనా, ఇంకా ఉన్నదానికంటే
ఎక్కువైన గాంభీర్యాన్ని సంపాదించి తన్మూలంగా రచయిత

లకుకూడా పెద్ద గౌర ... గా కలిగిస్తూ ఉంటుందని అనడానికి ఎంతమా ... దు.

ప్రస్తుతం ... కాలనబడే కావ్యాల్లో ప్రసంగాలు లఘుదీర్ఘ ... భేదాల్లో కనిపిస్తూ ఉంటాయి. లఘుప్రసంగాలనబడేవి అన్యుల భావాల్ని పురస్కరించుకొని సమయసిద్ధంగానూ, జాత్యాదిసహజసాంప్రదాయసమన్వితంగానూ, తత్తదుచితోదాత్తానుదాత్తస్వరిత భేదాల్లో భాషింపబడతగిఉంటాయి. దీర్ఘాలనబడేవి స్థాయిభాజనమైన భావసముద్రంలో పుట్టే సంచారిభావతరంగాల్ని తలపిస్తూ ఉంటాయి. ఈ ఆచారం ముఖ్యంగా కొంతవఱకు కీ॥ శే॥ ధర్మవరం కృష్ణమాచార్యులుగారి నాటకాలన్నిటిలోనూ కనిపిస్తూ ఉంటుంది. సంస్కృత నాటకాలు చదివినవారికీ ఇంగ్లీషు నాటకాల్ని తడవినవారికీ, ఈ పద్ధతిలో వ్రాయడం సులభసాధ్యంగా ఉంటుంది. రంగంమీద అట్టివి భావనటులు ప్రసంగిస్తూ ఉన్నప్పుడుకూడా వినేవారికి ఎంతో సరసంగానూ ఆనందదాయకంగానూ ఉంటూఉంటాయి. మఱిశ్రీ పానుగంటి లక్ష్మీనరశింహారావుగారి నాటకాల్లో ఈ ఫక్కీని ఉండే వాగ్రచన ఇంకా ఎంత చమత్కారంగానో కనిపిస్తూ లక్ష్మీనరశింహారావుగారి గద్యరచనావైదుష్యాన్ని చాటడానికి ప్రధానసాక్ష్యంగా ఉంటుంది.

మన రాఘవాచార్యులువారు ఆంగ్లేయ నాటకాల్లో అభినయించే అసామాన్యనటులవడంచేతనూ, ఆ ఫక్కీ గద్య



నైపుణ్యంతో తెలుగునా ... కీ॥ శే॥ కృష్ణమాచార్యులవారి మేళ్లుళ్లవడం ... ప్రసంగభేదాలన్నిటినీ, ఎంత నిపుణంగా, ... , ఎంత సరసంగా వినిపించాల్సి ఉంటుందో, ... నూ, అంత నిలకడగానూ, అంతఉదాత్తంగానూ ... స్తారు నిస్సంశయంగాను. అంతేకాకుండా ఇట్టి వాచికవిజ్ఞానాన్ని చాటుతూ ఆంధ్రాంగ్లేయ భాషాకోవిదుల్ని మొట్టమొదటగా సంతోషపెట్టసాగినవారు ఈ మన రాఘవాచార్యులువారే అనికూడా తోస్తుంది. ఈ నైపుణ్యమే కృష్ణమాచార్యులువారి నాటకాలకు కలిగిన విశేషవ్యాప్తికి సహితం కారణమైందేమో అనుకుంటాను. కారణంఏమంటే, ఏ చిత్రనళీయ సారంగధరలో కాక, ఇట్టి గద్యనైపుణ్యాన్ని ఆద్యంతం ప్రసన్నపఱచే రామరాజుచరిత్ర, చంద్రహాస, ప్రహ్లాద, పాదుక, మున్నైన కృష్ణమాచార్యులువారి నాటకాల్ని, ఈ ప్రాంతాల్లో, ఏ సమాజంవారైనా ఆడడంగానీ, ఒకవేళ ఆడితే అలాటి వాచికవిజ్ఞానాన్ని ప్రదర్శించడంగాని ఉండేదికాదు. ఇటీవల ఒక బందరు మినహాగా శేషించిన మదరాసు, నెల్లూరు, తెనాలి, గుంటూరు, బెజవాడ, ఏలూరు మొదలైన పట్నాల్లో, మన రాఘవాచార్యులువారు తెగపడి, ఈ నాటకాల్నన్నిటినీ ఆడగా చూడ్డంచేతనే ఇక్కడి నటులుకూడా ఒకరిద్దఱు, ఎలాగో ఆ ఫక్కీని, బెత్తెడు ఎడంగా అనుకరిస్తూ, కొన్ని కళ్లుత్రిప్పలూ, కొన్ని తలత్రిప్పలూ, కొన్ని పైపోజులూ, కొన్ని ప్రక్కపోజులూ, కొన్ని గాద్గద్యాలూ, కొన్ని ప్రకంపనాలూ, కొన్ని ఉన్మాదాలూ

ప్రకటిస్తూ కొంత పర పలుకుబడినీ సంపాదిస్తూ
ఉండడాన్ని మనం

'అనుకరించ అని సందేహపడేవారికి
దోషంకాదనే మనవి చె రాలో. అయితే ఆ 'అను
కరణం' సహజరూపంలోకి రావాలి! ఆయా ప్రసంగాలూ
ఆంగికాది వికారాలూ, ఎట్టి స్థాయిభావాల్ని పురస్కరించు
కొని బయలు వెడలుతూ ఉన్నాయో, అవి అన్నీ మనస్సుచే యథా
విధిగా గ్రహింపబడాలి! అలా గ్రహింపబడిన స్థాయి
భావంలో సత్త్వం సమన్వయించాలి! ఇంతపని జరిగితేనే కాని
ఆ 'అనుకరణాలు' సహజరూపంలోకి రావడానికి వీలులేదు. అలా
జరగడానికే, పవిత్రమైన హృదయం, భావాన్ని గ్రహించే
పరిజ్ఞానం, ఔచిత్యానౌచిత్యాలతో కూడిన లోకాన్ని సవిమ
ర్శంగా చూచే సూక్ష్మదృష్టి, మొదలైన సంపద లెన్నో కా
వాలిమరి! ఇలాంటి పెద్దవిషయాలు నిరక్షరకుక్షులకూ, పండి
తమ్మన్యులకూ, అశిక్షితులకూ, దురదృష్టులకూ, ఎన్నిజన్మా
లకైనా లభిస్తాయామరి! ఇక, ఏ విధమైన సంస్కారం లేని
వారు, పైకి కనిపించే ఆ యాచార్యులువారి కళ్లుత్రిప్పుళ్నీ
స్వరభేదాల్నీ అనుకరించేటప్పుడు ఆ 'అర్థాలు సార్థకాలుగా
ఉండక, ఇంకో విరుద్ధార్థదాయకాలుగా ఉంటా'యని అంటాను.
విశ్వసించాలి మరి మీ రందరూ దయచేసి!

వాగర్థాల్నీ, ముఖ్యంగా రసభావాల్నీ తలపించడానికి
సంగీతంకంటే సాధనంగా ఉండేవస్తువు ఇంకోటిలేదు. ద్వితీయ



ప్రకరణంలో ఆ వివరాల్ న్నాను. భావసంగీత
ప్రతిపాద్యాలైన స్వతం సమన్వయసుఖా
నుభవం నటుని కెంతై న్ని కలిగిస్తుంది.
ఆ సౌలభ్యమే ప్రేక్షకుల ట్టనీ కరిగిస్తుంది.
ఈ విధంగా సభ్యానుభవపాత్రమైం.. 'భావం' అనీ, 'ఆనందం'
అనీ, ఇంకా 'రసం' అనీ అనబడుతుంది. ఈ దాన్నిపట్టిచూస్తే
కాళిదాసు కవిత్వం ఒకప్రక్క కనిపిస్తూ ఉండగా, ఇంకొకడు
అలాంటి కవిత్వాన్ని చెప్పసాగించినట్టుగా ఉంటుంది. ఇంకా
సుప్రసిద్ధ శతావధానులైన తిరుపతి వేంకటేశ్వరకవులు అవధా
నాల్ని చేస్తూ ఉండగా, తగుదునంటూ ఇంకో సామాన్యులు
కూడా చేయడానికి సాగించినట్లు ఉంటుంది అంటాను.
అయితే ఏంటెండి! అలా అనడం అంటూ సాగిస్తే ప్రపంచం
నడవడానికే వీలులేదు. కాబట్టి స్వచ్ఛమైన గాంధర్వలోకం
నుండి ఒకమెట్టు దిగే మాట్లాడుకుందాం.

ప్రస్తుతాచారంలో ఏ విద్వాంసుల నోటవిన్నా భావ
రహితమైన కేవలాలాపమే వినిపిస్తూ ఉంది. ఇంకా స్వరం
అంటూ ఏమిటో సాధించి ఎఱుగని మన నటసామాన్యం సంగీ
తాలాపాన్ని చేస్తూ ఉంటే, మనం అందులో రసభావ విచా
రాల్ని చేయడంఅంటే చాలా తగనిపనిగా ఉంటుంది. పైగా
పదిమందీ సంతోషించేపద్ధతికి విరుద్ధంగాకూడా ఉంటుంది.
నలుగురితోపాటు నారాయణాఅంటే ఏపుణ్యమో, పురుషా
ర్థమో వస్తుంది. ఆ దార్నే పోదాం!

రంగాలమీద [illegible]తం ఇలాఉన్నా చాలావి
ధాలైన విమర్శనా[illegible]గాఉంది. సంగీతానభి
జ్ఞులు చేసే నాస్తి[illegible]ం పనికిరాదని అనడం
చాలా సాహసం. [illegible] సంగీతం ‘భావసహితంగా
ఉండాలి’అని అనడంకు[illegible]చెం బరువుగానే ఉంటుంది.
‘చెవికి ఇంపుగా ఉండాలి’అని మాత్రమే అంటానునేను. నేనే
కాదు! అసలు ‘స్వరం’ అనబడే పదమే “స్వతో రంజయతి శ్రో
త్రిమ్” అని చెప్పబడుతూఉంది. ఇలా అన్నా ఉన్నాయి
మడతపేచీలు! “భిన్నరుచిర్హిలోకః’ ఒకరికి ఇంపుగాఉన్నది
మఱొకరికి కంపుగా ఉండవచ్చు! మఱి దాన్ని ఎలాసాధిద్దాం!
ఇలా చర్చ చేస్తూపోయినకొద్దీ ‘విత్తుముందా చెట్టు ముందా’
అనే వాదంలోకి దిగుతుంది పర్యవసానం. “రంజకో జనచి
త్తానామ్” ఎక్కువజనుల్ని సంతోషపెట్టేదీ, ఎక్కువమంది
అనుసరించేదీ, అంటే ఏమన్నమాట! వ్యవహారసిద్ధమైన శబ్దం
వలెనే, ఆ స్వరం, స్వరకలితమైన సంగీతంకూడా, ‘సాధుత్వాన్ని
పొందుతుంది’ అని నమ్మాల్సిందే! ఇందుకు ప్రమాణం!
సభ్యానందమే! అయితే నాటకసభ్యులుమాత్రం రసజ్ఞులు.
ఈ సందర్భంలో రసికజనానందాన్ని మాత్రమే ప్రధానంగా
ఎంచుకోవాలి.

నాటకసంగీతం ఒకప్పుడు భూనభోంతరాళాన్ని ఎంతగా
బ్రద్దలుచేస్తూ ఉంటే అంతగా కొనియాడబడుతూ ఉండేది.
ఆ పిమ్మట ఎన్ని జిలేబీచుట్లుచుట్టుతూ ఉంటే అన్ని సంగతు



లతోగూడినదిగా ఎంచుకో[illegible]డేది. ఇటీవల ఎంత
మొండిముక్కలల్లే త్రు[illegible] అంత ప్రౌఢసంగీ
తంగా పరిగణింపబడడం [illegible] అయితే ఇప్పటి
ప్పుడు రసజ్ఞులంతోపాటు న[illegible] ఆ పద్ధతి పటాటో
పాన్ని బాగా గ్రహించారు. [illegible]ర్థరహితంగా గుడుగుడు
ఘుర్ఘురాల్ని త్రిప్పే కొక్కిరాయిసంగతుల్ని చూచి తృప్తిచెం
దరు. ఇంకా తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదంగా ఉండే
ఈ పద్యాలాపనభండనాల్ని చూచి మెచ్చుకోరు. శ్రుతి
లయాలకుండే సంబంధం ఏ ఆలాపనంలో శ్రవణానందాన్ని
ఇస్తూఉందో, ఇంకా నయభయార్థాల్ని అనుసరించే ఆ సుకు
మారగభీరవాగ్రచనావిజ్ఞానం ఏ ఆలాపనంలో చెవులను సుఖ
పెడుతూఉందో, ఇంతేకాకుండా ఔచిత్యనౌచిత్యాల్ని తల
పించే వాచికపరిమాణం ముఖ్యంగా ఏ ఆలాపనమందు కర్ణేం
ద్రియాలకు ఏకాగ్రతను ఇస్తూఉందో, ఆయాలాపనాన్ని, ఆ
పద్య గద్య గేయాల్ని మాత్రమే చూచి సంతోషిస్తూఉన్నారు
ప్రస్తుత ప్రేక్షకరసజ్ఞులు.

మన రాఘవాచార్యులువారు కేవల ధ్వన్యాలాపనమా
త్రం చేతనే రసజ్ఞుల్ని అందర్నీ సంతోషపెట్టగలుగుతూ
ఉన్నాగనడానికి, అంత పూర్వపుణ్యప్రసాదంగా కనిపించే గాత్ర
సౌకుమార్యం లేదంటాను. ఒకవేళ స్వరసంచారసామర్థ్యాన్ని
జతపఱచి చేసే పద్యాలాపాలవల్ల సభ్యుల్ని అలా ఆకర్షిస్తూ
ఉన్నారేమో అనుకోడానికి, యథాశాస్త్రానుగుణ్యంగా దృశ్య

మయ్యే తన్మయసం[illegible]న్యాలేవీ కనిపింపవంటాను
వారు పాడే రాగా[illegible]ం వాటి ఆలాపనవిధానం
అంతా రసభావ[illegible]ప్రేక్షకుల్ని తన్మయుల్ని
చేస్తూఉండాలంటే [illegible]ఋమ్మాత్రటికీని. మఱేమిటి
ఈద్రావిడ ప్రాణాయ[illegible] అంటారేమో! విధాయకంగా
అన్ని ప్రాణామాలు చేస్తేనేకాని ఆ ప్రసంగసారస్యం ప్రసన్నం
కాదుమఱి! ధ్వనిసముదాయాన్ని, వానివాని హెచ్చుతగ్గు
లనబడే యత్కించిదంతర్భేదాల్ని, స్థాయిస్థలాల్ని, ఒకానొక
విధంగా కల్పించి, తమ గాత్రానికి ధ్వన్యుచ్చారణ సౌలభ్యాల్ని
సంపాదించుకొన్నారు. తన్మూలంగా సుస్వరాపస్వరాల్ని నిర్ణ
యించుకొనే విజ్ఞానాన్నికూడా తమ శ్రవణేంద్రియాలకు
కలిగించుకొన్నారు. అన్నిటికంటే విశేషంగా భావితార్థాన్ని
తత్తదుచితస్ఫుటాస్ఫుటాలాపాల్లోనూ, ఆరోహణావరోహణా
ల్లోనూ, ఒకింత సరసంగా ప్రేక్షకులకు స్ఫురించులాగున
పాడే ప్రౌఢినికూడా పెంపుచేసుకొన్నారు. ఈ కారణాల్ని
పట్టి వీరియందు కనిపించే సంగీతం శ్రోతల కసంతుష్టిని నింప
కుండానూ, మితిని మించకుండానూ, శ్రుతిసమన్వయాన్ని కలిగి
భావ పోషకంగా ఉంటుంది. ఈ రహస్యాన్ని తెలియక
మనలో కొందఱు శ్రావ్యంగా పాడగలిగిన శక్తి ఉండికూడా
దాన్ని మఱుగుచేసుకొని రంగాలమీదపడే పరిభవాల్ని చూ
స్తూ ఉంటే ఎంతైనా జాలి అవుతుంది! 'గతానుగతికో లో
కో నలోకః పారమార్థికః' అని ఊరకేఅన్నారా మఱిపెద్దలు!
కాబట్టే మూఢానుకరణాలు తగవన్నాను నేను.



'మన రాఘవాచార[illegible] వేషాన్నైనా వేస్తూఉ
న్నారంటే ఎక్కడెక్కడిక[illegible]లంగా అలా తరలి
వస్తారేమిటి, ఏ అర్థో[illegible]సముద్రస్నానాలకు
వచ్చినట్లు జనమంతాన[illegible] ఆడేలోపలే అలా
విఱగపడతారేమిటి వారంత[illegible] ముఖసందర్శనానికని!
అదిఅంతాసరే, అప్పూ సప్పూ చేసైనా అలా ఎగపడికొంటా
రేమిటి రూపాయి టిక్కెట్టు నాలుగురూపాయలన్నాను! ఏం
అంత నారమల్లేపాడతారా లేక నటరాజల్లే ఆడతారా'! అని
ఎన్నెన్నివిధాలో అనుకొంటూ ఉంటుంది ఆ ఆటసమయంలో
ఉండే జనసముదాయం అంతాను. అందుకు తగ్గట్టే ఏ
పెద్ద పెద్ద ఆఫీసర్ల నోటవిన్నా ఆయన పొగడ్తలే వినవస్తూ
ఉంటాయి. ఏ ప్లీడర్లు చెప్పినా ఆయన పేరే చెబుతూ ఉం
టారు ఘనంగాను. ఇంగ్లీషు విద్యార్థుల్లో ఈయనకు ఉండే
పలుకుబడి ఇంతా అంతా కాదు. ఇక మిగిలిన సామాన్య
జనులంతా "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరోజనః" అన్న
ట్లు విద్యావివేకులైనవారందఱూ చెప్పకొనేదానికి భిన్నంగా
ఎలా అనుకొంటారు. ఒకవేళ అనుకుందాంఅన్నా విద్యా
ప్రపంచంలోనూ, అధికారిప్రపంచంలోనూ, అసామాన్య
స్థానాన్ని అక్రమించినవారిలో ఒకరుగాఉండే మన రాఘ
వాచార్యులువారివద్ద అలాటి అవకాశంమాత్రం ఎలా
దొరుకుతుంది!

రాఘవాచార్యులువారు బి. ఏ. బి.యల్. పరీక్షలందు
ఉత్తీర్ణులైనవారు. ఇంకా సామాన్యన్యాయవాదులేకాక

అనుసరిస్తూ, శేషించి ... హానిగూఢంగా నిలుపు
కుంటూ, అమాత ... జంగా ఉండే భావగాం
భీర్యాన్ని ప్రకటిం ... గాను. ఇలాగే వీరు
వేసే ప్రతివేషము ... కలిగి, అభినయప్రపం
చానికి ఆదర్శప్రాయం ... దిమటి! కాబట్టే సామా
న్యుల కాసందర్భాలు విశదంకావు. తదితరులు ఎన్ని ఉప
న్యాసాలిచ్చినా అనుభవంకావు. ఇందుకనే 'సచేతసామను
భవః ప్రమాణం తత్ర కేవలమ్' అన్నారు పెద్దలు.

ఏదో ఒకభాషలోనూ, ఒకపద్ధతి అభినయంలోనూ
పెద్ద 'స్వాతంత్ర్యం'అనేది కలిగితే, అది అన్నిటిలోనూ సంకల్ప
మాత్రంచేత సందర్భోచితంగా ప్రసరించడానికి అవకాశం
ఉండకపోదనే అభిప్రాయం విశ్వజనీనమైందే. రాఘవాచా
ర్యులవారు ప్రత్యేకం ఆంధ్ర గీర్వాణాల్లో, ఎంతపాండిత్యంకల
వారు, ఏయే కావ్యాలంకారలక్షణాల్ని పరామర్శించి ఉం
టారు, మొదలైన సందేహాలుకానీ, వాటినిగూర్చి తెలుసు
కొందాం అనే ఔత్సుక్యాలు కానీ మన కక్కఱలేదు. ఇంకా
ఆలోచిస్తే వీరికంటే కొన్ని విషయాల్లో కాకపోతే ఇంకో
కొన్నివిషయాల్లోనైనా సమానులైనవారో ఇంకా అధికులైన
వారో ఉంటారా ఉండరా అనికానీ, వీరిప్పటికి ప్రదర్శింప
కలిగినదానికంటే ఎక్కువైన అభినయవిధానంఅంటూ ఒకటి
ఉంటుందా ఉండదా అనికానీ చర్చించ తలపెట్టడంకూడా అన
వసరంఅని తోస్తుంది. విచారించతగిన అంశంమాత్రం ఒకటి



ముఖ్యంగా కనిపిస్తుంది.

నాటకకళ అనే ... గానాలు ఘనీభవించిన
మూలంగా, ఒక్కని ... పురస్కరించుకొని
అభినయకావ్యస్వరూపంగ ... గిఉంటుందని ప్రాచీనా
ధునిక లక్ష్యలక్షణసమాలోచనంచేత స్థిరపఱచుకొన్నాం.
ఇంకా ధర్మార్థకామాలకంటే మోక్షాన్ని ప్రసాదించడం దాని
ముఖ్యాశయంగా ఉంటుందనికూడా నిశ్చయించుకున్నాం.
మన రాఘవాచార్యులువారుకూడా ఒకానొక సందర్భంలో
ఈ నాట్యోద్యోగాన్ని యోగసాధనంగా చేసుకొంటూ
ఉన్నట్లు సెలవిచ్చి ఉన్నారు. ఇలాటివారి ప్రకటనం, నిజంగా
వినేవినడంలో, ఎంత ఆశ్చర్యాన్నో కలిగిస్తుంది! అది
ధ్రువపడినతర్వాత ఎంతబ్రహ్మానందాన్నైనా కలిగిస్తుంది
మనవంటివారికి! అదే ఆలోచించాల్సిన విషయం.

మన రాఘవాచార్యులువారు నేను చూచినంతవఱకు
మామూలు రూపకాల్నే చదువుతూఉన్నారని చెపుతాను.
ఇంకా ఏమంటానంటే, మామూలురంగాల్లో, బజారీ
తెరల్లో, అక్కడక్కడనుంచి వచ్చిచేరే పదిమంది సభ్యుల్లో
తమయొక్క అభినయప్రత్యేకత్వాన్నిమాత్రమే ప్రదర్శిస్తూ
ఉంటున్నారంటాను. ఏనాడు వీరు నిజమైన రసవన్నాట
కాన్ని సృష్టించడమో, తన్నిష్కళంకానుభవాన్ని ప్రసా
దించడమో కలుగుతుందో,ఆనాటి కది యోగసాధనంగా పరి
ణమించిందని అనుకోడానికి ప్రబలకారణంగా ఉంటుందేమో

మామూలు చొక్కా [illegible] మొదలైనవన్నీ, రామదాసుగారి లౌకిక స్థి [illegible] పమ్మట క్రమక్రమంగా ప్రసన్నపడుచే వస్త్ర [illegible] ర్యాలన్నీ రామదాసుగారి భక్తిభావోద్దీపనక [illegible] ద్యోతకం చేస్తూఉంటాయి. నాటకాంతానికి రామదాసుగారియందు మూర్తీభవించే భక్తిభావస్వరూపం అంతా భావజ్ఞులకు నేత్రానందాన్ని కలిగిస్తూ ఉంటుంది. ఆ మాటలూ, ఆ పద్యాలూ కూడా కేవల భావప్రాపంచికసాంప్రదాయానికే చెందినవి కాకుండానూ, కేవల లౌకికాచారసన్నిహితంగా కాకుండానూ, సమయోచితమైన సౌకుమార్యాది సౌందర్యాల్ని సాక్షాత్కరిస్తూఉంటాయి.

రామరాజు చరిత్రలో వీరు పఠాణివేషాన్ని వేస్తూఉంటారు. ఇందులోకూడా మామూలుగా మనం చూచే ఆహార్యాడంబరాలేవీ కనిపించవు. ఇంకా నిరర్థకభుజాస్ఫాలనాలూ, గర్జనిర్భేదకరాగాలాపాలూ, శస్త్రాద్యాయుధచంక్రమణాలూ, వివిధ వికారావలోకనాలూ, గాద్దద్యాలూ, పెద్దపులిఆటలూ, ఏ రంగంలోనూ దృశ్యంకావు. ఇక్కడకూడా ఒక సామాన్య మహమ్మదీయ సైనికుడగు 'పఠాణి' ప్రథమసందర్శనం, కేవల జాతీయ క్రౌర్య శౌర్యాదులను మాత్రమే తన గడుసుచూపుల పొలుపునేరల్లో దాచుకొంటూఉన్నట్లు కొంచెంగా స్ఫురిస్తూ ఉంటుంది. ఆపైని తందనాలపాటలమూలంగా హైందవజాతియందు విద్వేషం



అంకురించినట్లు అగపడుతుం [illegible] క్రమంగా ఆషాబీపరాభవసమయసందర్శనమూ [illegible] ఇంకా ఆషాబీయొక్క ప్రేరేపణరూపంగానూ, [illegible] అయినట్లుకూడా స్పష్టపడుతుంది. చిట్టచివరకా [illegible] విషానలం ఎంత నిగూఢంగానూ, నేర్పుగానూ, పదిలంగానూ, ప్రతాపంగానూ, రామరాజుని నాశనంచేసిందో, తా నెలా నాశనం అయిందో ఏర్పడుతుంది.

ప్రహ్లాదలో నేనైతే చూడలేదు వీరి హిరణ్యకశిపుని వేషాన్ని. ఇందులోకూడా వీరా పాత్రాన్ని కేవల రాక్షసమయంగా కాకుండా లౌకికానుగుణ్యంగానూ, సత్త్వప్రధానంగానూ సమన్వయిస్తూ, పుత్రప్రేమనుకూడా దిగనాడి శ్రీమహావిష్ణువునందు అనంతంగా ఉండే విద్వేషాన్ని పురస్కరించుకొని, ప్రహ్లాదుని, చతుర్విధోపాయాల్లో సాధించేటప్పుడు కలిగే భావతరంగబాహుళ్యాన్నంతా మిక్కిలి మనోహరంగా ప్రదర్శించినట్లు వింటూవచ్చాను.

చంద్రహాసలో వీరు దుష్టబుద్ధిగా ఉండి చూపిన అభినయప్రాగల్భ్యాల్ని నేనొక పర్యాయం అనుభవించాను. సామాన్యంగా ఆ పాత్ర్యంలో ఆద్యంతమూ తొలకరించే మిత్రత్వ శత్రుత్వాల్ని రెండింటినీ స్థూలాభినయరూపంలో వినికిరి చేస్తూఉంటారు చాలామంది నటసామాన్యులు. మన రాఘవాచార్యులువారు అందలి ప్రధానారాన్ని మాత్రమే

బళ్లారిలో పబ్లిక్ ప్రాసి[illegible]ర్‌గాకూడా పనిచేస్తూఉన్నారు. అనాదినుంచీ అధికగౌర[illegible]కీ, పాత్రంగాఉండే వంశానికి చెందినవారు. వి[illegible]ంగ్లేయ నాటకప్రపంచంలోకూడా పెద్ద ప్రతిష్ఠ[illegible]ారు. ఇంకా కావాల్నంటే తెలుగునాటక పితామహులైన కృష్ణమాచార్యులువారికి కూడా సన్నిహిత బంధువులు. అన్నిటికంటే ఎక్కువైన యోగానందసమాధినిష్ఠాగరిష్ఠులూ, పూజ్యులూ అయిన తారానాథ్‌గారికి ప్రియశిష్యులు. స్వస్థానమైన బళ్లారిలో వీరి నాటకాది సంబంధి మర్యాదలు ఎలా ఉంటాయో చెప్పలేంకాని తదితర ప్రాంతాల్లో వీరి వైదుష్యం కోటిసూర్యప్రభాభాసమానంగా వెలుగుతూ ఉంది అనడానికి సంశయం లేదు.

ఎన్ని సహాయ సంపత్తులు ఉన్నా నిశ్చయమైన విద్యావివేకం లేనివారి కీర్తి ఆచంద్రార్కంగా ఉండడానికి వీలు లేదు. కొంత పాండిత్యం ఉన్నవారికిమాత్రం ఆలాటి ఇతర బలాలన్నీ కీర్తిదోహదంగా ఉంటూఉంటాయి. మన రాఘవాచారిగారికి విద్వత్ప్రపంచంలో గల పలుకుబడికి తగినంత అభినయవిజ్ఞానం నిస్సంశయంగా భగవంతుడు అనుగ్రహించబట్టే, ఇంత జనాదరణాన్ని సంపాదిస్తూ ఉన్నారంటాను. ఈవిధంగా ఆంధ్రనాటకరంగానికి వీరు సంపాదించి పెడుతూఉన్న కాలోచితగౌరవానికి తగినట్లుగా, ఏతత్కాలాభిమానులందఱూ చూపించే కృతజ్ఞతలో, నా కృతజ్ఞతను



కూడా కలుపుతూఉన్నాను అంటాను.

మన రాఘవాచార్యు[illegible] అభినయిస్తూ ఉండగా చూడవెళ్లిన వారిలో ముప్పాతి[illegible]ందిని "ఏలాఉందండీ ఆచార్యులవారి అభినయం" అనిఅడిగితే "ఏమిటోనండీ మాకేమీ అర్థమయ్యే మామూలు అభినయంగామాత్రం లేదుకాని ఏమిటో ఒకక్రొత్త అందంగానూ, ఆనందంగానూ ఉంటుందండీ" అని అంటారు సర్వసాధారణంగాను. ఇంకా ఆ మొదటి రెండు మూడుతరగతుల్లో ఉండేవాళ్ని విచారిస్తే, ఏమేమిటో ఉపన్యాసాలు ఇస్తారు అయోమయంగాను. ఆ రెండువిధాలైన అభిప్రాయాలూకూడా నిజమేనంటాను నేను. ఒక రామదాసు నాటకం తీసుకోండి, లేదా రామరాజు చరిత్రనైనా తీసుకోండి. ఇంకా వారువేసే ప్రహ్లాదనైనా, చివరకు చంద్రహాస్నైనా, ఇంకా దేన్నైనాసరే ఒక్క పర్యాయం చూడండి! రామదాసు వేషంలో మనం మామూలుగా అన్నిచోట్లా చూస్తూఉండే మీసాలూ, గడ్డాలూ, రుద్రాక్షలూ, చప్పట్లూ, తాళాలూ, పాటలు, భజన్లూ, మొదలైన రంగుల్లోనూ హంగుల్లోనూ, కనిపించే గంజాయి బైరాగుల కపటపద్ధతులేవీ మన ఆచార్యులువారి రామదాసు వేషంలో కనిపించవు. రామదాసు చరిత్రంలో నాటకాంశంగా గ్రహింపబడిన ప్రధాన రసావస్థా, దానికి తగిన పూర్వాపరరూపాలూ, వేషాలూ, విషయవిస్తరణాంశాలూ, మాత్రమే దృగ్గోచరం అవుతూఉంటాయి. ప్రప్రథమంలో వా రలంకరించే ఆ

## బ్రహ్మశ్రీ ఎడవల్లి సూర్యనారాయణరావుగారు.

ఎడవల్లి సూర్యనారా…రావుగారు తమ బాల్యావస్థ నంతా గుంటూరులో గడి…రు. కొంతవఱకు ఆంధ్రం తత్తుల్యమైన ఇంగ్లీషు, అక్కఁడ అభ్యసించారు. ఆలా విద్యార్థ్యవస్థలో ఉండేటప్పుడే పూర్వపుణ్యరూపంగా వీరియందు కనిపించే పద్యపఠనసౌలభ్యం, దాన్ని అనుసరిస్తూఉండే ఒకపాటి సంగీతం, భావజ్ఞులకు పరమామోదాన్ని ఇస్తూఉండేవి. దానికి తగిన బహుజనాదరణకూడా అప్పటినుంచే వీరికి సంప్రాప్తిస్తూ ఉండేది. విద్యార్థుల్లో, ఇట్టి వీరి వాక్సౌరస్య ప్రాగల్భ్యాలు, ఎంతో అభిమానాన్ని సంపాదిస్తూ ఉండేవి. ఆవిధమైన ప్రోత్సాహ ఉత్సాహాల్లో, మన సూర్యనారాయణరావుగారికి ఉండే సంగీతానురాగం క్రమక్రమంగా అభివృద్ధి అవుతూఉన్నట్లే, నిర్బంధవిద్యానురాగంకూడా అలాగే పెంపౌతూ ఉండేది.

మన సూర్యనారాయణరావుగారు ఒకపాటి ఆగర్భశ్రీమంతులు కూడాను. అదిగాక సుందరవిగ్రహులు. హూణాంధ్రభాషల్లో స్వతంత్రంగా తమ నిత్యవ్యవహారాల్ని జరుపుకోకలవారు. గుంటూరు ఫస్టుకంపెనీవారి నాటకాలూ, అందు ముఖ్యంగా ప్రసాదరావుగారి పాత్రవైదుష్యం, లక్ష్మీకాంతంగారి సంగీతసారళ్యం, అనుదినమూ చూడ్డంచేతనూ, వినడంచేతనూ, వీరిహృదయంలో పొంగి పొ



ర్లుతూఉండే తత్సారసంగ్రహణౌత్సుక్యాన్ని పట్టి ఎంతెంత ద్రవ్యాన్నో ఖర్చుపెడుతూ…న్ని దేశాలో తిరుగుతూ ఎందఱు నటుల్నో చూస్త ఎందఱిపాటల్నో వింటూ ఎన్నెన్నివిధాలుగానో తమకుఉండే అన్నివిధాలైన అవకాశాల్ని వినియోగిస్తూ ఉండేవారు.

మన ఎడవల్లి సూర్యనారాయణరావుగారి వంశంలో కొంత సంగీతం, కొంత సాహిత్యం, అనాదినుండీ అలంకరించి ఉండేది. తదనుగుణ్యంగానే మన సూర్యనారాయణరావుగారుకూడా విద్యలయందూ, కళలయందూ, సహజమైన అనురాగాన్నీ, అభిమానాన్నీ కలిగి, వీలున్నంతలో పెద్దల్ని దర్శించడం, పెద్దభావాల్ని తెలుసుకోవడం, పెద్దగా సంచరించడం పెద్ద దర్జాను ప్రకటించడం కలుగుతూ ఉండేది. ఈ సమయంలో కొంచెంగా సంస్కృత భాషా పరిచితినికూడా సంపాదించారు. కొన్ని లక్షణగ్రంథాల్ని అక్కడినుంచీ తిరుగ వెయ్యడం ప్రారంభించారు రెండుభాషల్లోనూను. అలాగే ఇంగ్లీషు నాటకాల్నికూడా కొన్నింటిని తడవి, కొన్నింటిని పెద్దలు ఆడుతూ ఉండగాచూచి, కొన్ని అందాల్ని అనుభవించారు. హూణాంధ్రగీర్వాణభాషాభేదాల్లో ఆడేవార్నీ, పాడేవార్నీ, చాలామందిని సందర్శించారు. చాలావిధాలైన విద్యారహస్యాల్నీ, కళారహస్యాల్నీ, కొంత గ్రహిస్తూ గ్రహించినదానికి రెండింతలుగా విమర్శిస్తూ, కాలాన్నిబట్టీ సమయాన్నిబట్టీ, సభనుబట్టీ, సందర్భాల్నిబట్టీ, సహజసుం

దరసౌకుమార్యంతో, సరళావలోకనంతో, సస్మితాలాపంతో సరసంతో, సంగీతంతో, సా  ని సమ్మోహనంచేస్తూ గుంటూరు విద్యార్థిబృందాన్ని అ  వశ్యంచేసికొనేవారు.

అసలుకంటె వడ్డీ హెచ్చైనట్లు అనుభవాన్ని మించిన యశస్సు ఎంతైనా ఆక్రమించడం మొదలుపెట్టింది ఆ గుంటూరు దిశలన్నింటినీని. కాలజ్ఞులైన మన సూర్యనారాయణరావుగారుకూడా తమ కాలాన్ని వృధాగా గడపక, ఈ అంతరంలోనే అలా అలా పరిశ్రమిస్తూ ఉండేవారు. నాటక కళయందు వారికి కలిగిన అభిమానాన్ని అనుసరించి ఆ చేసిన సాధనలు, అప్పటి నాటకలోకంలో కనిపించే మన తెలుగునటులెవరూ చేసిఉంటారని తోచదు. ఎవరైనా చేసినా అన్ని వ్యయప్రయాసలకు లోనై ఉంటారని చెప్పలేం. ఈవేళ బాలగంధర్వుడు బరోడాలో ఆడుతూఉన్నాడంటే మన సూర్యనారాయణరావుగారు పరుగెత్తాల్సిందే ఏ ఫస్టు సెకండుక్లాసులోనో! ఇంకోనాడు ఏ వైద్యనాథ అయ్యరో తంజావూరులో సభ చేయపోతూఉన్నాడంటే, మన సూర్యనారాయణరావుగారు హాజరుకావాల్సిందే! ఈవేళ పేరా సాహేబుగారు ప్లేటు ఇచ్చారంటే, ఆ మఱునాడే మన సూర్యనారాయణరావుగారి ఇంటికి పేకెట్టు రావాల్సిందే! గ్రాంఫోను కంపెనీనుంచి. ఒకప్పుడు గ్రంథపఠనం, మఱొకప్పుడు సంగీతశ్రవణం, వేఱొకప్పుడు అకారసాధకం, ఇంకొకప్పుడు ఫోజులూ, చర్చలూ, ఇంకా కాఫీలూ, ఉప్మాలూ, అత్తర్లూ



పన్నీర్లూ, సిజర్లూ, అందులో ఇంకా ఇంపీరియల్సులూ, నిలువుటద్దాలూ, ప్రక్కఅద్దాలూ  ి చెప్పమంటారు! ఆ దినాల్లో లోకం అంతా చెప్పుకున్న తరక్కుండా ఉండేవి ఆ వివిధవిచిత్రవిధానాలన్నీని!

హరిప్రసాదరావుగారు అంతకంతకు యౌవనదశాతిక్రమణాన్ని సాగిస్తూఉన్నకొద్దీ మన సూర్యనారాయణరావుగారు తత్సామ్రాజ్యసంగ్రహణానికి ఎదురుచూస్తూఉన్నట్లు కనిపించేవి వారు చేస్తూఉండే ప్రయత్నాలన్నీని. "బుభుక్షితానైవ తృణంచరంతి" అన్నట్లుగా అనుభవంలో పిన్నలైనా, ఆశయంలో పెద్దగా కనిపించే వీరి పోకడలు భావిగౌరవాన్ని సూచిస్తూఉండేవి ముఖ్యంగాను. ప్రసాదరావుగారు ఏ నాటకంలో ఏ వేషంవేస్తారో, ఏ పద్యాన్ని ఎలా పాడతారో ఎలా అభినయిస్తారో, ఎలా నడుస్తారో, ఎలా నిలుస్తారో అలాటి అన్నిదారుల్లోనూ, మన సూర్యనారాయణరావుగారు సమంగానూ, ఇంకా అధికంగానూ, నడవాల్నే ప్రయత్నం పట్టుదల, ఉత్సాహం కలిగి ఉండేవారు. ఏది ఎట్లాఉన్నా సూర్యనారాయణరావుగారి నాటకగౌరవాభివృద్ధికీ, ఇంకోవిధంగా ధనప్రాప్తికీ, అవన్నీ ముఖ్యకారణాలైనాయనికూడా చెప్పాల్సిఉంటుంది.

'గుంటూరు ఎమెచార్సు' మన సూర్యనారాయణరావుగారిని పురస్కరించుకొని బయలువెడలిందే. ఏవో ఒకటి రెండు చిన్ననాటకాలు మొట్టమొదట ఆడినా, ఆపిమ్మటనుంచీ

ఘట్టుకంపెనీ చదివే నాటకాల్నే చదవడమందు ఎక్కువ అభిప్రాయాన్ని చూపించే ఘట్టుకంపెనీలో ప్రసాదరావుగారు వేసే వేషాలన్నీ ముఖ్యంగా మన సూర్యనారాయణరావుగారు వేసేవారు. సూర్యనారాయణరావుగార్ని పట్టి అప్పటికప్పుడే కొంతవిద్యార్థిబృందం, మఱికొంత ఉద్యోగిబృందం, ప్లీడర్లబృందం, ఇంకా ఇతరపెద్దలబృందం, పిన్నలబృందం మొదలైన ఎన్నో బృందాలు ఈ ఎమెచూర్సు సంఘాన్ని మంచి పలుకుబడిలోకీ, పరపతిలోకీ తెస్తూ ఉండేవి. ఆ పరపతి, ఘట్టుకంపెనీవారు ఒకమూల నాటకాల్ని ఆడుతూఉన్నా, ఈ ఎమెచూర్సు ఆడడానికి నిలబడేటంత వఱకూ వచ్చింది ఒకకొంత స్వల్పకాలానికి. అంతలోనే ఘట్టుకంపెనీవారికంటే పదింతలుగా ఆదాయం రావడంసాగింది ఈ సమాజానికి. అంతేకాదు. సూర్యనారాయణరావుగారు స్టేజిమీదకు వస్తారనే వర్తమానంరావడంతోటే, ఎప్పుడా ఎప్పుడా అని ఎదురుచూడడం మొదలుపెట్టేవి ఆ బృందంతోపాటు పట్నంఅంతాకూడాను. రంగానికి వచ్చేరావడంలోనే మ్రోగిపోయేది చప్పట్లతో అరగంటవఱకు ఆ హాలుఅంతాను. ఏంచెప్పమంటారు! మన సూర్యనారాయణరావుగారు ఆడినది ఆటగానూ పాడినది పాటగానూ తోచేదిమఱి నిస్సంశయంగాను. ఆదినాల్లోనే అర్జునుడు, సారంగధరుడు, నలుడు, బాహుకుడు, వేణీసంహారంలో ధుర్యోధనుడు, ఇంకా దుష్యంతుడు వేస్తూ తమకీర్తిచంద్రికలచేత ఈ చుట్టుప్రక్కల దేశాల్నన్నిటినీ వెలిగిస్తూఉండేవారు. ఆవిధంగా మన రావుగారు



మొట్టమొదట నటపితామహులనబడిన సుప్రసిద్ధ ప్రసాదరావుగారి గుంటూరుకోటను [illegible]ట్టడించి విజయపతాకాన్ని ఎత్తారు.

మన సూర్యనారాయణరావుగారు పూర్వోక్తవిధంగా సంపాదించిన యత్కించిత్ లక్ష్యలక్షణాత్మక నాట్యవిజ్ఞానం సంగీత పరిజ్ఞానం, విస్పష్టవాచికసారళ్యం, మంజులాంగిక భావాభినయప్రాగల్భ్యం మొదలైన సంపదలన్నిటితో పాటుగా వీరికి పరమేశ్వరు డనుగ్రహించిన సహజముఖసౌందర్యం సస్మితాలాపనం, మనోహరదృష్టిసౌకుమార్యం, అనేవన్నీచేరి నాట్యసార్వభౌమత్వానికి సూర్యనారాయణరావుగారు మిక్కిలి తగినవారని చాటిస్తూ ఉండేవి. అందుకు తార్కాణంగా సౌతు మైలవరం ఎస్టేటు జమీందారులగు మ. రా. శ్రా. శ్రీ. సూరానేని వేంకటపాపయ్యారావు బహద్దరు జమీందారువారు తమ బాలభారతిని వీరి చేతుల్లోపెట్టడం, తన్మూలంగా వీరా బెజవాడ పట్నాన్ని రాజధానిగా చేసికొని కొంచెం ఇంచుమించు తెలుగుజిల్లాలయందంతటా షుమారు పదిపదిహేను ఏండ్లవఱకూ తమ ప్రభుత్వాన్ని నిరర్గళంగా సాగించడం కలిగింది. గుంటూరు హరిప్రసాదరావుగారి తర్వాత అంతకంటేఎక్కువైన సర్వతోముఖనాట్యసాహిత్యాన్నీ సౌకుమార్యాన్నీ, ప్రదర్శించి ఇంతకాలం ఏకచ్ఛత్రాధిపత్యాన్ని సాగించినవారు, ఇంకోరు ఎవరూ లేరని నిస్సంశయంగా చెప్పవచ్చు.

మన సూర్యనారాయణరావుగారు "మైలవరం సమాజం"లో సర్వసాధారణం: ౹డబడే నాటకాలన్నిటిలోనూ నాయకపాత్రాల్ని వేస్తూఉండేవారు. శ్రీ శ్రీ జమీందారు వారుకూడా అందుబనటుల్నీ ఒక ఎత్తుగానూ, మన రావ్రగార్ని ఒకఎత్తుగానూ చూస్తూఉండేవారు. చాలినంత జీతాన్ని ఇచ్చేవారు. అంతేకాక వలయునన్ని సదుపాయాల్ని కలిగిస్తూఉండేవారు. కొన్ని సిరిసంపదలను కలిగి, జమీందారువారి ఆశ్రయంలో, నాటకకళాపరిశ్రమాన్ని విధికృతంగాచేసే మన సూర్యనారాయణరావుగారికి, ఏవిధమైన నిరుత్సాహకారణాలూ కలగడానికి వీలులేకుండా ఉండేది. భగవంతుడు ఇచ్చినదాన్ని ఇంత అనుభవిస్తూ, తనకున్న ధీవిశేషాన్నిఅంతా నాటకపరంగా ఉపయోగిస్తూ, ఇంకా పెద్ద పెద్ద గ్రంథాల్ని తిరగవేస్తూ, ఇతరదేశాల్లో ఉన్న పెద్దనటుల్నిగూర్చి వింటూ, సర్వవిధాలా శరీరాన్ని కాపాడుకొంటూ అంటీనట్లూ, అంటనట్లూ, తన ప్రత్యేకత్వాన్ని ప్రతిష్ఠించుకొంటూ, మైలవరం రంగాలంకారాల్లో, చీని చీనాంబరాల్లో, పాపట్లవారి పాటల్లో, బగ్గన్నగారి బందోబస్తుల్లో, ఎలక్ట్రిక్ దీపాల్లో, ఏ వారానికి ఒక పర్యాయమో అట్టే తొలకరిస్తూ, ఎన్నో తెలివితేటలతో మెలగుతూ ఉండే వీర్ని చూడ్డానికి, ఎంత ఉత్సాహమైనా ప్రబలుతూ ఉండేది ఆ దినాల్లో. ఇదిగాక వీరి రంగప్రవేశంలో కనిపించే కొన్ని ప్రతిభాదివిశేషాలుకూడా ముఖ్యంగా సమ్మోహనపఱుస్తూ ఉండేవి పండిత పామరుల నందఱినీని.



రాజువేషానికి వీరి మూర్తివంతం బహులాయకీగా ఉండేది చూచేచూడ్డంలో. ఆనాటి వేషాలకు తగిపోయే ఆహార్యాలూ, అలంకారాలూ, ౹ా అందుబాటులో ఉండేవి వీరికి. వర్ణలేపనోద్యోగంలోకూడా ఆఱితేరినవారుకాని వట్టివారుకారు మన రావుగారు. సహజకృత్రిమా లనబడే ఉభయమార్గాల్లోనూ, అద్వితీయంగా అలంకరింపబడి కనిపించే మన రావుగారి రాజువేషాన్నిమించేది, ఇప్పటికికూడా లేదనుకొంటాను. అయితే ఆ అందచందాలు ఎక్కడికిలేండి! చూచేవారి కంటిరుచుల్నిబట్టి నిశ్చయింపబడాల్సిఉంటాయి అట్లాంటి వన్నీని. ఇది నా కంటిరుచినిబట్టి చెప్పబడ్డ సత్యం మాత్రమే ఔతుంది.

మన సూర్యనారాయణరావుగారి శారీరం కొంచెం విచిత్రవిధమైందని చెప్పాల్సిఉంటుంది. వినేవినడంలోనే ఝల్లుమనిపించే స్వభావంకలది కాదు. కేవలం సుఖరహితమైందీ కాదు. హీనస్వరంతో ప్రాణాల్ని విసిగించేదీ కాదు. గభీర ప్రౌఢాలాపాలతో అట్టే హృదయాల్ని ఆకర్షించేదీ కాదు. మంద్రమధ్యస్థాయుల్లో ఆ గాత్రాన్ని వింటూఉంటే ఎంతసరళంగానో లయిస్తూ ఉంటుంది శ్రుతిపథంలో. తారస్థాయిని తాకేటప్పుడుమాత్రం తలనొప్పే పుట్టిస్తుంది ఎంత కళాదరిద్రునకైనాను. అదంతా ఆ మొదలుపెట్టిన వేళావిశేషాన్ని పట్టి ఉంటుంది. అదృష్టవశాత్తూ శ్రుతిలో పడిందా ద్రాక్షాపాకమే! దురదృష్టవశంగా దూరమైందా ఏంచెప్పమంటారు! గచ్చకాయపాకమే!

మన సూర్యనారాయణరావుగారి సరసవాచికసారస్యం మాత్రం అద్వితీయమైంది అంటాను నేను. ఎన్ని సమాసాలనైనా ఇవ్వండి! ఎన్ని [illegible]్యలనైనా ఇవ్వండి! ఎన్నిపద్యాలైనా ఇవ్వండి! ఇంకా పాటల్నికూడా ఇవ్వండి మీకుతోచినన్ని! అస్పష్టఅనర్థకాదిదోషాలు ఏమాత్రం రానీయకుండానూ పాత్రస్థాయిని సంకరం కానీయకుండానూ, ఔచిత్యాన్ని విడనాడకుండానూ, ఇంకా భావప్రకటనానికిసహాయంగాఉండే సస్మితాలూ, సరళావలోకనాలూ మొదలైనఅందాల్నికూడా జతపరుస్తూ అంత నిర్దుష్టంగానూ, అంత ఒప్పిదంగానూ, అంత రసభావద్యోతకంగానూ, అంత ప్రస్ఫుటంగానూ, సుందరంగానూ వాచికాభినయాన్ని ప్రదర్శించే రాజవేషధారులు మన సూర్యనారాయణరావుగారే అనడానికి సందేహం లేదంటాను. అయితే పాటలు పాడేటప్పుడుమాత్రం అక్కడక్కడ కొంచెం తప్పటడుగులు ఉంటాయంటాను. ఆ అడుగులైనా తాళాల్లోనేకాని పదాల్లోమాత్రం కాదంటాను. ఆమాత్రాన్ని ఆపద్ధర్మంగా ఎంచుకుంటే నాటకవిషయికం గనుక ఆదరించవచ్చు అంటాను నేను.

మన సూర్యనారాయణరావుగారి అభినయవిధానం యథారూపానుకరణమైందా, అవస్థానుకరణమైందా అనేవిషయంలోమాత్రం కొంచెం ఆలోచనమీదే చెప్పాల్సిఉంటుంది. ఏమంటే! ఆ కాలంలో ఈ సమస్యను పరిష్కరించేటంతపాటి ఆలోచన్లూ, విమర్శన్లూ రాలేదంటాను. ఇంకా ఏమంటానంటే, ఆ కాలానికి ప్రసిద్ధంగాఉండే యథాక్రమానికి అను



గుణ్యంగా ఉండే విధానాల్లో, మన రావుగారి అభినయం ప్రధానంగా ఉండేదంటాను. అదే ప్రసిద్ధంగాకూడా ఉండేదంటాను. కాబట్టే ప్రస్తుత ప్రపంచంలో వీరి పతాకం కొంచెం మందంగా ప్రకాశిస్తూ ఉన్నదంటాను.

## శ్రీమాన్, విద్వాన్, బాలకవి, పంచాంగం వేంకట రామానుజాచార్యులుగారు.

మ॥ రా॥ రా॥ చిట్టూరి వేంకటనరశింహం పంతులుగారిచే స్థాపింపబడి బందరులో ఉండే 'బాలభరత సంఘం' అనేది తన దివ్యదృష్టిచేత ఎక్కడెక్కడ ఉండే భావజ్ఞమూర్తివంతాల్నో దర్శించి సంగ్రహించడంలో అద్వితీయమైన నేర్పును చూపించేంది. ఎన్నెన్నో నవ్యాభిరుచుల్లోనూ నాణ్యాల్లోనూ నగిషీలు చెక్కి, ఆ అన్నిటినీ అన్నిరత్నాలుగా తన రంగంలో రాణింపచేసేది కూడాను. మ॥ రా॥ రా॥ సింగరాజు సాంబశివరావు, కొణకంచి రామమూర్తి, కేదారం సుబ్బరామయ్య, వరదాచారి, మాదిరెడ్డి వీరభద్రరావునాయుడు, లంక సత్యనారాయణ, పారుపల్లి సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి, చిలకలపూడి వేంకటేశ్వర్లు మొదలైన ప్రసిద్ధనటులందఱూ ప్రప్రథమంగా అలా బాలభరత రంగదర్పణంలోనే నేత్రోత్సవాన్ని కలిగించారు. బాలభరతలో ఆ విధంగా వీరి అందఱియందూ మొలకెత్తిన నాట్యప్రతిభాంకురమే ప్రస్తుతం ఆంధ్రదేశమందంతటా విస్తరించిన

కీర్తిశాఖోపశాఖలతో ఒక కల్పవృక్షసదృశంగా దృశ్యం అవుతూఉంటుంది. ఇటీవ[illegible]లంలో ఇంకా ఆపై అందఱికంటె ఎక్కువైన లక్షణాలతోనూ, లావణ్యాలతోనూ, బాల భరతరంగానికి మకుటప్రాయంగా ప్రకాశించిన కౌస్తుభ సదృశులు ఈ మన శ్రీమాన్, విద్వాన్, బాలకవి, పంచాంగం వేంకటరామానుజాచార్యులుగారు!

లోగడ పనిచేసి ఆగిపోయిన రంగాల్లోనూ, ప్రస్తుతం ఆడుతూఉన్న రంగాలలోనూ కూడా, ఏ ఒకటి రెండుసమాజాలలోనో తప్ప, మన ఆచార్యులుగారికి ఉన్నన్ని భరతాది వివిధ లాక్షణికవిజ్ఞానాలూ, అనుభవాలూ కలిగి, ఉభయ భాషాప్రవీణులై నాట్యధర్మాన్ని నిర్వహిస్తూఉన్న నటశేఖరులు ఎవరూ లేరని నిస్సంశయంగా చెబుతాను. ఇంకా వీరియందు కనిపించే శాస్త్రజన్యపరిజ్ఞానాలు ప్రయోగరూపంలో ఎంతెంతవఱకు సమన్వయింపబడి సాక్షాత్కరిస్తూ ఉంటాయో, ఎంతవఱకు ప్రేక్షక జనాకర్షణాన్ని సంపాదిస్తూ ఉంటాయో మనవిచేస్తాను.

ఆచార్యులువారు ఉభయభాషల్లోనూ పండితులు అనడంచేత సర్వసాధారణంగా ఆడబడుతూఉండే చిట్టిపొట్టి చిల్లరనాటకాలను మించిన ప్రౌఢనాటకార్థభావాల్ని అన్నిటినీ బహు సునాయాసంగా అనుభవం చేసికొంటారు. కవి హృదయంఅంతా వీరికి కన్నులకు కట్టినట్లు ఉంటుంది.



ధారాసారళ్యంతో సగుణంగా ఉండే పాఠ్యాన్ని ఎంతైనా ఇతరులకు పట్టేకాలంలో ఒ[illegible] పదోవంతైనదాన్ని తీసికొని కంఠస్థాన్ని చేసే శక్తి కలిగిఉంటారు. ఏవిధమైన వాగ్దోషాల్నీ దొర్లనీయకుండా పాఠ్యార్థాల్ని అన్నిటినీ స్పష్టంగానూ, సక్రమంగానూ, సరసంగానూ, విన్పిస్తారు. పద్యార్థాలూ, భావాలూ ఆచార్యులుగారి వాచికనైపుణ్యాన్ని ఆశ్రయించుకొని ఎంతో అందంగా అగపడుతూ ఉంటాయి సభ్యులందఱికీని. ఇంకా విశేషార్థాల్ని కూడా వినిపిస్తూఉంటాయి పండితులందఱికీని. రమణీయార్థాలు ధ్వనిస్తూఉంటాయి రసజ్ఞులైనవారికి కూడాను.

మన ఆచార్యులుగారికి కేవల సాహిత్యవిశేషమే కాకుండా శాస్త్రీయ సంగీతవిజ్ఞానం కూడా ఉంది ఎంతైనాను. కావాల్సివస్తే ప్రత్యేకంగా పాటకచ్చేరీనిచేసి పరమానందాన్ని ఘుటిస్తారు. సంగీతానికి మాతాపితరులుగా చెప్పకొనబడే శ్రుతిలయలు వీరి అడుగుజాడల్లో అనుగమిస్తూ ఉంటాయి. ఆ కారణంగా వీరు పాడే పాటలూ, పద్యాలూ మొదలైనవి గీతికాతత్త్వప్రతిపాదకాలైన భావరాగతాళాలయొక్క సమిష్టి స్వరూపంలో తొలకరిస్తూ ముద్దులు మూట కట్టుతూ ఉంటాయి. సంగీతశాస్త్రసంపర్కం లేకుండా కేవల శ్రుత పాండిత్యమూలకంగా పాడే మన నవ్యనటుల పద్యపఠనంలోనూ, పాటపద్ధతులలోనూ నిరాఘాటంగాదొర్లుతూఉంటాయి ఎన్నెన్ని రకాలోఅయిన పిచ్చిపిచ్చి స్వరాలు. శ్రవణేంద్రియాలకు పలుగురాళ్ళుగా పరిణమించే అలాటి ధ్వను

లతోకూడిన ఎగుడు దిగుడు ఆరోహణావరోహణాలూ సంకరరాగలక్షణాలూ మన ఆచార్యులుగారికి ఆమడదూరంలో ఉండి జోహార్లు చేయాల్సిందే మీదగ్గరకు రామని! ఇంకా వీరు ఫిడేలూ, హార్మోనియం, వీణ, అనే మూడు విధాలైన జంత్రాల్ని నేర్పుగా వాయించే సమర్థతను కూడా కలవారు అవడంచేత కేవలగాత్రజ్ఞులకంటే ఎక్కువైన స్వరసౌకుమార్యాన్ని ప్రదర్శిస్తూఉంటారు తాము చేసే రాగాలాపనాల్లో.

మన ఆచార్యులుగారి మూర్తివంతంకూడా సర్వాంగసుందరమైందే. ఇంకా ఉదాత్తతేజోవంతమైందికూడాను. ఆ కారణంచేత సర్వసాధారణంగా అన్నినాటకాల్లోనూ నాయకపాత్రాల్ని ధరించడానికి పాత్రంగా ఉంటుంది. ఇంకా తమ ప్రతిభావిశేషంచేత ఆ మూర్తివంతాన్ని నాయికాపాత్రల్లను వేయడానికికూడా అర్హమైనదాన్నిగా చేసికొంటారు వీరు. ఇంతెందుకు! అన్నివిధాలైన ప్రధాన స్త్రీ పురుష వేషాల్ని వీరు ధరింప అర్హులుగా ఉంటారని ఋజువుచేస్తాయి వీరు వేసిన దమయంతి, సీత, రుక్మిణి, ఇంకా చిత్రాంగి, కైక సత్యభామ, మోహిని, కమల, చింతామణి మొదలైన స్త్రీపాత్రాలూ, నలుడు, రాముడు, కృష్ణుడు మొదలైన పురుషపాత్రాలూ అన్నీని.

ఆచార్యులుగారి అభినయపద్ధతి చాలావఱకు భరత



సాంప్రదాయానుగుణ్యంగా ఉంటుంది. భావచిత్రీకరణ ప్రధానులైన శ్రీయుత తాడిపత్రి రాఘవాచారి, స్థానం నరసింహారావుగార్ల అభినయకావ్యాల్లో కనిపించే సహజప్రయోగసౌకుమార్యానికి సన్నిహితంగానూ, తదితరుల ప్రస్ఫుటార్థప్రకటనధర్మాలకు అతిశయంగానూ ఉంటుంది ఆ అభినయవిధానం అంతాను. ఔత్సాహిక నటవర్గంలో చేరినవారూ, ఎన్నడో అవసరార్థంగా రంగానికి ఎక్కేవారూ సంకల్పమాత్రసాధనంగా పాత్రస్వీకరణాన్ని చేసేవారూఅయిన మన ఆచార్యులుగారు, కేవల వ్యావహారికులను అతిశయిస్తూ కళోపాసకులను సమీపిస్తూ ప్రసిద్ధిని సంపాదిస్తూ ప్రేక్షకజనసముదాయాల్ని సంతోషపెడుతూ ఉండడంచేతనే వీరికుండే విద్యాస్వాతంత్ర్యం, కళాపరిజ్ఞానం, ప్రయోగప్రావీణ్యం అసామాన్యమైనవిగా అర్థం అవుతూఉంటాయి అనుభవజ్ఞులైనవారికి.

విద్వన్నటశేఖరులగు మన ఆచార్యులుగారు ఏలూరులో ప్రస్తుతం శ్రీ రాజా మోతే నారాయణరావు జమీందారువారి సీతారామాంజనేయ నాటక సమాజంలో తమ ప్రయోగాభివృద్ధిని ప్రదర్శిస్తూ తత్సామాజిక యశశ్చంద్రికలకు రాకాచంద్రులై ప్రకాశిస్తూ ఉన్నారు. సకలగుణసమర్థులైన మన ఆచార్యులుగారి నాట్యవైదుష్యం, నాటకకళాపోషకులగు శ్రీ. శ్రీ. మోతే నారాయణరావు జమీందారువారి దివ్యాశ్రయంలో స్థానం ఏర్పఱచుకొనడాన్నిబట్టి ఇంక

త్వరలోనది రసానందదాయకం కావచ్చునని నమ్ముతాను.

## బ్రహ్మశ్రీ మాధవపెద్ది వేంకట్రామయ్యగారు.

తెనాలి రామవిలాస సభలో సక్రమశిక్షను పొందిన నటులందరికీ ప్రయోగభావనిశ్చయంలో భేదాలు అంతగా కనిపించవు. కాబట్టే రామవిలాససభ ప్రదర్శనాలుకూడా సమిష్టి సమ్మేళనసౌష్ఠవాన్ని ప్రధానంగా అగపఱుస్తూ ఉండేవి. ఆ కారణంచేత ఏ నాటకాన్ని తీసికొన్నా ఒకరు బాగాచేసారు, ఒకరు బాగాచేయలేదు అనే కుశ్శంకలు కలగడానికి వీలులేకుండా ఉండేది. నటులందరి ప్రయోగనైపుణ్యాలూ ఆ విధంగా సమసిస్తూ "ఏంబాగుందండీ ఆప్రదర్శనం" అనడానికి వీలైన ఒక్కవిధమైన కావ్యస్వరూపాన్ని ఏర్పఱచేది. తత్కావ్యచిత్రీకరణసూత్రానికి ముఖ్యాధారులై • బ్రహ్మశ్రీ భాగవతుల రాజగోపాలంగారు, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు ఉండేవారు. మ॥ రా॥ రా॥ గోవిందరాజులు సుబ్బారావుగారు, బ్రహ్మశ్రీ పెద్దిభొట్ల వేంకటచలపతిరావుగారు స్థానం నరశింహారావుగారు కొంత ప్రత్యేకత్వాన్ని ఆరంభంనుండీ ప్రతిష్ఠించుకొంటూ ఉండేవారు. ఈ సభవారు ప్రదర్శించే నాటకాలుకూడా ఏ నాయికానాయకోభయప్రధానాలైనవోమాత్రం కాకుండా ప్రతాపరుద్రీయంవంటి బహుపాత్రాశ్రయములై ఉండేవి. ఆలాటినాటకాలు అన్నిటిలోనూ పెద్ద పాత్రాల్ని కలవన్నీ పెద్ద చదువులవారికి పోగా



పోగా మన మాధవపెద్ది వేంకట్రామయ్యగారివంతుకు ఏ "వల్లీఖాన్'వంటి పాత్రమో మిగ[illegible]తూ ఉండేది. మన వేంకట్రామయ్యగారు అలా ఉన్నంతలోనే తమకు సహజంగా ఉండే పొంకంతోనూ, పొలపుతోనూ, నిలువుతోనూ, నిర్ణయంతోనూ, ముఖంతోనూ, మురిపంతోనూ, కన్నులతోనూ గాంభీర్యంతోనూ, సంగీతంతోనూ, సాహిత్యంతోనూ, పాఠంతోనూ, ప్రావీణ్యంతోనూ ఏదో ఒకవిధంగా ఎంతపెద్దసభనైనా "ఏదో ఉంది మన వేంకట్రామయ్యగారియందు" అని అనిపిస్తూ ఉండేవారు రంగానికి వచ్చినప్పుడంతాను. రామవిలాససభవారు మొట్టమొదట ప్రతాపరుద్రీయాన్ని బందరులో ఆడుతూఉండగా చూచిన నేనుకూడా ఇదేవిధమైన ఔత్సుక్యాన్ని పొందాను నిశ్చయంగాను.

మన వేంకట్రామయ్యగారి వేషం అట్టే చూచేచూడ్డంలో అంత అద్వితీయసౌందర్యాన్ని ప్రదర్శిస్తుంది అనడానికి ఎందఱో ఉంటారు ఇంతకంటే ప్రత్యేకసుకుమారసుందరపురుషులైనవారు అనిపిస్తుంది. వీరి గాత్రధ్వని సకలాలాపనసౌలభ్యాల్ని కలిగి వినేవినడంలో ఝల్లుమనిపించే సంగీతసాంప్రదాయాన్ని కలిగి ఉంటుంది అనడానికి సంగీతసద్యఃఫలాన్ని ఇచ్చే గాత్రరాజాలు ఎన్నైనా ఉంటాయి ప్రతిచోటాను. అభినయాద్యంతలాలిత్యాన్నీ తత్ఫలితాన్నీ పర్యాలోచించి కావ్యకర్త్రాధికగౌరవాన్ని కలిగిద్దాం అంటే కావ్యకారక ప్రతిభా ప్రాగల్భ్యాలు యథాక్రమానుగుణ్యంగా

ఒకరిద్దరు నటసిద్ధులందు వలె పరిపక్వాలైనట్లు కనిపింపవు. ఇలా ఉన్నా ఒకొక్క ధర్మం[illegible] ఒకొక్క నటశేఖరుని నాట్యధర్మాన్ని సమీపిస్తూ, ఒకప్పుడు గ్రహిస్తూ, ఇంకొకప్పుడు అతిశయిస్తూ, వేఱొకప్పుడు "స్వయంరాజా స్వయంప్రజా" అన్నట్లు వెలుగుతూ ఉంటారు మన మాధవపెద్ది వేంకట్రామయ్యగారు.

చీలినవారు చీలగా మిగిలిన పరివారాన్ని తీసికొని రామవిలాససభ నాటకాలు ఆడుతూ ఉండేటప్పుడు బ్రహ్మశ్రీ వీరరాఘవస్వామిగారివద్ద చేసిన అభ్యాసఫలితంగా ప్రత్యేక ప్రశంసలకు చాలవఱకు పాత్రమౌతూ ఉండేది మన వేంకట్రామయ్యగారి శివాజీ వేషం. ఇంకా వీరి గభీర సుందర ముఖాకారం, తద్గతవిశాలలోచనయుగళం, చిత్రకారోపదిష్ట వస్త్రభూషణాద్యలంకారం మొదలైనవికూడా తత్పాత్రానుగుణ్యంగా శోభిస్తూ ఉండేవి. ఆ మాటా, ఆ పాటా, ఆ దర్జా ఆ దర్పం, ఆ డవులూ, ఆ సొరూ, అంతాకలిసి శివాజీ రూపానికీ, తత్త్వానికీ ఎక్కడలేని సిరిసంపదలనూ పెంచేవి. చిరాభ్యస్తమగు తదభినయంకూడా అలవాటు అయిపోయింది మన వేంకట్రామయ్యగారికి. ఎన్నిపర్యాయాలు చూచినా ఆ కుదురుపాటుకు కొఱత కనిపింపదు అణుమాత్రమైనాను. పాత్రౌదార్యాలను సాక్షాత్కరిస్తూ ఉంటుంది ఆ ప్రయోగ పంథా అద్యంతమూను.

ప్రస్తుతం "శ్రీకృష్ణనాట్యసభ" అనేదాన్ని స్వయంగా స్థాపించారు మన వేంకట్రామయ్యగారు. ఇదీ అదీ అని



లేకుండా అన్నివిధాలైన వేషాల్ని వేస్తూ, అన్ని భావాల్ని అభినయిస్తూ, ఎంతో కీర్తిని [illegible]స్తూ, ఇంతకుముందు 'ఏదో ఉంది వీరియందు' అనే ఔత్సుక్యానికి కారణంగాఉండే ప్రతిభాలేశం, వీరి పూర్వపుణ్యంచేతనూ, అభ్యాసవిస్తారంచేతనూ అభివృద్ధియై 'అన్నీఉన్నాయి అవసరమైనంతవఱకు' అనడానికి పాత్రంగా ఉంటుంది.

## బ్రహ్మశ్రీ. కపిలవాయి రామనాథశాస్త్రిగారు.

ప్రస్తుతం తెలుగునాటకరంగాల్లో ప్రతిదినమూ కనిపిస్తూఉండే నటుల్లోనూ, నాట్యంలోనూ, ఒక విధమైన నవ్యపద్ధతినీ, నవ్యానందాన్నీ ప్రదర్శిస్తూ, ముఖ్యంగా తమ వాచిక ప్రౌఢపద్ధతిమూలంగా అశేషజనుల అనురాగానికీ, ఆశీస్సులకీ, పాత్రం అవుతూ ఉన్నది ఎవరయ్యా అంటే, మన కపిలవాయి రామనాథశాస్త్రిగారిని మొట్టమొదటగా చెప్పాల్సి ఉంటుంది అంటాను.

రామనాథశాస్త్రిగారు 'మైలవరం బాలభారతీ సమాజం'లో ఎడవల్లి సూర్యనారాయణరావుగారి తర్వాత పట్టాభిషేక పాత్రత్వాన్ని సంపాదించారు. అచ్చటి పాటపద్ధతులూ, ప్రసంగపద్ధతులూ, ఇంకా అనేక విధాలైన పద్ధతులూ, అలవాటుపడినవారిలో మఱికొంతమంది కొన్నివిధాలుగా ఎన్నికలోకి వచ్చినవారు ఉన్నప్పటికీ, రామనాథశాస్త్రిగారివలె ఆ

కలిగిన అభ్యాసానుభవాల్ని అంతా నవ్యనాటకోచితమైన వాచికలావణ్యాన్ని కలిగించడానికి కారణంగా చేసికోకలిగిన ప్రతిభావిశేషం కలవారుమాత్రం ఇంకోరు లేరంటాను ముమ్మాటికీని. ఇంకా ఎడవల్లి సూర్యనారాయణరావుగారి తర్వాత పద్యాలనూ, పాటలనూ పాడడంలో ఉండేనేర్పును ఇదివరకెన్నడును అనుభవించియుండని విధంగా ప్రదర్శించడానికి కూడా ముఖ్యకారకు లయ్యారంటాను నేనీ రామనాథ శాస్త్రిగారిని!

రామనాథశాస్త్రిగారి శారీరం 'ప్రభూతభాగ్యవిభవైస్సుశారీరమవాప్యతే' అనడానికి తార్కాణంగా ఉంటుంది. ఆ సంగీతంకూడా కేవలం సాధనాసాధితమైంది కాకుండా రసభావసమన్వయీభూతసారవంతంగా ఉంటుంది. ఎటువంటి హృదయాలనైనా కదలిస్తుంది తదాలాపనవిధానంకూడాను.

రామనాథశాస్త్రిగారు బహు దుర్బలకాయంతో కనిపిస్తారు. ఆంగికసంపదలు తదనుగుణ్యంగానే ఉంటాయిమఱి విధాయకంగాను! వీరి కడుపులోఉండే ఊహాలల్నీ ఆ దుర్బల కపోలాల్లోనూ, కన్నుల్లోనూ, ముఖంలోనూ, మనోజ్ఞంగా బయటపడాలంటే నిజంగా ఇంకో అవతారాన్ని ఎత్తాల్సిఉంటుంది వీరు! ఏదో ఒక కళంకం పెడతాడు భగవంతుడు!

రామనాథశాస్త్రిగారు స్త్రీవేషాల్ని మినహాయిస్తే ఇక మిగిలే అన్నివిధాలైన వేషాల్నీ వేయడానికి పాత్రంగా



ఉంటారు. అలాగే వేస్తూఉంటారు కూడాను. ఆ దైవికంగా వీరియందు లోపింపబడ్డ తనూసౌష్ఠవాన్ని పట్టి వీరి వేషాలకొఱకు ఏ తేదీనో కనిపెట్టుకొని ఉంటూఉండనక్కఱలేకుండా, ఏ పదిమంది మధ్యను కూర్చోపెట్టుకొని విన్నప్పటికీ, వీరి వాచికవైదుష్యం నాట్యరంగమందున్నప్పటివలెనే సంతృప్తిని కలిగిస్తుంది. అది ఒకవిధంగా శ్రోతలకు పెద్ద సదుపాయంగా ఉన్నట్లుకూడా తోస్తుంది. అయితే కాలకర్మవశంగా వీరి పద్యపఠనంలో ఇటీవల కొంతకాలంనుండి అక్కడక్కడ తలచూపుతూఉండే వెఱ్ఱివెఱ్ఱి వెకిలికేకలూ బొబ్బరింతలూ ముందుముందు అభివృద్ధి అవడంఅంటూ తటస్థపడితే, ఆ కాస్త ప్రాగల్భ్యం పటాపంచలు అవుతుందేమోనని జాలిపడతాను.

మ॥ రా॥ రా॥ పారుపల్లి సుబ్బారావుగారు.

'బాలభరత సంఘం'లో పారుపల్లి సుబ్బారావుగారి 'విమల'వేషం ప్రప్రథమంగా బందరుపౌరులకు ఎంతైనా నేత్రోత్సవాన్ని కలగించింది. అలాగే మఱికొన్ని నాయికాపాత్రల్ని వేస్తూ, తమ సహజసౌందర్యంచేతనూ, ముఖభావప్రకటనాధిక్యంచేతనూ, యత్కించిత్ సరససంగీతంచేతనూ మనోహరంగా అభినయిస్తూ క్రమానుగతమైన సరపతిని సంపాదిస్తూఉండేవారు. ఆపిమ్మట తెనాలి మొదలైనగ్రామాల్లోనూ మఱికొంత కాలానికి మద్రాసు 'సుగుణవిలాస సభ'లోనూ

నాట్యోద్యోగాన్ని చేసి, చివరకు బెజవాడ 'బాలభాతీసమాజం' లోని ప్రధాననటుల్లో ప్రశస్తులై ఉంటూవచ్చారు. ప్రస్తుతం స్వతంత్రంగానూ, అస్వతంత్రంగానూ తన నాట్యధర్మాన్నినిర్వహిస్తూ, కొంతవఱకు వసతినీ, కొంత ద్రవ్యసంపత్తినీ మఱికొంత కీర్తినీ కలిగి, నాటకప్రపంచంలో ఒక నక్షత్రతుల్యంగా వెలుగుతూ ఉన్నారు!

మన పారుపల్లి సుబ్బారావుగారికి తెలుగులో కొద్దిగా ప్రవేశం ఉంది. సంగీత విద్వాంసులూ, వీరి జ్యేష్ఠ సోదరులూ అయిన మ॥ రా॥ రా॥ రామకృష్ణయ్యగారివద్ద అభ్యసింపబడిన శాస్త్రీయసంగీతం కూడా కొంతఉంది ఈ సుబ్బారావుగారియందు! దానకి తోడు సహజంగాఉండే శ్రుతిజ్ఞానం లయజ్ఞానం, ఇంకా రాగజ్ఞానం అనేవి సుబ్బారావుగారి నాట్యవృత్తికి దివ్యసాధనాలుగా ఉంటాయి. 'బాలభారతీ' వారి పద్ధతినాటకాల్లో కనిపించే పాపట్లవారి పార్శ్వపాటల పసందులూ, వర్ణలేపనరహస్యాలూ, బగ్గన్నగారి తబలా దరువు మెఱుగులూ, రకరకాలైన రమణీయ భావచిత్రాలంకారాలూ, ప్రసంగాలూ, ప్రవేశనిష్క్రమాలూ, పోజు పొలుపులూ మన సుబ్బారావుగారి హృదయంలో చక్కగా సమసించిపోయినాయి! ప్రస్తుతనాట్యప్రపంచాన్ని అంతా కదిలించేస్తూ ఘనంగా చెప్పుకొనబడుతూ రాజ్యంచేసే 'గంధర్వ'గారి గ్రాంఫోన్ ప్లేట్లకుచెందిన పాఠాంతరాలు, వీరి అభ్యాసాలాపాల్లో అణిగిపోయినాయి ఎన్నైనాను! ఇంకా ఆ



పాటల్ని పాడడానికి పండితుడుగా చెప్పుకొనబడే, బ్రహ్మశ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావుగారి సహవాసంకూడా మన సుబ్బారావుగారి సంగీతానికి ఎంతసారస్యాన్నైనా కలిగిస్తూఉంటుంది!

మన సుబ్బారావుగారు భావితార్థప్రకటనంలో బాగా నిగ్గుతేలినవారు. ఉదాత్తనాయికాపాత్రతత్త్వాన్ని ప్రదర్శించే విషయంలో, వీరికి భగవంతుడు అనుగ్రహించిన ఆ బలిష్ఠ దేహసౌందర్యం, ఆ బరువుమాటలూ, ఆ మందయానం, ఆ విస్పష్టవాక్కులూ, చాలా సహకారులుగా ఉంటాయి. మ॥ రా॥ రా॥ ముప్పిడి జగ్గరాజుగారి తర్వాత ఉదాత్తనాయికా పాత్రల్ని వేసేవారిల్లో, ఇంతటి సురూపసుందరభావగాంభీర్యాన్నీ, రూపాన్నీ ప్రదర్శించి, కీర్తి గడించినవారు ఎవరూ లేరని నిస్సంశయంగా చెప్పవచ్చు.

మన సుబ్బారావుగారికి బాలభారతిలో కలిగిన సర్వతోముఖనాట్యసాహిత్యసాంప్రదాయం అంతా 'రాధాకృష్ణ' నాటకంలో, వీరు రాధాదేవిగా రంగానికి వచ్చినప్పుడు, ఆద్యంతం వీరి అభినయమందు ఎంతైనా సరసంగా సాక్షాత్కరిస్తూ ఉంటుంది. సహజ స్తబ్ధత్వంతోనూ, సారళ్యంతోనూ, అదొక విధమైన ఔచిత్యాన్నీ, ఔదార్యాన్నీ, ప్రదర్శించే వీరి సత్త్వం, రాధామనోహర ఉదాత్తమానసికతత్త్వాల్నీ భావాల్నీ, ఎంత సులభంగానో సమసిస్తూ, అప్రయత్నాభినయానికి మార్గంచేస్తూ ఉంటుంది. సహజవిశాలావలోకన వీచికాసహస్రాల్లో, ఎన్నెన్ని లలితార్ద్రతీక్ష్ణాదిభావబుద్బు

దాలో నృత్యం చేస్తూఉంటాయి! స్ఫుటాస్ఫుటవివిధవాచిక వికారాలుకూడా కావ్యార్థదశల్ని అన్నిటినీ కన్నుల కట్టిస్తూ ఉంటాయి! ఇంకా ఆ నవ్యనాగరికనానాహార్యాలూ, నగిషీ ముస్తాబులూ, నడకలూ, నవ్వులూ, అన్నీ చేరి మన సుబ్బారావుగారి రాధావేషాన్ని, ఒక 'రవివర్మ'గారి సజీవ చిత్రాన్నిగా చేస్తూ ఉంటాయి! కవిహృదయం అంతా మన సుబ్బారావుగారి అభినయవ్యాఖ్యానాల్లో మంచి కట్టుబట్టం గానూ, కన్నుల పండువుగానూ కనిపిస్తూ ఉంటుంది! ఈ వేషమే వీరి సర్వైశ్వర్యాలకూ కారణమైందంటాను ముమ్మాటికీని.

## మ॥ రా॥ రా॥ స్థానం నరశింహారావుగారు.

వ్యాస వాల్మీకులు, భరతమహర్షులు • మొదలైన మహామేధావులు ప్రసాదించిన కావ్యనాటకాది వివిధకళాదృశ్యాల్లో అలంకరింపబడిఉండే రమ్యాంశాలన్నీ, లాక్షణికుల శాసన రూపాలుగామారి భాషాప్రపంచాన్ని పరిపాలిస్తూ ఉంటాయి ఇప్పటికీనని భావజ్ఞులందరికీ తెలిసినవిషయమే. ఆ శాసనాలన బడేవి ఆయా వివిధలోకాచారసాంప్రదాయాల్నీ, అభిరుచుల్నీ ఇంకా సమయాన్నీ, కాలాన్నీ పురస్కరించుకొంటూ, స్వతస్సిద్ధమైన ధర్మసూత్రాన్ని అనుసరించుకొంటూ, కార్యకారణాలుగా ఉండే, ఒకపాటి సంస్కరణాల్ని పొందుతూ ఉంటాయనికూడా మన కందరికీ బోధపడుతూ ఉంటుంది ప్రస్తుత



ప్రయత్నాలన్నిటినీపట్టి చూస్తేను. ఇలాటి మార్పులూ మర్యాదలూ, ఒక్కొక్క సమయంలో, ఒక్కొక్క ధీవిశాలుని ఆశ్రయించుకొని బహుళప్రచారాన్ని పొందుతూ ఉంటాయి. ఏతాదృశనవ్యభావప్రసిద్ధు లందఱూ మహాపురుషులుగా ఆపిమ్మటివా రందఱిచేతనూ పరిగణింపబడుతూ ఉంటారు కూడాను! భవభూతి పలికిన "ఉత్పత్స్యతేహి మమకోపి సమాన ధర్మా కాలోహ్యయం నిరవధిః పృథులాచపృథ్వీ" అనే ధర్మం కూడా ఈ సత్యాన్నే ఋజువుచేస్తూ ఉంటుంది.

స్థానం నరశింహారావుగారు అట్టే పెద్దపాటి ఉద్యోగిపాయాలుకానీ, విద్యలుకానీ, సిరిసంపదలుకానీ, కలవారు కారు. అట్టే బారుల్లోకానీ, క్లబ్బుల్లోకానీ, కచ్చేరీల్లో కానీ, పలుకుబడి కలవారూ కారు. నాట్యలోకంలోనైనా వీరి భావాభినయవైదుష్యాన్నిచూచి నిష్కళంకంగా మెచ్చుకొనేవారికంటే, మాతులూ, ముక్కలూ, విఱుచుకొనేవారే ఎక్కువగా ఉంటారనికూడా అనుకుంటాను. ఏది ఎలాఉన్నా వీరికికలిగిన అనుభవానికీ, ఆదరానికీ, ముఖ్యాశ్రయంగాఉండే రామవిలాససభ కూడా స్థానభ్రష్టమైపోయింది. ఇట్టి స్థితిగతుల్లో ఊగులాడుతూఉండే మన నరశింహారావుగారి ప్రతిభావిశేషం క్రమాభివృద్ధిని పొంది పెక్కువిధాలైన అభినయ చమత్కారాల్లోనూ, రసభావసాంప్రదాయాల్లోనూ, ఆదర్శప్రాయమైన అగ్రస్థానాన్ని అధిష్ఠిస్తూ రసానందాన్ని ప్రసాదిస్తూ ఉన్నదంటే, ఏతాదృశమైన అద్వితీయధీవైభవానికి కొంత

వఱకు పూర్వపుణ్యం, మఱికొంతవఱకు యత్నించివసామాన్యప్రయోగపగజ్ఞానం ముఖ్యకారణాలుగా ఉండాల్సి ఉంటుందని నిశ్చయమౌతుంది ప్రతి పవిత్రహృదయానికీని.

చాలామంది నాట్యోద్యోగులకు భగవత్ప్రసాదితాలైన అందాలు ఎన్నెన్నో,పరిపరివిధాలుగా కీర్తిని సంపాదించడంలో సాయపడుతూ ఉంటాయి. ఒకరియందు అంగసౌష్ఠవం,ఇంకొకరియందు స్ఫురన్నేత్ర వైశాల్యం, వేఱొకరియందు మంద స్మితం, మఱియొకరియందు సురుచిరకపోలలావణ్యం, ఇంకా చక్కని గాత్రం, నడక, నీటు మొదలైనవి, అలాటివానిలో ముఖ్యంగా చెప్పుకోతగి ఉంటాయి. చక్కని ముఖాంగిక సంపత్తు కలవారు, వేషాన్ని వేసికొనే అవసరంలో, అంతగా కష్టపడుతూ చిత్రకళా నైపుణ్యాన్ని జతపఱచుమూలంగా క్రొత్త అందాల్ని తెచ్చిపెట్టుకోవాల్సిన అవసరం ఉండదు. సహజమాధుర్యాన్ని ప్రకటించే గాత్రాన్ని కలవారి రాగాది వివిధాలాపనాలు, వినేవినడంలో శ్రవణానందాన్ని కూర్చేటంత సులభంగా,తదితర సామాన్య గాత్రజ్ఞుల గద్యపద్యగేయాదులేవీ శ్రోతల నాకర్షించవు. కొద్దో గొప్పో పెద్దదర్జా జీవనాన్ని గడపుతూ పెద్దలుగా సంచరించేవారికి, ఒకవిధమైన పెద్దవేషాలన్నీ, అనుకరించడానికి సులభసాధ్యంగా ఉండేటంతగా, తదితరులకు ఏమాత్రం సన్నిహితంగానూ ఉండవు. పురుషపాత్ర ధారణావసరాల్లోనే ఇన్నిన్నివిధాలైన అనుకూల్యప్రాతికూల్యాలు కనిపిస్తూఉంటే, అసలు సృష్టిలోనే ముఖ్యమై



న జాతిభేదాన్ని కనపఱుస్తూ అన్నివిషయాల్లోనూ ఆద్యంతమూ పురుషజాతినుండి భేదించే స్త్రీజాతికీ, అందులో ఇంకా ఉత్తమ మధ్యమాధమాద్యనేక తరగతులకూ చెందే పాత్రల్ని ధరించడంలోనూ, వానివాని భావాల్నీ, తత్త్వాల్నీ ప్రదర్శించడంలోనూ పురుషులైన నటులకు ఉండే అనుకూల్య ప్రాతికూల్యాలు ఎన్నని చెప్పడానికి సాధ్యమౌతుంది. ఇలాటి స్త్రీపాత్రల్ని ధరించడంలోనూ, వాని వాని సాత్త్విక సాంప్రదాయాల్ని సరసంగా ప్రదర్శించడంలోనూ ఉండే కీలకాన్ని పూర్వపుణ్యంచేత కాకపోతే, మన స్థానం నరశింహారావుగారు, ఏ ఇప్పటి నటాగ్రేసరునుండి సంగ్రహించారంటారో చెప్పండి చూద్దాం! పోనీ పాత్రనూ, దాని పాఠ్యాన్నీ కారణమాత్రంగా చేసికొంటూ మన నరశింహారావుగారు రసభావపరంగా చేసే ఆ వివిధాభినయవ్యాఖ్యానాలూ వ్యాసంగాలూ, ఇప్పటి ఏ నటాగ్రేసరుని కావ్యకోశంనుండి సంగ్రహించారంటారో చెప్పండి మఱి చూద్దాం!

ఇప్పట్లో ఏదో విధంగా పెద్ద పేరులోకి వచ్చిన నటులందఱూ అవలంబించిన పద్ధతుల్ని పట్టి చూస్తే, ఎంతెంత కాలమో, ఎన్నెన్ని విధాలైన అభ్యాసాలకో, కష్టాలకో గడుసు పోకడలకో లోనై, ఏదో ఒక విధమైన చిత్రీకరణ నైపుణ్యాన్నో, లేక సంగీతసౌకుమార్యాన్నో, ప్రయోగ దార్ఢ్యాన్నో సంపాదించుకొన్నట్లుగా ద్యోతకమౌతుంది. అల్లాగా అలవఱచుకొన్న ప్రయోగప్రత్యేకత్వాన్ని ప్రకటిం

చేవారు ఎంద రెందఱో ఉన్నారు ప్రతి ఊరూరానూ. అలా ఉన్న వారిలో ఇందలి ప్రత్యేకశీర్షికల క్రింద గ్రహింపబడిన ఈ ఆరేడుగురులో కూడా, ఏ ఒకరిద్దఱో తప్ప,ఇంకెవరియందునూ సర్వతోముఖమైన ప్రయోగసమన్వయస్వరూపం సాక్షాత్కరిస్తూ ఉన్నట్లు కనిపించదు.మన స్థానం నరశింహారావుగారు ఆ ఒకరిద్దఱువలెనైనా కేవలం అభ్యాసపూర్వకంగా కాని పురాకృతసుకృతవిశేషంగా కాని తమ నాట్య వైదుష్యాన్ని ప్రదర్శించేవారు కాక ప్రయత్నాప్రయత్నాలతో కూడిన నవ్యనాట్యవిశేషాన్ని ప్రకటిస్తూఉన్నారనడానికి ఎన్నో కారణాలు కనిపిస్తాయి నిస్సంశయంగానూ.

నరశింహారావుగారు తమ దృష్టి పథంలో ఉండే వ్యక్తులందఱి లావణ్యాల్నీ సవిమర్శంగా అవలోకిస్తూ ఆయా అంతరాలు వారి వారి వ్యక్తిత్వాల్ని ప్రబోధించడానికి ఎలా కారణాలుగా ఉంటాయో కనిపెట్టడంలో చాలా ఔత్సుక్యాన్ని కలిగి ఉంటారు. ఒకప్పుడు శోకాద్యశేషానుభవాలికి ఆశ్రయమైన భావాంశాలన్నీ ఆసాంతానికి ఎలా సంతోషానికి పాత్రాలు అవుతూ ఉంటాయో, ఆయాభావాల్ని ఆలంబించి నడిచేవారూ, నవ్వేవారూ, ఆడేవారూ, పాడేవారూ పిన్నలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ, ఉత్తములూ మధ్యములూ, మొదలైనవారందఱూ, ఎలా ఎలాంటి సాంజ్ఞల్లోనూ, సంచారాల్లోనూ తమ తమ స్థాయిభావాల్ని సాక్షాత్కరిస్తూ ఉంటారో, అవన్నీ కూడా బహు నిలకడగానూ



నిపుణంగానూ లక్షిస్తూ ఉంటారు. అంతే కాకుండా ఆయా వ్యక్తుల సుఖదుఃఖాల్ని సహితం స్వీయానుభవాలుగా చేసుకొంటూ ఏ సమయంలోపడితే ఆ సమయంలో ఇంట్లో ఉన్నా, బయటఉన్నా, ఒంటరిగా ఉన్నా, మిత్రసహితులై ఉన్నా, దేన్నో చూస్తూ ఒకప్పుడు అట్టే జాలిపడుతూ ఉంటారు. ఇంకొకప్పుడు దుఃఖిస్తారుకూడాను. మఱొకప్పుడు చిద్విలాసం పడతారు.ఏమేమో భావిస్తారు.ఎంతెంతో అనందిస్తారు. ఇలాటి లక్షణాల్నన్నిటినీ పట్టి మన నరశింహారావుగారిని ఒక పెద్ద భావయోగీశ్వరునిగా ఎంచుకుందాం అంటే, అంత లోతైన ఆత్మానుభవాలుకానీ, చిదానందస్వరూపాలుకానీ కనిపించవు. ఏదో ఒకపాటి సామాన్య సాహిత్యం, సత్సాంగత్యంమూలంగా జతపడిన భావపరిశీలనలక్షణంగా మాత్రమే ఎంచుకోవాల్సి ఉంటుంది ఆ విచిత్ర వికారాన్ని. అయితే పాత్రౌచిత్యచిత్రీకరణాన్ని ప్రధానంగా చిత్రించే వీరి అభినయానికి మాత్రం, అది ఎక్కడలేని ఆనుకూల్యాన్నీ జతపఱుస్తూ ఉంటుందంటాను నిశ్చయంగానూ.

నరంశిహారావుగార్ని లక్షణ గ్రంథాల్లోఉండే శ్లోకాల్ని వేనినైనా అడిగితే ఏకరువు పెడతారని అనను. ఇంకా అభినయశాస్త్రాంశాల్ని అన్నిటినీ యథావిధిగా పరిక్షిస్తారని కూడా అనను. అలాగే స్వీయాది నాయికాభేదాల్ని కానీ, తదితరనాయకాదిభేదాల్నికానీ యథాక్రమంగా అట్టే అడగడంతోటే, తద్రూపాల్నన్నిటినీ ప్రత్యక్షం చేస్తారని

కూడా అనను. అయితే ఏదైనా కావ్యాన్ని ఇస్తే దాని ప్రధాన గుణాన్ని విన్పిస్తా రంటాను విబుధసమ్మతంగాను. ఇంకా ఆయా కావ్యార్థాల్ని కూడా సక్రమంగా ప్రసన్నపఱచ గల సుకుమారాంగిక వాచికాద్యభినయ భేదాల్ని అన్నిటినీ ప్రదర్శిస్తారంటాను ప్రాజ్ఞజనవిహితంగాను. కావ్యఫలానికి ఆశ్రయంగా ఉండే నాయికా నాయకుల తత్త్వాల్ని అనుభవ పూర్వకంగా ఏర్పఱుస్తారంటాను సకలలక్షణలక్షితంగాను. ఈ కారణాల్ని పట్టి అనుభవ ప్రధానులైన వీరి అభినయ చిత్రీకరణ విధానం అంతటికీ, వీరే ప్రధానులుగా ఉంటారంటాను. ఇట్టి వీరి అభినయదర్పణంలో ప్రతిబింబించే యత్కించిదాధునిక లావణ్యాలూ, లక్షణాలూ మున్నైనవన్నీ మఱియొక నవ్యాభినయదర్పణనిర్మాణానికి దారి చూపిస్తూ ఉంటాయంటాను కూడాను. దీనికి సాక్షులు ఎవరంటారా ఏమిటి! శాస్త్రజ్ఞులైనవారందఱూ వీర్ని ఒక పర్యాయం రంగంమీద చూడ్డం అంటూ తటస్థపడితే ఏకగ్రీవంగా అలాటి అభినయాంశాల్ని అన్నింటినీ వినిపిస్తారంటాను.

నరశింహారావుగారు అట్టే భాషాప్రవీణులు కారు కావ్యకర్తలతో వాదులు ఆడ్డానికి! బలశాలులూ కారు గ్రుద్దులాడడానికైనాను! స్వంతంగా వాగ్మయకావ్యాన్ని ఎలా సృష్టించుకొంటారు. ఏదో ఒకదాన్ని గ్రహించాలి మఱి తప్పకుండాను. అందులో కూడా జనాభిరుచుల్ని పాటించాలి మఱి ఆర్థికంగాను. ఏది ఎట్లా ఉన్నా కేవలం కళానుభవా



నందాన్నే ఆనందిస్తూ తదితర జగత్తునంతా అట్టే త్యజించే పాటి మహా తపశ్శాలురుతో పోల్చడానికా, ఎంతమాత్రమూ వీలులేని కేవల లౌకికులలో యత్కించిదనుభవజ్ఞులు మాత్రమే అయిపోయారు మన నరశింహారావుగారు. కాబట్టే ఏ రోషనారనో, ఏ సారంగధరనో, ఏ హరిశ్చంద్రనో గ్రహిస్తారు మఱి కక్కుర్తికి. మామూలు తెరల్లోనూ, రంగాల్లోనూ ఆడతారు మఱి అవసరానికి. అలాగే ఎవర్నో కొందఱిని అడ్డం పెట్టుకొంటారు మఱి అడ్డానికి. ఇన్ని విధాలుగా వ్యభిచరించిన నాట్యోద్యోగాన్ని మన నరశింహారావుగారు విధిలేక సాగిస్తూ ఉన్నా, ఆ ఉన్నంతలోనే తమ భావస్వాతంత్ర్యాన్ని మాత్రం నిలువపెట్టుకొంటూ ఉంటారు తప్పకుండాను. ఇట్టి యా యభినయరూపంలోనే ఒకప్పుడు కావ్యరూపాన్ని కూడా మఱుగు చేసేస్తూ ఉంటారు సమగ్రంగాను. కాబట్టే కావ్యకర్తల్లో చాలామందికి, పాపం! మన నరశింహారావుగారు కొంచెం కంటకంగా ఉంటూ ఉంటారు!

ప్రస్తుత నాట్యలోకంలో కొంచెం కదిలించి చూడండి ఏ నవ్యనటాగ్రేసరునైనాను! ఎన్నెన్ని విధాలైన అహమహమికాలాపాలూ, ఆత్మస్తుతులూ, పరనిందలూ పడజిమ్ముకొంటూ వస్తూ ఉంటాయో! ఇంకా ఏ సందర్భంలోనైనా కొంచెం భాషావిషయికంగానో, అభినయసంబంధంగానో, ఉచితమైన సలహాల్ని ఇవ్వబోయేటప్పుడు, వినండి ఎన్నెన్ని విధాలైన వెఱ్ఱి వికారాలాపాలు వినబడుతూ ఉం

టాయో ఆ నటవతంసుని నోటి వెంట! ఇంతెందుకు! ఇంకే నటుడైనా ఆపుతూ ఉండగ తాను ప్రేక్షకకోటిలో ఉండడం తటస్థపడినప్పుడు కొంచెం కనిపెట్టండి ఆ ప్రేక్షక నటుని హృదయ వృత్తాన్ని, ఎన్నెన్ని విధాలైన విమర్శనాలో వ్యాఖ్యానాలో వెళ్ళిపోతూ ఉంటాయి వంద మూడు కాసులుగాను! అలాటివన్నీ ఆ యా సమయాల్లో ఏదో ఒకపాటి లాభాన్ని సంపాదించి పెట్టేవిగా ఉండినా పండితులైన వారికి సర్వథా పరిహాసభాజనాలుగానే ఉంటాయి. కారణం ఏమంటారు ? విద్య యొక్క సారాన్ని ఏ మాత్రం అర్థం చేసుకోడానికి అలవాటు పడినవాడైనా, అలా వర్తిస్తాడా మరి ! మన నరశింహారావుగారు కొద్దో గొప్పో ఆంగ్లభాషను అభ్యసించారు. కొన్ని తెలుగు కావ్యాల్ని అనుభవించారు. ఇంకా విద్యాధికు లెందరినో సేవిస్తూ, ఎన్నెన్ని మంచి విషయాలో తెలుసుకున్నారు. అంతే కాకుండా చిన్నప్పటి నుంచీ అనేక కష్టసుఖాలకు లోనయ్యారు. పది మందితో కూడిన నాట్య ప్రపంచంలో ఏదో కొంత పరపతనీ కొంత ప్రతిష్ఠనీ సంపాదించారు. దాదాపు తెలుగు సీమ అన్నిటి యందూ తమ నాట్యవ్యాసంగాన్నీ, వైదుష్యాన్నీ ప్రదర్శించారు. అనేక విధాలైన తర్కవితర్కాల్నీ వ్యాఖ్యాన వైఖరీల్ని విన్నారు. కొంత కాలం సూత్రధారులుగాకూడా ఉండి, స్వయంగా ఒక సమాజాన్ని నడిపించారు. ఇన్ని విధాలైన అనుభవాల్ని సంపాదించిన మన నరశింహారావుగారి యందు పైని పేర్కొనబడిన విలక్షణాలు



ఎలా కనిపిస్తాయి! అలా కనిపించడం అంటూ కలిగితే అభినయావసరంలో వారు ప్రదర్శించే ఉదాత్తభావ ప్రస్తారాలు ప్రేక్షక జనాల్ని ఎలా ఆకర్షిస్తాయి!

నరశింహారావుగారు నాట్యోద్యోగాన్ని ప్రారంభించి ఇప్పటికి పది సంవత్సరాలకంటే ఎక్కువ కాదనుకొంటాను. అలా ప్రారంభించి వేషం వేసినప్పటినుంచీ జనాకర్షణాన్ని చేస్తూ ఉండే ఏతాదృశకళాసౌలభ్యమే పురాకృతసుకృతలబ్ధార్థమైందంటాను. రామవిలాససభాసంబంధం నరశింహారావుగారికి కలిగినప్పటినుంచీ వీరు పొందే సవిశేష కీర్తి అంతా వీరు చేసిన ప్రౌఢాభ్యాసమైందంటాను. ఆ అభ్యాసాలైనా ప్రతిభాపురస్సరాలై సంకల్పమాత్రంగా మన నరశింహారావుగారి రసమయమనఃప్రకృతిలో సిద్ధిపొంది పోయాయి అంటాను చాలావరకు. కారణం ఏమంటే అభినయావసరంలో నటుని వ్యక్తిత్వం సమగ్రంగా మఱుగుపడుతూ, పాత్రతత్త్వం అనేది ఎంత ప్రధానంగా పరిఢవిస్తూ ఉంటే, అది అంత హృదయాహ్లాదాన్ని కలిగించడానికి హేతువు అవుతూ ఉంటుంది నిస్సంశయంగాను. ఆ ధర్మం పురుష వేషాల్ని వేసేటప్పటికంటె ఆడవేషాల్ని ధరించేటప్పుడు ప్రతిపాదింప బడడానికి నటుడైనవాడు అనేక విధాలుగా తన అంతరంగాన్నీ, ఆకారాన్నీ, మాటల్నీ, చేష్టల్నీ, పాత్రానుగుణ్యంగా మార్చుకోకలిగి ఉండాలి. పురుషుడైన నటుడు వీ నల హరిశ్చంద్రాది పాత్రాల్లో ప్రదర్శించేటప్పుడు

తదనుగుణ్యమైన ఉదాత్త తత్త్వాల్ని ఏమాత్రమైనా దర్శించడం అంటూ కలిగితే, ఆ శోభించిన ఆకార వికారాల్ని అన్నిటినీ అట్టే తేలిగ్గా అడుగులకు మడుగులవలే అనుగమింప చేయ గలిగి ఉంటాడు. దమయంతి, చంద్రమతి మున్నైన ఉదాత్త స్త్రీ పాత్రాల్ని నయించేటప్పుడూ, మఱి యే యితర సామాన్య నాయికా వేషాలైనా వేసేటప్పుడూ, ఆయా పాత్రాల స్థాయిభావాల్ని అనుభవించిన నటుడైనా, పురుష పాత్రాలంత చులాగ్గా వాని నన్నిటినీ అనుకరించడానికీ, వ్యక్తీకరించడానికీ శక్తి కలిగి ఉండడు. చిరాభ్యాస పూర్వకంగా ఒకవేళ ప్రదర్శనాన్ని సాగించినా ఆ ప్రయత్నం తెచ్చిపెట్టుకొన్నదిగానే కన్పిస్తుంది. ఇంతెందుకు! చూచే చూడ్డంలోనే అలాటి వ్యక్తిని ఉద్దేశించి సర్వసామాన్యంగా "ఆ వెళ్ళే ఆయన స్త్రీ వేషధారుడు కాబోలునండోయి" అని అంటూఉంటాం. సహజంగా పురుషుడైన ఆవ్యక్తిమాత్రుడు తనకు చెందని మఱియొక తత్త్వాన్నీ, ఆంగిక వాచికాది వివిధ వికారాల్నీ అనుకరించే ప్రయత్నాలన్నీ, ఆలా పట్టిస్తూ ఉంటాయని నమ్మాల్సి మన మందఱమూను. మన నరశింహారావుగారు మొదటినుంచీ స్త్రీ వేషాల్నే ఎక్కువగానూ, ప్రధానంగానూ వేస్తూ ఉన్నారు. ఆ వేషాలు కూడా ఒకే విధమైన ఔచిత్యాన్నీ లేక ఆసౌచిత్యాన్నీ కలిగి ఉండేవి కూడా కావు. ఇప్పటికి యామినీ పూర్ణతిలక, వీరాభాయి, చిత్రాంగి, లీలావతి, యశోద మోహిని, అనసూయ, మల్లమదేవి, సత్యభామ సంయుక్త



రోషనార, చంద్రమతి మొదలైన పాత్రాల్ని ఎన్నో ధరించారు. ఇలా ధరిస్తూ ఇంతకాలంనుంచీ సుప్రసిద్ధ స్త్రీ వేషధారులుగా పరిగణింపబడేవారైఉన్నా, మన నరశింహారావుగారిని, ఎవరుగాని, ఏ సమయమందుగాని, పైని చెప్పినట్లు గుర్తించడానికి ఏమాత్రమైనా అవకాశం ఉంటుందేమో చూడండి! ఈ కారణాన్ని బట్టికూడా, వీరు చేసే అభినయాభ్యాసాలూ, ప్రయత్నాలూ మొదలైనవి అన్నీ, పాత్రల తత్త్వానుభవాల్ని పురస్కరించుకొని ఉండేవే కాని, కేవల రూపాల్ని బట్టీ, చేష్టల్ని బట్టీ, అనుకరింపబడేవి ఎంతమాత్రమూ కావని ఎలా ద్రుఢపడకుండా ఉంటుంది! ఇంతకంటే అభ్యాస సిద్ధిని శ్రుతపఱచే లక్షణం ఇంకేదిగా వర్ణింపబడుతుంది!

నరశింహారావుగారు కొందఱివలె కొన్ని స్త్రీ స్వభావాల్ని సహజంగా కలవారు కారు. కొన్ని కొన్ని పాత్రలకు ముఖ్యంగా కావాల్సిఉండే తనూసౌష్ఠవాన్నీ, ఆంగిక సంపత్తునూ కలవారూ కారు. ఇలా ఉన్నా భావాభినయావసరంలో తక్కువపడని తత్తదుచితలావణ్యాల నన్నిటినీ చిత్రీకరణానైపుణ్యంచేతనూ, వస్త్రభూషణమాల్యాద్యలంకారాలచేతనూ, సమయోచిత తటస్థ దృశ్య పరికరాలచేతనూ, ఎంతో గుంభనగానూ, మనోహరంగానూ, కలిగించుకొంటూ ఉంటారు. శుష్కాది చూర్ణ సమ్మేళనాలూ, ఇంకా వివిధభావోచిత వర్ణలేపన వైదగ్ధ్యాలూ మొదలైనవీ, అవిగాక నిలుకడ నీటులూ, నడక నవకాలూ, నవ్వులూ, చూపులూ

మొదలైనవీ, ఆపైని రకరకాలైన చీరకట్టు సొగసులూ, రవికల రామణీయాలూ, ముస్తాబు తెఱగులూ మొదలైనవీ ఆంగ్లేయ నవ్యనాగరికుల శాస్త్రీయ సిద్ధాంతాల్ని పట్టీ చరిత్రాంశాల్ని పట్టీ, ఇంకా వీలున్నంతలో స్వదేశీయ విదేశీయ వివిధచిత్రఫలకాల్ని పట్టీ పాత్రోచితంగా పరిగ్రహిస్తూ ఉంటారు.

ప్రస్తుతనటలోకంలో చాలామంది పద్య పాఠ్యాలయందు చూపే శ్రద్ధలోనూ, అభ్యాసానురాగాల్లోనూ, ఒక శతాంశమైనదాన్నైనా గద్యాలయందు చూపరు. ఆ కారణంచేతనే పాఠ్యాద్యంతం క్రమంగా ప్రసరించాల్సి ఉండే పాత్రయొక్క స్థాయితత్త్వంగానీ, తదభిముఖ సంచారి భావానేకాలుకానీ, రసోన్ముఖాలు కాకుండా ఉంటూఉంటాయి. నరశింహారావుగారు పద్యగద్యగేయాలతో నిండిన పాఠ్యాంశాన్ని అంతా, సాత్త్వికప్రసిద్ధమైన సమాన లక్ష్యంతోనూ, లక్షణంతోనూ విన్పిస్తారు. ఆ పలుకుభేదాలన్నీ, ఎన్నెన్నో సంచారి భావాల్నీ, సత్త్వాల్నీ సాక్షాత్కరింపచేయడానికి కారణాలుగా ఉంటాయి. ఇట్టిదైన వాచికవైదగ్ధ్యం వీరి ప్రౌఢాభ్యాస పద్ధతిని ముఖ్యంగా తెలుపుతూ ఉంటుంది. పాత్రావస్థకూ భావానికీ సర్వవిధాలా తగిఉండే ఆయా కాకుస్వరాది వివిధ భేదాల్నీ, వానిఅందాల్నీ అనుభవింపనివారు కొంతవిపరీతంగా ఎంచుకొంటూ ఉంటారు కూడాను. అయితే మఱికొంత కాలానికైనా అలాటివి సకలలోకాదరపాత్రములై నరశింహారావుగారి కీర్తికి వన్నెతేక మానవు.



పద్యాలు పాడడంలోకూడా ఒక క్రొత్తఅందాన్ని మన నరశింహారావుగారు చూపిస్తారు. ఆ అందమే సంగీతసాహిత్యాల సన్నిహితసంబంధిరూపంగానూ, రసదాయకంగానూ ఎంతైనా శ్రవణోత్సవాన్ని కలిగిస్తుంది తప్పకుండాను. అలా అని ప్రతిపద్యమూ లేక పాటా విధాయకంగా అందఱినీ సంతోషపెడుతుందని అంటూఉన్నా ననుకోకూడదు. ఎక్కడెక్కడ హృదయాన్ని ఆకర్షించే రమణీయభావం పద్యాత్మకమై ఉంటుందో, అక్కడక్కడ అంతా మన నరశింహారావుగారి పద్యపఠనం శ్రావ్యంగా ఉంటుందని మాత్రమే అనుకోవాలి. తదితర సమయాలో „పిండికొద్దీ రొట్టె,, అన్నట్లుగా ఉంటుందని అనుకోవాలి.

కీర్తనలు సమయోచితంగానూ, మితంగానూ, ఎలాగో ఒకలాగు జతపఱచుకొంటూఉంటారు. ఉన్నంతలో భావానికీ, రసానికీ తగిఉండేటట్లే ఏర్పఱచుకొంటారు. ఈ విధానంలో వీరు కూడా చాలా వఱకు గ్రాంఫోనులమీదే ఆధారపడతారు. అయితే తమకు గల బుద్ధివిశేషాన్ని బట్టి ఆయా రాగసాంప్రదాయాల్నీ, తాళాల్నీ, పాఠ్యాంశంతో సమన్వయించుకొంటూ సంగ్రహిస్తారు. అంతమాత్రంచేత వీర్ని సంగీత శాస్త్రజ్ఞుల్లో చేర్చడానికి వీలులేదు. గాయకాగ్రగణ్యుల్లో ఒకరుగా వీరిని పేర్కొనడానికీ, అవకాశం లేదు. అట్టే పూర్వపుణ్య ఫలితంగా హృదయాన్ని కరిగించే గాత్రాన్నీ స్వన్యాలాపాన్నీ కలిగిన వారుగా నిర్ణయించడానికి సాహసించ

లేం. నరశింహారావుగారి శారీరం సాధనసాంప్రదాయాల్లో స్వాదుత్వాన్ని సాంపాదించింది ద్వావింశతి శ్రుత్యాత్మకమైన ఉత్తరదేశీయ గాంధర్వప్రకృతిలోని ధ్వన్యాత్మక లలిత కళాంశాల్ని సంగ్రహించింది. స్వర వర్ణ సమన్వయాన్నీ సౌకుమార్యాన్నీ స్థిరపఱచుకుంది. ఈ సందర్భంలో వీరి కలవడిన గాంధర్వ పేటికా వాద్యనైపుణ్యం చాలావఱకు సహకారం చేసిఉంటుంది అని అనుకొంటాను.

నరశింహారావుగారి భావాభినయ సూత్రానికి, తత్తత్కావ్యానుభవ స్థాయిస్వభావాలు పతకాలుగా ఉంటాయి. ఆహార్యాలు అనుభవసిద్ధంగానూ, కొంతవఱకు చారిత్రక సమ్మతాలుగానూ ఉంటాయి. చేష్టాదిక వివిధవిక్రియలు రసోన్ముఖాలుగా ఉంటాయి. ఎక్కడో ఒకచోట తప్ప చాలా వఱకు ప్రకృతిపరిసిద్ధాలుగా కూడా ఉంటాయి. సంచారిభావాభినయావసరాల్లో, కొన్ని చోట్ల, కొంచెం అధికంగా పోతూ ఉన్నట్లు అనుకొంటారు చాలామంది. నా అనుభవంలో తటస్థపడలేదుమఱి! భావావేశాన్ని సూచించే కొన్ని లక్షణాలు నేను చూచిన నాలుగైదు సమయాల్లోనూ కనిపించాయి. యథార్థమైన ఏతాదృశ స్వీయానుభవాన్ని కొంచెం చెపుతాను. నమ్మాలి మఱి నాయందు దయయుంచి!

తెనాల్లో రామవిలాస సభలో వీ రొకపర్యాయం బొబ్బిలి నాటకంలో మల్లమ్మదేవిగా రావడం చూచాను. ఏం



చెప్పమంటారు! ఎందఱెందఱో పెద్దలు బహు సమర్థంగా అభినయిస్తూ ఉన్నారు పెద్దపెద్ద పాత్రాల్ని. అదంతా చూస్తూనేఉన్నాను ఆద్యంతమూను. నిద్రముంచుకొనిరావడం చేత వెళదాంఅనుకొంటూఉన్నాను వాసస్థానానికి. ఎవరోఅన్నారు "మల్లమ్మ వేషాన్ని చూచివెళ్ళండి" అని. ఆ నరశింహారావుగారే "ఏం ఉంటుందిలెండి! నిద్రపాడుచేసుకోకండి"! అన్నారు దగ్గఱకు వచ్చి. ఇంతలో తెర లేచింది. నరశింహారావుగారు రంగంలో ప్రవేశించారు. ఒక అపూర్వమైన అవ్యక్తమధురార్తాలాపం అట్టే హర్షాంబుపూరూపంగా నా నేత్రాల్ని తడిపింది. శ్రవణాలికి గిలిగింతలు పెట్టింది. అంతలో మనస్సు తన్మయభావోన్ముఖమైంది. ఆపైని ఎలా పరాధీనమైందో చెప్పలేనుగాని మల్లమ్మదేవి మాంగళ్యాన్ని పురస్కరించుకొన్న స్వప్నగతవృత్తాంతాన్ని విన్పించే ఆ వివిధ వాచిక భావాభినయ వీచికాపరంపరాల్లోనూ, సాత్త్విక సరళసాంప్రదాయాల్లోనూ, అనన్యానుభవ లావణ్యాల్లోనూ లయించిపోయిందేమో అనుకొంటాను! ఇంకొకప్పుడు సమయోచితమైన భావమాధ్యాన్ని తెలిపే సంధిరాయబారమును గూర్చి ప్రస్తావింపగా, సహజగభీరుడైన తన నాథుడు చెందిన మనోవేదనను గ్రహిస్తూ పశ్చాత్తప్తహృదయయై సహజవీరపత్నీత్వమును చాటునపుడునూ, ఎన్నని చెప్పను! చివరకు చినరంగరాయని దాసికి ఒప్పచెప్పి, తాను ప్రాణత్యాగాన్ని చేసేటప్పుడు ప్రదర్శించిన ఆ భావావేశంలో, పద్యాలుగదా అని, పాపం! వాయిద్యాన్ని మొదలుపెట్టిన ఆ హార్మనిస్టుపై నా మనస్సు విఱుచు

కొనివడగా, బ్రహ్మశ్రీ. పెద్దిభొట్ల చలపతిరావుగారంతటివారం దఱూ అది గ్రహించి ఆ[illegible]ంచారు ఆ వాద్యారంభాన్ని. అప్పటి నరశింహారావుగారి వాచికానికి ఆ విధానం ఎంతో నిధానంగా ఉండిపోయింది! ఆ రాగాన్ని ఏ శాస్త్రంలో చూద్దాం అన్నా, ఇప్పటికీ కనిపించకుండా పోయింది! ఆ అనుభవం మాత్రం తలుచుకుంటే తాండవం ఆడుతూ ఉంటుంది దృష్టిపథంలో! ఈ కారణాన్నిబట్టి సంగీతానికి మాతృతుల్యంగా ఉండే శ్రుతివాద్యం అనేది భావాభినయావసారాల్లో ఉండాని అందామా, వద్దందామా! ఈ నవ్యలక్షణానికి మన నరశింహారావుగారు ఆధారులుగా ఉంటారని అంటామా, అనమా!

గురజాడవారి కన్యాశుల్కంలో మధురవాణి పాత్రకు ఉండే పార్టు ఎంత దాని ప్రాధాన్యమెంత! నఖశిఖపర్యంతంగా మన నరశింహారావుగారి ఆ నవ్యనాగరికాహార్యం అంతా అలా ప్రతిబింబిస్తూ ఉంటుందిఏమిటి గణికాలోకమందంతట్నాను! వివిధకావ్యానందమయులూ, మహాపండితులూ అయిన శతావధాని బ్రహ్మశ్రీ వేలూరు శివరామశాస్త్రివారంతటివారుకూడా స్థానంవారిమధురవాణిమీద అలామోజుపడతారేమిటి గురజాడవారి ప్రాచీనమధురవాణిని వదిలిపెట్టి! విశ్వమోహనప్రదంగా వెలలేని విలాసాన్ని ప్రకటిస్తూ స్థానంవారి మధురవాణికి మకుటప్రాయంగానూ, మహా సలక్షణలక్షితంగానూ, నిలిచిపోయిన ఆ నవ్యనవకం ఏ భరతనాట్యశాస్త్రంలో కనిపిస్తుందో కొంచెం వెదకండి! ఈప్రయోగానికి ప్రమాణం స్థానంవారి నవ్యనాటకభావాభినయదర్పణమే అని అంటామా, అనమా!



ఎందఱెందఱో వ్రాశారు సారంగధర నాటకాన్ని. ఆయా పత్రికల్లో కనబడతాయి అలా వ్రాయడానికి గల కారణాలన్నీని. ఎందులో చూచినా కొడుకును తల్లి మోహించడం అనేదే కనిపిస్తుంది మహాఘోరంగాను. ఎవరు ఎన్ని విధాల సమర్థింప చూచినా తల్లివరుసైనదాన్ని త్యజించాడని చెప్పడంలో సారంగధరుని ఏకపత్నీత్వంకానీ, ధర్మపరత్వంకానీ, బయల్పడజాలదు. ఇంకా ఏ యితరసుందరీవిషయికంగానో ఆ కథ నడిచేటప్పుడు ఏమాత్రం అయినా ఉంటుందేమో అనుకోడానికి అలాటి అవకాశం! ఇక నరేంద్రుడంతటివాడు వంచించి సారంగధరునకు ఉద్దేశించిన దానిని, తాను గైకొన్నాడని రూపించడం కూడా, చాలా అసమంజసంగానే కనిపిస్తుంది తప్పకుండాను. అది కూడా అలాగే జరిగి ఉంటుందని ఒకవేళ ఒప్పుకొన్నా, భారతీయ సాధ్వీధర్మాన్ని బట్టి, విధాయకంగా పతిని సేవించాల్సి ఉండే చిత్రాంగిదేవి, తద్వ్యతిరిక్తంగా ఇలాటి మహాపాపానికి ఒడికట్టి ఉంటుందని అనుకోవడంగానీ, అలాటి వృత్తాన్ని కావ్యాంశంగా చేసుకోడంగానీ, ఎంతమాత్రమూ ఆదరించతగిన విషయం కాదంటాను ముమ్మాటికీని. నిజంగా బహిష్కరింపబడాల్సిందే ఈ నాటకం. అలాగే జరుగుతూ ఉంది కూడాను.

మన నరశింహారావుగారు చిత్రాంగిపాత్రాన్ని వెయ్యడంసాగించినప్పటినుంచీ, అలా ఎగపడతారేమిటి పండిత పామరులందఱూను ఆ చిత్రాంగి కోసం అని! అసలు గ్రంథమా

ఈయన నూతనంగా వ్రాసినది కాకపోయె! కథావిధానమూ తాతలనాటినుంచీ చూస్తూ ఉన్నదే అయిపోయె! ఈచిత్రాంగి వేషమూ ఎందఱెందఱిచేతనో ఎన్ని పర్యాయాలో వేయబడే ఉండె! ఎన్ని అయితే నేమి! ఏ కవిగాని లేక నటుఁడు గాని ఆ చిత్రాంగి పాత్రానికి తగిన సంస్కరణాన్ని చేశారామఱి! కేవలం స్వీయాభినయ వ్యాఖ్యాన వైదుష్యం మూలంగా ఆ చిత్రాంగిని మన నరశింహారావుగారు ఒక నవ్యభావ ప్రపంచానికి చెందిన ప్రేమానుబద్ధచేతస్కయగు, ఉదాత్త కామినీ స్వరూపంగా చిత్రించారు- ఈ సృష్టికి నరశింహారావుగారి సహజ ప్రతిభావిశేషమే కారణం అని అంటామా అనమా!

పానుగంటివారి సత్యభామ ఎంత గయ్యాళిగంపో ముత్తరాజువారి భామ అంత మోహాల ముగ్ధగా కనిపిస్తుంది మన స్థానంవారి అభినయవ్యాఖ్యానంలో! తులాభార కావ్యంలో ఆరూపంగా అక్కడక్కడ తొలకరించే యత్కించిత్ కథాంశాల్ని మన నరశింహారావుగారు భామా ప్రణయానికి చెందిన ప్రధానభావాంశాలుగా చేసుకొన్నారు. ప్రణయమాధ్యాతిశయంచేత సత్యభామ నారదుని పుణ్యక వ్రతోపదేశమనే మాయలో పడడం అనేది, స్థానంవారిఅభినయ కావ్యంలో బీజసదృశంగా ఉంటుంది. లౌకిక ధనధాన్యానేకాలతో చతుర్దశ భువన కుక్షింభరుడైన తన నాథుని తులదూచే ప్రయత్నాలన్నీ, భామాహృద్గత ప్రణయమాధ్యాంకు



రానికి ఉద్దీపనాలుగా ఉంటాయి. చివరకు తులసీ మాహాత్మ్యన్నీ, రుక్మిణీమానసికభక్తిస్వరూపాన్నీ పురస్కరించుకొని, సత్యభామ, శ్రీకృష్ణుని భక్తపరాధీనునిగా తెలుసుకోడం అనేది కావ్యఫలానుభవభాజనమైన అభినయ కావ్యోపసంహారంగా ప్రసన్నం అవుతుంది. ఏతాదృశాభినయ కావ్యచిత్రీకరణానికి మన నరశింహారావుగారే ముఖ్యంగా కారకులని అంటామా, అనమా!

ఇక రోషనారా విషయం, ఈ పాత్రాన్ని అభినయించడంలో మన నరశింహారావుగారి సర్వతోముఖ అభినయవైదగ్ధ్యం అంతా ప్రసన్నం అవుతుంది. యత్కించిత్ చారిత్రిక అంశాన్ని ప్రధానంగా ప్రకటిస్తుంది అసలు కావ్యం. దానిని ఒక దర్శనీయమైన అభినయాంశంగానూ, విశేషించి కావ్యంగానూ, ప్రకాశింపచేస్తూఉన్నది మన నరశింహారావుగారే అనడానికి సందేహంలేదు. మన నరశింహారావుగారు చూపే రోషనార యందు నిష్కళంకమైన ప్రేమతత్త్వమే ప్రత్యక్షం అవుతుంది. ఆ వేషవిధానం ఆభిజాత్యప్రధానంగా ఉంటుంది. ఆ పలుకు పెంపులూ, చూపుసొబగులూ, ఆ యశేషనవ్యాంగికవిక్రియలూ మొదలైనవన్నీ, ప్రాచీనలక్షణ సమ్మతంగానూ నవ్యలక్షణోద్బోధకంగానూ ఉంటాయి నిశ్చయంగాను.

ఛత్రపతి శివాజీయొక్క ధైర్యస్థైర్యాల్నీ, ఏకపత్నివ్రతానుష్ఠాన దార్ఢ్యాన్నీ, ప్రధానంగా నిరూపించే ఉద్దే

శంతో బయలుదేరదీయబడిన రోషనారా నాటకానికి, ఓవ రసు కామినీ ప్రాధాన్యం కలిగిందేమిటి! అదే మన నరశింహారావుగారి ప్రతిభావిశేషం అంటేను! శివాజీకంటే వేయివిధాల ఆగర్భశ్రీమంతురాలైన రోషనార, ప్రేమ కొఱకు సర్వసంగ పరిత్యాగాన్ని చేసుకొని, అంతఃపురం వదలి, అష్టైశ్వర్యాలూ వదలి, చీమలు దూఱని చిట్టడవులూ కాకులుదూఱని కాఱడవులూ, మొదలైన ఎన్నెన్నో నట్టడవుల్ని దాటడమేకాకుండా, విహితంచేత కాకపోతే విరోధంచేతనైనా, తానువలచిన వానిని సమీపించి, శివాజీచేతిగుండా ఆ మాతృప్రేమ అమృతధారనైనా ఆసాంతానికి అనుభవించి, ఆట్టే అతని అడ్డాల్లోపడి, తద్దర్శనాయత్త దృగ్ధానలోకనాల్లో తనప్రాణాల్ని కాస్తా వదిలేస్తుంది! ఆ రూపంగా ధన్యతనుపొందిన మన స్థానంవారి రోషనారా ప్రణయ తత్త్వార్ణవంల్లో, మఱి మన శివాజీ దోనె అవుతాడా, దోనెకడుపులోని పిల్లడవుతాడా! ఇట్టిదైన సాత్త్వికాభినయ చిత్రీకరణానికి, నాట్యచిత్రకారుడగు మన నరశింహారావుగారే కారకులు అవుతారని అంటామా అనమా! అదంతా కథలో లేదా అని అంటారు కాబోలు! ఆ కథను తెల్పే కల్పనాలు గద్యపద్యాల్లో కనిపించాలి మఱి ఆద్యంతమూను! ఆపైన అవి రసభావాదిద్యోతకాలు కావాలి క్రమంగాను! చతుర్విధాభినయాల్లో వానిని మన నరశింహారావుగారు ఏర్పఱచారనుకొంటాను. తదభినయకావ్యానుభవులకు అలాటివన్నీ కరతలామలకాలు అవుతాయంటాను.



ఇంకా ఏతాదృశాభినయానవ్య వైదుష్యంతో పాటుగా విద్యా వినయ వివేకాల్ని కూడా కలిగి, మన స్థానం నరశింహారావుగారు ఆంధ్రనాటక ప్రపంచానికంతా అమూల్యమైన కీర్తిని సంపాదించి పెడుతూ ఉన్నారంటానుకూడాను.

## మ॥రా॥శ్రీ. చిలకలపూడి వేంకటేశ్వర శర్మగారు.

బందరు బాలభరత సంఘానికి చెందిన మ॥రా॥శ్రీ. చిలకలపూడి వేంకటేశ్వరశర్మగారు, మిక్కిలి లలితంగా అభినయిస్తారు. బక్కపలచని ఒకపాటి పొడుగైన సుకుమారతనువుతో, సహజబ్రహ్మత్వమూ, ఆపైని సాహితీత్వమూ, తేజోవంతంగా ఉండి నేత్రానందాన్ని జతపఱుస్తూ ఉండే సుందరముఖారవిందంతో, వినయౌదార్యాలూ, వివేకప్రాగల్భ్యాలూ, వెలలేని గౌరవాన్ని సంపాదించిపెడుతూ ఉండగా, ఉన్నంతలో సుఖజీవనాన్ని చేసుకొంటూ, ఆ యాచార్యత్వాన్ని అలా అలా నిర్వహించుకొంటూ, ఎన్నడో ఒకనాడు ఏ స్నేహితుల బలవంతానో, ఏ పండితుల ప్రోత్సాహానో పురస్కరించుకొని రంగాన్ని అలంకరిస్తూ ప్రస్తుతం బెజవాడలో పండితపదవియం దలంకరించి ఉన్నారు. వీరు సంస్కృతంలో విద్వాన్ పరీక్షయందు తీర్ణులైనారు. ఆంధ్రంలో కూడా పెద్దపాండిత్యాన్ని సంపాదించారు. ఇంగ్లీషులో ప్రవేశ పరీక్ష నిచ్చారని నా జ్ఞాపకం. ఇవన్నీ గాక మ॥ రా॥ శ్రీ.

పారుపల్లి రామకృష్ణయ్యగారివద్ద శాస్త్రీయ సంగీతాన్ని శిక్షపొంది ప్రత్యేకంగా కచ్చేరీనిచేసే సామర్థ్యాన్ని గడించారు. సుస్వరాలాపనంలో సాధుత్వాన్ని సంపాదించిన సన్నని శారీరం స్ఫుటమైనవాక్కు, లక్ష్యలక్షణ సమాదృతమైన అభినయం కలిగి ఉంటారు. ఇట్టి వీరు అభినయించే 'కణ్వ' పాత్రమూ ఇంకా చిత్రనళీయంలోని 'సుదేవ' పాత్రమూ, అలాటి ఇతర పాత్రలూ, ఎంత ముద్దుగానో, ఎంత మనోహరంగానో ఉంటాయి అని నిస్సంశయంగా చెబుతాను.





# ఆంధ్రనటప్రకాశిక.

## దశమ ప్రకరణము.

## రూపకము—పాత్రము

తెలుగు జిల్లాల్లో తఱచుగా అన్నిసమాజాల చేతనూ ఆడబడుతూ నాటకాలనిపించుకొంటూ ఉండేవి కొన్ని ఉన్నాయి. ఆయా నాటకాలకు చెందిన ప్రధానపాత్రాల్ని కొందఱు బుద్ధిమంతులు సమర్థంగా అభినయిస్తూ, ప్రేక్షక సముదాయాన్ని మిక్కిలి ఆనందపెడుతూ ఉన్నారు. ఏతాదృశ నటవతంసుల్నీ, వారివారి ప్రయోగప్రాగల్భ్యాల్నీ, ముఖ్యంగా పరిచయం చేసికోవాల్నే తలంపుతో, శక్తిలోపం లేకుండా ప్రయత్నిస్తూ వచ్చాను. అనేక స్థలాలకు వెళ్లాను. అనేకుల ప్రదర్శనాల్ని చూచాను. ఆ విధంగా నేను గ్రహించిన అనుభవాన్నంతా ఒక వేయి పుటలలో వ్రాసి ఉంచాను

కూడాను. అయితే ఆ వివరణాన్ని సాకల్యంగా ప్రకటించే ఉద్దేశాన్ని ప్రస్తుతం మానుకొన్నాను కారణాంతరాలు అనేకంగా ఉండడంచేత. ఒకవేళ అటులే ఆద్యంతమూ ప్రకటించినా అంత ఓపికతో పాఠకులు తమ కాలాన్ని ముఖ్యంగా దాన్ని చదివేటందుకు ఉపయోగిస్తారని కూడా తోచదు. కాబట్టి ఆయా నటుల గుణాగుణాల్ని మాత్రమే యీ ప్రకరణంలో స్థాలీపులాకన్యాయంగా చెబుతాను. ఇంకా ఏయే నాటకంలో, ఏయే నటుడు, ఏయే పాత్రాన్ని మనోహరంగా అభినయించగలిగి ఉంటాడో చెబుతాను.

## ముగ్గురు యుగంధరులు.

మ॥రా॥శ్రీ. డాక్టర్ గోవిందరాజుల వేంకటసుబ్బారావు గారు తెనాలి సభలో తొలుదొల్త యుగంధరపాత్రాన్ని ధరించి తెలుగుదేశాన్నంతా ఇంచుమించుగా ఆనందపెట్టారు. వీరికి తెలుగులోనే గాక ఇంగ్లీషులో కూడా ఉండే ప్రసిద్ధ నాటకాలకు చెందిన రసభావాల్ని అనుభవించే విజ్ఞానం ఉంది. వివిధ వస్త్రాలంకారాల్నీ, వివిధ జాతీయ ఆహార్యాల్నీ, వివిధ వాగ్వైఖరుల్నీ, ఇంకా రకరకాలైన నగిషీ ముస్తాబుల్నీ, నడకల్నీ, నవకాల్నీ, సమయానుగుణ్యంగా ప్రసన్నపఱచే ఒకింత ధీవిశేషం కూడా అగపడుతూ ఉంటుంది, వీరి రాంగిక విహారంలో. నిండైన కుదిమట్టపు విగ్రహమూ, విప్పాఱినముఖమూ



చుఱుకైన కన్నులూ, బలిసిన బుగ్గలూ, విశాలమైన వక్షమూ, దానికి తగిన బాహువులూ, అవిగాక గడుసు చూపులూ, మందపు నవ్వులూ, మొదలైన ఆంగిక సహజ సంపదలు కూడా, ఆయన ధరించే ఉదాత్తపాత్రలను తలపించే అలంకారాలుగా ఉంటూ ఉంటాయి. గద్యపాఠ్యార్థాల్ని ఎన్నిటినైనా అప్రయత్నంగా వినికిరి చేస్తారు. నాలుగైదు పద్యాల వఱకూ ఏదో గుంభనగా తమ సంగీతాన్ని జతపఱుస్తారు. ఒకపాటి పాటల్ని అంతకంటే ప్రౌఢంగానే పాడగల రనుకొంటాను. రంగంమీద ఉన్నంతసేపూ, మొత్తానికి ఏదో విధంగా చుఱుగ్గానూ, సొగసుగానూ, చాలావఱకు సందర్భోచితంగానూ మెలగుతూ, ఆశేష జనుల్ని ఆనందపెడతారు.

డాక్టర్ సుబ్బారావుగారి అభినయదర్పణంలో యుగంధరుడు తిలక్ మహాశయునివంటి గొప్పరాజ్యాంగవేత్తగా ప్రసన్నమౌతాడు. వీరు ధరించే ఆ మహారాష్ట్రీయ శిరోవేష్టనమూ ఆ తెల్లని అంగరఖా, ఆ ఉత్తరీయం వల్లెవాటూ, మొదలైన కొన్ని ప్రధాన ఆహార్యాలు కూడా, ఆ సత్యాన్ని బలపఱుస్తూ ఉంటాయి. ఆ వ్రేలాడు పట్టాకత్తీ, ఆ నడకబెడగూ, ఆ లోతుచూపుల నిద్దపుపలుకులూ, ఇంకా పోజుపొలుపులూ మొదలైనవి, తదుద్యోగహోదానూ, చాటుతూ ఉంటాయి. ఆయభినయావేగం ఆద్యంతమూ, తన్మహోత్తమ కార్యనిర్వణౌత్సుక్యాన్నీ, తద్గభీరసాత్త్వికతత్త్వాన్నీ సాక్షాత్కరిస్తూ

ఉంటుంది. ఈ విధంగా డాక్టర్ సుబ్బారావుగారి యుగంధరత్వం చాలవఱకు కట్టుగానూ, ప్రతిపదార్థద్యోతకంగానూ మనోహరంగానూ ఉంటుంది. అయితే ,,గిరీశం,, పాత్రధారణం కొఱకు వీరు అలవాటుచేసికొన్న, ఆ తూర్పు జిల్లాలలోని యాసప్రసంగం వంటిది, అప్రయత్నంగా అక్కడక్కడ దొర్లుతూ ఉండి, కొంచెం ఔచిత్యానికీ, గాంభీర్యానికీ, భంగపాటును తెస్తూఉంటుంది.

మధ్వశ్రీ. నెల్లూరు నాగరాజరావుగారు పలుతావుల్లో ఈ యుగంధరపాత్రాన్ని అభినయించారు. చామనఛాయలో సుందరంగా ఉండే తనూసౌకుమార్యాన్ని కలిగిఉంటారు వీరు. కొంతవఱకు ఇంగ్లీషు, మఱికొంతవఱకు తెలుగు, ఇంక కొన్ని లలితకళలు వీరిచే అనుభవింపబడ్డాయి. ఒకవిధమైన అనుకరణశక్తీ, ఇంకా ఉత్పన్నశక్తీ, వీరి యందు సహజంగా ఉన్నట్లు కనిపిస్తుంది, వీరుచూపించే వివిధ పాత్రాభినయ వైఖరుల నన్నిటినీ శ్రద్ధగా లక్షించేవారికి. చాలవఱకు స్ఫుటంగానూ, సక్రమంగానూ, లలితంగానూ ఉంటాయి వీరి ఆంగికాది వివిధాభినయ విలాసాలన్నీని. ముఖాంగికభావ ప్రకటనం వీరియందు కనిపించేటంత విరళంగా మఱి యేసామాన్యులందునూ కనిపింపదు. పాత్రానుగుణ్యంగా ఏవేషాన్ని పడితే ఆవేషాన్ని కనుమూసి కనుతెఱచేటంతలో చిత్రించుకొనే నేర్పు, నగరాజరావుగారికి అలవడినంతగా మఱి యే మన తెలుగునటవతంసునకూ అలవడలేదు. గద్యాల్ని మిక్కిలి ఉదా



త్తంగానూ, స్పష్టంగానూ, భావానుగుణ్యంగానూ విన్పిస్తారు. పద్యాల్ని ప్రయత్నపూర్వకంగా పఠిస్తారు. పాటల్ని తఱచుగా వాడనేవాడరు. రంగంలో మిక్కిలి సుందరంగా వర్తిస్తారు. కొన్ని కొన్ని అంగికాభినయ భేదాలు ముఖ్యంగా ఫోటోలు దింపుకొనడానికి అర్హతను కలిగి ఉంటాయి. చాలమంది పెద్ద నటుల్లో కనిపించని సుస్వభావం వీరికి ఎక్కడలేని గౌరవాన్ని కలిగిస్తూఉంటుంది.

నాగరాజరావుగారు యుగంధర పాత్రానికి చక్కని జాతీయతను ఘటించారు, తమకు గల చిత్రీకరణ ప్రౌఢిమను బట్టి. ఆ జరీబుటాతాపడవు తలపాగతెఱగూ, ఆ గిరజాల నడిమిముడీ, ఆ ఒంటిఱాతి చెవిపోగుల చౌకళింపులూ, ఆ చేతిలోని రజతదండమూ, ఆ నిలువుటంగీ, ఆ పటకాడాలుకత్తిపొలుపూ, ఆ ప్రాచీనపాదుకాపాటలలావణ్యమూ మొదలైనవన్నీ, ఆ పద్ధతి అలంకారప్రాగల్భ్యాన్నంతా ఎంతో ముద్దుగా మూర్తీభవింపచేస్తూ ఉంటాయి. గద్యవాచికం అసామాన్యప్రౌఢాభినయవైదుష్యాన్ని ఎంతైనా సాక్షాత్కరిస్తూ ఉంటుంది. ఆంగికవిన్యాసంకూడా జాతీయ ఔన్నత్యాన్ని మిక్కిలి చాటుతూ వాచికాభినయానికి వన్నెతెస్తూ ఉంటుంది. విద్యానాథ ప్రభృతులు పేరిగాడ్ని పేనే రంగంలోనూ, వస్తువుల పెట్టెతోనడచే చెకుముకి సన్నాహాన్ని సందర్శించే సమయంలోనూ, ఇంకా మఱికొన్ని స్థలాల్లోనూ వీరు చూపినచూపు సొగసులు, ఎంతోప్రాగల్భ్యాన్ని ప్రకటిం

చాయి! ఈ విధంగా వీరి యుగంధరపాత్రాభినయంకూడా ఒక పంథాలో పైని చెప్పినవారి భూమికానిర్వహణంవలెనే యశేషజనామోదాన్ని సంపాదించింది.

మ॥రా॥శ్రీ. ముంజులూరి కృష్ణారావుగారు యుగంధర పాత్రాహార్యాల్ని చాలవఱకు నగరాజరావుగారి వలెనే అలంకరించారు. అదిగాక ఒకింత వార్ధక్యాన్ని సూచించే శ్మశ్రురాజిని విశేషంగా అనుసంధించారు. వీరి మూర్తివంతం యుగంధరమంత్రి, పిచ్చివాడుగా మాఱునప్పటి సమయానికీ స్వరూపానికీ, స్వభావానికీ, సన్నిహితమైన సారూప్యాన్ని కలిగి ఉంటుంది. వీరు రంగంమీద చూపించే కొన్ని విధాలైన సమయాభినయ సందర్భాల్ని పట్టి, ఆ నాటకంలో తమదైన ఒక్క పాఠ్యాన్నే కాకుండా గ్రంథాద్యంతమూ కృష్ణారావుగారికి కంఠస్థమై ఉన్నట్లుగా నిశ్చయంబౌతుంది. పాఠ్యార్థాలకు మించిన విశేషార్థాలూ, భావాలూ, ఎన్నెన్నో స్ఫురిస్తూ ఉంటాయి వీరి వాచికవిధానాన్ని యథాక్రమంగా లక్షిస్తూ ఉండే భావజ్ఞులందఱికీని. అయితే తమలోలేని గాంభీర్యాన్ని కొంత కష్టంమీద తెచ్చిపెట్టుకొంటూ ఉన్నట్లు కనిపిస్తుంది ఆ మొదటి యుగంధరమంత్రి పాఠ్యభాగాన్ని అభినయించే టప్పుడాద్యంతమూను. పద్యగద్యగేయాలతో కూడిన వీరి వాచికం, అన్నివిధాలా సరిసమానమైన అందాన్ని అగపఱుస్తూ రక్తిగానూ, భావసుబోధకంగానూఉంటుంది నిస్సంశయంగానూ.

యుగంధర మంత్రిల కపటోన్మాద భావాభినయ భాగంలో కనిపించే ఆ చిక్కిన నిడుపాటి నీరసశరీరమూ, ఆ



వంకర టింకర వ్రాలుడు నిలువుడు చూపులూ, ఆ పుల్లల వంటి పొడుగుచేతులూ, ఆ సూదులువంటి సోలుడువేళ్ళూ త్రిప్పుకొంటూ, తిరుక్కొంటూ, ఆడుకొంటూ, పాడుకొంటూ, సానిమేళాలతో, సన్నాయి నొక్కులతో, తూత్తుబూరాలతో, డోలువాయిద్యాలతో, వెకిలిపంచాంగాలతో వెఱ్ఱి వేదాంతాలతో ,,ఢిల్లీసుల్తాన్,, మొదలుకొని ,,వీరడికి రాగడికి నాశమంగళం,, వఱకూ ఉండే అన్నివిధాలైన వాచికలావణ్యాల్నీ, ముంజులూరి కృష్ణారావుగారొక్కరే అద్వితీయంగా చూపించారు. ఖుస్రూవర్తనాన్ని గ్రహించి దానికి తగిన తంత్రాన్ని బోధించడంలోనూ, ,,తాటికాయ,, పదంలోనూ, అగపఱచిన వాచిక విధానాలు మన కృష్ణారావుగారి అసామాన్యశేముషీ విశేషాన్ని ప్రకటిస్తూ ఉంటాయి. శ్మశానంలో వంటకాన్ని చేసికొంటూఉండడాన్ని ఇతరులు లక్షిస్తూ ఉండడానికి సూచించేదిగా ఉద్దేశింపబడిన ‘ఆవులింత, అప్పటి మఱికొన్ని అభినయ సమయాలూ, ఆ పిమ్మట సుల్తాను వెనుకనున్న ప్రతాపుడును తానునూ పరస్పరం తెలియపఱచుకొనే నిగూఢాభినయాలింగనావలోకనాద్యశేష చమత్కారాలూ, ముఖ్యంగా కృష్ణారావుగారి ప్రౌఢాభినయాభిజ్ఞతకు తిలకప్రాయాలుగా ఉంటాయి. ఇప్పటికి ఈ పాఠ్యభాగాన్ని ఇంత మనోహరంగానూ, ఇంత గభీరంగానూ, ప్రదర్శించిన వారు ఎవరూ లేరని నిస్సంశయంగా చెబుతాను. ,,పాతాళం బందుగానీ,, అనే పద్యంకూడా ముఖ్యంగా ఎన్ని పర్యాయాలు వీరి నోటవిన్నా, ఇంకా విన్నాలనే అనిపిస్తుంది.

ఇలాగే వీరు వేసే యితర వేషాలలో కూడా మూషువంతులు వేషాలు నిరుపమాన సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ ఉంటాయి.

## ప్రతాపుడు-పేరిగాడు.

తెనాలి సభలో పై రెండు పాత్రల్నీ బ్రహ్మశ్రీ పెద్దిభొట్ల వేంకట చలపతిరావుగారు ధరిస్తూ ఉంటారు. ద్వితీయాంధ్రనట మహా సభాధ్యక్షులైన చలపతిరావుగారి నాట్య వైదుషీ విశేషం నాటక లోకానికి చిరపరిచితమైంది అవడంచేత, నేను వేత్తే విస్తరించాల్సి ఉండదు! విద్యాధికులై, పెద్ద పాయాజీవనంలో ఉండే చలపతిరావుగారు అలాటి చాకలివేషాన్ని వేసి, ఏమాత్రం సమయోచితంగా అభినయించ కలిగినా, అసలు ముద్దుగా ఉండక తప్పదు. ఇది యిలా ఉండగా ఇక ఏ విషయంలోనూ తక్కువ పడని విజ్ఞానంతోనూ, సంగీతంతోనూ, జాతీయ వాక్సౌకుమార్యం తోనూ, వేషంతోనూ, విలాసంతోనూ, వేయేల! ప్రయోగ ధీచాతురీ సర్వస్వంతోనూ, మన చలపతిరావుగారు, పై రెండు పాత్రాల్నీ సాక్షాత్కరిస్తూ ఉంటూఉంటే, ఇక తత్సరసనాట్య సౌందర్యాన్ని సందర్శించే వారు, ఎంతటి ఆనందాన్ని పొంద గలరో అది అనుభవం మీాదనే తెలియదగి ఉంటుం దంటాను.

పేరిగాని భావమాధ్యం అంతా ఒక్క వాచికంలోనే కాకుండా మనోవాక్కాయ కర్మములందంతటా సాధుత్వాన్ని



పొందించుకొన్నారు మన చలపతిరావుగారు! వీరు రంగంమీాద పేరిగానివిగా పలికే పలుకులన్నీ, మంగళ్లు మొదలుకొని మహాత్ముల వఱకూ వర్ణింపబడిన త్యాగరాయకృతులువలె ఆబాలగోపాలం వ్యావహారిక విచిత్రాలాపాలుగా వ్యాపిం చాయి, వీరా పాత్రాన్ని ధరించిన భూములం దంతటాను! మఱి ఆ „పోగొట్టుకొన్న ఉంగరం, సమయంలోనూ, గం డాన్ని, తెలుసుకొనడంలోనూ, „ఎల్లి యెడబాటు„కు పరిత పించడంలోనూ, „యోగం, పసుతుందని చిందులుదొక్కడం లోనూ, ఇంకా „సారా శెంబు„ పట్టులోనూ, ఇదేమిట దేమిటి! అన్నిమాటల్లోనూ, పాటల్లోనూ, అడుగుల్లోనూఅందాల్లోనూ ఆద్యంతమూ, ఎంత జాతీయాన్నో శ్రమిస్తారు నిస్సంశ యంగాను! అయితే అక్కడక్కడ కొంత వినోదాతిరేకం ప్రొఢచూపకుండా ఉండదు కాని, అది అంత ఆ రసానంద ప్రసర ణానికి అపాంతరంగా మాత్రం ఉండదు.

## జనార్దనుడు.

తెనాలిసభలో బ్రహ్మశ్రీ. పిల్లలమఱ్ఱి సుందరరామయ్య గారు వేస్తూఉంటారు ఈ వేషాన్ని. ఒకపాటి చిన్నిగుమ్మటం వంటి భాసురవిగ్రహం, విశాలమైనకన్నులూ, కంచువంటి గాత్రం, స్పష్టమైన వాక్కు, శ్రుతిలీయమైనపాట కనిగి వీ రా పాత్రాన్ని ధరించి మనోహరంగా అభినయిస్తూ ఉండే టప్పుడు మాత్రం నాకు కలిగే ఆనందం ఇంతా అంతా అని చెప్పలేను!

## చెకుముకి.

తెనాలిసభలో బ్రహ్మశ్రీ. పులిపాక వేంకటేశ్వర్లుగారు చెకుముకి పాత్రాన్ని అభినయిస్తూ ఉండగా చూచినమీదట ఇంకొకర్ని తిరిగీ ఆవేషంలో చూడాల్సిన అవసరముండదు. ఇంకా మన చలపతిరావుగారికి పేకిగాని వేషంవలె, ఈ వేంకటేశ్వర్లుగార్కి చెకుముకి వేషం కుదిరిందంటాను అంతపొంకంగానూను! వెదకుదా మనుకొన్నా ఆ యభినయవిధానంలో లోపం రాలేదంటానుకూడా ద్రుఢంగాను, ఆ నేను చూచిన నాటిరాత్రి ప్రదర్శనంలో.

## వల్లీఖుస్రూలు.

బ్రహ్మశ్రీ. మాధవపెద్ది వెంకట్రామయ్యగారి 'వల్లీ' బ్రహ్మశ్రీ. తంగిరాల ఆంజనేయులుగారి 'ఖుస్రూ' వేషాలు రెండూ, ఎంత పొంకంగానో కుదిరిపోయాయి!

## విద్యానాథుడు.

తెనాలిసభలో ఈ పాత్రాన్ని బ్రహ్మశ్రీ. అబ్బూరి లక్ష్మీనారాయణగారు ధరిస్తూఉండేవారు. చక్కని గాత్రంతోనూ, శ్రావ్యమైన సంగీతంతోనూ ప్రేక్షకుల్ని ఒకింతగా ఆనందపెడతారు వీరు. తదితర ప్రాగల్భ్యాల్ని ప్రకటిస్తూ



బందరు నేషనల్ థియేటరుకు చెందిన కీ. శే. వెంపటి వేంకటేశ్వర్లుగారు జనామోదాన్ని గడించేవారు. ఈ పాత్రాన్ని ఇప్పటికి ఇంకెవరూ సకలలక్షణ లక్షితంగా చిత్రించేవారు నా కంటికి అగపడలేదు.

## ఇద్దఱు పఠాణులు.

రామరాజు చరిత్రలోని 'పఠాణి' పాత్రాన్ని, ఈ పాత్రాల్లో తఱచుగా మధ్వశ్రీ. నెల్లూరు నాగరాజరావు, బ్రహ్మశ్రీ. డి. వి. సుబ్బారావుగార్లు అభినయిస్తూ జనామోదాన్ని సంపాదిస్తూ ఉంటారు. సుప్రసిద్ధులైన ఈ యుభయుల అభినయ తారతమ్యాల్ని తెల్సుకోవడం నాటకలోకానికి అవసరమని తలుస్తాను. నాగరాజరావుగారి "పఠాణి" వేషం మిక్కిలి పఠాణసాదృశ్యాన్ని కలిగినదిగా ఉంటుంది. డి. వి. సుబ్బారావుగారి వేషం, ఎత్తు మొత్తంలో కొంచెం తగ్గునదిగా ఉండినా తేజోవంతమై కనిపిస్తుంది. నాగరాజరావుగారివి వలెనే సుబ్బారావుగారి నేత్రాలు కూడా ఆకర్ణాంత విశాలములై వెలుగుతూ ఉంటాయి. అయితే నగరాజరావుగారి దృష్టిల్లో స్పష్టపడేటంత భావగాంభీర్యానికి, సుబ్బారావుగారి దృష్టిభావం కొంచెం తగ్గునదిగా అగపడుతుంది. నగరాజరావుగారి ప్రస్ఫుటముఖభావ తరంగాలతో, సుబ్బారావుగారి ముఖాభినయభావాలు, సంఖ్యయందు కొంచెం తగ్గినా, పోలికలో సమానంగానే ఉంటాయి. నాగరాజరావుగారు కృష్ణా గోదా

వరేప్రాంతస్థరూపసదృశునిగా „పఠాణి„ నేర్పఱచుకొన్నారు. సుబ్బారావుగారు ఉత్తర హిందూస్థానుకు చెందిన పెద్దబారు పరుష విగ్రహునిగా 'పఠాణి' నేర్పఱచుకొన్నారు.

నగరాజరావు సుబ్బారావుగార్లలో వాచికార్థభావాంతరాలు అంతగా కనిపింపవు కాని, నగరాజరావుగారియందు కనిపించే నెల్లూరుపద్ధతి ప్రసంగపారుష్యం, సుబ్బారావుగారియందుండడానికి ఎంతమాత్రం వీలులేదు.

నగరాజరావుగారే గాక మిగిలిన తెలుగు నటవతంసులైన ఇంకా యితరు లనేకులకంటే, డి. వి. సుబ్బారావుగారు అధికమైన గాత్రసౌలభ్యం కలవారనడానికి సందేహంలేదు. కాని 'పఠాణి' పాత్రప్రయోగావసరంలో నగరాజరావుగారు కొన్ని పద్యాల్లో కలిగించిన భావప్రబోధం, సుబ్బారావుగారు కలిగించలేదు. డి. వి. సుబ్బారావుగారు తమ యనర్గళాలాపన సౌకుమార్యాన్ని ప్రదర్శిస్తూ యధిక జనామోదాన్ని గడిస్తారు. నగరాజరావుగారు „ధర్మాంచలోజ్జ్వల„ „సేవకధర్మంబు„ „కలనికిజొచ్చువేళ„ అను సీ పద్యాలు మూడింటినీ తమ పఠన ప్రాగల్భ్యంవల్ల మూడు వజ్రాలుగా వెలిగేటట్లు చేశారు, నేను చూచిన ఒకానొక సమయంలో! సుబ్బారావుగారు ప్రతిపద్యాన్నీ శ్రుతిపేయంగా ఆలాపిస్తూ సమ్మోహనం చేసేస్తారు.

నగరాజరావు, సుబ్బారావుగార్ల అభినయపద్ధతులు సమాన ప్రతిపత్తిని కలిగిఉంటాయి. మొత్తముమీద నగరాజ



రావుగారి అభినయం సాపుతేఱిన ఆరిందాప్రాతవలె ఉంటుంది. సుబ్బారావుగారి అభినయం ఆలాగే కొంచెం దిద్దుడు దస్తూరీగా ఉంటుంది.

### ఆసాబీ.

ఈ పాత్రానికి మాత్రం నెల్లూరు ఆంధ్రసభకు చెందిన శ్రీమాన్ కె. శ్రీనివాసాచారిగారి నాట్య సాహితీ సర్వస్వం తూచినట్లుగా తగిఉంటుంది. వీరి ప్రక్కను నగరాజరావుగారు పఠాణిగా ఉంటే, ఇంకా ఎంత మనోహరంగానో ఉంటుంది.

### తందానపాటవాడు.

ఎందర్నో చూచాను, ఈ వేషాన్ని వేయగాను! ఎవరు వేసినా బందరులోని మ. రా. శ్రీ. కృత్తివెంటి సుబ్బారావుగారికి కుదిరినంతగా, ఆపాటపోంకంగానీ, ఆవేషం డౌలుగానీ కుదరలేదని దృఢంగా చెబుతాను. నిజంగా పఠాణికి రోషావేశాన్ని కలిగించే ధర్మాన్ని, ఈ సుబ్బారావుగారి అభినయమే కలిగిఉంటుంది. సుప్రసిద్ధులైన శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులువారు కూడా వీరినిగూర్చి యిదే అభిప్రాయాన్ని పలువురుతో వెల్లడించియున్నట్లు వింటాను.

### హరిశ్చంద్రుడు.

బందరు „ఇండియన్ డ్రామెటిక్" కంపెనీలో డి. వి. సుబ్బారావుగారొక్కరే ఇప్పటికీ ఈ 'హరిశ్చంద్ర' వేషాన్ని

వేస్తూ, అశేషజనామోదాన్నీ, అతిశయాదాయాన్నీ గడిస్తూ ఉన్నారు. అదిగాక గుంటూరు "కాంపిటేషన్,, లో కూడా ఈపాత్రను ప్రదర్శించి పారితోషికాన్ని పొందారు. ఈ కారణాన్నిపట్టి తత్ప్రయోగవిధానాన్ని నాటకలోకం తెలుసుకోవడంవల్ల కొంతలాభం ఉండకపోదని నా నమ్మకం.

డి. వి. సుబ్బారావుగారు బందరులో ది 16-2-25 నాటి రాత్రి "హరిశ్చంద్ర,, వేషాన్ని అభినయించనున్నారని తెలిసికొని, నేను ముఖ్యంగా నా గ్రంథంకొఱకు, నాటి ప్రదర్శనంలో నుండి "నోట్సు,, తీసికొన నిశ్చయించుకొన్నాను. ఈ సంగతినే, డి. వి. సుబ్బారావుగారికి ముందుగ ఉత్తరంలో వ్రాసి పంపాను. వారునూ సగౌరవంగా నన్నాదరించారు. అలా ఆరాత్రి నేను గ్రహించిన సత్యాన్నే యిచ్చో వ్రాస్తాను.

డి. వి. సుబ్బారావుగారు ఆనాఁడు అలంకరించిన ఆ జరీబుటాలతాపడపు తెలుగుతలపాగా, ఆ నుదుటి యందలి నిడివినామమూ, ఆ వెడదకన్నుల వెలుగు విన్నాణమూ, ఆ నిండు చెక్కిళుల నిద్దపు నిగనిగలూ, ఆ ముత్తెపుసరులఅచ్చంపు పొలుపుమెలుపులూ, ఆ పట్టుతాబితా పంచెకట్టూ, ఆ పెద్ద పాయా నిలువుటంగీ, వానికి తగిన ఆ నడక, ఆ ఠీవి, అన్నీ చేరి చూచే చూడ్డంలో ఆమూర్తివంతం ఎంతైనా నేత్రానందాన్ని కలిగించింది. మృగయావిహారం ముగిసి, ఆలుబిడ్డలతో కలిసిమెలసి పలుకుతూ, పరితోషిస్తూఉండే ఆ ప్రయోగపంథాలు



నిజంగా వయోవృద్ధుల నిండుకారుణ్యాల్నీ, గాంభీర్యాల్నీ తలపించాయి. మాతంగాంగనల వెకిలిపాటలందు చూపిన విరక్తిభావం, మామూలు బజారీనటుల బొబ్బలింతల్లో కాకుండానూ, అమాత్యశేఖరుడైన ఒక్క సత్యకీర్తికిగాక, తదన్యులకేమాత్రం అర్థం అయ్యేటట్లుకాకుండానూ, ఎంతో ఉదాత్తంగానూ, ఎంతో నిగూఢంగానూ, తమ నిద్దపుచూపుల్లో మాత్రమేచూపబడి మిక్కిలిముచ్చటనింపింది. నిప్పులురాల్చుకొంటూ, భూనభోంతరాళాల్ని భోరుపెట్టుకొంటూ, మదపుటేనుగుపైకి కొదమసింగం ధుమికేచందాన పరుగుపరుగున పైబడవచ్చే, ఆ విశ్వామిత్రుని హడావుడిని గూర్చి సతీసుతులకు స్థైర్యము నింపుతూ, సహజధైర్యగాంభీర్యాలను ఏమాత్రం జారవిడువకుండానూ, వినయౌదార్యాల్ని విడనాడకుండానూ సుబ్బారావుగారు చూపిన ప్రౌఢాభినయ విధానాలు భావజ్ఞులనెంతో సమ్మోహనం చేశాయి. కోపాతిరేకంచేత కిరీటాన్ని సహితం క్రిందకు పడదన్నిన మునిసింహుని పాదాలపైబడి, మన సుబ్బారావుగారు చూపిన ప్రశాంతిదైన్యాది భావానేకాలు పాషాణహృదయుడైన అప్పటి విశ్వామిత్రునంతవానినే కరగించాయి అంటే, ఇక రసజ్ఞప్రేక్షకజనాల్ని ఎంత అలరించి ఉంటాయో నే వేఱే చెప్పనక్కఱలేదనుకొంటాను! ఆపిమ్మట పాడిన "సిగ్గేలాగునలేకపోయె,, "ఆకుంబోకనుబొందదీపలుకు,, పద్యాలు కూడా మనం అన్నిచోట్లా చూచే సగర్వోపన్యాస ధోరణిలో ఉండక, హరిశ్చంద్రుని సహజ వినయౌదార్యాది

గుణసంపదల్ని సూచినట్లు ప్రత్యక్షం చేశాయి. బింకంగానూ బడాయిగానూ కాకుండా, మాటలో మాటగా వెలిబుచ్చిన ఆ రాజ్యత్యాగ విషయం, ఎంతైనా వినడానికి ఇంపుగా ఉంది. విశ్వామిత్రుని రాజ్యాకాంక్షను తెలిసినపిమ్మట రాజ్యదానాన్ని చేసేటప్పటి "దేవబ్రాహ్మణ మాన్యములే," అభినయించేటప్పుడు, సుబ్బారావుగారు అగపఱచిన మహోదార స్వభావం అందుకు తగిన ఉత్సాహం, మొదలైన లలితభావాలు చాలా ఒప్పిదంగా ఆకర్షించాయి చూచేవారి హృదయాలనన్నిటినీ. "ఆకల్పాంతము నంతయుంగనని," పాడుతూ ప్రకటించిన నిండు వైరాగ్యం కూడా అలాగే హృదయాల్ని కదలించింది.

రాజ్యహీనుడైన హరిశ్చంద్రుని అవస్థను సూచించే ఆ ధౌతవస్త్రధారణంకూడా సమంజసకార్యంగా పొడగట్టింది. సతీసుతుల దురవస్థకు జాలిపడే పాత్యభాగాన్ని వినిక్రిరి చేసేటప్పుడు కరుణారసం కన్నులకు ప్రసన్నమైంది. ఇంతవఱకు ప్రకటింపబడిన సుబ్బారావుగారి అభినయ విధానం అంతా బహు సహేతుకంగానూ. రసవాహకంగానూ ప్రసన్నమైంది, నిస్సంశయంగాను. ఇక భేతాళుని సంహరించేటప్పుడు చొక్కా చేతుల నెగద్రోసికొంటూ, భుజాలుసారించుకొంటూ, సర్వ బలాల్ని సంక్షోభవించుకొంటూ, కళ్లెఱ్ఱచేసికొంటూ, ఓడు గఱుసుకొంటూ చూపిన ఆ ఆవేగోద్వేగాలన్నీ, ఒక కుస్తీపట్టు పన్న జెట్టీవాని వైఖరిని తలపించాయి. అది యటులుగాక ఒకింత సంకల్పమాత్ర విక్రమోపక్రమంగానూ, విశేషించి



నేత్రాభినయపూర్వకంగానూ, రంగాన్ని బాసి చనడం చేతనూ సూచింపబడినట్లయితే, యథాపూర్వికమైన ఔచిత్యాన్ని సంరక్షించేదిగానూ, సరసుల్ని సంతోషపెట్టేదిగానూ ఉండేదే' అని అనిపించింది. కాశీవిశ్వేశ్వర దేవాలయ శిఖరసందర్శనాన్ని చేసి చూపిన తన్మయీపూర్వకమైన భక్తి భావప్రకటనం సమంజసంగానే ఉందికాని, ఆసమయమందే, ఆ-చోటనే మోకాళ్ళపై కూర్చోవడం, ఏవేవో ప్రార్థనాలు చేయడం మాత్రం, సమయవిరుద్ధంగానూ, అన్యజాతీయాచారసిద్ధంగానూ, అగపడ్డాయి. సతీసుతులట్లు విక్రయింపబడి కాలకౌశికుని వెంట నిష్క్రమించునప్పుడు, సుబ్బారావుగారు అలౌకికునివలె, గాంభీర్యశూన్యునివలె, శోకోన్మత్తునివలె, సమయాతిరేక సత్త్వాతిరేక చేష్టాసదృశమనియైనా యెంచక, తటాలున నెత్తినిబాదుకొంటూ భూమిపై పడడం, చాలా పరుషంగానూ నీరసంగానూ కనిపించింది. వీరబాహుకు నుద్దేశించి కవిగారనిపించారుకదా అనే మూఢవిశ్వాసంతో, అనౌచిత్యమైనదనికానీ, పూర్వోక్త సత్యార్థానికి విరుద్ధమైనదనికానీ, దురభిమాన పూరితమైనదనికానీ భావింపక "నన్నీ కసజాతివానికే అమ్మెదవా', అనడం, సుబ్బారావుగారికి ఉండే అభినయ గౌరవానికి ఒకింత లఘుత్వాన్ని ఘటించేదిగా తోచింది.

శ్మశానంలోని హరిశ్చంద్రుని చిత్రించేటప్పుడు, ఆ తెల్ల దుస్తులను సహితం తొలగించి, ఒక మాసిన జీర్ణవస్త్రాన్ని కట్టడం, నల్లని నిలువుటంగీని తొడగడం, అట్టిదే మఱొక తుంపుగుడ్డను పైగుడ్డగా ఉంచుకోవడం, మఱికొంత గుడ్డపేలి

కను నడుముకు కట్టుకోవడం, తలకొక తెల్లని పీలికను చుట్టుకొని, మొగాన చెదరిన ఊర్ధ్వపుండ్రం, మూపున కుండ, చేతను కఱ్ఱ, ఉంచుకోవడం, మొదలైనలక్షణాలు యుక్తి యుక్తంగానే కనిపించాయి కాని, ఏతదవస్థకు ముఖ్యలక్షణాలుగా పరిగణింపబడే, తనూకార్శ్యం, ముఖవైవర్ణ్యం, వాచిక వైకల్యం అనబడేవి మృగ్యం కావడం మాత్రం, ఎంతైనా అసంతృప్తిని కలిగించింది మఱి నిస్సంశయంగాను. "మాయామేయ జగంబు" అనే పద్యాన్ని, వైరాగ్యప్రధానమైనదాన్నిగా గాక వర్ణనాత్మకమైనదాన్నిగా జేసి తన్మయ ప్రతిపదార్థాల్ని క్రమానుగుణ్యాంగా అభినయిస్తూ నిరూపించడంకూడా అంత యుక్తంగా కనబడ లేదు. శ్మశానంలోని విగతజీవాభివర్ణనాలూ, అంధకారవర్ణనాలూ, పిశాచవర్ణనాలూ, ఇంకెన్నోవిధాలైన వర్ణనాలూ చేస్తూ చేస్తూ, ఇందుండే చంద్రమతి ఆర్తాలాపాలవల్ల, ఎవరో యిక్కడకే వస్తూ ఉన్నారని అనుకొంటూ ఉన్న హరిశ్చంద్రుడు, అంతలోనే ఆ శ్మశానాన్ని విడిచి యెక్కడికో పోయినటు లేర్పఱచిన కవిగారి ప్రమాదాన్ని, రాంగికానుభవవిస్తారు లనిపించుకొనే, మన సుబ్బారావుగారైనా ఉచితగతిని మార్చుకొని ఉండిఉంటే, ప్రవేశ వైరుధ్యం, వస్తువైరుధ్యం, అనబడే స్వల్ప దోషాలైనా దొర్లడానికి వీలులేకుండా ఉండేది! "హృదయమున దుఃఖమింతేని పదిలబడదు" అనే పద్యాన్నీ, అందలి హృదయారాటస్వరూపాన్నీ అభినయించిన విధానం, నిజంగా తిరిగీ ఎంత నిరుపమాన ఆనందాన్నో ప్రసాదించింది! "ఈ నెలంత



సుశీలగా గానిపించు" పద్యం స్మృతిప్రధానంగా అభినయించి ఉంటే మఱికొంత భావాభివృద్ధికి కారణమయ్యేది! ఇంకా "పడతీ యెవ్వతెవీవు" పద్యం డోలాయమాన మానసంతోనూ, విస్మయావలోకనాలతోనూ, కొంత సరళంగానూ మఱి కొంత సరసంగానూ, పఠించిఉంటే, దాని వెంటనే చంద్రమతి చదివే "అరయ నితడొక మహనీయుడట్లుతోచు" అనే పద్యానికి సందర్భశుద్ధి కలగడమే కాకుండా, ఎంతటి కరుణారసాన్నైనా కుమ్మరించేది మఱి నిస్సంశయంగాను! "ఈ యలివేణి" పద్యం, నిరర్థకతనూప్రకంపనాలతోనూ, విపరీత గాద్గద్యాలతోనూ, అతిరేక శిరఃప్రచలనాలతోనూ ఆలాపింపబడుచున్నప్పుడు, చూచే భావజ్ఞులకు ఎంత చీకాకైనా కలిగింది కూడాను. "మాంగళ్య" పద్యపఠనానంతరం చంద్రమతి తన్ను గుర్తించి పైబడునప్పుడైనా, నిర్వహణ సంధిసూచనానికి అత్యంత ప్రధానంగా పరిగణింపబడే అద్భుతరసాన్నీ, తద్బోధకమైన కరుణరసోచిత వివిధాభినయవిధానాల్నీ ప్రకటిస్తే, ఎంతటి బ్రహ్మానందం అయినా కలిగేది మఱి రసజ్ఞులందఱికీని! ఇటులుగాక ఇచ్చోటకూడా పైని చెప్పిన ప్రకంపనాలూ, గాద్గద్యాలూ, ఇంకా పరాఙ్ముఖాంగికాభినయాలూ, ప్రదర్శింపబడడం, ఒక విధంగా రసాభాసకారణమైందని చెప్పాల్సివచ్చినందుకు మిక్కిలి విచారిస్తాను. ఇవిగాక ఇంకా ఏవో యొకటి రెండు చిట్టిపొట్టి శబ్దదోషాలు దొర్లిన సంగతినికూడా అప్పుడే సుబ్బారావుగారికి విన్పించానని కూడా నా జ్ఞాపకము.

హరిశ్చంద్ర వేషాన్ని అక్కడక్కడ ఇంకా ఇప్పటికీ ఎవరెవరో వేస్తూనే ఉన్నారు. అలాటివార్ని కూడా ఎందర్నో చూచాను. ఆ వివరాలుకూడా వ్రాయబడే ఉన్నాయి నావద్ద ఇప్పటికీని అట్టివి ఎన్నిఉన్నా, మన డి. వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర వేషాన్ని గూర్చి యీ చెప్పిన మీదట తిరిగీ చెప్పాల్సిన విశేషాంశాలు కలవిగా కన్పట్టనందున వదిలేశాను ఈచోట వ్రాయకుండాను. ఆ యన్నిటిలోనూ డి. వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర పాత్రాభినయమే, విశేష గౌరవానికి అన్నివిధాలా పాత్రంగా ఉంటుందంటాను ముమ్మాటికీని.

## శ్రీ కృష్ణతులాభారము.

కీ॥ శే॥ ముత్తరాజు సుబ్బారావు పంతులుగారి శ్రీ కృష్ణతులాభారాన్ని ఆడే సమాజాలన్నిటినీ చూచాను ముప్పాతిక మూడువంతులు తెలుగు జిల్లాలందంతటాను. అందలి ప్రధానపాత్రల్ని ఏయేనటులు ఎంతవఱకు యుక్తీయుక్తంగా అభినయిస్తారో మనవిచేస్తాను.

**శ్రీకృష్ణుడు:-** ఈ పాత్రపాత్యంలో ప్రధానంగా కనిపించే ప్రణయలాలిత్యం, శృంగారసౌకుమార్యం, బ్రహ్మశ్రీ ఎడవల్లి సూర్యనారాయణరావు గారి అభినయంలో ఎంత



ముద్దుగానైనా గోచరం ఔతుంది. ఆపిమ్మట నెల్లూరు ఆంధ్రసభకు చెందిన మ॥ రా॥ శ్రీ. రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారియందు కొద్దిగా అగపడుతుంది. ఏలూరు శ్రీ సీతారామాంజనేయ నాటకసమాజాన్ని అలంకరించిన శ్రీపూర్ణ విద్వాన్ బాలకవి పంచాంగము వేంకట రామానుజాచార్యులు గారునూ సుబ్రహ్మణ్యంగారితో తుల్యంగా అభినయిస్తారు.

నారదుడు:- ఈ పాత్రాన్ని అన్నివిధాలా ఉదాత్తంగానూ, నృత్యగీతాల్లోనూ, మనోహరంగా అభినయించే విషయంలో, నెల్లూరు ఆంధ్రసభకు చెందిన బ్రహ్మశ్రీ. నేలనూతుల రామకృష్ణయ్యగారిని తొలుదొల్త పేర్కొంటాను. ఆపిమ్మట అదేవిధానంలో ఒక్కనృత్యం మినహాగా నారద పాత్రాభినయ కార్యాన్ని నిర్వర్తిస్తూ పండితాదరాన్ని సంపాదిస్తూ ఉన్నది, ఏలూరు సీతారామాంజనేయనాటక సమాజసభ్యులైన బ్రహ్మశ్రీ. అద్దంకి శ్రీరామమూర్తిగారే, అని నమ్ముతాను. బ్రహ్మశ్రీ. కపిలవాయి రామనాథశాస్త్రిగారి నారదవేషం హరి స్వయంకృతాపరాధపూర్వకాలైన కొన్ని పెట్టి వెకిలిపిల్లబైరాగి వర్తనాలచేతనూ, కొన్ని అసహజవాచికాడంబరాలచేతనూ అగ్రతాంబూలార్హతను కోల్పోతూ ఉన్నదంటాను.

సత్యభామ:- ఈ పాత్రాన్ని ముఖ్యంగా మన తెనాలి రామవిలాససభకు జెందిన మ. రా. శ్రీ. స్థానం నరసింహారావు గారు అభినయిస్తూ ఉండగా చూచినవారు, మఱి ఇంకెవరినీ ఈ వేషంలో తిరిగీ చూడ తలపెట్టనేపెట్టరంటాను.

రుక్మిణి:- ఈ పాత్రానికి ఈ నాటకంలోఉండే పాత్రాంశాన్ని పట్టి యోజించేవారికి అంతగా ఎట్టి అభినయప్రాధాన్యమూ కన్పింపకపోయిననూ, తమయందుండే సహజోదారసత్త్వగాంభీర్యంచేతనూ, పలుకుపాటవంచేతనూ, దానికే ఏంతో అందాన్ని తెచ్చి ఆనందపెట్టేవారు ముమ్మాటికీ మ. రా. శ్రీ. పారుపల్లి సుబ్బారావుగారే అంటాను.

### దశరథుడు.

శ్రీమాన్. తాడిపత్రి రాఘవాచార్యులువారు బహు సమర్థంగానూ, అద్వితీయంగానూ ,,పాదుక,, లోని దశరథ పాత్రాన్ని ప్రదర్శిస్తూఉంటారనివింటాను. నేనుదానినిచూడలేదు. చూచినంతలో బ్రహ్మశ్రీ. అద్దంకి శ్రీరామమూర్తిగారొక్కరే ఆ దశరథపాత్రమందు ప్రధానంగా కన్పట్టే ప్రేమతత్త్వాన్నీ తద్వయోధర్మాన్నీ, తన్నాటకీలాలసత్వాన్నీ, డోలాయమాన మానసికవికారబాహుళ్యాన్నీ,ఆద్యంతం, ఎంతో లలితంగానూ సుకుమారసుందరంగానూ, రసభావ పురస్సరంగానూ, ప్రకటించ కలిగారని నమ్ముతాను.

### దుష్యంతుడు.

నెల్లూరు ,,భాషాభిమాని" సమాజానికే గాక సింహపుర నాట్యసరస్వతికే మకుటప్రాయంగా ప్రకాశిస్తూ, ఈ దుష్యంత పాత్రాన్ని సర్వవిధాలా లక్ష్యలక్షణోపేతంగా అభి



నయించి తమ ప్రౌఢాభినయాద్వితీయప్రాచుర్యంచేతనూ ప్రాగల్భ్యంచేతనూ, స్వచ్ఛమైన దిగంతకీర్తి నార్జించినవారు ముఖ్యంగా కీ. శే. కందాడై శ్రీనివాసన్‌గారే అంటాను ముమ్మాటికీని! వీరు తనూసౌష్ఠవమునందేమీ, పలుకుపాటవమునందేమీ, భరత సాహిత్యమునందేమీ, రసానుభవమునందేమీ, అసాధారణమైన స్థానాన్ని కలిగిఉండేవారు. తెలుగు, అఱవము, సంస్కృతము, ఇంగ్లీషు, అను నాలుగు భాషలందునూ, మేటి స్వాతంత్ర్యాన్ని బడసినవారు. వేషధారణమందునూ మిక్కిలి చాతుర్యమును నగపఱచగలిగేవారు. శాస్త్రీయమైన అభినయ సాంప్రదాయాన్ని సాక్షాత్కరిస్తూ అనన్యప్రౌఢిని ప్రకటించేవారు. అవసరాన్ని పట్టి కావ్యాల్నిసహితం సమర్థంగా సృష్టించుకోకలవారు. ఒకటి పాట పద్ధతిని ఊరక యభినయాన్ని రక్తిగా జరపగలిగే చాలమంది ఇప్పటి నవనాగరిక నటశిఖామణుల కంటె అతిశయంగా, అభినయాంశాల్ని గూర్చి కానీ, పాత్రతత్త్వాల్ని గూర్చి కానీ, అమోఘంగానూ, అనర్గళంగానూ, ఎంతకాలమైనా ఉపన్యసించ కలవారు కూడాను! అయితే సంగీతమందు మాత్రం అంతగా రసప్రసరణాన్ని కలిగించే గాత్ర సంపదను బడయకపోయిన కారణంచేత, ఈ ప్రాంతాల్లో అంతగా ఏకోన్ముఖమైన జనామోదాన్ని సంపాదించలేకపోయినారు. అభినయకళాసౌందర్యాన్ని మాత్రమే ప్రధానంగా లక్షించి ఆనందించే పండితులు మాత్రం అన్ని దేశాల్లోనూ, ఇప్పటికీ వీరి అద్వితీయమైన అభినయమార్గాన్ని స్మరిస్తూ తమలో

తాము సంతృప్తి పొందుతూఉంటారు. ఇట్టి మహానటులైన కందాడై శ్రీనివాసన్‌గారి అకాలమరణానికి నాటకలోకం అంతా కన్నీళ్ళు కార్చక మానదు. ప్రస్తుతం బ్రహ్మశ్రీ. ఎడవల్లి సూర్యనారాయణరావుగారు ఒక్కరే దుష్యంత పాత్రాన్ని సమర్థంగా అభినయిస్తూ ఉంటారు.

### చింతామణి.

సుబ్బిశెట్టి పాత్రాభినయంలో మొట్టమొదట బందరు శ్రీరామమోహన్ థియేటరుకు చెందిన మ రా. శ్రీ. పాతూరి సుబ్బారావుగారు అశేషకీర్తిని గడించారు. బ్రహ్మశ్రీ. కుందా పిచ్చయ్యగారు దాని నతిశయించిన ప్రయోగ ప్రాగల్భ్యాన్ని ప్రదర్శించి బందరు బాలభారతసంఘానికి వన్నె తెచ్చారు.

భవానీశంకరుడు పాత్రాన్ని, బందరు రాయల్ థియేటర్ సభ్యులైన మ. రా. శ్రీ. వేమూరు రామారావుగారు అద్వితీయంగా అభినయించి కాంపిటేషన్ పారితోషికాన్ని సంపాదించారు.

చింతామణి పాత్రాన్ని, ఈ ప్రాంతాల్లో మొట్టమొదట వ్యాప్తిలోకి తెచ్చి, ఎంతో పేరును బడసిన వారు బందరు రామమోహన్ థియేటరుకు చెందిన మ॥ రా॥ శ్రీ. చావలి ముక్తేశ్వరరావుగారు. ఆ పిమ్మట కాకినాడలోని కృష్ణ విలాససభా సభ్యులైన మ॥ రా॥ శ్రీ. డి. జగన్నాయకులుగారు అద్వితీయమైన ప్రయోగ చాతుర్యాన్ని ప్రదర్శించి కాంపిటేషన్ పారితోషికాన్ని కూడా పొందారు.



ఈ ప్రకరణంలోని బిల్వమంగళ పాత్రాన్ని, ఏలూరు సీతారామాంజనేయ నాటక సమాజంలో బ్రహ్మశ్రీ. అద్దంకి శ్రీరామమూర్తిగారు సహజ సంగీత ప్రౌఢిచేతనూ, సమయోచిత రంగప్రవర్తనం చేతనూ ప్రదర్శించి బహు జనాదరాన్ని గడిస్తారు. మ॥ రా॥ శ్రీ॥ ముంజులూరు కృష్ణారావుగారు సంగీతం మినహాగా సరసుల్ని సంతోష పెడతారు.

### పేటికావాద్యకులు. (హార్మోనియిస్టులు.)

కీ. శే. పాపట్ల కాంతయ్యగారు తెలుగుదేశపు సంగీత విద్వన్మణులలో మేటిమణిప్రాయులై దిగంతకీర్తిని ప్రభాజాలాన్ని ప్రసరిస్తూఉండేవారు. వీరు తమ సహజప్రతిభావిశేషం చేతనూ, రాగతాళస్వాతంత్ర్యంచేతనూ, వివిధవిచిత్రగీతికాపాఠ్యానుభవంచేతనూ, గాంధర్వపేటికానన్యవాద్యవైదగ్ధ్యంచేతనూ, కొంతకాలం తెలుగునాటకరంగాలన్నిటికీ ఒకక్రొత్త అందాన్నీ, క్రొత్తమర్యాదనీ సంపాదించారు. ఎన్నెన్నినాటకాలలోనో, ఎన్నెన్నిపాటలనో, చాలవఱకు భావానుగుణ్యాంగా జతపఱచారు. తాము స్వయంగా ఎందఱెందఱికో ఆ పాటపద్ధతులను నేర్పారు. సంగీతస్వతంత్రులై, వివిధగీతికానిర్మాతలై, గురువులై, విశేషించి వాద్యకులై, ప్రదర్శనాల్ని జరిపిస్తూఉంటే, సంగీతఛాందసులొకకొందఱికి కొన్నివిధాల కొంతవెగటుగా కన్పించినా, భావజ్ఞులైన శ్రోతలందఱికీ ఎంత బ్రహ్మానందమైనా కలుగుతూఉండేది ఆ యపూర్వభావరాగతాళసమ్మేళనసౌష్ఠవాన్ని అనుభవించేకొద్దీని! వీరికి తోడుగా

తాళప్రస్తారపారగులూ, తదపూర్వానందవస్తుప్రదర్శకులూ
మహత్తరవిద్వద్వాద్యకులూ, అయిన కీ. శే. బగ్గన్నగారు టబలా
వాద్యాన్ని జరిపిస్తూ ఉంటే ఎంతమనోహరంగానో ఉండేది!

ప్రస్తుతం బెజవాడలో తత్తుల్యనేటికా వాద్యాన్ని ప్రద
ర్శిస్తూ మ. రా. శ్రీ. ఎ. రామానుజంగారు మిక్కిలికీర్తిని
ఆర్జిస్తూ ఉన్నారు. వీరు కీ. శే. పా. కాంతయ్యగారిప్రియ
శిష్యులు. వారితోపాటుగా అనేక నటాలాపాల్నీ, గీతికా
ఫణితుల్నీ అనుభవించారు. ఇప్పటికి నాటకలోకంలో వీరు
అనుసరింపని పాటపద్ధతులుగానీ, ప్రసిద్ధసమాజాలుకానీ లేవని
చెప్పవచ్చును. ప్రదర్శనం పట్టున అత్యావశ్యకంగా జతపఱచ
దగి ఉండే అన్నివిధాలైన ప్రజ్ఞల్నీ కలిగి, రక్తిప్రధానంగానూ
సర్వస్వతంత్రంగానూ, ఉపాంగికవాద్యధర్మాన్ని ప్రకటించే
వారు ముఖ్యంగా ఈ రామానుజులుగారే అని అంటాను.

మ. రా. శ్రీ. (రాజుగారనే) వల్లూరు కౌస్తుభభూషణ
రావుగారు, ఆ తర్వాత చెప్పతగిన హార్మోనీవాద్యాన్ని ప్రదర్శి
స్తారు. వీరి వాద్యం మిక్కిలి సుఖదాయకంగానూ, నటాలా
పనానుగుణ్యంగానూ ఉండి శ్రోతలకెంతైనా శ్రవణానందాన్ని
కలిగిస్తుంది. ఈవిషయంలో వీరిని మించినవారు నాకంటి కిప్ప
టికి కనిపింపరు.

బ్రహ్మశ్రీ. మార్తి శీతారామయ్యగారు పామఱ్ఱు
తాలూకా కొండిపఱ్ఱుగ్రామవాస్తవ్యులు. సంగీతంలో చాలా
వఱకు శాస్త్రీయాభ్యాసాన్నీ, అనుభవాన్నీ కలవారు. కొన్ని
వర్ణాలూ, మఱికొన్ని కృతులూ, కొంతవఱకు పల్లవీ, మొద



లైనవే గాక, కాంతయ్యగారి గీతికానేకాలూ, ఇంకా
వల్లూరు జగన్నాధరావు ప్రభృతుల హాస్యాలాపనాలూ, గం
ధర్వ' ఫణితులూ ఎన్నెన్నో వర్ణించారు. ఎంపఱెందఱు
ప్రసిద్ధనటులనో సందర్శించారు. ఎన్నెన్ని ప్రదర్శనాలందో
పాల్గొనుచున్నారు. ఈ రూపంగా వీరియందేర్పడిన హార్మోనీ
వాద్యవిజ్ఞానం, అదొక క్రొత్తవిధమైన శాస్త్రీయ గమకస్వర
లక్షణసాంప్రదాయంతో సాక్షాత్కరిస్తూ ఉంటుంది. ఈ
పద్ధతి వాద్యానికి వీరే ప్రాథమికులుగా ప్రకాశిస్తూ ప్రస్తుతం
కీర్తిని గడిస్తూ ఉన్నారు.

బ్రహ్మశ్రీ. ఎడవల్లి నాగేశ్వరరావుగారు, మా బందరు
తాలూకా పెడన గ్రామానికి చెందినవారు. వయస్సులో
పైవాద్యకులు అందఱికంటే పిన్నలు. వీరి వాద్యధర్మం
సర్వవిధాలా మార్తి శీతారామయ్యగారు చేసిన సాధనాల
వంటి సాధనాల్లోనూ, సంపాదించిన అనుభవాలవంటి అను
భవాల్లోనూ, ఇంకా చాలవఱకు పూర్వపుణ్యరూపంగానూ
అభివృద్ధియై, కొంచెమించుమించు తత్తుల్యప్రౌఢిని ప్రద
ర్శిస్తూ, కీర్తిని సంపాదిస్తూ ఉంటుంది. ఒకింత స్వతంత్రంగా
పాడే ప్రజ్ఞాలేశాన్ని కలిగిన నటులనూ, ఇతరులనూ, అనుస
రించేటప్పుడు, వీరి వాద్యం, ఎంత రమణీయంగానైనా ఉం
టుంది. ఉన్నంతలో జాగ్రత్తగా సమయాన్ని గడుపుకొ
వారికి, కొంచెం అయోమయంగా ఉంటుంది, వీరి ఘూకుడు
ధైర్యంగా నిలిచి పాడడానికి.

ఇంకా ఇలాగే ఎన్నెన్ని నాటకాల్లో ఆడబడుతూ ఇంకా ఎందఱెందఱో అందందు ప్రతిష్ఠ సంపాదించుకొంటూ ఉన్నవారు లేకపోలేదు. ఈ పై తెల్పిన వానినిబట్టి ఆ కడమవి సహితం ఊహింపబడుట ఒక అబ్బురము కాదని తలచి, ఇంతటితో యీ యంతంలేని ఆకాశపురాణాన్ని ఆపుతాను. క్షమించాలి పాఠకులు కూడా నాయందు దయయుంచి!

సంపూర్ణము.



